

# భారత చరిత్ర



మనది భారతదేశం. ప్రాచీనకాలంలో దీన్ని భారతవర్షం అనేవారు. ఆటు తరవాత పర్షియనులు దీనిని హిందూదేశమన్నారు. "హిందు" అనేమాట సింధు అనేమాటకు రూపాంతరం. మనదేశపు నాగరికత సింధు ప్రాంతంలో మొదటగా వెలిసినందున ఈ పేరు ఏర్పడింది.

ఈ మన భారతదేశంయొక్క విస్తీర్ణం సుమారు **12,60,000** చదరపు మైళ్లు. ఈ విస్తృతమైన దేశంలో ఉత్తరాన ఎల్లప్పుడూ మంచుకప్పిన శిఖరాలుగల కొండలున్నాయి; మధ్యలో నిర్జనమైన ఎడారి ఉన్నది; నదుజల సమృద్ధిగలిగి సారవంతమైన భూములున్నాయి; దుర్గమములైన అరణ్యాలున్నాయి.

ఈ దేశపు ప్రజలలోకూడా కేవలం మృగాలను వేటాడి, అరణ్యంలో దొరికే సంపద మీద ఆధారపడి బతికే ఆటవికులు మొదలుకొని, అత్యుత్తమమైన నాగరికతను అలవరుచుకున్నవారూ, జాను లూ పర కూ అనేకరకాల మనుషులున్నారు.

మనదేశం ఏనాడూ ఒకటిగా లేదని, ఫలాని కాలంలో ఫలాని చక్రవర్తి ఫలాని ప్రాంతాలను ఏకచ్ఛత్రం కిందికి తెచ్చాడని, కిందటి శతాబ్దంలో బ్రిటిషువారే దేశాన్నంతా ఒకటిగా చేశారని కొందరనేది నిజంకాదు.

"ఉత్తరం యత్ సముద్రస్య
హిమాద్రేశ్చైవ దక్షిణం,
వర్షం తద్ భారతం నామ
భారతీ యత్ర సంతతిః"

అని విష్ణుపురాణ శ్లోకాన్నిబట్టి హిమాలయాలకు దక్షిణంగానూ, సముద్రానికి (హిందూ మహా సముద్రానికి) ఉత్తరంగానూ ఉండే భూమి యావత్తూ భారతదేశమని, అందుండే వారందరూ భరతుడి సంతతి వారేనని అనాడే భావించారు.



**1.** అనాగరిక యుగం



తరువాత వచ్చినవారుకూడా భారత దేశపు ఐక్యతను సంశయించటం ఏనాడూ జరగలేదు. క్రీస్తుకు పూర్వం 3 వ శతాబ్దంలో ప్రాకృతభాష భారతదేశపు అన్ని ప్రాంతాల వారికీ తెలుసు.

దేశమంతటినీ ఒకే సంస్కృతి కలిపి ఉంచిందనటానికి రామాయణ, మహాభారతాలే నిదర్శనం. ఈ గొప్ప గ్రంథాలను కాశ్మీరం నుంచి కన్యాకుమారి వరకూ, సింధూనదీ ప్రాంతం నుంచి బ్రహ్మపుత్రా నదీ ప్రాంతం వరకూ గల ప్రజలందరూ పఠించి ఆనందించారు. వేదపురాణాలు అందరికీ ఆదర్శప్రాయంగానే ఉండేవి. శివకేశవుల ఆలయాలూ, అర్చనా అన్ని ప్రాంతాలలోనూ జరిగేది.

ఇలాటి భారతదేశంయొక్క చరిత్ర తాలూకు ప్రధానాంశాలు అందరూ తెలుసుకోదగినవి.

*　　*　　*

మన దేశంలో ఉండిన అత్యంత ప్రాచీనులు పూర్వ శిలా యుగానికి చెందినవారు. వీరు ఒకప్పుడు మనదేశంలో నివసించినట్లు ఆధారమేమంటే వీరు ఉపయోగించిన మొరటైన రాతి పనిముట్లే. ఇలాటి పనిముట్లు చెంగల్పట్టు జిల్లాలోనూ ఇంకా



శిలాయుగపు పనిముట్లు

అనేక చోట్ల దొరికాయి. ఈ రాతి పనిముట్లు వాడినవారు పశుప్రాయంగా జీవించినవారు. వారికి వ్యవసాయంగాని, కుండలు చెయ్యటంగాని తెలియదు.

నవీన శిలాయుగానికి చెందిన మనుషులు దేశం అన్ని ప్రాంతాలా నివసించారు. వీరి పరికరాలు అనేకచోట్ల ఉన్నాయి. ముఖ్యంగా బళ్లారి ప్రాంతంలో జరిగిన తవ్వకాలలో ఒక కార్ఖానాలాటిది బయట పడింది. ఆ కార్ఖానాలో రాతి పనిముట్లు తయారయేవి. పనిముట్లు చెయ్యటం ఒక పరిశ్రమగా అభివృద్ధి అయిందన్నమాట.





నవీన శిలాయుగపు జీవితంలో క్రమంగా అనేకరకాల అభివృద్ధి కనిపిస్తుంది. వారు వ్యవసాయం నేర్చుకుని ధాన్యాలూ, ఫలాలూ పండించారు. ఎద్దు మొదలైన జంతువులను పెంచటం నేర్చుకున్నారు. కుండలు చెయ్యటం నేర్చుకున్నారు. మొదట్లో వీటిని చేత్తో చేసేవారు. తరవాత కుమ్మరిసారె కూడా వచ్చింది. వీరు గుహలలో నివసించి తమ నివాసాల గోడలమీద వేటకు సంబంధించిన చిత్రాలూ, నృత్యానికి సంబంధించిన చిత్రాలూ వేశారు. ఇలాటి గుహలు కొన్ని ఇప్పటికీ ఉన్నాయి. వారు తమ మట్టి పాత్రలకు అలంకరణలూ, రంగులూ అమర్చారు. పడవలు తయారు చేసి వాటిలో సముద్రం మీదికి వెళ్ళారు. పత్తి, ఉన్ని వడికి ఆ దారాలతో బట్టలు నేశారు. వారు చనిపోయిన వారిని పాతిపెట్టేవారు. తరవాత లోహయుగపు సంస్కృతి ఆరంభమయింది.

లోహయుగంలో మొదట వాడుకలోకి వచ్చినది రాగి; తరవాత కంచూ, ఆ తరవాత ఇనుమూ వాడుకలోకి వచ్చాయి. భారతదేశంలో జరిగిన సాంఘిక పరిణామంలో "కంచు యుగం" అనేదిలేదు. ఉత్తర భారతంలో కొంతకాలం రాగి వాడుకలో ఉండి, తరవాత ఇనుము వచ్చింది.

దక్షిణ భారతంలో మటుకు మనుషులు శిలాయుగం నుంచి బయట పడుతూనే ఇనుమును వాడుకలోకి తెచ్చారు.

భారతదేశ చరిత్రకు లిఖితరూపమైన ఆధారాలు ఋగ్వేదకాలంనుంచి లభిస్తున్నాయి. ఋగ్వేదం లోహయుగంలోనే పుట్టింది. ఇది రాసేనాటికి ఇనుము వాడుకలోకి వచ్చి ఉండవచ్చును. అయితే రాగి యుగం నాటికే సింధు లోయలో ఒక అద్భుతమైన నాగరికత వెలిసింది. దీనిని గురించి పై మాసంలో తెలుసుకుందాం.





# భారత చరిత్ర



ప్రపంచంలో కెల్లా అత్యంత ప్రాచీనమైన నాగరికతలు ఈజిప్టు, అసిరియా, బాబిలోనియాలలో ఉండేవని ఒకప్పుడు భావించే వారు. కాని పంజాబు, సింధురాష్ట్రాలలో హరప్పా, మొహెంజొదారో (శవాలదిబ్బ) ప్రాంతాలలో బయటపడిన నగరాలను బట్టి 5 వేల యేళ్ళక్రితం మన దేశంలో ఒక ఉత్కృష్టమైన నాగరికత ఉండేదని, అది కాలక్రమాన భారతీయ నాగరికతగా రూపొందిందని స్పష్టమవుతున్నది. ఇదే సింధు నాగరికత.

మొహెంజొదారో, హరప్పా నగరాలను బట్టి ఆ నాగరికతను గురించి మనం అనేక విషయాలు తెలుసుకో గలుగుతున్నాం.

మొహెంజొదారో నగరం వరదల వల్ల నైతేనేం, ఇతర కారణాలవల్ల నైతేనేం శిథిలమై కనీసం ఏడుసార్లు నిర్మించబడి ఆ తరువాత శాశ్వతంగా శిథిలమై పోయింది. ఇది బాగా పెద్ద నగరం. అనేక ఇళ్ళు ఉండేవి. రెండే గదులుగల ఇళ్ళు మొదలు కొని రాజసౌధాల వంటివి కూడా ఉండేవి. వీటిని కాల్చిన ఇటుకలతో కట్టారు. పెద్ద ఇళ్లు రెండు మూడంతస్తులు కలిగి ఉండేవి. ఇళ్ళచుట్టూ ఖాళీ ఆవరణలూ, ఇళ్ళకు వాకిళ్ళూ, కిటికీలూ, సన్నని మెట్లవరసలూ ఉండేవి. దాదాపు ప్రతి ఇంటికీ బావి, మురుగు కాలవలూ, స్నానాలగదీ ఉండేవి. నేలపైనా ఆవరణలోనూ రాళ్ళు పరిచేవారు.

నగరంలో ఇళ్ళుగాక విశాలమైన కట్టడాలు కొన్ని ఉండేవి. ఇవి జనోపయోగమైనవి కావచ్చు. ఇలాటి కట్టడాలలో చెప్పదగినది ఒక పెద్ద కొలను. దీని నిడివి 39 అడుగులు, వెడల్పు 23 అడుగులు, లోతు 9 అడుగులు. దీనిచుట్టూ మెట్లూ, గదులూ ఉండేవి. కొలనులోకి నీరు రావటానికి, పోవటానికి తగిన ఏర్పాట్లుండేవి.

## 2. సింధు నాగరికత





ఈ స్నానఘట్టం అంతా ఎంత బాగా నిర్మించారంటే 5000 ఏళ్ళ అనంతరం అది ఇంకా చెక్కు చెదరకుండా ఉన్నది. నగర వీధులు విశాలంగానూ, సూటిగానూ ఉండేవి. మురుగునీటి పారుదలకు ఏర్పాట్లుండేవి. ఇక్కడి జీవితం సుఖమయంగానూ, నాగరికంగానూ ఉండేదనటానికి సందేహం లేదు. ఆ నాటికి ప్రపంచంలో ఎక్కడా అంత శోభగల నగరం ఉండినట్టు కనబడదు.

ఇక్కడి ప్రజలు తినే ఆహారంలో గోధుమలూ, బార్లీ, ఖర్జూరఫలాలూ, మాంసమూ, చేపలూ, గుడ్లూ ఉండేవి. దుస్తులు నూలువి, ఉన్నివి ఉండేవి. స్త్రీ పురుషులు ఆభరణాలు ధరించేవారు. ఇవి మెడపండలూ, కేశభూషలూ, మురుగులూ, ఉంగరాలూనూ. స్త్రీలు మాత్రమే ధరించే ఆభరణాలు వడ్డాణాలూ, ముక్కుపుడకలూ, చెవి కమ్మలూ, కాలి కడియాలూనూ. ఈ ఆభరణాలలో ఎన్నో రకాలు. కొన్ని ఎంతో అందమైనవి కూడా. వీటిని బంగారం, వెండి, దంతం, రాగి, రత్నాలు మొదలైన వాటితో చేసేవారు.

ఇళ్ళలో వాడుకునే పాత్రలలో హెచ్చు భాగం కుమ్మరి సారెపై తయారైన కుండలు మట్టివి. రాగి, కంచు, వెండి పాత్రలూ, బంగారు పాత్రలూ బహుకొద్ది. ఇనుము



హరప్ప శిథిలాలు

మచ్చుకైనా దొరకలేదు. గృహోపకరణాలలో కదుళ్ళూ, సూదులూ, దువ్వెనలూ, గొడ్డళ్ళూ, రంపాలూ, కత్తులూ, కొడవళ్ళూ, చేపలు పట్టే గాలాలూ, మంగలి కత్తులూ (రాగితో, కంచుతో చేసినవి) ఉండేవి. ఈ నగరంలో పాచికలు విరివిగా దొరికాయి. పాచికలాట పరిపాటి అయి ఉండవచ్చు.

ఈ నగరంలోని పెంపుడు జంతువులు ఆబోతులూ, బర్రెలూ, గొర్రెలూ, ఏనుగులూ, పందులూ, కుక్కలూనూ. ఆనాటికి అక్కడ గుర్రాలున్నట్టు కనబడదు. ఇక్కడి ప్రజల యొక్క పరికరాలలో విల్లులూ బాణాలూ





అంత ముఖ్యమైనవి కావు. గండ్రగొడ్డళ్లూ, ఈటెలూ, బాకులూ, గదలూ, వడిసెలలూ ముఖ్యమైనవి. ఈ ప్రజలకు ఖడ్గాలు తెలియవు. వీరు శిరస్త్రాణాలూ, డాలులూ మొదలైన రక్షణ సామగ్రి ఎరగనట్టు కనబడతారు.

సింధు నాగరికత నాటి శిల్పం చాలా గొప్పది. హరప్పాలో దొరికిన ప్రతిమలు కొన్ని గ్రీకు శిల్పాలకు ఏమీ తీసిపోవట. ఆ నగరాలవారు భారత దేశంలోని ఇతర ప్రాంతాలతోనే గాక ఆసియాలోని అనేక దేశాలతో వర్తకం చేశారు. ఇక్కడ పుష్కలంగా దొరికిన ముద్రల నమూనాలు రెండు మెసపొటేమియాలో దొరికాయి. ఇక్కడి పౌరులు వ్యవసాయమూ, బహు విధములైన వృత్తిపనులూ నేర్చినవారు. సింధు ప్రజలు దేవీ ఆరాధకులు. వీరొక పురుషదైవాన్ని కూడా ఆరాధించేవారు. ఈ పురుషరూప ప్రతిమచూస్తే శివుడి కిది ప్రాచీనరూపం అని తోస్తుంది. ప్రజలు విగ్రహారాధకులు, ప్రకృతిని ఆరాధించేవారు. వీరు హోమాలు చేసినట్టు కనబడదు. ఎందుకంటె ఎక్కడా అగ్నిగుండాలు లేవు.

సింధు నాగరికత ఆర్యులది కాదు. అది ఋగ్వేదకాలం కన్న ముందుది. ఆర్యులు నగరజీవితం ఎరగరు. వారికి ఇనుము తెలుసు. వారు విగ్రహారాధన చేయలేదు. సింధు నాగరికతను పెంపొందించిన వారు ద్రావిడులని కొందరూ, సుమేరియనులని కొందరూ, వారే వీరని కొందరూ వాదిస్తున్నారు. ఏ మైనప్పటికీ చరిత్రయుగంలో భారత దేశమంతటా వ్యాపించిన నాగరికత యొక్క బీజాలు వేదసంస్కృతిలో ఎంతగా ఉన్నాయో, సింధు నాగరికతలో అంత కంటె ఒక్కపిసరు హెచ్చుగానే ఉన్నట్టు కనిపిస్తుంది.

మొహెంజొదారో నగరంలోని స్నానఘట్టం








# భారత చరిత్ర



ఇంతకు ముందు సింధు నాగరికత గురించి కొంత తెలుసుకున్నాం. ఆ నాగరికతలో జీవించిన వారికీ ఆర్యులకూ చాలా తేడా లున్నాయి. ఆర్యుల సంస్కృతికి ఆధారం వేదాలు. వేదాలలో హరప్ప, మొహెంజొదారోలాటి నగరాల ప్రసక్తి ఎక్కడా లేదు. వారికి. విగ్రహారాధన లేదు. వారి ఆరాధ్య దైవాలైన ఇంద్రుడు, వరుణుడు, మిత్రుడు, నాసత్యులు (అశ్వనీ దేవతలు) సూర్యుడు, అగ్ని—అందరూ పురుష దైవాలే.

వేదాలు ఏనాడు పుట్టినదీ స్పష్టంగా తెలియదు. కాని ఆసియా పశ్చిమప్రాంతం లోని దేశాలలో దొరికిన లిఖిత రూపమైన ఆధారాలనుబట్టి ఆ దేశాలను ఆర్య నామ ధేయాలుగల రాజులు పాలించారనీ, ఇంద్ర మిత్ర వరుణ నాసత్యులు వారి ఇష్ట దేవత లనీ స్పష్టమయింది. ఈ ఆధారాలు క్రీస్తు పూర్వం 14 వ శతాబ్దానివి.

ఆర్యులు ఎక్కడి నుంచో మన దేశానికి వచ్చారనటానికి ఋగ్వేదంలో ఆధారం ఉన్నది. ఇంద్రుడు బహుదూర ప్రాంతం నుండి యదు, తుర్వశులనే జాతుల వారిని తెచ్చాడట. ప్రాచీనకాలంలో పర్షియావారికి పశు లేక పరశు అనే పేర్లుండేవి; వారితో యదులకు సంబంధాలుండేవి. పరశులు పార్థవుడనే రాజుతో యుద్ధం చేసినట్టు ఋగ్వేదం వర్ణిస్తున్నది. ఈ పార్థవుడు సృంజయులకు రాజు.

కాలక్రమాన ఆర్యజాతులలో రెండు పక్షాలు ఏర్పడ్డాయి. ఒక పక్షాన సృంజ యులూ, భరతులూ, రెండవ పక్షాన యదులూ, తుర్వశులూ, ద్రుహ్యులూ, అనులూ, పూరులూ ఉండేవారు. ఈ రెండో పక్షంవారు స్థానిక ప్రజలైన దశ్యులతో సహ జీవనం చేసినట్టు చెప్పబడింది. దశ్యులు నల్లనివారు, చట్టిముక్కులవారు, యజ్ఞ

3. వేదకాలం నాటి ఆర్యులు



బలులు ఇచ్చేవారుకారు, ఆర్యులకు అర్థం కాని భాష మాట్లాడేవారు. వీరే సింధు నాగరికతకు చెందిన వారనుకోవచ్చు.

ఆర్యజాతులుగా వేదాలలో కనిపించే వారిలో భరతులు ప్రత్యేకత గలవారు. వీరుండిన ప్రాంతాల గల నదులు దృషద్వతీ, సరస్వతీ, ఆపయా. ఇవన్నీ మధ్య ఆసియా పడమర ప్రాంతాలివే. భరతులు అగ్నిని ఆరాధించేవారు. వారికి తృత్సు వంశంవారు పాలకులు. తృత్సులకు వశిష్ఠుడు కుల గురువు.

ఆర్యజాతుల మధ్య జరిగిన అంతః కలహాల ఫలితంగా భరతజాతి అత్యున్నత స్థానం సంపాదించుకున్నది.

ఆర్యులు అనార్యులతో చేసిన యుద్ధాలు ఇంకా ముఖ్యమైనవి. ఈ యుద్ధాలలో జయించి ఆర్యులు అనార్యదేశాలను ఆక్రమించారు. వారు తూర్పుగా విస్తరించారు. శంబరుడనే అనార్యవీరుణ్ణి దివోదాసుడనే వాడు ఓడించాడు. విశ్వామిత్రుణ్ణి గురువుగా పెట్టుకుని సుదాసుడనే వాడు యమునా తీరాన అనేక అనార్యజాతులను సమిష్టిగా పోరి ఓడించాడు. ఆర్యులు తూర్పు ప్రాంతాలను ఆక్రమించటానికి భరతులలాగే పూరులుకూడా విశేష కృషిచేశారు. ఋగ్వేద



కాలం నాటికి ఆర్యులు ఆక్రమించిన ప్రాంతం కాబూలునదీ ప్రాంతం నుంచి సరయూనదీ ప్రాంతం వరకూ ఉంది. "సప్తసింధు" అనేది ఈ ప్రాంతంలో పెద్ద భాగం.

ఈ ప్రాంతాన్ని అచ్చగా ఆర్యులే ఆక్రమించలేదు. ఆర్యులతో బాటు స్థానిక జాతులుకూడా ఉంటూండేవి.

ఋగ్వేదకాలం నాటి పరిపాలనాధికారం రాజుది. ఆయన తన రాష్ట్రాన్ని, ప్రజలనూ కాపాడేవాడు. ఆయన కొక పురోహితుడు సలహా లివ్వటమేగాక, మంత్ర తంత్రాల ద్వారా రాజ్యానికి శుభం కలిగించేవాడు.





పరిపాలన ప్రజామోదం పొందాలన్న నియమం ఉండేది.

ఆ నాటి సాంఘికజీవితానికి కుటుంబం కుదురు. తండ్రి కుటుంబానికి పెద్ద. స్త్రీలు చదువుకునేవారు. కొందరు ఋక్కులు కూడా రచించారు. యుక్తవయసు వచ్చాకనే వారికి వివాహాలు జరిగేవి. వారు ధనం కోసమూ, ప్రేమించీ కూడా పెళ్లాడేవారు. హెచ్చుమందికి ఒకే భార్య ఉండేది, కాని బహు భార్యాత్వం దూష్యంకాదు. ఆ కాలపు దుస్తులు నూలుతోనూ, లేడిచర్మాలతోనూ, ఉన్నితోనూ చేసి వాటికి బంగారు అలంకరణలు అమర్చేవారు. బంగారు ఆభరణాలూ, పూలమాలలూ పండుగలకు విధిగా ధరించేవారు. అలాగే విందులలో మాంసాహారం ఉండేది. మామూలుగా వేపిన ధాన్యమూ, అపూపాలు అనే పిండి వంటలూ, పెరుగూ, వెన్నా, పళ్ళూ తినేవారు. మొదట గోమాంస భక్షణ ఉండేది గాని అది క్రమంగా దూష్యమయింది. వారు సోమం, సుర అనే రెండు రకాల మద్యాలు తాగేవారు. పురుషులు వేటా, వ్యాయామ క్రీడలూ అభ్యసించే వారు. స్త్రీలు నృత్యగానాలు నేర్చేవారు.

ఆర్యుల సమాజంలో వర్ణవ్యవస్థ క్రమంగా ఏర్పడింది; దస్యులనేవారు, శూద్రులయారు. అదే విధంగా ఆశ్రమాలు కూడా ఏర్పడ్డాయి. వ్యవసాయం ఉండేది. వర్తకం కూడా సాగేది. ధనం కింద గోవులనూ, నిష్కము లనే బంగారు నాణెములనూ వాడే వారు. రాక పోకలకు గుర్రాలు పూన్చిన రథాలూ, ఎడ్లులాగే బళ్ళూ ఉండేవి. కమ్మరి, కుమ్మరి, కమసాలి, వైద్యవృత్తులుండేవి.

ఆర్యులకు లిపి ఉన్నట్టు కనబడదు. వేదాలు గురుముఖతః విని కంఠస్థం చేసే వారు. అశోకుడి శాసనాలకు వాడిన లిపి అనార్య లిపి.





# భారత చరిత్ర



క్రమంగా భరతఖండంలో ఆర్యసమాజాలు విస్తరించి, మార్పులు పొందాయి. అక్కడక్కడా రాజరికం లేని గణతంత్ర రాజ్యాలు చిన్నవి ఉన్నప్పటికీ, రాజరికానిదే పైచేయి అయింది. రాజ్యాలు విస్తరించి సామ్రాజ్యాలయాయి. ఇలాటి సామ్రాజ్యాలు నాలుగు—అవంతీ, వత్స, కోసల, మగధ—ప్రసిద్ధి కెక్కాయి.

అవంతికి ఉజ్జయిని రాజధాని. ఇది ఇప్పుడు మాల్వదేశంలో ఉన్నది. వత్స దేశానికి రాజధాని అయిన కౌశాంబి అలహాబాదు సమీపంలో ఉండేది. ఉజ్జయిని రాజైన ప్రద్యోతుడి కుమార్తె వాసవదత్తను వత్స రాజైన ఉదయనుడు ఎత్తుకుపోయి పెళ్ళాడిన కథను మనం లోగడ చదివి ఉన్నాం. కోసల సామ్రాజ్యానికి అయోధ్య రాజధాని. మగధ ఈనాటి బీహారు దక్షిణ ప్రాంతం. వేదకాలంలోనే మగధను బలాఢ్యులు పాలించారు. క్రీస్తు పూర్వం 6 వ శతాబ్దంలో బింబిసారుడనే వాడు రాజ్యాభిషిక్తుడై తన సామ్రాజ్యాన్ని బాగా విస్తరించాడు. ఇతను బుద్ధుడి సమకాలికుడు. బుద్ధుడు పరినిర్వాణం పొందటానికి 60 ఏళ్ళు పూర్వం తన 15 వ ఏట సింహాసనం ఎక్కాడట. (బుద్ధుడి పరినిర్వాణం క్రీ. పూ. 483 లో జరిగినట్టు అంచనా.)

బింబిసారుడు అంగ దేశాన్ని (తూర్పు బీహారును) జయించాడు. కోసల, వైశాలీ రాజకుమార్తెలను పెళ్ళాడాడు. తన రాజధాని గిరివ్రజం అయినప్పటికీ రాజగృహం అనే మరొక నగరం నిర్మించాడు. వర్ధమాన మహావీరుడు జైన మతాన్నీ, గౌతమ బుద్ధుడు బౌద్ధ మతాన్నీ బింబిసారుడి కాలంలోనే ప్రచారం చేశారు. బింబిసారుణ్ణి వృద్ధాప్యంలో అతడి కొడుకు అజాతశత్రువు హత్య చేశాడని ప్రతీతి.









అజాతశత్రువు రాజ్యానికి వస్తూనే శత్రు బాధ ఎదుర్కొన్నాడు. కాని దక్షులైన మంత్రులుండి అతనికి విజయం చేకూర్చి పెట్టారు. వీరి కృషివల్లనే, గంగా శోణా నదుల సంగమం వద్ద ఉండిన పాటలీ గ్రామం శత్రు నిర్భేద్యమైన కోటగా నిర్మించబడి, పాటలీపుత్ర మనే పేరు సంపాదించి భరతఖండ మంతటికీ మహానగరంగా 4 శతాబ్దులపాటు వెలిగింది. బుద్ధుడూ, మహవీరుడూ కూడా అజాతశత్రు కాలారంభంలోనే పరమపదించారు.

మహావీరుడి తండ్రి పేరు సిద్ధార్థుడు, తల్లి పేరు త్రిశల. వీరిద్దరూ వైశాలీ, మగధల రాజవంశీయులు. మహావీరుడు యశోద అనే ఆమెను పెళ్ళాడి, కొంత కాలం పవిత్రమైన గృహస్థాశ్రమం గడిపి, 30 వ ఏట సన్యసించాడు. పన్నెండేళ్ళు తపస్సు చేశాడు. చివరకు "కేవల జ్ఞానం" సంపాదించాడు. ఈయనకు జినుడనే పేరు కూడా వుండేది. అందుకే ఆయన మతం అవలంబించిన వారికి జైనులనే పేరు వచ్చింది. ఈయన 30 ఏళ్ళపాటు తన మతాన్ని దేశ దేశాల ప్రచారం చేసి, దక్షిణ బీహారులో పావా అనే చోట తన 72 వ ఏట నిర్వాణం పొందాడు. ఈయన నిర్వాణం బుద్ధ నిర్వాణానికి ముందే జరిగిందట. బుద్ధుడి కథ మనకు తెలిసినదే.

అజాతశత్రువు కొడుకు ఉదాయి. అతని తరవాత అనురుద్ధుడూ, ముండుడూ, నాగదాసకుడు అనే వారు వరసగా రాజ్యం చేశారు. వీరంతా పితృహంతకులే. నాగదాసకుడనే వాణ్ణి పౌరులు వెళ్ళగొట్టి శిశునాగుడనే మంత్రిని రాజుగా చేశారట.

శిశునాగుడి తరవాత రాజైన కాలాశోకుడు (లేక కాకవర్ణి) అనే వాడు పాటలీపుత్రాన్ని తన శాశ్వత రాజధానిగా చేసుకున్నాడు. ఇతని పరిపాలన సాగిన 10 వ ఏట బుద్ధ పరినిర్వాణం జరిగి నూరేళ్ళు నిండాయి.





ఇతను హత్య చేయబడ్డాడు. ఇతనికి పిల్ల లున్నప్పటికీ వారికి రాజ్యం దక్కలేదు. మగధ సింహాసనం శైశునాగుల నుంచి నందవంశానికి సంక్రమించింది.

మొదటి నందు డెవరో స్పష్టంగా తెలియదు. ఇతను శైశునాగులకు శూద్ర స్త్రీ వల్ల జన్మించాడని కొందరూ, ఒక వేశ్యకు మంగలి-వల్ల జన్మించాడని కొందరూ చెబుతారు. నందుడు అనేకమంది క్షత్రియులను సంహరించి తన సామ్రాజ్యాన్ని దృఢంగా స్థాపించుకున్నా డనటానికి చాలా ఆధారాలున్నాయి. అలెగ్జాండరు కాలం నాటికి బియాస్ నది అవతల ఉండే ప్రజలందరూ ఒకే సామ్రాజ్యానికి చెందినవారనీ, దానికి రాజధాని పాటలీపుత్రమనీ గ్రీకులు రాశారు. ఈ నందుడికే మహాపద్మ నందుడనీ, మహాపద్మపతి నందుడనీ పేరుండేది. ఈ పేర్లు ఇతనికి గల అంతులేని సేనలను సూచిస్తాయి. బౌద్ధమత గ్రంథాలలో ఇతనికి ఉగ్రసేనుడనే పేరు కూడా కనిపిస్తుంది. నందవంశం వారు తొమ్మిది మంది మాత్రమే మగధ రాజ్యాన్ని పరిపాలించారు. వీరిలో ఎనిమిది మంది మొదటి నందుడి కుమారులు. వీరందరూ వరసగా ఒకరి తరవాత ఒకరు రాజ్యం చేశారు. వీరిలో ఆఖరి వాడైన ధననందుడు ప్రజాకంటకుడు. అపారమైన ధనాన్ని పోగుచెయ్యటం కోసం ప్రజలను పన్నుల భారంతో పీడించాడు. ప్రజలు ఇతణ్ణి ద్వేషించి, రోశారు.

అందుకే నందవంశం అంతరింప జేసి చంద్రగుప్తుడనే వాడు ప్రజానాయకుడైనాడు. చంద్రగుప్తుడితో మగధ సామ్రాజ్యానికి మౌర్యులు చక్రవర్తులయారు.

నందులను తుదముట్టించి మగధ సింహాసనాన్ని చంద్రగుప్తుడి వశం చెయ్యటానికి కౌటిల్యుడు (లేక చాణక్యుడు) అనే ఒక బ్రాహ్మణుడు తోడ్పడ్డాడు. ఈ బ్రాహ్మడిది తక్షశిల.







# భారత చరిత్ర



క్రీ. పూ. 6 వ శతాబ్దంలోనే, బింబిసారుడి కాలంలో గాంధార దేశంపై పర్షియను చక్రవర్తి సైరస్ అనేవాడు దాడిచేసి కాపిశ అనే నగరాన్ని నిర్మూలించి, సింధు నదికి పడమట ఉండే గాంధార దేశాన్ని తన సామ్రాజ్యంలో కలుపుకున్నాడు.

పూర్వపు గాంధార దేశం సింధునదికి తూర్పుగానూ, పడమరగానూ విస్తరించి వుండేది. పడమరగా వుండే ప్రాంతానికి పుష్కలావతి అని పేరు. దానికి తూర్పుగా తక్షశిల ఉండేది. ఇది సుభిక్షమైన, సుపాలితమైన రాజ్యం. దీని రాజధాని రావల్పిండికి వాయువ్య దిశగా 20 మైళ్ళ దూరాన ఉండేది. ఈ నగరపు వర్తకం ప్రపంచ ఖ్యాతి పొందినది. గొప్ప విద్యాకేంద్రంగా ఇది గడించిన ఖ్యాతి అంతులేనిది. మహాభారతం మొట్టమొదటిసారి తక్షశిలలోనే పఠించబడిందని చెబుతారు.

తక్షశిల రాజ్యానికి ఎగువగా ఉరశ, అభిసార అనే దేశాలుండేవి. నైరృతీ దిశగా పూరులు (లేక పౌరవులు) అనే జాతివారుండేవారు; వీరు వేదకాలం నాటికే ప్రసిద్ధులు. ఝీలం, చీనాబ్ నదుల మధ్య ఒక రాజ్యాన్ని పెద్ద "పోరస్" అనేవాడూ, చీనాబ్, రావీ నదుల మధ్యప్రాంతాన్ని చిన్న "పోరస్" అనేవాడూ పాలించినట్టు గ్రీకు చరిత్రకారులు రాశారు. రావీ, చీనాబ్ నదుల దిగువప్రాంతాలలో శిబులూ, మాలవులూ, క్షుద్రకులూ, అంబష్ఠులూ అనే జాతులవారు నివసించేవారు. ఇవన్నీ స్వతంత్ర జాతులు. వీటిలో కొన్ని ప్రజాతంత్రం కలవి. అయితే వీరిమధ్య స్పర్థల వల్ల విదేశీయులు భారతదేశంపై దాడి చేసే అవకాశం చిక్కింది.

యూరపు ఆగ్నేయప్రాంతంలో మేసిడన్ అనే బల సంపన్నమైన యవన రాజ్యం

## 5. అలెగ్జాండరు దండయాత్ర





ఉండేది. క్రీ. పూ. 336 లో అలెగ్జాండర్ అనే సమర్థుడైన యువకుడు ఈ దేశానికి రాజయాడు. ఇతను డేరియస్ సంతతికి చెందిన పర్షియన్ రాజులను క్రీ. పూ. 333 లోనూ 331 లోనూ రెండుసార్లు ఓడించి, వారి రాజ్యాన్ని అక్రమించాడు. 330 కల్లా పర్షియనుల సామ్రాజ్యం అలెగ్జాండరు అధీనంలోకి వచ్చింది. పర్షియనుల పరిపాలనలో ఉండిన భారత భూభాగాలను స్వాధీన పరచుకునేటందుకు అతను క్రీ. పూ. 327 లో హిందూకుష్ పర్వతాలు దాటి వచ్చాడు. పుష్కలావతి మొదలైన అనేక నగరాలను జయించి అతను 326 లో పడమటి పంతెన మీదుగా సింధునదిని దాటి తూర్పుగా వచ్చాడు. తక్షశిల రాజైన అంభి అనేవాడు అలెగ్జాండరుకు ఘనమైన ఆతిథ్యమిచ్చి, గొప్పగా సహాయపడ్డాడు.

అంభి ప్రవర్తనను చూసి తీవ్రంగా నిరసించినవాడు పెద్ద పౌరవ రాజు (పోరస్.) ఇతను మహా వీరుడూ, మహా కాయుడూనూ. అలెగ్జాండరు వితస్తా (ఝీలం) నది చేరే సరికి అవతలి గట్టున బ్రహ్మాండమైన పౌరవ సేన యుద్ధ సన్నద్ధమై నిలిచి ఉన్నది. నది మంచి ఉరవడిలో ఉన్నది. ఎ్టెదుట అపారమైన సేన నిలిచి ఉన్నది. నది



దాటటం అసాధ్యమని గ్రహించి అలెగ్జాండరు మాయోపాయం చేశాడు. తన సేనలను అటూ ఇటూ చెదరగొట్టినట్టు నటించి, పదిహేడు మైళ్ళ ఎగువను సమావేశపరిచి అక్కడ నది దాటించి పౌరవ సేనతో యుద్ధానికి తలపడ్డాడు. కొద్దిమంది సైనికులు పౌరవ సేనలు చూస్తూండగా నది దాట యత్నించి నాశనమయారు.

పౌరవ సేనలో 30,000 మంది కాల్బలమూ, 4,000 అశ్వికులూ, 300 మంది రథికులూ, 200 మంది ఏనుగు లెక్కిన యోధులూ ఉన్నారు. అలెగ్జాండరు సేనలు ముందు దెబ్బ తీసినదాకా వేచి వుండక







తామే ముందుదెబ్బ తీసివుంటే పౌరవ రాజు ఓడి వుండకపోను. అలెగ్జాండరు సేనలో అశ్వికబలం హెచ్చు. వారి దాడిని రథికులు తట్టుకోలేకపోయారు. బురదలో కాల్బలం కదలలేకపోయింది. ఏనుగులు వెనక్కు తిరిగి తమ సైన్యాన్నే మట్టు బెట్టాయి. తన సేన చెల్లాచెదరై నప్పటికీ ఏనుగు నెక్కిన పౌరవ రాజు తీవ్రమైన గాయం తగిలినదాకా యుద్ధం చేశాడు. అయనను పట్టుకుపోయి తన ఎదట పెట్టి నప్పుడు అలెగ్జాండరు, "మిమ్మల్ని నే నెలా చూడాలి ?" అని అడిగితే పౌరవ రాజు, "రాజులాగా ప్రవర్తించండి !" అన్నాడట. అలెగ్జాండరు ఆయన రాజ్యాన్ని అక్రమించక అయనకే తిరిగి ఇచ్చివేశాడు.

అలెగ్జాండరు గంగాతీరందాకా జయించు కుంటూ పోదామనుకున్నాడు. కాని అతని సైన్యాలు యుద్ధంతో విసిగి ముందుకుపోవ నిరాకరించాయి. అలెగ్జాండరు కొంత సేనను పంపేసి, మరి కొంత సేనతో రావీ, చీనాబ్ దిగువప్రాంతాల ఉండే జాతులను నాశనం చేస్తూ వెనక్కు మరలాడు. మాలవులతో యుద్ధం చేసేటప్పుడు అతను తీవ్రంగా గాయపడ్డాడుకూడా. తరువాత అతను సింధుదేశంలోని ముఖ్య పట్టణాలను జయించి, క్రీ పూ. 325 లో సముద్ర మార్గాన బాబిలన్ చేరుకుని, మరి రెండు సంవత్సరాల అనంతరం ఆ నగరంలోనే మరణించాడు.

అలెగ్జాండరు జయించిన భారత ప్రాంతాలలో రాజ ప్రతినిధులుగా పర్షియనులూ, మాసిడన్ దేశీయులూ నియోగించబడ్డారు. శశిగుప్త, అంభీ మొదలైన రాజులుకూడా యవన పరిపాలనకు సహాయపడ్డారు. పౌరవ రాజూ, అభిసారదేశపు రాజూలాటివారు కొందరు సామంతులయారు. పుష్కలావతి లోనూ, తక్షశిలలోనూ అలెగ్జాండరు తాలూకు సైనిక కేంద్రాలు ఏర్పాటయాయి.





# భారత చరిత్ర



## 6. చంద్రగుప్త మౌర్యుడు

అలెగ్జాండరు ఇంకా పంజాబులో ఉండగానే, క్రీ. పూ. 326 లో, సింధు దిగువ లోయలోని బ్రాహ్మణులు జనాన్ని రెచ్చగొట్టి విదేశీయపాలకుల పైన పెద్ద పితూరీ లేవదీశారు. కాని అలెగ్జాండరు చేత నియోగితులైన పాలకులు దీనిని అణగదొక్కారు.

అయితే ఈ యవనపాలకుల మధ్య చీలికలు ఏర్పడసాగాయి. పశ్చిమ పంజాబు పాలకుడైన ఫిలిప్పోస్ అనేవాడు క్రీ. పూ. 324 లో హత్య చేయబడ్డాడు. మిగిలినవారు తమ ఆక్రమణలో ఉన్న భారతప్రాంతాన్ని పంచుకునేందుకు కీచులాడుకోసాగారు.

వారి మధ్య గల వైషమ్యాలను ఆధారం చేసుకుని పరపీడకులను పారదోలి, దేశాన్ని దాస్యం నుంచి విడిపించినవాడు చంద్రగుప్తుడు. ఇతనిది మౌర్యవంశం. ముర ఇతనికి తల్లిగాని, నాయనమ్మగాని అయి ఉండవచ్చు. ఆమె ఒక నంద రాజు భార్య అని చెబుతారు. ఈమె పేరనే మౌర్య వంశం ఏర్పడిందనీ, ఈమె శూద్ర స్త్రీ కనుక మౌర్యులు శూద్రులనీ ఒక వాదం.

అయితే మౌర్యులనే సూర్యవంశపు క్షత్రియులు పిప్పలీవన రాజ్యాన్ని పాలించినట్టు పురాతన బౌద్ధవాఙ్మయంలో చెప్పబడి ఉన్నది. ఏమైనప్పటికీ చంద్రగుప్తుడి నాటికి మౌర్యులు చాలా దైన్యస్థితిలో ఉన్నారు. చంద్రగుప్తుణ్ణి పసితనంలో పెంచినవారు కేవలం ఆటవికులూ, వేటగాళ్ళూనూ.

చంద్రగుప్తుడు కుర్రవాడుగా ఉండగానే అలెగ్జాండరును కలుసుకున్నాడు. అతని దర్పమైన మాటలకు అలిగి అలెగ్జాండరు అతన్ని చంపమని ఉత్తరు విచ్చాడట. చంద్రగుప్తుడు వింధ్యవనాలకు పారిపోయి ప్రాణాలు దక్కించుకున్నాడు.

తరవాత తక్షశిల నుంచి పాటలీపుత్రానికి వచ్చిన చాణక్యుడు (కౌటిల్యుడు) అనే ఒక



బ్రాహ్మణుడు నందరాజుల చేత పరాభవం పొంది, ఉగ్రుడై వింధ్యవనానికి వచ్చి, అక్కడ చంద్రగుప్తుడి పరిచయం పొంది అతని ద్వారా తన పగతీర్చుకున్నాడు. చంద్ర గుప్త చాణక్యులకు ఎక్కడో తవ్వుతూంటే ఒక నిధి దొరికిందట. ఈ నిధితో చంద్ర గుప్తుడు కొంత సేనను కూర్చుకుని నందు లతో యుద్ధంచేసి, నందవంశం నిర్మూలించి, మగధ సింహాసన మెక్కాడు. ఆ తరవాత కొంతకాలానికి అతను యవననాయకులతో యుద్ధం సాగించి ఉండవచ్చు.



ఒకటిమాత్రం నిజం: క్రీ. పూ. 321 కే సింధునదికి తూర్పుగా ఉండే ప్రాంతంలో యవనపరిపాలన అంతమయింది. 313 నాటికి చంద్రగుప్తుడు మాల్వదేశాన్ని వశ పరచుకున్నాడు. అతని సామ్రాజ్యం పడ మరగా సౌరాష్ట్రదేశం వరకూ విస్తరించింది.

చంద్రగుప్తుడు 24 సంవత్సరాలు పాలిం చినట్టు మన పురాణాలూ, బౌద్ధసాహిత్యమూ కూడా చెబుతున్నాయి. అతని ఆఖరు రోజు లలో మౌర్యసామ్రాజ్యం వాయువ్య ప్రాంతా నికి విస్తరించింది.

ఇది ఎలా జరిగిందంటే—అలెగ్జాండరు కింది సేనానాయకులలో ఒకడైన సెల్యూ కస్ అనేవాడు అలెగ్జాండరు మరణా నంతరం బాబిలన్ పరగణాకు రాజయాడు. తన సామ్రాజ్యాన్ని మధ్యధరాసముద్ర తీరం నుంచి సింధునది వరకూ విస్తరింప జేసి, సింధునదికి తూర్పున గల ప్రాంతాన్ని కూడా ఆక్రమించ యత్నించి విఫలు డయ్యాడు. దాని ఫలితంగా సెల్యూకస్ చంద్రగుప్తుడితో సంధి చేసుకుని, చంద్ర గుప్తుడి వద్ద 500 ఏనుగులు పుచ్చుకుని కాబూలులో కొంత ప్రాంతమూ, కంద హారమూ, బలూచిస్తానమూ మొదలైన విస్తృతప్రాంతాలను చంద్రగుప్తుడి పరం చేశాడట. ఈ సంధిని బలపరచటానికిగాను సెల్యూకస్ చంద్రగుప్తుడితో వియ్యం చేసు





కోపటమేగాక పాటలీపుత్ర రాజధానిలో తన రాయబారినికూడా ఉంచాడు.

చంద్రగుప్తుడు జైనమతం స్వీకరించాడనీ, అయన తన రాజ్యాన్ని వదిలిపెట్టి మైసూరు రాష్ట్రంలోని శ్రవణబెళ్గొళలో తన చివరిరోజులు గడిపాడనీ జైనులు చెప్పారు. కాని గ్రీకులు చెప్పేదాన్నిబట్టి చూస్తే చంద్రగుప్తుడు బలులు మానలేదు, జైనులు అవలంబించే అహింసా విధానాన్ని అవలంబించలేదు. అయనకు వేట అంటే చాలా ప్రీతి కూడానూ. చంద్రగుప్తుడిలాగే అయన కుమారుడు బిందుసారుడూ, మనమడు అశోకుడూ కూడా వేట తమకం గలవారు. అయినప్పటికీ చంద్రగుప్తుడు జైనమతం స్వీకరించకుండానే ఆ మతాల్ని ప్రోత్సహించి పోషించి ఉండవచ్చు.

చంద్రగుప్తుడు రాజైనది క్రీ.పూ. 326 లో గాని అటు తరవాతగాని అయిఉండాలి. చంద్రగుప్తుడి అనంతరం అతని కొడుకు బిందుసారుడు మౌర్యసామ్రాట్టు అయాడు. ఇతను క్రీ. పూ. 302 లో గాని ఆ తరవాత గాని రాజై ఉండవచ్చు.

బిందుసారుడు 25–28 ఏళ్ళ మధ్యకాలం పాటు రాజ్యమేలాడు. ఇతనికి "అమిత్రఘాతకుడు" అన్న బిరుదు ఉండేది. ఇతను తన తండ్రి సంపాదించిన సామ్రాజ్యాన్ని పెంచకపోయినా తరిగిపోకుండా నిలబెట్టుకున్నాడు. తక్షశిలలో ఒక పితూరీ సాగితే బిందుసారుడు దాన్ని విజయవంతంగా అణచగలిగాడని ఒక గాథ ఉన్నది. ఇతని కాలంలో ఉత్తర హిందూస్థానంలో చాలా భాగమూ, దక్కనులో కొంత భాగమూ మగధ సామ్రాజ్యంలో చేరి ఉండేది. కళింగదేశం మాత్రం స్వతంత్రంగా ఉండేది.

బిందుసారుడు కూడా తన తండ్రిలాగే యవనులతో సత్సంబంధాలు నెరపాడు. సెల్యూకస్ కుమారుడికీ ఇతనికీ మధ్య స్నేహపూర్వకమైన ఉత్తరాలు జరిగాయట.





# భారత చరిత్ర



## 7. అశోకుడు

చంద్రగుప్తుడి కొడుకైన బిందుసారుడు క్రీ. పూ. 273 ప్రాంతంలో చనిపోయాడు. ఆయన చనిపోయిన నాలుగు సంవత్సరాల అనంతరం అశోకుడు పాటలీపుత్రంలో రాజ్యాభిషేకం చేసుకున్నాడు. బిందుసారుడికి అనేకమంది కూతుళ్ళూ, కొడుకులూ ఉండేవారు. రాజ్యాధికారం కోసం బిందుసారుడి కొడుకుల మధ్య ఘర్షణ జరిగినట్టు కనిపిస్తుంది. అశోకుడు తన సోదరులను అనేకమందిని చంపి సింహాసనం ఎక్కాడని ప్రతీతి. అతను బిందుసారుడి సింహాసనానికి అసలైన వారసుడు కాక పోవచ్చు. అశోకుడి పట్టాభిషేకం నాలుగేళ్ళు ఆలస్యంగా జరగటానికి కారణం అన్నదమ్ముల అంతః కలహమే కావచ్చు.

అశోకుడు "ప్రియదర్శి", "దేవానాం ప్రియ" అనే బిరుదులను తన పేరుతో చేర్చుకున్నాడు. అనేకమైన అశోక శాసనాలలో ఈ బిరుదులు కానవస్తాయి. రాజ్యానికి వచ్చిన తొలికాలంలో అశోకుడు తన పూర్వులలాగే కత్తి పట్టి ఏలాడు. ఆయన కళింగ రాజ్యంతో ఘోరమైన యుద్ధం చేసి దాన్నికూడా మగధ సామ్రాజ్యంలో చేర్చుకున్నాడు. ఈ విజయంతో మగధ సామ్రాజ్యం తమిళదేశం మినహా యావద్భారతాన్నీ ఆక్రమించింది; ఆఫ్ఘనిస్తానులో చాలా భాగం ఈ సామ్రాజ్యంలోకి వచ్చింది.

కళింగ యుద్ధం భారత చరిత్రగతిలోనే గాక ప్రపంచ చరిత్రగతిలో కూడా ఒక ప్రముఖ ఘట్టంగా పరిణమించింది. అది అశోకుడి జీవితాన్నే మరొక మార్గానికి తిప్పింది. కళింగ యుద్ధంలో జరిగిన రక్తపాతం కళ్ళారా చూసి అశోకుడి అంతరాత్మ మేల్కొన్నది. ఆయన పశ్చాత్తాపంతో కుమిలిపోయాడు. కత్తిని విడిచి ధర్మాన్ని





చేపట్టాడు. ఇక ప్రపంచంలో ధర్మ విజయాలు తప్ప అస్త్రవిజయాలుండరాదని తీర్మానించుకున్నాడు. అటు పిమ్మట ఆయన అనుసరించిన వైదేశిక విధానంలో కూడా మార్పు వచ్చింది. తన రాజ్యంలో ధర్మఘోష తప్ప యుద్ధఘోష వినిపించ రాదని అశోకుడు శాసించాడు.

బౌద్ధమతమూ, బుద్ధుడి బోధలూ అశోకుణ్ణి అమితంగా ఆకర్షించాయి. ఆయన వాటిని శ్రద్ధా సక్తులతో పఠించి అవలంబించాడు. బుద్ధగయకూ, కపిలవస్తు నగరానికి యాత్రలు చేశాడు. ఆయన "ధర్మ యాత్రలు" చేస్తూ తన రాజ్యమంతా తిరిగి, సామాన్య ప్రజలకు "ధర్మం" బోధించాడు. ఒక్క విడిగ 256 రోజులు దేశయాత్ర చేసి, తన రాజ్యంలోనూ, పరిసర జంబూద్వీప ప్రాంతాలలోనూ ప్రజలు వెనకటి కన్న దేవత్వానికి దగ్గిర వచ్చారని తృప్తిపడ్డాడు.

ధర్మస్థాపన కోసమూ, ధర్మ వ్యాప్తి కోసమూ అశోకుడు చేసిన కృషి ఊహాతీతమైనది. ఇందుకుగాను ఆయన ప్రత్యేకంగా ఉద్యోగులను నియమించాడు. దేశమంతటా శిలాశాసనాలు వేయించాడు, ధర్మ స్తంభాలు ఏర్పాటు చేయించాడు. తన కొలువులో "ధర్మ మహామాత్రులు" అనే ఉన్నతాధికారులను ఏర్పాటు చేశాడు.

రాజ్యంలో అరాజకాన్ని రేపే అటవికులూ, ఇతర జాతులవారూ ఉండేవారు. వారిని బలప్రయోగంతో అణిచే పద్ధతికి అశోకుడు స్వస్తి చెప్పాడు. ఆయన తన కొడుకులకు సహితం నైతిక విజయం యొక్క ప్రాశస్త్యం బోధించాడు. ధర్మ ప్రచారంలో ఆయనకు కారువాకి మొదలైన ఆయన పత్నులు కూడా తోడ్పడ్డారు.

బౌద్ధ ధర్మాన్ని ఇతర దేశాలలో ప్రచారం చెయ్యటానికి అశోకుడు ఇతర దేశాలకు ప్రచారకులను కూడా పంపాడు. ఈవిధంగా

బౌద్ధం సింహళానికి, బర్మాకూ, సుమత్రాకూ ఇతర ప్రాంతాలకూ వెళ్ళింది. యవన దేశాలకు కూడా అశోకుడు ప్రచారకులను పంపాడుగాని అక్కడ బౌద్ధం అంతగా పాదుకోలేదు.

అశోకుడు మిగిలిన కృషితోపాటు నిర్దుష్టమైన బౌద్ధ ధర్మాలను లిఖిత రూపంలో తయారు చేయించాడు. బుద్ధ సంఘాల సక్రమ నిర్వహణ గురించి కూడా ఆసక్తి చూపాడు. అశోకుడిలో విశేష మేమంటే ఆయన బౌద్ధ మతాభిమాని అయినప్పటికీ ఇతర మతాల పట్ల అసహనం చూపలేదు, ఇతరులను చూపనివ్వలేదు. బ్రాహ్మణులూ, జైనులూ, గోశాలమతం వారైన ఆజీవికులూ, తదితర మతాలవారూ తమతమ మతాలను స్వేచ్ఛగా అనుసరించగలిగారు.

తాను ఏదైతే బోధించాడో దాన్ని అశోకుడు అక్షరాలా ఆచరించాడు. జంతు వధను అదుపులో ఉంచాడు, బలులు నిషేధించాడు. మానవులతోపాటు పశువులకు కూడా చికిత్సా సౌకర్యాలు ఏర్పాటు చేశాడు. ప్రయాణీకుల సౌకర్యంకోసం రహదార్ల వెంబడి చెట్లూ, తోటలూ వేయించాడు.

అశోకుడి మరొక ప్రత్యేకత ఏమంటే ఆయన నిర్మించిన కట్టడాలు అత్యద్భుతమైనవి. ఆలయాలూ, విహారాలూ, స్మారక స్థూపాలూ మొదలైన వాటి చెంత అద్భుతమైన హర్మ్యాలు కట్టించాడు. ఆయన ప్రజలకు ఐక్యతా, సహనమూ, అహింసా బోధించాడు. ఆయన కృషితో గంగాతీరాన కొద్దిమంది మాత్రమే అవలంబించిన బౌద్ధ మతం విశ్వవ్యాప్తి పొందింది. భారత చరిత్రలో అశోకుడిలాటి అపూర్వ వ్యక్తిని మనం చూడం.

అశోకుడు 36 లేక 37 ఏళ్ళపాటు రాజ్యం చేసి 232 (క్రీ. పూ.) ప్రాంతంలో మరణించాడు. ఆయనతో మగధ సామ్రాజ్య వైభవం మాసిపోయింది.





# భారత చరిత్ర



అశోకుడి అనంతరం మౌర్యసామ్రాజ్యం విచ్ఛిన్నమయింది. దానితోబాటు భారత చరిత్రలో శాఖోపశాఖలు ఏర్పడ్డాయి. వేరు వేరు ప్రాంతాలలో వేరు వేరు రాజులు విజృంభించి చరిత్ర గతిని భిన్నమార్గాల నడిపించారు.

అశోకుడి వారసులను గురించి కూడా వేరు వేరు గాథ లున్నాయి. పురాణాలలో కుణాలు డనేవాడు అశోకుడి అనంతరం రాజయినట్టున్నది. కాశ్మీరు చరిత్ర గ్రంథాలలో జలౌకుడు రాజయినట్టుగా రాసి ఉన్నది. వీరు అశోకుడి కుమారులు. అశోకుడి సామ్రాజ్యాన్ని అతని కుమారులు పంచుకుని ఉండవచ్చు. అశోకుడి శాసనాలలో తీవరుడనే కొడుకు పేరు మాత్రమే కనిపిస్తుంది; అయితే ఈ తీవరుడు ఏ ప్రాంతానికీ రాజయినట్టు కనబడదు. కుణాలుడి తరవాత బంధుపాలితుడు రాజ్యం చేశాడని పురాణాలు చెబుతున్నాయి. బౌద్ధ జైన గ్రంథాలలో కుణాలుడి మరొక కొడుకని చెప్పబడిన సంప్రతి (లేక సంపది) అనేవాడు కుణాలుడి అనంతరం చాలా మంది రాజ్యంచేసిన పిమ్మట పాటలీపుత్రాన్నీ, ఉజ్జయినినీ పాలించినట్టు పురాణాలలో చెప్పి ఉన్నది. సంప్రతికి ముందు పాలించినవారిలో దశరథు డనేవాడు ఉన్నాడు. అశోకుడి అనంతరం కొద్ది కాలానికే ఈ దశరథుడు మగధను పాలించాడు. ఇతను ఆజీవికులనే వారికి గుహలు దానం చేసినట్టు బీహారులోని నాగార్జునీ కొండలలో శాసనాలు దొరికాయి.

దశరథుడికీ, సంప్రతికీ అనంతరం శాలిశుకు డనేవాడు రాజ్యం చేశాడు. గార్గి సంహిత అనే జ్యోతిష గ్రంథంలో ఇతని పేరున్నది. ఇతను దుష్టుడు. ఇతని అనంతరం దేవవర్మ, శతంధనువు; బృహద్ర

## 8. మౌర్యసామ్రాజ్య విచ్ఛిత్తి



ధుడు అనే వాళ్ళు రాజులైనట్టు పురాణాలు చెబుతున్నాయి. బృహద్రధుణ్ణి అతని సేనా నాయకుడైన పుష్యమిత్రు డనేవాడు రాజ్య భ్రష్టుణ్ణి చేసి, తానే రాజై, శుంగవంశాన్ని స్థాపించాడు.

కాశ్మీరం మౌర్యుల అధీనం నుంచి ఇతరుల కిందికి పోయినట్టు కాళిదాసు రచించిన "మాళవికాగ్నిమిత్ర" నాటకంలో సూచించబడి ఉన్నది. క్రీ. పూ. మూడవ శతాబ్దం అంతమయేనాటికి కాబూలులోయకు సుభాగసేను డనేవాడు రాజై, తన రాజ్యాన్ని సింధులోయ వరకూ విస్తరించుకున్నాడు. ఇతను మౌర్యుడుకాడు.

మౌర్యసామ్రాజ్యం బలహీనం కావటానికి అశోకుడి అహింసా విధానం కారణం కావచ్చు. సామ్రాజ్యం బలహీనపడగానే తిరిగి యవనులూ (గ్రీకులు), ఇతర అనాగరిక జాతులవారూ వాయవ్య ప్రాంతం మీదుగా వచ్చిపడ్డారు. గాంధారం(వాయువ్య సరిహద్దు ప్రాంతం)లోనూ, శాకల (ఉత్తర పంజాబు నడిమి) ప్రాంతంలోనూ బలమైన విదేశీయ రాజ్యాలు వెలిశాయి. దక్షిణ ప్రాంతాలు స్వతంత్రమై మగధ సామ్రాజ్యాన్ని తలదన్నే సంస్కృతిని పెంపొందించుకున్నాయి.



మగధనూ, దాని పరిసరాలనూ శుంగ వంశీయులు స్వాధీన పరచుకున్నారు. వీరు భారద్వాజ గోత్రీయులైన బ్రాహ్మణులట. మొదటి శుంగరాజైన పుష్యమిత్రుడి రాజ్యం దక్షిణాన నర్మదాతీరం వరకూ, పశ్చిమోత్తరంగా పంజాబులోని జాలంధర్, సయాల్‌కోటల వరకూ ఉండేది. పుష్యమిత్రుడి రాజధాని పాటలీపుత్రమేగాని, యువరాజైన అగ్నిమిత్రుడు తన కొలువును విదిశ (తూర్పుమాల్వ)లో ఏర్పాటు చేసుకున్నాడు.

శుంగరాజులకు యవనుల ఒత్తిడి జాస్తి అయింది. ఈ ఒత్తిడిని గురించి పతంజలీ, కాళిదాసూ మొదలైనవారు తమ గ్రంథా





లలో రాశారు. అంతకంతకూ తీవ్రమౌతున్న యవనుల దౌర్జన్యాన్ని అరికట్టినవాడు అగ్నిమిత్రుడి కొడుకు వసుమిత్రుడు. ఇతను తన విజయం అనంతరం రెండు అశ్వమేధయాగాలు కూడా చేశాడు.

పుష్యమిత్రుడు 36 ఏళ్ళు రాజ్యంచేసి, క్రీ. పూ. 150 ప్రాంతందాకా పాలించాడు. అతని కొడుకైన అగ్నిమిత్రుణ్ణి కాళిదాసు "మాళవికాగ్నిమిత్ర" నాటకానికి నాయకుణ్ణి చేశాడు. క్రమంగా శుంగవంశరాజుల ప్రఖ్యాతి సన్నగిలింది. నిజమైన అధికారం వారి మంత్రులైన కణ్వుల వశమయింది. క్రీ. పూ. 40-30 మధ్యకాలంలో దక్షిణ ప్రాంతంలో ఒక మహనీయుడు బయలుదేరి శుంగులనూ, కణ్వులనూ తుడిచిపెట్టేశాడు. ఇతడు సాతవాహను డనే తెలుగువాడూ, ఆంధ్రుడూ అని పురాణాలలో ఉన్నది. సాతవాహనులు ఏలిన ప్రాంతం బళ్ళారికి సమీపంలో ఉండేదని చెబుతున్నారు. సాతవాహనుల కీర్తి శాలివాహనుడి కథలలో చిరస్థాయిగా నిలిచిపోయింది. ఈ రాజులలో జగద్విఖ్యాతి గడించిన మొదటివాడు మొదటి శాతకర్ణి. ఈయన పట్టాభిషిక్తు డవుతూనే అశ్వమేధ యాగం చేశాడు. ఈయన అనంతరం శకులు (సితియనులు) విజృంభించి శాతవాహనుల కీర్తిని అపహరించారు. కాని తిరిగి ఈ కీర్తికి మెరుగులు దిద్దినవాడు గౌతమీ పుత్ర శాతకర్ణి. ఈయన శకులనూ, యవనులనూ (గ్రీకులను,) పహ్లవులనూ (పార్థియనులను) ఓడించాడు. ఈయన సామ్రాజ్యం ఉత్తరాన మాల్వా నుంచి దక్షిణాన కన్నడదేశందాకా విస్తరించింది. ఈయన కుమారుడు వాశిష్ఠీ పుత్ర పులుమాయి, గోదావరి తీరాన ప్రతిష్ఠాన పురం రాజధానిగా ఏలాడు. సాతవాహనులలో ఆఖరువాడు శ్రీయజ్ఞశాతకర్ణి. ఇతని అనంతరం సాతవాహన సామ్రాజ్యం అస్తమించింది.





# భారత చరిత్ర



సాతవాహనులకు సమకాలికులై వారికి ప్రతిగా నిలిచినవారు కళింగ రాజులు. అశోకుడి అనంతరమే వీరు గొప్ప సామ్రాజ్యం స్థాపించారు. కళింగ రాజులలో ప్రముఖుడు ఖారవేలుడు. ఈయన మగధను ఏలుతూ ఉండిన బృహస్పతి మిత్రుడనేవాణ్ణి జయించాడు. ఈయన తన సామ్రాజ్యాన్ని గోదావరి దాటి విస్తరింప జేశాడట. అయితే ఈయన అనంతరం కళింగ సామ్రాజ్యం అంతరించి పోయింది.

తమిళ (ద్రవిడ) దేశంలో చాలామంది రాజులుండేవారు. వారిలో ముఖ్యులు చోళ, పాండ్య, కేరళ దేశాలవారు. ఈ నాటి తంజావూరు, తిరుచిరాపల్లి జిల్లాలనూ, పరిసర ప్రాంతాన్నీ చోళులు పరిపాలించారు. క్రీస్తు పూర్వం రెండవ శతాబ్దంలో చోళులు గొప్ప యుద్ధాలు చేశారు. ఏళరన్ అనే చోళరాజు సింహళాన్ని జయించాడు. ఇతని న్యాయబుద్ధిని నిరూపించే కథలు అనేకం చెబుతారు. ఈ నాటి మదుర, తిరునెల్వేలి, దక్షిణ తిరువాన్కూరు జిల్లాల ప్రాంతాన్ని పరిపాలించిన పాండ్యులు వర్తకాన్నీ, సంస్కృతినీ పెంపొందించారు. ఆగస్టస్ అనే రోమను చక్రవర్తి వద్దకు ఒక పాండ్యరాజు తన రాయబారిని పంపాడు. కేరళ రాజ్యం పాండ్యరాజ్యానికి ఉత్తరానా, పడమటా ఉండి, మలబారు, కొచిను, తూర్పు తిరువాన్కూరు ప్రాంతాలు చేరి వుండేది.

మౌర్య సామ్రాజ్యం విచ్ఛిత్తి అయినది మొదలు ఇండియాపై విదేశీయుల దండయాత్రలు సాగాయి. బాక్ట్రియాను ఏలే డిమిట్రియోస్ అనే యవనరాజు అఫ్గనిస్థానం, పంజాబు, సింధు దేశాలలో హెచ్చుభాగం జయించి పరిపాలించాడు. పంజాబులోని శాకల అనేది రాజధానిగా పెట్టుకుని మరొక యవనరాజూ, గాంధారంలో తక్షశిల

## 9. విదేశీయుల దాడులు



రాజధానిగా వేరొక యువనరాజూ పాలించారు. అయితే కాలక్రమాన ఈ యవన రాజులు తమ పరిసరాల ప్రభావానికి గురి అయి బౌద్ధమతమూ, వైష్ణవమూ పుచ్చుకున్నారు. క్రీ. శ. మొదటి శతాబ్దంలో భారత దేశంలో యవనుల ప్రభావం పూర్తిగా తుడిచి పెట్టుకుపోయింది.

యవనుల (గ్రీకుల)తో పోటీ చేసి వారి స్థానాన్ని ఆక్రమించిన విదేశీయులు శకులూ, పహ్లవులూ, కుషానులు. శకులు మధ్య ఆసియావారు. అక్కడి నుండి కుషానుల చేత తరమబడి దక్షిణంగా వలస వచ్చారు. వారు క్రీస్తు శకారంభంలో ఆఫ్గనిస్తానం దక్షిణ ప్రాంతంలో స్థిరపడి శకస్థానం అనేది ఏర్పాటు చేసుకున్నారు. క్రమంగా వారి పరిపాలన సింధు లోయకూ, పశ్చిమ భారతానికీ వ్యాపించింది.

క్రీ. శ. మొదటి శతాబ్దంలోనే శకుల సామ్రాజ్యంలో కొంత భాగాన్ని పహ్లవులు ఆక్రమించారు. అటుపిమ్మట భారతదేశంలో శక-పహ్లవ పరిపాలన కొంతకాలంసాగింది. వీరి తరఫున క్షత్రపులూ, మహాక్షత్రపులూ అనే గవర్నర్లు వేరువేరు ప్రాంతాలను పాలించారు. ఒక దశలో సాతవాహన సామ్రాజ్యంలో కొంత భాగం ఓడించి చివ



రకు గౌతమీపుత్ర శాతకర్ణి చేతిలో ఓడిపోయినది ఈ క్షత్రపులే. శకరాజులలో ప్రముఖుడు రుద్రదామనుడనేవాడు. ఇతను క్రీ. శ. 130-150 మధ్య కాలంలో పరిపాలించాడు. ఇతని పరిపాలన కొంకణ ప్రాంతం నుంచి ఉత్తరాన సింధు, మార్వారు దేశాలదాకా వ్యాపించిందట.

యు ఎ-చి అనే సంచార ముఠాలవారు క్రీ. పూ. 165 ప్రాంతంలో చీనా సరిహద్దు నుంచి తరుమబడి ఆక్సస్ లోయలో అయిదు రాజ్యాలు ఏర్పాటు చేసుకున్నారు. వీరిలో కుషానులనే వారికి రాజైన కుజులకుస అనేవాడు శక్తిమంతుడై ఒక





సామ్రాజ్యాన్ని స్థాపించాడు. ఇతను పహ్లావులను ఓడించి భారతదేశపు సరిహద్దుకు రాజైనాడు. కుజుల అచ్చు వేయించిన రాగి నాణాలను బట్టి అతను క్రీ. శ. మొదటి శతాబ్దం మధ్యకాలంలో రాజ్యం చేశాడని తెలుస్తున్నది.

కుజుల అనంతరం విమ అనే వాడు రాజ్యం చేశాడు. బంగారు నాణాలు అచ్చు వేయించాడు. శైవ మతం పుచ్చుకుని తన నాణాలపై "మహీశ్వర" అని తన పేరు వేయించుకున్నాడు. కనిష్కుడు ఇతని అనంతరం రాజయాడనీ, క్రీ. శ. 78 లో శకమానం ఇతనే స్థాపించాడనీ చెబుతారు. కనిష్కుడి రాజధాని పురుషపురం (పెషావరు). అతని రాజ్యం గాంధారం నుంచి అయోధ్య, వారణాశీలదాకా ఉండేది. అయితే కనిష్కుడి కీర్తికి ప్రధాన కారణం అతను బౌద్ధమతానికి చేసిన సేవే. పెషావరు వద్ద గొప్ప చైత్యం నిర్మించాడు. బౌద్ధ గ్రంథాలపై భాష్యాలు రాయించాడు. "బుద్ధ చరితం" రచించిన అశ్వఘోషుడు ఇతని ఆస్థానకవి.

కనిష్కుడు 23 ఏళ్ళపాటు రాజ్యం చేశాడు. అతని అనంతరం వాసిష్కుడనే వాడు కొద్ది కాలం ఏలిన పిమ్మట హువిష్కుడనేవాడు రాజ్యానికి వచ్చాడు. హువిష్కుడేలిన సామ్రాజ్యం కనిష్కుడి సామ్రాజ్యం కంటె ఒక్క పిసరు హెచ్చే ఉండినట్టు కనిపిస్తుంది. ఇతని కాలంలో మధురానగరం ప్రాముఖ్యానికి వచ్చింది. ఇతని పరిపాలనకు సంబంధించిన వివరాలు కాబూలుకు పడమరగానున్న వర్దస్ వద్ద బయటపడ్డాయి.

కుషానుల శకం 98 ఏళ్ళు నడిచింది. కుషాను రాజులలో ఆఖరువాడు మొదటి వాసుదేవుడు. ఇతను 31 ఏళ్లు పాలించాడు. ఇతని శాసనాలూ, నాణాలు మధుర ప్రాంతంలో లభించాయి. ఈ నాణాల పైన శివుడి బొమ్మ తరుచుగా కనిపిస్తుంది.





# భారత చరిత్ర



దేశాంతరాల నుంచి వచ్చి భారతదేశంలో రాజ్యాలు ఏర్పరచుకుని సామ్రాజ్యాలు కూడా ఏలిన విదేశీయులు శకులు, పహ్లవులు, యవనులు మొదలైన వారికి మొదటి దెబ్బ దక్షిణ దేశంలో తగిలింది. సాతవాహన వంశంవాడైన గౌతమీపుత్ర శాతకర్ణి ఈ విదేశీయుల పరిపాలనను దక్షిణాన లేకుండా చేసేశాడు. అయినా వీరి ఏలుబడి ఉత్తరదేశంలో మరికొంత కాలం నిర్విఘ్నంగా సాగింది. వాసుదేవ కుషానుడి అనంతరం కుషానుల ప్రభ తరిగిపోయినప్పటికీ పూర్తిగా నశించలేదు. క్రీ.శ. మూడవ శతాబ్దం నాటికి కూడా వీరి ఏలుబడి కింద నాలుగు రాజ్యాలున్నాయట. కాని గుప్త సామ్రాజ్యం ఏర్పడటంతో విదేశీయుల ప్రభ నశించి పోయింది.

మొదటి చంద్రగుప్తుడితో గుప్తరాజుల ఉచ్ఛదశ క్రీ.శ. 320 లో ప్రారంభమయింది. చంద్రగుప్తుడు "మహా రాజాధి రాజ" బిరుదం ధరించాడు. బీహారులో మహా శక్తిమంతులుగా ఉండిన లిచ్ఛవీ రాజ వంశంవారి ఆడ బడుచును కుమారదేవిని వివాహ మాడి తన బలాన్ని పెంపొందించుకున్నాడు. అతని హయాంలో గుప్త సామ్రాజ్యంలో అలహాబాద్, అయోధ్య, దక్షిణ బీహారు ప్రాంతాలు కలిశాయి.

గుప్త రాజులలో ప్రముఖుడన దగిన వాడు సముద్రగుప్తుడు. ఇతను 320 తరువాత ఎప్పుడో రాజ్యానికి వచ్చి 380 కి ముందుగానే చనిపోయాడు. ఇతను బహుముఖ ప్రజ్ఞాశాలి, కవి, పండితుడు, గాయకుడు. ఇతడి ఆస్థానంలో ఎందరో కవి పండిత ప్రకాండులుండేవారు. వారిలో హరిషేణుడు గొప్ప కవీ, గొప్ప యోధుడూ కూడా. ఇతని విజయాలు దక్షిణాన కంచివరకూ విస్తరించి నప్పటికీ గుప్త సామ్రాజ్యం.

## 10. గుప్త సామ్రాజ్యం



నర్మదా, మహా నదీల వద్ద ఆగిపోయింది. గంగా యమునా లోయప్రాంతమూ, తూర్పు మాల్వా, బహుశా బెంగాలులోని కొన్ని జిల్లాలూ గుప్త సామ్రాజ్యంలోవే. ఈయన ప్రభావం సామ్రాజ్యపు ఎల్లలు దాటి చాలా దూరం వెళ్ళింది. తూర్పు బంగాళం, అసాము, నేపాలు, గర్వాల్, జలంధర్, పంజాబు రాజులూ, పశ్చిమ భారతానికి చెందిన మాళవులూ, యౌధేయులూ, మద్రకులూ, అభిరులూ, సనాకానీకులూ, కుషాను వంశపు రాజ సంతతివారూ, శకులూ, సింహళ రాజులూ—అసంఖ్యాకులు ఆయన ఆధిక్యతకు లోబడి సామంతులై, కప్పాలు కట్టారు. ఈ విధంగా దిగ్విజయం చేసిన అనంతరం ఆయన అశ్వమేధయాగం చేశాడు.



సముద్రగుప్తుడి తరవాత రెండవ చంద్రగుప్తుడు రాజయాడు. ఈయనకు విక్రమాదిత్యుడనే బిరుదున్నది. ఇతను ఇంచుమించు క్రీ. శ. 380 నుంచి 413 వరకూ పరిపాలించాడు. ఇతనుకూడా తన సామ్రాజ్యాన్ని విస్తరించుకున్నాడు. ఇందుకుగాను ఇతను యుద్ధాలు చేయటమేగాక, వీలయినప్పుడు సామోపాయంకూడా ప్రయోగించాడు. ఇతర రాజ వంశ స్త్రీలను పెళ్లాడి తన బలం వృద్ధిచేసుకున్నాడు. కుబేరనాగ అనే రాజ పుత్రికను పెళ్ళాడి నాగ వంశీయులతోనూ, రుద్రసేను డనేవాడికి తన కుమార్తెను ప్రభావతి నిచ్చి దక్కనులోని వాకాటకులతోనూ మైత్రి చేసుకున్నాడు. పశ్చిమ మాల్వా, కతియవాడులలో శకుల పరిపాలన అంతం చేస్తానని మాట ఇచ్చి సనాకానీకుల నాయకుణ్ణి సామంతుణ్ణి చేసుకున్నాడు. ఇతను శకులను ఓడించిన విషయం ఇతని నాణాలపైనా, బాణుడి "హర్ష చరితం" లోనూ మనకు తెలుస్తుంది.

ఈ చంద్రగుప్తుడి నాణాలపైన "విక్రమాదిత్య" అనీ "సాహసాంక" అనీ, "శకారి"





అనీ వున్నది. విక్రమాదిత్యుణ్ణి గురించి కల్పిత గాథ లెన్నోవున్నాయి. ఆ గాథలలో ఇతని ఆస్థానంలో నవరత్నా లుండేవారని వున్నది. మిగిలినవారిమాట ఏమైనా కాళి దాసు చంద్రగుప్త విక్రమాదిత్యుడి సమ కాలికు డనటానికి ఆధారం వున్నది.

చంద్రగుప్త విక్రమాదిత్యుడి అనంతరం మొదటి కుమారగుప్తుడూ, అతని అనంతరం స్కందగుప్తుడూ రాజ్యం చేశారు. కుమార గుప్తుడికి మహేంద్రాదిత్యుడనే పేరుండేది. ఇతను 415 - 455 మధ్యకాలంలో రాజ్యం చేశాడు. ఇతని కాలంలో గుప్త సామ్రాజ్యం హిమాలయాల నుండి నర్మదదాకా, ఉత్తర బంగాళం నుంచి కతియవాడ్ దాకా విస్త రించి ఉండేది. ఇతని అఖరు దినాలలో నర్మదా లోయలోని పుష్యమిత్రు లనేవారు బలవంతులై చిక్కులు తెచ్చిపెట్టారు. అయితే స్కందగుప్తుడు వీరిని అణచి పెట్టాడు. కాని అతనికి హూణుల పోరు నతటస్థ పడింది. స్కందగుప్తుడు వారి తొలి దాడులను ఎదిరించి జయించాడు. ఈ విజయం "కథా సరిత్సాగరం"లో చెప్పబడి ఉంది. స్కందగుప్తుడి పరిపాలన క్రీ. శ. 467 ప్రాంతంలో ముగిసింది.

తరువాత చరిత్రలో మనకు ఎందరో గుప్తవంశపు రాజులు కనిపిస్తారు. వీరిలో కొందరు హూణులతో పోరి జయించి ప్రసిద్ధి కెక్కారు. వీరిలో బాలాదిత్యు డనేవాడూ, యశోధర్ము డనేవారూ ఉన్నారు. 5, 6, 7 శతాబ్దులలోకూడా దేశంలోని వివిధ ప్రాంతా లలో గుప్త రాజులు తమ ప్రతిభను ప్రద ర్శించారు. 7 వ శతాబ్దం ఉత్తరార్థంలో ఆదిత్యసేను డనేవాడు గుప్తవంశపు ఖ్యాతిని పునరుద్ధరించి, గొప్ప బిరుదులు తగిలించు కున్నాడు. అయితే 8 వ శతాబ్దంలో కనౌజ్, గౌడదేశపు రాజుల మధ్య సంఘర్షణలో మగధ నలిగిపోయింది. అంతటితో గుప్త సామ్రాజ్యం అస్తమించింది.





# భారత చరిత్ర



గుప్త సామ్రాజ్యం అడుగంటటంతో హూణులనే మంగోలియా జాతివారు కొన్ని ప్రాంతాల తమ ప్రతిభను స్థిరపరుచుకున్నారు. వీరు క్రూరులు, అనాగరికులు. 5, 6 శతాబ్దుల సంధికాలంలో వీరి ప్రభ బాగా సాగింది. హూణ పరిపాలనను విస్తరించిన రాజులలో ప్రసిద్ధులు తోరమానుడనేవాడూ, అతని కొడుకు మిహిరకులుడనే వాడూనూ. హూణుల విజృంభణను అణచిన వాడు దశపుర రాజైన యశోధర్ముడు.

6వ శతాబ్దం ఉత్తరార్థం నాటికి ఉత్తర భారతదేశంలో మౌఖరి వంశపు రాజులూ, దక్షిణ భారతంలో చాళుక్యులూ ప్రముఖులుగా ఉన్నారు.

మౌఖరులు తమ మూల పురుషుడు పురాణయుగపు అశ్వపతి అని చెప్పుకునే వారు. వీరిలో తొలిగా ప్రసిద్ధికి వచ్చి మహారాజాధిరాజ బిరుదం పెట్టుకున్నవాడు ఈశానవర్మ. ఇతను ఆంధ్రులనూ, శూలికులనూ, గౌడులనూ జయించినట్టు క్రీ. శ. 554 నాటి శాసనం ఉన్నది. (శూలికులంటే చాళుక్యులు కావచ్చు) మౌఖరివంశీయులు కూడా విదేశీయుల నెదిరించి పోరాడారు.

ఈశానవర్మ అనంతరం శర్వవర్మ, అవంతివర్మ, గ్రహవర్మ అనేవారు వరసగా రాజ్యం పాలించారు.

గ్రహవర్మ భార్య రాజ్యశ్రీ. ఈమె పుష్యభూతి వంశానికి చెందిన స్థానేశ్వరరాజు ప్రభాకరవర్ధనుడి కుమార్తె. ఈమెకు రాజ్యవర్ధనుడనీ, హర్షుడనీ ఇద్దరు సోదరులుండేవారు. రాజ్యశ్రీ భర్త అయిన గ్రహవర్మ మాళవరాజు చేత హత్య చేయబడ్డాడు. అప్పుడు రాజ్యశ్రీ అన్న అయిన రాజ్యవర్ధనుడు తన చెల్లెలి వైధవ్యానికి ప్రతీకారం చేశాడు గాని, కుట్ర చేసి గౌడరాజైన శశాంకుడనేవాడు అతన్ని హత్య చేశాడు.

## 11. హర్ష చక్రవర్తి





ఈ విధంగా ఖాళీ అయిన స్థానేశ్వర సింహాసనానికీ, మౌఖరీల రాజ్యానికీ హర్షుడు వారసుడయాడు. 606 లో హర్ష పరిపాలన ఆరంభమయింది.

ఇతను అయిష్టంతో సింహాసనం ఎక్కినట్టు కనిపిస్తుంది. కాని ఇతని పరిపాలన కూడా భారత చరిత్రలో ఒక సువర్ణ ఘట్టం. ఇతని రాజధాని కనౌజ్.

హర్షుడు ఆరేళ్ళపాటు శత్రువులను పరిమార్చటంలో గడిపి, 612 లో తన సామ్రాజ్యాన్ని భద్రపరచుకుని చక్రవర్తినని ప్రకటించుకున్నాడు.

634 కు పూర్వం హర్షుడు దక్షిణ దిగ్విజయానికి బయలుదేరినట్టున్నూ, వాతాపిని ఏలే చాళుక్యరాజు రెండవ పులకేసి హర్షుణ్ణి నిరోధించినట్టూ తెలుస్తున్నది. అయితే పులకేశి మరణానంతరం 643 లో హర్షుడు దక్షిణ దిగ్విజయం చేస్తూ గంజాం (ఒరిస్సా) దాకా వచ్చాడు.

హర్ష సామ్రాజ్యానికి కేంద్రమైన కన్యాకుబ్జం గంగ యొక్క తూర్పుతీరాన ఉండేది. ఇది బలమైన రక్షణలతో కూడినదనీ, గొప్ప హర్మ్యాలతో కూడినదనీ చీనా యాత్రికుడు హ్యూన్‌త్సాంగ్ వర్ణించాడు. ఎక్కడ చూసినా ఉద్యానవనాలూ, మంచి నీటి



కోనేరులూ ఉండేవి. పౌరులు విద్యావంతులు, ధనవంతులు. నగరములో సిరిసంపదలు వెల్లివిరిశాయి.

హర్షుడు చీనాతో సన్నిహిత రాయబార సంబంధాలు పెట్టుకున్నాడు. బౌద్ధక్షేత్రాలు చూడవచ్చిన చీనా యాత్రికుడూ, న్యాయశాస్త్రవేత్తా అయిన హ్యూన్‌త్సాంగ్‌తో ఆయనకు పరిచయం అయింది. హర్షుడు శైవం వదలి పెట్టకుండానే గాఢమైన బౌద్ధ మతాభిలాష ప్రదర్శించాడు. మాంసాహారమూ, ప్రాణిహింసా నిషేధించాడు. అనేక వసతి గృహాలూ, మఠాలూ ఏర్పాటుచేసి, విరివిరిగా దాన ధర్మాలు జరిపాడు.

643 లో హర్షుడు కన్యాకుబ్జంలోనూ, ప్రయాగలోనూ రెండు అపూర్వ సమ్మేళనాలు జరిపించాడు. ఈ రెంటికీ చీనా యాత్రికుడు వెళ్ళాడు. కన్యాకుబ్జ సమ్మేళనం మహాయాన బౌద్ధం యొక్క ప్రాశస్త్యాన్నీ, హ్యూన్‌త్సాంగ్ ఔన్నత్యాన్నీ లోకానికి ప్రదర్శించటానికి జరపబడింది. ఈ సమ్మేళనంలో 20 మంది రాజులూ, అనేక వేలమంది బౌద్ధ, బ్రాహ్మణ, జైన మత వేత్తలూ పాల్గొన్నారు. ప్రయాగ సమ్మేళనానికి 5 లక్షలమంది, మారుమూలల నుంచి కూడా, ఆహ్వానించబడి హర్షుడి వద్ద కానుకలు పొందారు. సమ్మేళనం మూడు రోజులు జరిగింది. మూడు రోజులూ వరసగా బుద్ధుడి, సూర్యుడి, శివుడి ప్రతిమలుంచబడ్డాయి. అయిదేళ్ళపాటు సంపాదించిన దంతా హర్షుడు ఆహూతులకు దానం చేసేసి, పాత బట్టలు ధరించి బుద్ధుణ్ణి ఆరాధించాడు.

హర్షుడు 40 ఏళ్ళు పరిపాలించి 646 ప్రాంతంలో దేహం చాలించాడు. విచ్ఛిన్నమైపోయిన ఉత్తర భారతంలో సక్రమ, న్యాయ పరిపాలన ఏర్పాటు చేశాడు. అందరికీ సమంగా న్యాయం జరిగింది. ఆయన రాజధాని అయిన కన్యాకుబ్జం "మహోదయశ్రీ" అనే పేరుతో ఆయన అనంతరం కూడా గొప్పకీర్తి దక్కించుకున్నది. ఆయన విఫలుడయింది, దక్షిణ దేశాన్ని లోబరచుకోవటంలో మాత్రమే.

హర్షుడు తనకు పూర్వులైన సముద్రగుప్తుణ్ణీ, అశోకుణ్ణీ అనుకరించ యత్నించాడు. పాశ్చాత్య చరిత్రకారులు హర్షుణ్ణి "హిందూయుగపు అక్బర్" అన్నారు. ఆయన ఆస్థానంలో బాణుడూ, మయూరుడూ, దివాకరుడూ, హ్యూన్‌త్సాంగ్ మొదలైన మేధావులుండేవారు. హర్షుడే స్వయంగా గొప్ప గ్రంథకర్త. ఆయన రచనలు కొన్ని నిలిచి ఉండటం మన అదృష్టం.





# భారత చరిత్ర



క్రీ. శ. 646-647 లో హర్షుడు పరమపదించాడు. ఇతని మరణానంతరం మధ్యదేశంలో ఏర్పడిన అరాజకం, 836 లో మొదటి భోజుడనే ప్రతిహారరాజు పరిపాలన నాటి దాకా సాగింది. కన్యాకుబ్జం యొక్క ఘనతను కాపాడటానికి యశోవర్మలాటి రాజులు చేసిన ప్రయత్నాలు సాగలేదు. మధ్యప్రదేశం వెలపల ఉండే రాజు లందరి కళ్ళూ కన్యాకుబ్జంపైనే ఉండేవి. 10 వ శతాబ్దందాకా ప్రతిహారులు కన్యాకుబ్జం ఘనతను కాపాడారు. చివరకు 1194 లో కన్యాకుబ్జం పతనమయింది.

హర్షుడికి కొడుకులున్నట్టు కనబడదు. అతని కుమార్తె వలభీ రాజైన ధృవభటుణ్ణి పెళ్ళాడింది. హర్షుడి అనంతరం హర్షుడి కీర్తి ప్రపత్తులను ఆశించిన వారిలో ధృవభటుడి కొడుకు ధీరసేనుడనేవాడు ఒకడు. ఇతను "పరమభట్టారక మహారాజాధిరాజ పరమేశ్వర చక్రవర్తి" అనే బిరుదు ధరించాడు.

మధ్యదేశంలో (గంగా లోయ ఎగువ ప్రాంతంలో) ఆదిత్యసేను డనేవాడు 672లో శక్తిమంతుడై విరాజిల్లాడు. ఇతని తండ్రి మాధవగుప్తుడు హర్షుడితో సఖ్యం గలవాడు. ఆదిత్యసేనుడు రాజ్యానికి వస్తూనే అశ్వమేధం చేశాడు. ఇతను మాల్వా, మగధ దేశాలకు చెందిన గుప్తవంశ శాఖవాడు. ఇతను తన కాలపు ప్రసిద్ధ వంశాలన్నిటితోటీ వియ్యాలు నెరపాడు. తన కుమార్తెను మౌఖరి వంశంవాడైన భోగవర్మకు ఇచ్చాడు.

ఆదిత్యసేనుడి తరువాత మగధలో దేవగుప్తుడు, విష్ణుగుప్తుడు, జీవితగుప్తుడు అనే వారు పరిపాలించారు. కాని 8 వ శతాబ్దం ఆరంభంలో మగధ గౌడుల వశమయింది. (పశ్చిమ, పశ్చిమోత్తర బెంగాలు ప్రాంతం గౌడదేశం. అక్కడివారు గౌడులు. తూర్పు,

## 12. హర్షుడి అనంతరం



మధ్య బెంగాలు ప్రాంతం వంగదేశం.) ఈ గౌడులు మగధలో ఎంతో కాలం వెలిగే అవకాశం లేకుండా కన్యాకుబ్జం తిరిగి ఉజ్వలమయింది. చంద్రవంశం వాణ్ణని చెప్పుకునే యశోవర్మ అనేవాడు తన కీర్తిని దిగంతాలకు వ్యాపింపజేశాడు. ఇతని గాథలు "గౌడవహో" అనే ప్రాకృత గ్రంథంలో వాక్పతిరాజ అనే కవి రచించాడు. యశో వర్మ హర్షుడి అడుగు జాడలలో నడిచాడు; గౌడరాజుపై దండెత్తి, అతణ్ణి యుద్ధంలో చంపాడు; వంగదేశాన్ని జయించి, దక్షిణాభి ముఖుడై నర్మదా తీరం దాకా వెళ్ళాడు. తరవాత రాజపుత్రస్థానపు ఎడారి మీదుగా తన రాజధానికి వచ్చి చేరాడు. వాక్పతిరాజ అనేవాడూ, భవభూతీ ఈ యశోవర్మ ఆస్థాన కవులు. హర్షుడిలాగే ఇతనుకూడా 731లో చీనాతో రాయబార సంబంధాలు ఏర్పాటు చేసుకున్నాడు. చివరకు యశోవర్మ లలి తాదిత్యుడనే కాశ్మీరు రాజుతో యుద్ధం చేసి చనిపోయాడు.

కాశ్మీరులోయ అశోక, కనిష్క, మిహిర కుల రాజుల సామ్రాజ్యంలో ఒక ప్రాంతంగా ఉండి, 7వ శతాబ్దిలో ఒక ప్రముఖ రాజ్యంగా రూపొందింది. దుర్లభవర్ధను డనేవాడు మూలపురుషుడుగా గల కార్కోట



వంశం వారు కాశ్మీరును ఏలారు. ఈ రాజ్యం చీనా చక్రవర్తికి లోబడి ఉండినట్టు కన బడుతుంది. దుర్లభవర్ధనుడి మనమలు చంద్రాపీడుడూ, ముక్తాపీడ లలితాదిత్యుడూ అనేవారు చీనా చక్రవర్తి నుంచి కాశ్మీరు రాజ్యాధిపత్యం స్వీకరించారు. లలి తాదిత్యుడు గొప్ప యోధుడు. ఇతను యశో వర్మను ఓడించటమేగాక టిబెటనులనూ, దర్దులనూ, తురుష్కలనూ సింధు ప్రాంతంలో ఓడించి, గౌడరాజును వధించాడు. ఇతను కట్టించిన మార్తాండాలయం ప్రసిద్ధమైనది.

జయాపీడవినయాదిత్యుడనే వాడు లలితాదిత్యుడి మనమడు. తాతగారిలాగే





గౌడ, కన్యాకుబ్జ రాజులను జయించాడు. ఇతని ఆస్థానంలో క్షీరస్వామి, ఉద్భటుడు, దామోదరగుప్త, వామనుడు మొదలైన పండితులుండేవారు. అయితే ఇతను ప్రజలను పన్నుల భారంతో పీడించి చాలా అపనిందకు గురి అయాడు. 855 లో ఈ వంశం అంతరించి, ఉత్పల వంశంవారు కాశ్మీరానికి రాజులయారు.

ఉత్పలవంశ మూలపురుషుడు అవంతివర్మ నీటి పారుదల సౌకర్యాలు విరివిగా చేశాడు. ఇతని కుమారుడు శంకరవర్మ కాశ్మీర రాజ్యాన్ని అనేక దిక్కుల విస్తరింపజేశాడు; కన్యాకుబ్జ రాజైన మొదటి భోజుడితోనూ, ఉదభాండపుర (సింధు ప్రాంతం) రాజైన లల్లియషాహీ తోనూ యుద్ధాలు చేశాడు. గుర్జరుల నుంచి పంజాబులో కొంత ప్రాంతం లాక్కున్నాడు. ఇతను కూడా పన్నులతో ప్రజలను పీడించగా, ఇప్పటి హజారా జిల్లాలోని ఉరశగ్రామ పౌరులు ఇతనిపై తిరగబడి చంపేశారు. కొంత కాలం పాటు అరాజకం చెలరేగిన పిమ్మట కాశ్మీర బ్రాహ్మణులు కృషిచేసి యశస్కరుడనే బ్రాహ్మణ్ణిరాజుగా చేశారు.

యశస్కరుడి సంతతి కొంతకాలం కాశ్మీరును పాలించిన మీదట పర్వగుప్తు డనే వాడు రాజయాడు. పర్వగుప్తుడి కొడుకు రాజ్యానికి వచ్చాక అతని భార్య దిద్దా అనే ఆమె రాజ్యభారం తానే వహించింది. 1003 దాకా ఆమె రాజ్యం చేసి తరవాత తన కిరీటాన్ని సంగ్రామరాజ అనే వాడికి ఇచ్చింది. ఇతను లోహర వంశ స్థాపకుడు.

సంగ్రామరాజ కాలంలోనే ఘజ్నీ మహమ్మద్ ఉదభాండపుర రాజ్యంపై పడ్డాడు. కాశ్మీరం నుంచి సహాయం అందినప్పటికీ ఉదభాండపురం ఓడిపోయింది. కాశ్మీర రాజ్యం ఘజ్నీ మహమ్మద్ వాత పడకే తప్పించుకున్నదే గాని అంతః కలహాలు దాన్ని కుంగదీశాయి.





# భారత చరిత్ర



గౌడ వంగ దేశాలు అతి ప్రాచీన మైనవి, పురాణ కాలం నాటివి. మౌర్యుల, గుప్తుల కాలంలో ఇవి మగధ సామ్రాజ్యంలో చేరి ఉండేవి. 7, 8 శతాబ్దులలో గౌడదేశం కన్యాకుబ్జ, కాశ్మీర దేశాలతో సమాన ప్రతిభ కనబరిచింది. పాలవంశపు రాజులు బెంగాలును చరిత్రప్రసిద్ధం చేశారు. పాలవంశ మూలపురుషుడు గోపాలుడు "వంగపతి" అనీ, "గౌడేశ్వరు" డనీ కూడా ఖ్యాతి కన్నాడు. ఇతని కొడుకు ధర్మపాలుడు 8వ శతాబ్దం ఉత్తరార్థంలో రాజ్యానికి వచ్చాడు. ఇతని పరిపాలనలో ప్రాచీన పాటలీపుత్రం తిరిగి శోభ పొందింది. ఇతని పరిపాలన హిమాలయాల నుంచి దక్షిణాన గోకర్ణం వరకూ సాగిందట. కాని మధ్య దేశంలో ఇతని ప్రభావాన్ని (కన్నడ) రాష్ట్రకూటులూ, పశ్చిమం నుంచి ప్రతిహారులూ భగ్నంచేశారు. ఇతను జయించిన కన్యాకుబ్జం 836కు ముందే ప్రతిహారుల వశమయిపోయింది.

ధర్మపాలుడి కొడుకు దేవపాలుడు పశ్చిమ, దక్షిణ దేశాలతో యుద్ధాలు సాగించాడు. సువర్ణద్వీప (సుమత్రా) రాజైన బాలపుత్రదేవు డితని వద్దకు రాయబారిని పంపాడు. ఇతని అనంతరం పాలవంశ ప్రతిభ సన్నగిల్లింది. తరవాత బెంగాలులో ప్రతిహారులూ, కాంభోజులూ కూడా అధికారం చలాయించారు. అయితే 11వ శతాబ్దంలో మొదటి మహీపాలుడు పాల వంశ ప్రతిష్ఠను పునరుద్ధరించాడు. కాని 12వ శతాబ్దంలో విజయసేనుడనే కర్ణాట రాజు బెంగాలును ఓడించి తన పరిపాలనను అక్కడ ప్రతిష్ఠించుకున్నాడు.

కన్యాకుబ్జాన్ని పాల వంశం నుంచి లాక్కున్న ప్రతిహారులు లక్ష్మణుడి సంతతి వారమని చెప్పుకున్నారు. ప్రతిహార రాజు

**13. పాలులు, ప్రతీహారులు, పల్లవులు**



లలో మొదటి భోజుడూ, అతని కొడుకు మొదటి మహేంద్రపాలుడూ ముఖ్యులు. 1018లో కన్యాకుబ్జంలో రాజ్యపాల ప్రతిహారుడు రాజ్యం చేస్తూండగా ఘజ్నీ మహమ్మద్ దండయాత్ర జరిగింది. అటు తరవాత ప్రతిహార వంశీయులు అక్కడా యిక్కడా కేవలం చిల్లర రాజులుగా మాత్రమే కాలం గడిపారు.

క్రీ. శ. 2 వ శతాబ్దాంతంలో గౌతమీపుత్ర యజ్ఞశ్రీ శాతకర్ణితో సాతవాహనుల ప్రతిభ సన్నగిలింది. వారి స్థానాన్ని ఇక్ష్వాకులూ, బృహత్ఫలాయనులూ, శాలంకాయనులూ ఆక్రమించారు. విదర్భ ప్రాంతాల వాకాటకులు పైకివచ్చారు.



సముద్రగుప్తుడు దక్షిణ దిగ్విజయానికి వచ్చేనాటికి వింధ్యకు దక్షిణాన ఏలుతూ వుండిన ముఖ్య రాజవంశాలు వాకాటకులూ, ఇంకా దక్షిణంగా పల్లవులూనూ.

4 వ శతాబ్దం మధ్యలో విష్ణుగోప పల్లవుడనే రాజు సముద్రగుప్తుడికి ఓడిపోయి విడిచిపుచ్చబడ్డాడు. పల్లవ రాజులలో ప్రసిద్ధుడుగా చెప్పబడి, అశ్వమేధం చేసినవాడు శివస్కందవర్మ.

పల్లవరాజుల రాజధాని కంచి. వారిలో అనేకమంది తెలుగు, కన్నడ ప్రాంతాలను కూడా పాలించారు. క్రీ శ. 436 లో సింహవర్మ అనే పల్లవరాజు రాజ్యానికి వచ్చినట్టు దాఖలా ఉన్నది.

అయితే 6 వ శతాబ్దం ఉత్తరార్థంలో సింహవిష్ణు అనేవాడు రాజయినాక పల్లవ చరిత్ర వివరాలు స్పష్టంగా ఉన్నాయి. ఇతను చోళరాజ్యాన్నీ, దక్షిణప్రాంతాన్నీ, లంకనూకూడా వశపరచుకున్నాడట. ఇతను వైష్ణవుడు. ఇతనూ, ఇతని ఇద్దరు భార్యలూ గల చెక్కడం ఒకటి మహాబలిపురంలో ఈ నాటికీ ఉన్నది.

సింహవిష్ణు కుమారుడు మొదటి మహేంద్రవర్మ. ఇతని కాలంలోనే దక్షిణాధిపత్యం





కోసరం పల్లవులకూ, వాతాపి ఏలిన చాళుక్యులకూ ఘర్షణ ఆరంభమై, అనేక తరాల పాటు సాగింది. రెండవ పులకేశి అనే చాళుక్యరాజు పల్లవులను ఓడిస్తే, మహేంద్రవర్మ కుమారుడైన మొదటి నరసింహవర్మ చాళుక్యులను ఓడించాడు. రెండవ పులకేశి కొడుకు మొదటి విక్రమాదిత్యుడు పల్లవులపై యుద్ధంచేశాడు. 8 వ శతాబ్దంలో అతని ముని మనమడైన రెండవ విక్రమాదిత్యుడు పల్లవులను ఓడించి కంచిని స్వాధీనపరచుకున్నాడు.

పాండ్యులుకూడా పల్లవులపై దండెత్తి కావేరీ తీరందాకా జయించారు. చివరకు 9 వ శతాబ్దం అంతంలో ఆదిత్యచోళుడనే వాడు అపరాజిత పల్లవుణ్ణి ఓడించి పల్లవ వంశాన్ని పదభ్రష్టంచేశాడు.

భారత చరిత్రలో పల్లవుల పాత్ర చారిత్రకంగానూ, సాంస్కృతికంగానూ చెప్పుకోదగినది. దక్షిణాపథంలో ఒక గొప్ప సామ్రాజ్యాన్ని వారు మొదటగా నిర్మించారు. వారి ప్రతిభ లంక (సింహళం) దాకా ప్రసరించింది. వారి కాలంలో అనేకమంది (వైష్ణవ) ఆళ్వారులూ, (శైవ) నయనారులూ కీర్తి గడించారు. వారికాలంలో కంచి; బ్రాహ్మణ, బౌద్ధ సంస్కృతులకు కేంద్రమయింది. "విచిత్ర చిత్త" అనే బిరుదుగల మొదటి మహేంద్రవర్మ గుహా శిల్పాల పద్ధతి అమలు చేశాడు. ఆయన "మత్తవిలాస ప్రహసనం" అనే హాస్యనాటకంకూడా రచించాడు. పుదుక్కోట సంస్థానంలోని ఒక గుహలో కనిపించిన చిత్రరువులు ఇతని కాలానివేనని నిర్ణయించారు. ఇతని కొడుకు నరసింహవర్మ మహామల్లుడు. ఇతని పేరనే మహాబలిపురం (మహామల్లపురం) ఏర్పడింది. ఇక్కడి శిల్పాలను చూడటానికి జనం దేశదేశాల నుంచి వస్తారు. రాజసింహనరసింహవర్మ అనే పల్లవరాజు కంచిలో కైలాసనాథాలయం కట్టించాడు.





# భారత చరిత్ర



పల్లవుల బద్ధ శత్రువులు చాళుక్యులు. వీరి ప్రభ కర్ణాటదేశంలో 6 వ శతాబ్దంలో ఆరంభమయింది. వీరి తొలి రాజధాని వాతాపి (బాదామి). వీరి మూలపురుషుడు మొదటి పులకేశి. ఇతని కొడుకులు మొదటి కీర్తివర్మా, మంగలేశుడూ కూడా కొంకణ, వైజయంతి, దక్షిణ మహారాష్ట్ర, మాల్వ దేశాలను జయించి చాళుక్య సామ్రాజ్యాన్ని నలువైపులా విస్తరింప జేశారు. కీర్తివర్మ కొడుకైన రెండవ పులకేశి చరిత్రప్రసిద్ధుడు. ఇతను 609 నుంచి 642 దాకా ఏలాడు. ఇతను దక్కను యావత్తూ జయించి గౌతమీ పుత్ర శాతకర్ణిని మరిపింప జేశాడు. హర్షుణ్ణి ప్రతిఘటించాడు. పల్లవ మహేంద్రవర్మ దర్పం అణచాడు. పిష్టపుర (పిఠాపుర) రాజ్యాన్ని జయించి దానికి తన తమ్ముడైన కుబ్జ విష్ణువర్ధనుణ్ణి రాజుచేశాడు. కాని ఇతని హయాంలోనే పల్లవ నరసింహవర్మ ఇతన్ని ఓడించి, వాతాపిని మట్టిపాలుచేశాడు.

అయితే చాళుక్యుల ప్రతిభ అంతటితో అంతరించి పోలేదు. రెండవ పులకేశి కొడుకైన మొదటి విక్రమాదిత్యుడు తన శత్రువులైన పల్లవులతో తిరిగి పోరు ప్రారంభించాడు. ఈ పోరాటం మరింతగా సాగించి కృతకృత్యుడైన వాడు ఇతని మనమడు రెండవ విక్రమాదిత్యుడు. ఇతను పల్లవ రాజధానిని లోబరచుకున్నాడు కూడా. రెండవ విక్రమాదిత్యుడి కుమారుడి కాలంలో చాళుక్య ప్రతిభ అంతమై, రాష్ట్రకూటుల ప్రతిభ తల ఎత్తింది. ఆఖరు చాళుక్యరాజు పతనానికి కారకుడు అతని సేనానాయకుడైన దంతిదుర్గు డనేవాడు.

ఇతను పునాది వేసిన రాష్ట్రకూట సామ్రాజ్యం మహారాష్ట్ర, కర్నాట ప్రాంతాలాక్రమించింది. రాష్ట్రకూటులు తమ

**14. చాళుక్యులు, రాష్ట్రకూటులు**





మూలపురుషుణ్ణిగా కృష్ణుడి తమ్ముడైన సాత్యకిని చెప్పుకుని, తాము యాదవుల మన్నారు. వారు తెలుగుదేశపు రెడ్డివంశం వారని కొందరు చెబుతున్నారు. రాష్ట్ర కూటులు ఆంధ్రదేశపు రైతులని తూర్పు చాళుక్యుల పత్రాల ద్వారా తెలుస్తున్నది. వీరు ఒకప్పుడు నిజాము రాజ్యంలోని లట్టలూరు గ్రామానికి నాయకులుగా ఉండినట్టు సాక్ష్యం ఉన్నది.

రాష్ట్రకూట సామ్రాజ్యం ఉచ్చలో ఉన్న కాలంలో ఉత్తరాన, దక్షిణ గుజరాతు, మాల్వ, బాఘేల్‌ఖండ్‌ల దాకానూ, దక్షిణాన తంజావూరు దాకానూ విస్తరించి ఉండేది. పల్లవులు కన్యాకుబ్జ చక్రవర్తిని ప్రతిఘటించటం మాత్రమే చేశారుగాని రాష్ట్ర కూటులు, మహీపాల ప్రతిహారుడు రాజ్యం చేసే కాలంలో, కన్యాకుబ్జాన్నే ముట్టడించారు. రాష్ట్రకూటులు ఇంత సామ్రాజ్యాన్ని ఏర్పరచినప్పటికీ, తూర్పు తీరాన గోదావరీ కృష్ణానదీ ముఖప్రాంతాలు రాష్ట్ర కూటుల వశం కాలేదు; వాటిని చాళుక్య వంశపు రాజులే పరిపాలిస్తూ వచ్చారు. మాన్యఖేటాన్ని పరిపాలించిన రాష్ట్రకూట రాజు, వల్లభరాజు, ప్రపంచపు మహా చక్రవర్తులు నలుగురిలో ఒకడని ఆ కాలపు




అరబ్బీ రచయితలు ప్రశంసించారు. (మిగిలిన ముగ్గురు చక్రవర్తులు—చీనా చక్రవర్తీ, బాగ్దాదు ఖలీఫా, కాన్‌స్టాంటి నోపిల్ చక్రవర్తీ.)

రాష్ట్రకూట రాజులు సారస్వతాన్ని పోషించారు. మొదటి అమోఘవర్షు డనే వాడు ప్రఖ్యాత కవి. ఎల్లోరాలో కైలాసనాథాలయం చెక్కించిన వాడు మొదటి కృష్ణు డనే వాడి దంతిదుర్గుడి ముందు తరానికి చెందిన రాష్ట్రకూటుడు. చాళుక్యులు కంచిలోని పల్లవులతో పోరాడినట్టే, రాష్ట్ర కూటులు కన్యాకుబ్జపు ప్రతిహారులతో పోరాటాలు సాగించారు. మొదటి కృష్ణుడి చిన్న





కొడుకు ధృవుడనేవాడు ప్రతిహార వత్స రాజును ఓడించాడు. ధృవుడి కొడుకైన మూడవ గోవిందుడి కాలంలో రాష్ట్ర కూటులు అజేయు లనిపించుకున్నారు. కంచి పల్లవులు వారికి కప్పం కట్టారు; దక్షిణ గుజరాతులో రాష్ట్రకూట వంశీయుడు రాజ్యం ఏలాడు. వత్సరాజు కొడుకు రెండవ నాగభటుడూ, వంగరాజు చక్రాయుధుడూ వారికి లొంగిపోయారు.

815 నుంచి 877 దాకా పాలించిన మొదటి అమోఘవర్షుడు తన రాజధానిని నిజాం రాష్ట్రంలోని మాన్యఖేటం(మల్ఖేడ్)కు మార్చాడు. ఈయన గోదావరీ కృష్ణా తీరాల లోని వేంగీ చాళుక్యులతో పోరాడాడు. ఇతని ముని మనమడు మూడవ ఇంద్రుడు ప్రతి హార మహీపాలుణ్ణి జయించి, కన్యాకుబ్జాన్ని తాత్కాలికంగా ఆక్రమించ గలిగాడు.

రాష్ట్రకూటులలో చెప్పదగిన ఆఖరు రాజు మూడవ కృష్ణుడు. ఇతని కాలంలోనే రాష్ట్రకూట సామ్రాజ్యం అత్యధికంగా విస్త రించింది. 973 లో రాష్ట్రకూట వంశం పతనమయింది.

వాతాపి చాళుక్యుల వారసుడనని చెప్పు కునే రెండవ తైలుడు—ఒక సామంతు— వారి పతనానికి కారకుడయాడు.

ఈ తైలుడు కల్యాణీ చాళుక్య వంశానికి మూల పురుషుడు. ఇతని వారసులు తంజా వూరు చోళులతో యుద్ధాలు చేశారు. ఇప్పుడు చోళుల ప్రతిభ కూడా హెచ్చసాగింది. ఇందుకు కారణ భూతులు రాజరాజ చోళుడూ, అతని కుమారుడు మొదటి రాజేంద్ర చోళుడూనూ. దక్షిణ భారతంలో చోళులూ, చాళుక్యులూ సంఘర్షణ పడు తూంటే ఉత్తర భారతంలో చరిత్రకు కొత్త అధ్యాయం ప్రారంభ మయింది; సుల్తాను ఘజ్నీ మహమ్మదు విజృంభణ ఫలితంగా ఒక్కొక్క ఉత్తర రాజ్యమే పతనం కాసాగింది.





# భారత చరిత్ర



మనం ఇంతవరకూ భారతదేశంలో జరిగిన చరిత్ర గురించీ, అక్కడ వెలిసిన సామ్రాజ్యాలను గురించీ, రాజవంశాలను గురించీ ముస్లిముల దాడుల కాలందాకా తెలుసుకున్నాం. తరవాత జరిగిన చరిత్ర గురించి తెలుసుకునే ముందు భారతదేశం యొక్క దేశాంతర చరిత్ర గురించి తెలుసుకుందాం.

భారతదేశం అనాదిగా దేశాంతరాలతో సంబంధం కలిగి ఉండింది. భారతీయులు భూమి మీదా, సముద్రం మీదా ప్రయాణాలు చేసి దేశాంతరాలకు వలసవెళ్ళారు. ఒకప్పుడు భారతదేశానికి బాబిలోనియా, సిరియా, ఈజిప్టులతో వర్తక సంబంధాలుండేవి. క్రీస్తుశకం మొదటి శతాబ్దం మొదలుకుని ఈ వర్తక వివరాలు చరిత్రలో విపులంగా కనిపిస్తాయి.

వర్తకంతో బాటు భారతీయ సంస్కృతీ నాగరికతలుకూడా ఇతర దేశాలకు వెళ్లాయి. అశోకుడి బౌద్ధ ప్రచారకులు పశ్చిమ ఆసియా, ఉత్తర ఆఫ్రికా, ఆగ్నేయ యూరపు ప్రాంతాలకు వెళ్ళారు. అక్కడ బౌద్ధ ధర్మ ప్రచారం చురుకుగా జరిగింది.

అదేవిధంగా పడమర నుంచి రోమను జ్యోతిశ్శాస్త్రమూ, గ్రీకు కళలూ, నాణెముల తయారీ మొదలైనవి భారతీయులు నేర్చారు. భారతీయ ఔషధ శాస్త్రమూ, దశాంశ గణితమూ అరబ్బులద్వారా ప్రపంచ వ్యాప్తి పొందాయి.

మధ్య ఆసియాలో కుషానురాజుల ధర్మాన కాస్పియన్ సముద్రం నుంచి చీనా గోడ దాకా బౌద్ధం వ్యాపించింది. 7 వ శతాబ్దంలో హ్యూన్ త్సాంగ్ చీనా నుంచి మధ్య ఆసియాకుండా వచ్చేటప్పుడు దారి పొడుగునా అతను భారతీయ మత సంస్కృతులు గమనించాడు. బౌద్ధం మధ్యఆసియా నుంచి చీనాకు వెళ్ళింది.

## 15. దేశాంతరాలలోని హిందూరాజ్యాలు



క్రీ. శ. రెండవ శతాబ్దం నుంచీ భారతీయులు దేశాంతరాలను పాలించటం మనకు తెలుస్తుంది. ఆ దేశాలలో-మలయా ద్వీపకల్పమూ, కాంబోడియా, అన్నామ్, సుమత్రా, జావా, బాలి, బోర్నియోలలో—భారతీయ మతాచారాలూ, భాషా, లిపీ, పేర్లూ అమలులో ఉండేవి.

దేశాంతరాలలో భారతీయులు స్థాపించిన సామ్రాజ్యాలు వెయ్యి సంవత్సరాలు మించి దక్కాయి. భారతదేశంలో హైందవ పరిపాలన అడుగంటినాక కూడా ఈ సామ్రాజ్యాలు నిలబడి ఉండటం విశేషం. ఇండో చీనాలో చంపా, కంబుజా అని రెండు ప్రధాన రాజ్యాలుండేవి. చంపను ఏలిన రాజులు: జయ పరమేశ్వరవర్మదేవ ఈశ్వరమూర్తి (1050-1060), రుద్రవర్మ (1061-1069), హరివర్మ (1070-1081), మహారాజాధిరాజ శ్రీ జయ ఇంద్రవర్మ (1161-1180), జయసింహవర్మ (1257-1287). వీరంతా మహావీరులు. కుబ్లయిఖాను కూడా చంపను ఓడించలేకపోయాడు. ఈ హిందూరాజ్యం 16 వ శతాబ్దంలో మంగోలు దాడులకు ఓడిపోయింది.



కంబుజ హిందూరాజ్యమైంది క్రీ. శ. ఒకటి, రెండు శతాబ్దులలో కావచ్చు. అది ఈనాటి కాంబోడియా దక్షిణ ప్రాంతం. "ఇక్కడ వెయ్యిమందికి పైగా బ్రాహ్మణులున్నారు. వారికి ఇక్కడివారు తమ కుమార్తెలను వివాహం చేశారు. వారు అహోరాత్రాలు (వేద?) పఠనం చేస్తూంటారు," అని ఒక చీనా గ్రంథకర్త రాశాడు. ఇక్కడి రాజులలో ప్రసిద్ధులు జయవర్మ అనే పేరుగల వారిలో మొదటి, రెండవ, ఏడవవారూ, యశోవర్మా, రెండవ సూర్యవర్మా అనేవారు. ఈ రాజ్యం పదిహేనవ శతాబ్దంలో విచ్ఛిన్నమయింది.

చంపా కన్న కంబుజ చాలా విస్తృతీ, శక్తీ ప్రదర్శించింది. ఒకప్పుడు కాంబో





డియా, కొచిన్-చీనా, లావోస్, సయామ్, మలయా, బర్మాలలో కొంత భాగమూ ఈ రాజ్యంలో చేరి ఉండేవి. కంబుజ రాజుల చరిత్రను చెప్పగల సంస్కృత శాసనాలు ఇక్కడ అసంఖ్యాకంగా దొరికాయి. వారి ప్రతిభ చాటగల రెండు అద్భుత దేవాలయాలు అంగ్కోర్‌వాత్, అంగ్కోర్ థామ్ అనేవి.

అంగ్కోర్‌వాత్ ప్రపంచ వింతలలో పేర్కొనదగినది. అది ఆదిలో విష్ణు ఆలయం. దీనిపైన అనేక గోపురాలున్నాయి. నట్టనడుమనున్న ఆలయ గోపురం ఎత్తు 213 అడుగులు. అంగ్కోర్ థామ్ అనేది ఏడవ జయవర్మ నిర్మించిన రాజధానీ నగరం. ఇది రెండు మైళ్ళ చదరం. దీని చుట్టూ ఎత్తయిన రాతి గోడా, 330 అడుగుల వెడల్పు గల అగడ్తా ఉన్నాయి. (నవంబరు "ప్రపంచపు వింతలు" చూడండి.)

మలయా ద్వీపకల్పంలోనూ ఇండియన్ అర్కిపిలాగోలోనూ రెండు హైందవ రాజ వంశాలు వృద్ధిక్షయాలు పొందాయి. శైలేంద్ర వంశం 8 వ శతాబ్దంలో స్థాపన అయింది. మలయా "చక్రవర్తి" చంపా, కంబుజ దేశాలపై దాడులు చేసేవాడనీ, ఆయన దినసరి రాబడి 200 మణుగుల బంగారమనీ, ప్రతి ఉదయమూ ఆయన ఒక కొలనులోకి ఒక బంగారు అచ్చు విసిరి వేసేవాడనీ ఆ కాలపు చరిత్రకారులు రాశారు.

శైలేంద్రులపై మొదటి రాజేంద్ర చోళుడు 11 వ శతాబ్దంలో దాడిచేసి కొంత రాజ్యాన్ని కాజేశాడు. 13 వ శతాబ్దంలో శైలేంద్ర రాజు సింహలం పై దాడిచేసి అపజయం పొందాడు. తరవాత శైలేంద్రుల ప్రతిభ అంతరించింది. తరవాత జావా హిందూ రాజ్యానికి కేంద్రమయింది.

అయితే 15 వ శతాబ్దంలో ఇస్లాము మతం ఈ ప్రాంతాలను ఆక్రమించేసింది.








# భారత చరిత్ర




ఆసియాకు పశ్చిమాన ఉన్న అరేబియా లోని మక్కాలో 570లో మహమ్మద్ ప్రవక్త జన్మించి ఇస్లాము మతాన్ని వ్యవస్థాపించాడు. ఈ మతం అక్కడి ప్రజలలో ఉత్తేజనం కలిగించింది. ప్రవక్త అనంతరం 632 నుంచి ఇస్లాము మతావలంబులకు ఖలీఫాలు నాయకత్వం వహించి ఆ మతాన్ని ఇరాను నుంచి స్పెయిను దాకా గల రాజ్యాలలో వ్యాపింప జేశారు.

అరబ్బులు ఆది నుంచి కూడా పశ్చిమ భారతం పైనా, వాయువ్య సరిహద్దు ప్రాంతం పైనా కన్ను వేసి ఉంచారు. 637 ప్రాంతంలోనే, రెండవ పులకేశి పరిపాలనా కాలంలో ఒక అరబ్బుసేన బొంబాయి సమీపాన గల థానాకు వచ్చింది. అనంతరం బ్రోచ్ మొదలైన ప్రాంతాలపై దాడులు జరిగాయి. మరికొద్ది సంవత్సరాలకు దక్షిణ అఫ్ఘానిస్తాను అరబ్బుల వశమయింది. తరవాత అరబ్బులు కాబూల్ ఏలే షా పై అనేక దాడులు చేశారు. ఈ షా, కనిష్కుడి సంతతి వాడట.

దక్షిణ అఫ్ఘానిస్తాను జయించిన అరబ్బులు బలుచిస్తాన్‌లో కొంత భాగాన్ని, సింధు రాష్ట్రాన్నికూడా జయించారు. ఇరాక్ గవర్నరైన అల్ హజ్జజ్ యొక్క అల్లుడు ముహమ్మద్ ఇబన్ కాసిమ్ అనేవాడు, దేశద్రోహులైన బౌద్ధుల, సామంతరాజుల సహకారంతో 712లో సింధునదిని దాటి అనేక నగరాలు జయించాడు. సింధు దిగువ లోయ యావత్తూ అరబ్బుల వశ మయింది. అరబ్బుల పురోగమనాన్ని అరికట్టినవారు దక్షిణాన చాళుక్యులూ, తూర్పున ప్రతిహారులూ, ఉత్తరాన కార్కోటులూనూ.

ఇలా ఉండగా 962లో అల్ప్తిగీన్ అనేవాడు ఘజ్నీ రాజ్యాన్ని వ్యవస్థాపించాడు. ఇతను మధ్య ఆసియా





పాలకుల బానిస అయి ఉండి ఘజ్నీలో స్వతంత్ర రాజ్యం వ్యవస్థాపన చేసి 963లో చనిపోయాడు. 977 లో ఈ రాజ్యం ఇతని అల్లుడైన సబుక్తిగీన్ ఆధిపత్యం కిందికి వచ్చింది. ఇతన్ని నిరోధించిన వాడు ఉదభాండపుర రాజు జయపాలుడు. 997 లో సబుక్తిగీన్ చనిపోయి ప్రసిద్ధుడైన అతని కొడుకు మహ్మూద్, ఘజ్నీకి సుల్తానయాడు. 1001 లో జయపాలుడు మహ్మూద్ చేతిలో చిత్తుగా ఓడిపోయి అవమానం సహించలేక చితి మీద కాలిపోయాడు.

ఘజ్నీ మహ్మూద్ క్రమంగా పంజాబును జయించాడు, స్థానేశ్వరం జయించాడు. 1015 లో ఇతను కాశ్మీరు లోయను జయించటానికి చేసిన యత్నం ఫలించలేదు. 1018 లో ఇతను కన్యాకుబ్జాన్ని తుడిచిపెట్టి ప్రతిహార సామ్రాజ్యాన్ని తుదముట్టించాడు. 1022, 1023 లో గ్వాలియర్, కాలింజర్ రాజ్యాలు అతనికి లొంగాయి. 1026 లో ఇతను కాఠియవాడ్ లోని సోమనాథ్ పై చేసిన దాడి ప్రసిద్ధమైనది. ప్రసిద్ధమైన ఈ హిందూ ఆలయం పతనమైన నాలుగేళ్ళకు మహ్మూద్ చనిపోయాడు. మహ్మూద్ ప్రపంచ యోద్ధలలో చేర్చదగిన వాడు. ఇతను భారతీయులతోనే



ఘజ్నీ మహ్మూద్ విజయస్తంభం

గాక శత్రువులైన తురుష్కులతో కూడా గొప్ప యుద్ధాలు చేసి గెలిచాడు. ఇతను సంస్కృతిని కూడా పోషించాడట. అయితే భారత చరిత్రకు సంబంధించినంత వరకు ఇతను దోపిడికి మాత్రమే ఖ్యాతి పొందాడు. ఇతను చేసిన యుద్ధాలు ప్రధానంగా దోపిడి దాడులు. మత ప్రచారం కూడా అతని ముఖ్యాశయం కాదు. కాని ఇతని విజయాల వల్ల హిందూ రాజులలో ఆత్మ విశ్వాసం దెబ్బ తిన్నమాట నిజం. 1030లో ఘజ్నీ మహ్మూద్ పోయి 1192లో ఘూర్ ముహమ్మద్ వచ్చేదాకా హిందూ





రాజ్యాలపై చెప్పుకోదగిన దాడు లంతగా లేవు—ఒక అరబ్బు సేనాపతి వారాణసి నగరాన్ని కొల్లగొట్టాడు. అయితే ముస్లిము దాడుల భయం మాత్రం భారతీయులలో శాశ్వతంగా నిలిచిపోయింది.

అఫ్ఘానిస్తాన్ లోని పర్వతాల మధ్య ఘూర్ అనేది ఒక చిన్న రాజ్యం. తూర్పు పర్షియాకు చెందిన ఒక జాతివారు ఈ అనామకపు సామంత రాజ్యాన్ని పాలిస్తూ ఘజ్నీ సుల్తానుకు లోబడి ఉండేవారు. కాని మహ్మూద్ అనంతరం ఘజ్నీ సుల్తానులు బలహీనులవటం చేత ఘూర్ పాలకులు క్రమంగా బలవంతులై ఘజ్నీ సుల్తానులతో ఆధిక్యతకై పోటీ పడసాగారు. ఈ పోటీ మూలంగా ఘజ్నీ సుల్తానైన బహ్రామ్ షా అనేవాడు ఘూర్‌కు చెందిన ఇద్దరు అన్నదమ్ములను, కుతుబుద్దీన్ ముహమ్మద్, సైఫుద్దీన్ అనేవారిని చంపించాడు. వీరిద్దరికీ సోదరుడైన అలాఉద్దీన్ హుసేన్ అనేవాడు ఘజ్నీపై భయంకరంగా పగ తీర్చుకున్నాడు. అతను ఘజ్నీ నగరాన్ని కొల్ల గొట్టటమేగాక ఏడు రోజులపాటు ఆ నగరాన్ని పరశురామప్రీతి చేసి "ప్రపంచ దాహకుడు" అనే బిరుదు కూడా సంపాదించుకున్నాడు. బహ్రామ్ కొడుకు ఖుస్రవ్ అనే వాడు పంజాబుకు పారిపోయాడు. తరవాత పదేళ్ల పాటు ఘజ్నీనగరం ఘుజ్ జాతి తుర్కమానుల అధీనంలో ఉండి 1173లో ఘూర్ పాలకుల అధీనమయింది.

"ప్రపంచదాహకుడి" కొడుకు తుర్కమానుల చేతిలో చనిపోయాడు. కాని అతని దాయాది ఘియాసుద్దీన్ మహమ్మద్ 1173 లో తుర్కమానులను ఘజ్నీ నుంచి పారదోలి, ఘజ్నీ రాష్ట్రానికి తన తమ్ముణ్ణి పాలకుడుగా ఏర్పాటు చేశాడు. ఈ తమ్ముడే ఘూర్ ముహమ్మద్. అన్న కింద సైనికోద్యోగిగా ఉంటూండగానే ఇతను ఇండియాపై దండయాత్రలు సాగించాడు.





# భారత చరిత్ర



ఘూర్ మహమ్మద్ ఇండియా పై చేసిన మొదటి దాడి 1175లో ముల్తాన్ పై జరిగింది. ఈ దాడి సఫలమయింది. కాని 1178లో అతను గుజరాత్ పై దాడి చేసి చిత్తుగా ఓడిపోయాడు. అయినప్పటికీ మరుసటి ఏడే అతను పెషావరును లోబరుచుకున్నాడు. 1181లో శియాల్కోటలో ఒక దుర్గం నిర్మించాడు.

ఆ కాలంలో ఘజ్నీ వంశస్థుడైన ఖుస్రవ్ మాలిక్ లాహొరులో పాలిస్తున్నాడు. ఘూర్ మహమ్మద్ జమ్మూ రాజైన విజయదేవుడితో సఖ్యం చేసుకుని, ఖుస్రవ్ మాలిక్‌ను బందీగా పట్టుకుని ఘజ్నీకి తెచ్చాడు. ఈ సంఘటనతో పంజాబులో ఘజ్నీ వంశీయుల పరిపాలన ముగిసింది. పంజాబు ఘూర్ మహమ్మద్‌కు చేజిక్కటంతో ఇండియాలో ఇతర ప్రాంతాలను లోబరుచుకునే అవకాశం ఏర్పడింది.

ఈ ప్రయత్నంలో అతను రాజపుత్రులతో — ముఖ్యంగా పృథ్వీరాజ్ చౌహాన్‌తో — తలపడవలసి వచ్చింది. పృథ్వీరాజు కింద ఢిల్లీ, అజ్మీరు నగరాలున్నాయి. కన్యాకుబ్జాన్ని జయచంద్రుడనే గాహడవాల వంశంవాడు ఏలుతున్నాడు. జయచంద్రుడు సాధారణంగా కాశీలోనే ఉంటూండేవాడు. భారతదేశంలో ఆనాటి రాజులందరికీ జయచంద్రుడు మిన్న అని ఆ కాలపు మహమ్మదీయ చరిత్రకారులు రాశారు.

జయచంద్రుడూ, పృథ్వీరాజూ ఏకమై ఉంటే ముస్లిమ్ శత్రువు సంగతి ఏమయేదో, కాని వారి మధ్య సఖ్యత లేదు. జయచంద్రుడు పృథ్వీరాజు ఔన్నత్యాన్ని ఓర్చలేకపోయాడు. పృథ్వీరాజును పిలవకుండానే జయచంద్రుడు తన కుమార్తెకు స్వయంవరం ఏర్పాటు చేశాడనీ, మీదు మిక్కిలి పృథ్వీరాజును అవమానించటానికి అతని

## 17. ఇండియాపై ముస్లిముల అధిపత్యం



ప్రతిమను ద్వారం వద్ద ద్వారపాలకుడి స్థానంలో ఉంచాడనీ, జయచంద్రుడి కుమార్తె అయిన సంయుక్త ఆ ప్రతిమ మెడలో పూలమాల వేసిందనీ, పృథ్వీరాజు ఆమెను తీసుకుపోయి పెళ్ళాడాడనీ కథ చెబుతారు. ఈ కథను ఎంతోమంది బుర్ర కథలుగానూ, గేయాలుగానూ పాడేవారు.

1190 అంతంలో ఘూర్ మహమ్మద్ సైన్యాలతో సహా ఇండియా పైకి వస్తున్నాడని తెలియగానే పృథ్వీరాజు 2 లక్షల అశ్విక బలంతోనూ, మూడువేల ఏనుగులతోనూ, పరాక్రమంలో ముస్లిములకు ఏమాత్రమూ తీసిపోని రాజపుత్ర వీరులతోనూ ఎదురు వెళ్ళాడు. స్థానేశ్వరం సమీపంలో తరాయిన్ అనే చోట ముస్లిము సేనలకూ, రాజపుత్ర సేనలకూ 1191 లో యుద్ధం జరిగింది. హిందూ సేనలు ఘూర్ మహమ్మద్ సేనలను బాగా చీకాకు పరచి, చివరకు ఓడించాయి. ఘూర్ మహమ్మద్ యుద్ధంలో గాయపడి ఘజ్నీకి వెళ్ళిపోయాడు.

కాని ఆ మరుసటి ఏడు అతను మరింత గొప్ప సేనను సమకూర్చుకుని అదే చోట పృథ్వీరాజు సేనలతో యుద్ధం చేశాడు. ఈసారి విజయం ముస్లిములది. పృథ్వీరాజు శత్రువులకు చిక్కి హత్య చేయబడ్డాడు.



1192లో ముస్లిములు సాధించిన ఈ విజయంతో పైకి వచ్చినవాడు కుతుబుద్దీన్ ఐబక్ అనేవాడు. భారత చరిత్రలో ప్రముఖ స్థానం వహించే ఈ కుతుబుద్దీన్ తుర్కిస్తానుకు చెందిన ఒక బానిస. ఇతను కుర్రవాడుగా ఉన్నప్పుడే ఒక వర్తకుడు ఇతన్ని నిషాపూర్‌కు తీసుకు వచ్చి ఒక కాజీకి అమ్మాడు. కుతుబుద్దీన్ కాజీ కొడుకులతో బాటు మతబోధా, సైనిక శిక్షణా పొందాడు. కాజీ చనిపోయాక ఆయన కొడుకులు తమ బానిసను ఒక వర్తకుడికి అమ్మగా, ఆ వర్తకుడు అతన్ని ఘజ్నీకి తెచ్చి ఘూర్ మహమ్మద్‌కు అమ్మాడు.





కుతుబుద్దీన్ చూడటానికి అనాకారి అయినా అనేక మంచి గుణాలూ, శ్లాఘనీయ లక్షణాలూ గలవాడు. ఘూర్ మహమ్మద్‌కు అతని మీద ఎంతో నమ్మకం. అందుచేత ఆయన అతన్ని తన అశ్వశాల లన్నిటిపైనా అధిపతిని చేశాడు. యుద్ధాలలో కూడా కుతుబుద్దీన్ తన యజమానికి ఎంతో అండగా ఉండటంచేత 1192 తరవాత భారత దేశాన్ని జయించే భారాన్ని ఘూర్ మహమ్మద్ కుతుబుద్దీన్ పైన పెట్టాడు. తనను యజమాని నమ్మినందుకు కుతుబుద్దీన్ ఆ యేడే హాఁసీ, మీరట్, ఢిల్లీ మొదలైన అనేక ప్రాంతాలను జయించాడు. 1194లో కాశీ—కన్యాకుబ్జ రాజైన జయచంద్రుడు ఘూర్ మహమ్మద్‌కు ఓడి నిహతు డైనప్పుడు కుతుబుద్దీన్ సహాయం కూడా ఉండింది. 1197లో ఇతను గుజరాతు రాజధానిని కొల్లకొట్టాడు. 1202లో కాలింజర్ (బుందేల్ ఖండ్) కోటను పట్టుకుని 50 వేల మంది స్త్రీ పురుషులను ఖైదీలుగా తీసుకున్నాడు.

ఘూర్ మహమ్మద్‌కు కుతుబుద్దీన్ కుడి భుజమైతే, ఇఖ్తియారుద్దీన్ మహమ్మద్ అనే వాడు ఎడమ భుజం. ఇతను బీహారూ, పశ్చిమ బెంగాలులో కొంత భాగమూ, అనేక ఇతర ప్రాంతాలూ గెలిచి ముస్లిమ్ సామ్రాజ్యంలో కలిపాడు.

తన అన్న చనిపోయినాక, 1203 ఫిబ్రవరిలో ఘూర్ మహమ్మద్ ఘజ్నీ, ఘూర్, ఢిల్లీలకు ప్రభువయాడు. 1205లో ఇతను మధ్య ఆసియాలో యుద్ధం చేసి పెద్ద అపఖ్యాతికి గురి అయాడు. భారతదేశంలోని ఇతని సామ్రాజ్యంలో అరాజక లక్షణాలు కలిగాయి. అతను తిరిగి వచ్చి ఈ అరాజకాన్ని అణచ గలిగాడు కాని త్వరలోనే, అతను లాహోరు నుంచి ఘజ్నీ వెళుతుండగా 1206 మార్చి 15న కొందరు హంతకులు చంపేశారు.








# భారత చరిత్ర



ఘురార్ మహమ్మద్‌కు వారసులు లేరు. అతని ప్రతినిధులు (వైస్రాయిలు) తమ తమ ప్రాంతాల మీద స్వతంత్రాధికారం ప్రకటించారు. తాజుద్దీన్ యిల్దిజ్ అనేవాడు ఘజ్నీలో ప్రభువయాడు. భారత ప్రాంతం లోని వైస్రాయిలు కుతుబుద్దీన్ ఐబక్‌ను సుల్తాను చేసి ప్రభువుగా గుర్తించారు. ఇలా గుర్తించిన వారిలో బెంగాలు వైస్రాయి ఇఖ్తియారుద్దీన్, ముల్తాన్ వైస్రాయి నాసిరుద్దీన్ కబాచా ఉన్నారు. ఇందువల్ల తాజుద్దీన్‌కు కుతుబుద్దీన్‌పై అసూయ కలిగి, పంజాబుపై అధిపత్యం కోసం కుతుబుద్దీన్‌తో యుద్ధానికి తలపడ్డాడు. కుతుబుద్దీన్ అతన్ని ఓడించి, ఘజ్నీ నుంచి తరిమివేసి, నలభై రోజులపాటు ఆ నగరాన్ని ఆక్రమించాడు. అయితే అతను చేసిన అత్యాచారాలు సహించలేక ఘజ్నీ పౌరులు రహస్యంగా తాజుద్దీన్‌ను రప్పించారు. తలవని తలంపుగా తాజుద్దీన్ తిరిగి రావటంతో కుతుబుద్దీన్ పారిపోయి రావలిసి వచ్చింది. ఈ విధంగా జరగని పక్షంలో అతని హయాములోనే ఇండియా అఫ్ఘానిస్తానులు రాజకీయంగా ఏకమై ఉండేవి.

1210 నవంబరులో, కుతుబుద్దీన్ పోలో ఆడుతూ గుర్రంపై నుంచి పడిన ఫలితంగా లాహోరులో మరణించాడు. అతను పరిపాలించింది గట్టిగా నాలుగేళ్ళు మాత్రమే. అతని దాతృత్వం జగద్విఖ్యాతమైనది; "లక్షదాత" అని అతనికి బిరుదుండేది. అతని పరిపాలనలో న్యాయమూ, శాంతి భద్రతలు చక్కగా ఉండేవి.

కుతుబుద్దీన్ చావగానే దేశం అరాజకం అయిపోకుండా, లాహోరులోని అమీర్లూ, మాలిక్‌లూ, ఆరామ్ బక్ష్ అనేవాణ్ణి సుల్తానుగా ఎన్నుకుని, ఆరామ్ షా అని పేరు పెట్టారు. అయితే ఈ ఆరామ్ షా బొత్తిగా

## 18. బానిసవంశం - ఇల్తుత్మిష్



అసమర్థుడు కావటంచేత ఢిల్లీలోని "పెద్దలు" అతణ్ణి తొలగించి, మాలిక్ షంసుద్దీన్ ఇల్తుత్మిష్‌ను రాజుగా చేశారు.

ఇల్తుత్మిష్ తుర్కిస్తాన్‌లోని ఇల్బరీ తెగకు చెందినవాడు. గొప్ప అందగాడు, తెలివితేటలూ, ఉపజ్ఞా కలవాడు. అందుకే కుతుబుద్దీన్ ఢిల్లీలో వైస్రాయిగా ఉండే సమయంలో ఇల్తుత్మిష్‌ను పెద్ద ధర యిచ్చి బానిసగా కొన్నాడు. ఇతను క్రమంగా తన హోదా పెంచుకుని బదాఊన్‌కు గవర్నరు కావటమేగాక కుతుబుద్దీన్ కుమార్తెను కూడా పెళ్ళాడాడు.



1210 లేక 1211లో ఇల్తుత్మిష్ ఢిల్లీ సింహాసనం ఎక్కుతూనే గడ్డు సమస్యలను ఎదుర్కొన్నాడు. నాసిరుద్దీన్ కబాచా సింధులో స్వాతంత్ర్యం ప్రకటించటమేగాక పంజాబు పైన కూడా కన్ను వేశాడు. ఘజ్నీలో ఉన్న తాజుద్దీన్, ఘూర్‌మహమ్మద్ గెలిచిన ప్రాంతమంతా తనది చేసుకోవాలనే ఆశతో ఉన్నాడు. ఇఖ్తియారుద్దీన్ అనంతరం 1206లో బెంగాలు గవర్నరుగా నియమించబడిన అలీమర్దాన్ అనే ఖల్జీ వంశస్థుడు సుల్తాన్ అలాఉద్దీన్ అని పేరు పెట్టుకుని స్వాతంత్ర్యం ప్రకటించాడు. గ్వాలియర్, రంతంభోర్‌లు ఆరామ్ షా హయాములో తిరిగి హిందూ రాజుల అధీనమయాయి; మిగతా హిందూ రాజులు రాజ్యకాంక్షతో తహతహ లాడుతున్నారు. ఇవన్నీ ఇలా ఉండగా ఢిల్లీలోనే కొందరు అమీర్లకు ఇల్తుత్మిష్ పరిపాలన సరిపడలేదు.

ఇల్తుత్మిష్ ఈ అవాంతరాలన్నిటినీ క్రమంగా అధిగమించుకుంటూ వచ్చాడు. ఢిల్లీ సమీపంలోని జూద్ మైదానంలో తిరుగుబాటు చేసిన అమీర్లను ఓడించాడు. 1216 జనవరిలో తాజుద్దీన్‌నూ, 1217 లో నాసిరుద్దీన్‌నూ ఓడించాడు. అయితే నాసిరుద్దీన్ 1228 ఫిబ్రవరి దాకా పూర్తిగా పతనం కాలేదు. 1229 లో బాగ్దాదులో ఖలీఫాగా





ఉండిన అల్ ముస్తన్సిర్ బిల్లా, ఇల్తుత్మిష్‌ను గుర్తించుతూ, వస్త్రకానుక పంపి, అతనికి "సుల్తాని అజమ్" (సుల్తాను శ్రేష్ఠుడు) అనే బిరుదు కూడా ఇచ్చాడు.

1226 లో రంతంభోర్ తిరిగి ఇల్తుత్మిష్ అధీనమయింది. 1230-31 లో బెంగాలులోని ఖల్జీలు లోబడిపోయారు. 1232 లో గ్వాలియర్‌ను పరిపాలిస్తున్న మంగళదేవుడు ఓడిపోయాడు. 1234 లో మాల్వా, ఉజ్జయినీలు ఓడిపోయాయి. ఉజ్జయిని నుంచి ప్రసిద్ధమైన విక్రమాదిత్యుడి శిలాప్రతిమ ఢిల్లీకి చేర్చబడింది. ఇల్తుత్మిష్ 26 సంవత్సరాలు పరిపాలించి 1236 ఏప్రిలు 29 న ఢిల్లీలో చనిపోయాడు.

ఇల్తుత్మిష్ హయాంలోనే మొట్టమొదటిసారిగా మంగోలులు సింధూ నదీతీరం దాకా వచ్చారు. వారి నాయకుడు చరిత్ర ప్రసిద్ధుడైన ఛింగీజ్‌ఖాన్. ఇతని అసలు పేరు తెముచీన్. ఇతను 1155 లో పుట్టి, చిన్నతనంలో చాలా కష్టాలు పడి, కాలక్రమాన మహానాయకుడై, మధ్య ఆసియాలోని అనాగరిక జాతులతో సామ్రాజ్యం ఏర్పాటు చేశాడు. అయితే మంగోలులు ఢిల్లీ సుల్తానులను బాధించకుండా అప్పటికి తిరిగి వెళ్ళిపోయారు.

ఢిల్లీని తుర్కీ సుల్తానులు 1290 దాకా పరిపాలించారు. వారిలో ఇల్తుత్మిష్ చాలా గొప్పవాడు. ఇతను తన పరిపాలనా కాలమంతా యుద్ధాలలో గడిపి కూడా కళలను గొప్పగా పోషించాడు. ఇతని కీర్తికి శాశ్వత చిహ్నంగా నిలిచి ఉన్న కుతుబ్ మినారు నిర్మాణం 1231-32 లో పూర్తి అయింది. ఈ స్తంభానికి కుతుబుద్దీన్ ఐబక్ పేరు పెట్టారన్నది అపోహ. బాగ్దాదు ప్రాంతం నుంచి వచ్చిన ఖ్వాజా కుతుబుద్దీన్ అనే ప్రముఖుడు ఢిల్లీలో నివాసం ఏర్పరచుకున్నాడు. ఈయన గౌరవార్థం ఇల్తుత్మిష్ కుతుబ్ మినారు నిర్మించి, సుల్తాన్ కుతుబుద్దీన్, సుల్తాన్ ముయిజుద్దీన్‌ల పేర్లు దానిపై రాయించాడు.







# భారత చరిత్ర



ఇల్తుత్మిష్ పెద్దకొడుకు నాసిరుద్దీన్ అనేవాడు 1229లో పోయాడు. అప్పటికింకా ఇల్తుత్మిష్ బతికే ఉన్నాడు. నాసిరుద్దీన్ బెంగాలులో రాజప్రతినిధిగా ఉంటున్నాడు. ఆయన కొడుకులలో మరెవరూ రాజ్యార్హులు కారు. అందుచేత ఇల్తుత్మిష్ తన కుమార్తె అయిన రజియ్యాను తనకు వారసురాలిని చేసి మరణించాడు. కాని సుల్తానుగారి కొలువులో ఉండే సామంతులకు ఆడదాని ముందు తల వంచటం అవమానమనిపించింది. వారు సుల్తానుగారి కోరికను తోసిపుచ్చి ఆయన రెండో కొడుకును, రుక్నుద్దీన్ ఫీరూజ్ అనేవాణ్ణి సింహాసనం ఎక్కించారు.

రుక్నుద్దీన్ వట్టి అప్రయోజకుడు, నీచ భోగాలయం దాసక్తి కలవాడు. వాడు పరిపాలనను గాలికి వదిలి ఖజానా ఖాళీ చేసేశాడు. తన కొడుకు అప్రయోజకత్వాన్ని ఆసరా చేసుకుని వాడి తల్లి షాతుర్ఖాన్ అధికారం హస్తగతం చేసుకున్నది; ఆమె మొదట్లో దాసీది. ఈ తల్లి కొడుకుల ఏలుబడిలో రాజ్యం అల్లకల్లోలమయింది. రాష్ట్రాలలో కేంద్ర ప్రభుత్వం పైన తృణీకారం ప్రబలింది. చివరకు ఢిల్లీలోని పెద్దలు సుల్తానునూ, అతని తల్లినీ పట్టుకుని ఖైదులో ఉంచారు. కిలోఖ్రీ అనే చోట తల దాచుకుంటూ ఉండిన రుక్నుద్దీన్‌ను కూడా పట్టి ఖైదు చేశారు. 1236 లో రుక్నుద్దీన్ ఖైదులోనే మరణించాడు.

రజియ్యా ఢిల్లీ సింహాసనం అధిష్ఠించింది. కాని ఆమెకు బలమైన ప్రతిపక్షం తయారయింది. దానికి నాయకుడు "ప్రధాని" ముహమ్మద్ జునైదీ. అయితే రజియ్యా సమర్థురాలు; రాజ నీతిని తెలివిగా ఉపయోగ పరిచి తన ప్రతి పక్షుల ఆట కట్టించింది. రాష్ట్రాలలో కూడా ఆమె పరిపాలనకు ఆదరం లభించింది. ఆమె పరి

## 19. రజియ్యా సుల్తాను







పాలన ఆరంభమైన రోజుల్లోనే కిరామితా, ములాహిదా అనే తెగలవారు నూరుద్దీన్ అనే తుర్కీవాడి నాయకత్వాన అరాజక చర్యలు తలపెట్టారు. వెయ్యిమంది కత్తులూ, డాళ్ళూ పట్టుకుని ఒక నిర్ణీత దినాన ఢిల్లీ లోని పెద్ద మసీదులో ప్రవేశించారు. అయితే రాజభటులు వీరిని తరిమి కొట్టటంతో ఈ ప్రయత్నం హాస్యాస్పదంగా ముగిసింది.

అయినప్పటికీ రజియ్యాకు శాంతి యుతంగా రాజ్యపాలన చేసే అవకాశం లేక పోయింది. అబిస్సీనియాదేశపు బానిస, జలాలుద్దీన్ యాకూత్ అనేవాడు రజియ్యా అనుగ్రహానికి పాత్రుడు కావటం జరిగింది. ఆమె అతన్ని అశ్వశాలల అధిపతిగా నియమించింది. ఇది చూసి తుర్కీకులీనులకు ఆగ్రహం వచ్చింది. వారు ఐక్య ప్రతిఘటన సంఘటిత పరిచారు. సర్హింద్ గవర్నరైన ఇఖ్తియారుద్దీన్ అల్తూనియా అనేవాడు ముందుగా రజియ్యా సుల్తానుపై ఎదురు తిరిగాడు. ఇతడికి ఉన్నత రాజోద్యోగుల ప్రోత్సాహం ఉండింది.

ఈ తిరుగుబాటు అణచటానికి రజియ్యా పెద్ద సేనతో బయలుదేరింది. ఉభయ పక్షాలకూ జరిగిన సంఘర్షణలో జలాలుద్దీన్ యాకూత్ సంహరించబడ్డాడు. రజియ్యా తిరుగుబాటు దార్లకు బందీగా చిక్కింది. ఆమె అల్తూనియా అధీనంలో ఉంచబడింది. ఆమె సోదరుడు ముయిజుద్దీన్ బహ్రాం ఢిల్లీ సుల్తాను చేయబడ్డాడు.

తనకు ఏర్పడిన క్లిష్టపరిస్థితి నుంచి బయట పడటానికిగాను ఆమె అల్తూనియాను పెళ్ళాడి, అతన్ని తన పక్షం చేసుకున్నది. ఆమె తన భర్తతోనూ, అతని అనుచరుల తోనూ కలిసి ఢిల్లీ పైకి యుద్ధానికి బయలు దేరింది. అయితే ఆమె కైథల్ సమీపానికి వచ్చేసరికి అల్తూనియా పక్షంవారు నమ్మక ద్రోహం చేసి తప్పుకున్నారు. 1240 అక్టోబరు 13 న ముయిజుద్దీన్ బహ్రాం





రజియ్యాను ఓడించాడు. మర్నాడే రజియ్యానూ, ఆమె భర్తనూ చంపేశారు.

రజియ్యా ప్రతిభావంతురాలు. తండ్రి జీవించి ఉండగానే ఆమె రాజకీయ దక్షత సంపాదించింది. సింహాసనానికి వచ్చాక ఆమె సామర్థ్యం మరింత ప్రస్ఫుటమయింది. శత్రువులపై యుద్ధాలకు వెళ్ళేటప్పుడు ఆమె తాను ముందుండి సేనలను నడిపేది. స్త్రీల ఉడుపులు విసర్జించి పురుషుడి దుస్తులు ధరించి, తలపాగా పెట్టుకుని, బహిరంగంగా దర్బారులు జరిపి, తన పరిపాలనా దక్షతను చాటింది. తుర్కీ సామంతులు ఒక స్త్రీకి లొంగి ఉండటం అవమానంగా భావించి ఆమెను అక్రమంగా తుదముట్టించారు.

రజియ్యా అనంతరం ఢిల్లీ నుంచి పరిపాలించిన ముయిజుద్దీన్ బహ్రాం, అలావుద్దీన్ మసూద్‌లు అసమర్థులు. వారి పరిపాలన సాగిన ఆరేళ్ళ కాలంలోనూ దేశంలో శాంతిగాని, సౌఖ్యంగాని లేదు. దేశ దౌర్భాగ్యానికి తగ్గట్టుగానే విదేశీయుల దాడులు ఆరంభమయాయి. 1241లో మంగోలులు పంజాబులో జొరబడి లాహోరు నగరాన్ని కొల్లగొట్టారు. 1245కు వారు ఉచ్ వరకూ వచ్చారు. వారిని తరమగొట్టటంలో చాలా నష్టం జరిగింది. మసూద్ షా పరిపాలనాంతంలో అశాంతి తారస్థాయి నందుకున్నది. 1246 జూన్ 10న ఢిల్లీలోని అమీర్లూ, మాలిక్‌లూ కలిసి ఇల్తుత్మిష్ చిన్న కొడుకును నాసిరుద్దీన్ మహ్మూద్ అనే వాణ్ణి సింహాసనం ఎక్కించారు.

నాసిరుద్దీన్ మరీ సౌమ్యుడు. రాజకీయ క్లిష్ట పరిస్థితిని ఎదుర్కొనే దక్షత అతనికి లేదు. ఆ పని సాధించిన వాడు అతని మంత్రి అయిన ఘియాసుద్దీన్ బల్బన్. అతనే రాజ్యంలోని అంతః కలహాలనూ, పైనుంచి మంగోలుల దండయాత్రలనూ అరికట్టాడు. 1266 ఫిబ్రవరి 18న నాసిరుద్దీన్ మరణంతో ఇల్తుత్మిష్ వంశం అంతరించింది.







# భారత చరిత్ర



నౌసిరుద్దీన్‌కు పిల్లలు లేనందున అతను మరణిస్తూ ఘియాసుద్దీన్ బల్బన్‌ను తన వారసుడుగా నియమించాడు. ఇందుకు ఢిల్లీ ప్రముఖులు కూడా ఆమోదించారు.

బల్బన్ తుర్కిస్తానులోని ఇల్బరీ తెగకు చెందినవాడు. కుర్రవాడుగా ఉండగానే మంగోలు లితన్ని పట్టుకుని బగ్దాదుకు తెచ్చారు. ఖ్వాజా జమాలుద్దీన్ అనే ఆయన అతన్ని బానిసగా కొని, 1232 లో తన ఇతర బానిసలతో బాటు ఢిల్లీకి తెచ్చి, ఆ బానిసలందరినీ సుల్తాన్ ఇల్తుత్మిష్‌కు అమ్మాడు. బానిసగా ఉండిన బల్బన్ స్వశక్తి చేత క్రమంగా పైకి వచ్చాడు. ఇతని కుమార్తెను 1249 లో సుల్తానే స్వయంగా పెళ్ళాడాడు.

ఇల్తుత్మిష్ చనిపోయిన 30 ఏళ్ళకు బల్బన్ సుల్తానయాడు. ఈ మధ్య కాలంలో రాజ్యాంగం ఎంతో తారుమారయింది. ఖజానా దాదాపు ఖాళీ అయింది. పరిపాలకులపై పాలితులకు లక్ష్యం పోయింది. దీనికి తోడు మంగోలుల దాడులు శరపరంపరగా సాగాయి. ఈ పరిస్థితులను బల్బన్ సమర్థతతో చక్కబరిచాడు. సైన్యాన్ని గట్టి "మాలిక్"ల అధీనం చేశాడు. ప్రాణహానీ, ధనహానీ, వ్యాపారానికి అంతరాయమూ కలిగించే బందిపోటు ముఠాలను నిర్మూలించాడు. గోపాలగిరి, జలాలీ మొదలైన ప్రమాద ప్రాంతాల రక్షణకుగాను దుర్గాలు నిర్మించాడు. రహదార్లను నిర్భయం చేశాడు.

వాయువ్య సరిహద్దు మంగోలుల ప్రమాదంలో పడింది. వారు ఖలీఫాను హత్యచేసి బగ్దాదును వశపరచుకున్నారు, ఘజ్నీలో రాజ్యం స్థాపించుకున్నారు, పంజాబు, సింధు రాష్ట్రాల పైకి వచ్చారు. మంగోలుల నాయకుడు అల్ ముతసిమ్. వారు లోగడ విధ్వంసం చేసిన లాహోరు దుర్గాన్ని బల్బన్ 1271 లో మరమ్మతు చేయించాడు.

**20.** *బానిసవంశ సమాప్తి*





బల్బన్ దాయాది షేర్‌ఖాన్ సుంకర్‌కు పంజాబులో కొన్ని జాగీర్లుండేవి. ఇతను మంగోలులకు సింహస్వప్నంగా ఉండి వారిని నిగ్రహిస్తూ వచ్చాడు. ఇతన్ని బల్బన్ అసూయానుమానాలతో విషంపెట్టి చంపించాడు. ఇది రాజకీయంగా అవివేకమైన పని. షేర్‌ఖాన్ చావటంతోనే మంగోలులు విజృంభించి, సరిహద్దుపై దాడులు సాగించారు. వీరి దోపిడీలను అరికట్టటానికి బల్బన్ తన పెద్ద కొడుకును, యువరాజు ముహమ్మద్‌ను, ముల్తాను గవర్నరుగా నియమించాడు ; తన రెండవ కొడుకైన బుఘ్రాఖాన్‌కు సామాన, సునామ్ మొదలైన జాగీర్లు వశపరిచాడు. 1279 లో మంగోలులు పెద్ద ఎత్తున దాడిచేసి సట్లెజ్ నదిని దాటి వచ్చినప్పుడు సుల్తాను కొడుకులు తమ సేనలతోనూ, ఢిల్లీ నుంచి వచ్చిన సేనలతోనూ మంగోలులను తిప్పికొట్టారు.

ఈ సంవత్సరంలోనే బెంగాలులోని రాజప్రతినిధి తుఘ్రిల్‌ఖాన్ అనేవాడు ఢిల్లీని ధిక్కరించాడు. ఈ రాజ ప్రతినిధి చాలా సమర్థుడు. కాని సుల్తాను వృద్ధుడు కావటం చేతనూ, పడమటి నుంచి ఒక వంక మంగోలుల బాధకు గురి అవుతూండటం చేతనూ, ఢిల్లీ చాలా దూరాన ఉండటం చేతనూ తుఘ్రిల్‌ఖానుకు దురాశ కలిగింది. తిరుగుబాటుకు అతని సలహాదార్ల ప్రోత్సాహం కూడా లభించింది.

బల్బన్ ఈ తిరుగుబాటు చూసి కంగారు పడి, అమీర్‌ఖాన్ అనే వాడి నాయకత్వాన బెంగాలు పైకి పెద్ద సేనను పంపాడు. యుద్ధంలో అమీర్‌ఖాన్ ఓడిపోయాడు. అతని సేనలు చాలా భాగం లంచాలు పుచ్చుకుని శత్రువుతో చేరిపోయాయి. ఓడి వచ్చినందుకు అమీర్‌ఖాన్‌కు సుల్తాను మరణ దండన విధించాడు! 1280 లో పంపిన మరొక సేనకూడా తిరుగుబాటుదారుకు ఓడిపోయింది. తుఘ్రిల్‌ను శిక్షించటానికి





బల్బన్ స్వయంగా సేనను నడుపుకుని, తన రెండవ కొడుకును బుగ్రాఖానును వెంట పెట్టుకుని, పశ్చిమ బెంగాలులోని లఖ్నౌతీ చేరాడు. తుగ్రిల్ ఈ వార్త తెలుస్తూనే లఖ్నౌతీ నుంచి జాజ్‌నగర్ అరణ్యాలలోకి పారిపోయాడు. తిరుగుబాటు దార్లను తరుముకుంటూ బల్బన్ తూర్పు బెంగాలులోకి వెళ్ళాడు. చివరకు తుగ్రిల్‌ను బాణంతో పడగొట్టారు. అతని తల నరికి, మొండెం నదిలో పారేశారు.

1285 లో మంగోలులు పంజాబు పైకి వచ్చారు. బల్బన్ పెద్ద కొడుకు వారి నెదుర్కొన్నాడు. ఆ ఏడు మార్చి 9 న మంగోలులు అతన్ని మాటు వేసి చంపారు. 80 ఏళ్ళ వృద్ధుడైన బల్బన్ ఈ సంఘటనతో కుంగిపోయాడు.

బల్బన్ తన మనమడైన కైఖుస్రవ్‌ను తనకు వారసుడుగా నియమించి 1287 అంతంలో చనిపోయాడు.

బల్బన్ అనంతరం ఆయన కిందివారు కైఖుస్రవ్‌ను కాక, బుగ్రాఖాన్ కొడుకును ముయిజుద్దీన్ కైకుబాద్‌ను సింహాసనం ఎక్కించారు. ఇతని వయసు 17 లేక 18. చిన్న తనం నుంచీ క్రమశిక్షణలో పెరిగిన ఈ కుర్రవాడు సింహాసనం ఎక్కుతూనే విశృంఖలంగా భోగాలలో మునిగి తేల సాగాడు. ఢిల్లీ కొత్వాలుకు నిజాముద్దీన్ అనే అల్లుడుండేవాడు. అతను రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకున్నాడు. అధిపత్యం కోసం తుర్కుల పక్షానికీ, ఖల్జీల పక్షానికీ, ఘర్షణ సాగింది. మాలిక్ జలాలుద్దీన్ ఫీరూజ్ అనేవాడి నాయకత్వాన ఖల్జీలది పై చెయ్యి అయింది. కైకుబాద్‌ను హత్య చేసి అతని శవాన్ని యమునా నదిలో పారేశారు. అతని పసి కొడుకును కూడా చంపేసి 1290 జూన్ 13 న జలాలుద్దీన్ ఫీరూజ్ షా, ఖిలోఖ్రీ రాజభవనంలో పట్టాభిషేకం చేసుకున్నాడు.







# భారత చరిత్ర



ఖిల్జీ సుల్తాను జలాలుద్దీన్ ఫీరూజ్ ఢిల్లీ పెద్దలకు నచ్చలేదు. అతను గద్దె ఎక్కే నాటికి 70 ఏళ్ళ వృద్ధుడు. అతను తురుష్క జాతివాడు కాడని వారికి ఏవగింపు. అయితే అతను తన సౌజన్యంతోనూ, ఔదార్యంతోనూ, న్యాయబుద్ధితోనూ ఢిల్లీలోని అమీర్లను సుముఖులను చేసుకోగలిగాడు. అతని శాంతి ప్రియత్వమూ, ఔదార్యమూ తరుచు మితిమించి ఉండేవి. తిరుగుబాటు చేసిన వారిని క్షమించేసేవాడు.

అయినప్పటికీ 1292లో మంగోలు దండ్లు ఇండియా పైకి వచ్చినప్పుడు జలాలుద్దీన్ వారిని చిత్తుగా ఓడించాడు. ఓడిన సేనను తిరిగి తమ దేశానికి వెళ్ళిపోనిచ్చాడు. మంగోలులు కొందరు ఇస్లాము మతం పుచ్చుకుని ఢిల్లీ పరిసరాలలో స్థిరపడి పోతామంటే అందుకు సమ్మతించాడు. "కొత్త ముస్లిములు" అని పిలవబడిన ఈ మంగోలులు ఢిల్లీ చక్రవర్తులకు చాలా చిక్కులు తెచ్చిపెట్టారు.

జలాలుద్దీన్ సోదరుడి కొడుకు అలా ఉద్దీన్ ఖిల్జీ. జలాలుద్దీన్ అతణ్ణి ఎంతో ఆపేక్షగా చేరదీసి, తండ్రి లేని బిడ్డ అని మాలిమి చేశాడు. తరవాత అతణ్ణి తన అల్లుణ్ణి చేసుకున్నాడు కూడా. కర (అలహాబాదు జిల్లా) అనే ఈనాము అతనికి కట్టబెట్టాడు. కర స్వాధీనమైన నాటి నుంచి అలా ఉద్దీన్‌లో ధనకాంక్షా, పదవీకాంక్షా తల ఎత్తాయి. ఇతను 1292లో మాల్వా పై దాడి చేసి భీల్సానగరం పట్టుకుని, ఇందుకు గాను అయోధ్య ఈనాముగా పొందాడు.

దక్షిణాన దేవగిరి అత్యంత సంపన్నమయినదని అలా ఉద్దీన్ భీల్సాలోనే చూచాయగా విన్నాడు. అప్పట్లో రామచంద్ర దేవుడనే యాదవరాజు (కాకతీయ రుద్రమదేవికి సమకాలికుడు) దేవగిరిని

**21.** అలా ఉద్దీన్ ఖిల్జీ రాజ్యాకాంక్ష



పాలిస్తున్నాడు. దేవగిరిని కొల్లగొట్టాలని అలా ఉద్దీన్‌కు కాంక్ష కలిగింది: తన మామకు తెలియకుండా వెయ్యిమంది అశ్వికులతో వింధ్యను దాటి దేవగిరి చేరాడు.

రామచంద్రదేవుడు ఈ యుద్ధానికి సన్నద్ధుడుగా లేడు. పైగా దేవగిరి సేనలో హెచ్చు భాగాన్ని తీసుకుని అతని కొడుకు శంకరదేవుడు దక్షిణ ప్రాంతాలకు వెళ్ళి ఉన్నాడు. అయినప్పటికీ రామచంద్రదేవుడు శక్తికొద్దీ యుద్ధం చేసి ఓడిపోయి శత్రువుకు భారీగా పరిహారం ఇవ్వటానికి ఒప్పుకున్నాడు. అలా ఉద్దీన్ తిరిగి వెళ్ళి పోబోతుండగా శంకరదేవుడు ససైన్యంగా వచ్చి అతన్ని ఎదిరించాడు. తండ్రి చెప్పినా వినక అతను యుద్ధం చేసి చివరకు ఓడిపోయాడు. తనకు తోడు రమ్మని పరిసర దేశాలవారిని శంకరదేవుడు అడిగాడు కాని ఎవరూ రాలేదు. అందుచేత అతను శత్రువుకు మరింత హెచ్చు పరిహారం ఇచ్చి సంధి చేసుకున్నాడు.

అలా ఉద్దీన్ చేసిన ఈ సాహస కృత్యం ఫలితంగా దక్షిణ దేశాల (దక్కను) సంపద కొల్ల పోవటమేగాక ఢిల్లీ సుల్తానుల ఏలుబడి వింధ్యను దాటి దక్కనుకు వ్యాపించటానికి పునాదికూడా ఏర్పడింది. ఇలా కొల్లగొట్టిన ధనాన్ని అలా ఉద్దీన్ తన మామకు



అందనివ్వకపోగా, తన దృష్టిని ఏకంగా ఢిల్లీ సింహాసనం మీదనే లగ్నం చేశాడు. అతను తన మామను కరకు రమ్మని ఆహ్వానించాడు. జలాలుద్దీన్ సిబ్బందిలో ఉన్న రాజద్రోహి ఒకడు ప్రోత్సహించాడు. అసలే జలాలుద్దీనుకు అలా ఉద్దీ నంటే గుడ్డి ప్రేమ. అందుచేత, తన హితం కోరుతున్నవారు వద్దన్నా వినక, కనీసం తన అంగరక్షకులనైనా వెంట పెట్టుకోక, ఆయన పడవ ఎక్కి బయలుదేరి వెళ్ళి అలా ఉద్దీన్ రాజ్యకాంక్షకు బలి అయిపోయాడు. 1296 జులై 19న అలా ఉద్దీన్‌ను అతని అనుచరులు సుల్తానుగా ప్రకటించారు.





జలాలుద్దీన్ భార్య మలికా జహాఁ అసాధ్యురాలు. ఆమె చేసే పన్నాగాలు సహించలేక ఆమె పెద్ద కొడుకు అర్కలీ ఖాన్ ముల్తానులో దూరంగా ఉండిపోయాడు. తన భర్త చని పోయినట్టు తెలియగానే మలికా జహాఁ తన చిన్న కొడుకును రుక్నుద్దీన్ ఇబ్రాహీమ్‌ను ఢిల్లీలో సుల్తానును చేసింది. ఈ సంగతి తెలిసి అలా ఉద్దీన్, వర్షాలనుకూడా లెక్క చేయక, ఢిల్లీకి బయలుదేరివచ్చాడు.

అలా ఉద్దీన్‌ను ప్రతిఘటించటం ఇబ్రాహీమ్‌కు సాధ్యం కాలేదు. పైగా అతని అనుచరులు అతనికి అండగా నిలబడలేదు. అందుచేత ఇబ్రాహీమ్ తన తల్లితో సహా ముల్తానుకు పారిపోయాడు. అలా ఉద్దీన్ దక్కను నుంచి కొల్లగొట్టిన బంగారంతో ఢిల్లీ ప్రముఖులనూ, పౌరులనూ కూడా సుముఖులను చేసుకుని 1296 అక్టోబరు 3న ఢిల్లీలో సింహాసనం ఎక్కాడు.

అయితే అలా ఉద్దీన్ సుఖంగా రాజ్యం చెయ్యలేదు. కొందరు తురుష్కులు పెడ తిరిగారు. రాజపుత్ర స్థానం, మాల్వా, గుజరాతుల పాలకులు అతణ్ణి ధిక్కరించారు. మంగోలుల ప్రమాదం ఉండనే ఉన్నది. అయినా ఈ ప్రతి బంధకాలన్నిటినీ అతను సమర్థతతో ఎదుర్కొన్నాడు. అతను సింహాసనం ఎక్కగానే మంగోలులు దాడి చేసి ఓడిపోయారు. మరుసటి ఏడు మరొక దాడి చేసి, ఓడి, వేల సంఖ్యలో ఖైదీలుగా పట్టుబడ్డారు. 1299లో వారు తిరిగి దాడి చేశారు. ఈసారి వారి ఆశయం దోపిడీ కాదు, విజయం. వారు పల్లెలను కొల్లగొట్టక, కోటలను పట్టక, తిన్నగా ఢిల్లీ పైకి వచ్చారు. యుద్ధం జరిగింది. చివరకు వారు నిష్క్రమించారు. వారు మళ్ళీ 1304లోనూ, 1307లోనూ దాడులు చేసి ఓడిపోయి, విసుగెత్తి, అలా ఉద్దీన్ ఖల్జీ బతికి ఉండగా మరి రాలేదు.





# భారత చరిత్ర




అలా ఉద్దీన్ మంగోలులను అనేకమార్లు ఓడించటమేగాక తన వాయువ్య సరిహద్దును రక్షించుకోవటానికి తగు ఏర్పాట్లు చేశాడు. మంగోలులు వచ్చే దారిలో గల కోటలన్నీ మరమ్మతు చేయించి, కొత్తవి కూడా నిర్మింపజేశాడు.

సరిహద్దు నగరాలైన సామానా, దీలాల్పూర్ల వద్ద యుద్ధ సన్నద్ధమై ఉండే సైనిక స్థావరాలు ఏర్పాటు చేశాడు. ఘాజీ మలిక్ (ఘియాజుద్దీన్ తుఘ్లక్) ను సరిహద్దు రక్షణకు నియోగించాడు.

ఘాజీ మలిక్ మంగోలులను పాతిక సంవత్సరాలపాటు సమర్థతతో నిగ్రహించాడు.

ఢిల్లీ పరిసరాలలో నివాసాలు ఏర్పరచుకున్న "కొత్త ముస్లిములు" (మంగోలులు) తమ పదవీ/కాంక్ష తీరనందున తిరుగుబాటు చేశారు. పైగా సుల్తాను ఉద్యోగాలలో ఉన్న వారిని కూడా తొలగించాడు. వారు సుల్తానును హత్య చేయటానికి చేసిన కుట్ర బయట పడింది. ఒక్క రోజులో సుల్తాను 20, 30 వేలమంది "కొత్త ముస్లిములను" నిర్దాక్షిణ్యంగా వధ చేయించాడు.

అలా ఉద్దీన్ హయాంలోనే ఆయన రాజ్యం విస్తరించి సామ్రాజ్యంగా రూపొందింది; ఈ సామ్రాజ్యం అర్ధ శతాబ్దం పాటు దక్కింది. అలా ఉద్దీన్ తమ్ముడైన ఉలుఘ్ ఖాన్, వజీరైన నుస్రత్ ఖాన్ ఒక పెద్ద సేనతో 1297లో గుజరాతుపై దాడి చేశారు. లోగడ ముస్లిములు గుజరాతును కొల్ల గొట్టారేగాని జయించలేదు. ఈసారి గుజరాతు లొంగి పోయింది. రాజైన రెండవ కర్ణదేవుడు తన కుమార్తె అయిన దేవలా దేవితో రాజ్యం విడిచి పారిపోయాడు. రాణి కమలాదేవి గొప్ప అందగత్తె. ఆమె శత్రువులకు చిక్కి, కాలక్రమాన అలా ఉద్దీన్‌కు ప్రియ భార్య అయింది.

22. ఖిల్జీ సామ్రాజ్యారంభం



కొందరు "కొత్త ముస్లిములు" రంథం బోర్ రాజైన హమీరదేవుడి పంచ చేరారు. అలా ఉద్దీన్ మండి పడి 1299లో తన తమ్ముణ్ణీ, వజీరునూ సేనతో ఆరాజ్యం పైకి పంపాడు. అలా ఉద్దీన్ సేనలు అపజయం పొందటమేగాక, వజీర్ నుస్రత్ ఖాన్ చచ్చి పోవటం కూడా జరిగింది. అప్పుడు సుల్తాను స్వయంగా వచ్చి 1301 జులైలో రంథం బోర్‌ను జయించాడు. ఈ విజయం ఒక ఏడాది ముట్టడి అనంతరం అతి కష్టం మీద లభించింది. హమీరుడి మంత్రి రణమల్లు డనేవాడు స్వామి ద్రోహం చేసి శత్రు పక్షం అయాడు. అలా ఉద్దీన్ ఈ రాజద్రోహిని బహూకరించక వధ చేశాడు. హమీరుడూ, అతని అండ చేరిన "కొత్త ముస్లిములూ" వధించ బడ్డారు. అంతఃపుర స్త్రీలు చితి పేర్చుకుని అందులో దగ్ధమైపోయారు.

అలా ఉద్దీన్ మేవాడ్ పై చేసిన దాడి అందరికీ తెలిసినది. ఈ దాడికి ముఖ్య కారణం చితోడ్ రాణి పద్మిని యొక్క అందమేనని చెబుతారు. పద్మిని భర్త అయిన రాణా రతన్‌సింగ్ అలా ఉద్దీన్ సైనికులకు దొరికిపోగా, అతన్ని సుల్తాను గుడారానికి తీసుకుపోయేదారిలో రాజ పుత్రులు అడ్డు పడి అద్భుత సాహసంతో



తమ రాజును కాపాడారు. చితోడ్ వెలుపలి ద్వారం వద్ద గోరా, బాదల్ అనే రాజపుత్ర వీరులు కొద్దిమంది సైనికులతో సుల్తాను సేనలను కొంతసేపు నిరోధించ గలిగారు. చితోడ్ పతనంకాక తప్పదని తెలియగానే పద్మిని మొదలుగా గల అనేక వేలమంది రాజస్త్రీలు అగ్నికి ఆహుతి అయారు.

1303 ఆగస్టు 26న చితోడ్ పతన మయింది. దాని పేరు ఖిజ్రాబాద్ అని మార్చి సుల్తాను తన కొడుకైన ఖిజ్ ఖాన్‌ను దానికి అధిపతిని చేశాడు.

1305 అంతంలో మాల్వా, సుల్తానుకు ఓడిపోయింది. దానికి రాజైన మహ్లక





దేవుడూ, ప్రధాని కోక కూడా వధించబడ్డారు. ఉజ్జయినీ, మాండూ, ధార్, చందేరీ మొదలైనవి క్రమంగా ముస్లిముల వశమై, 1305 నాటికి దాదాపు ఉత్తర భారతదేశమంతా ఖల్జీ సామ్రాజ్యంలో చేరిపోయింది.

అలా ఉద్దీన్ కన్ను దక్షిణ భారతంపై పడింది. అక్కడి పరిస్థితులు కూడా సుల్తానుకు అనుకూలంగానే ఉన్నాయి. ఆనాడు నాలుగు ప్రముఖ రాజ్యాలుండేవి, వాటిని నలుగురు రాజులు పాలించేవారు. ఒకడు దేవగిరిని పాలించే యాదవరాజు రామచంద్రదేవుడు (1271-1309) ఇతను ధర్మపరుడూ, సమర్థుడూనూ. రెండవవాడు కాకతీయ వంశానికి చెందిన మొదటి ప్రతాపరుద్రుడు. ఇతను వరంగల్లు రాజధానిగా తెలంగాణను పరిపాలించాడు. మూడవవాడు హొయసలరాజు మూడవ వీరబల్లాలుడు (1292-1342). ఇతను, ఈనాటి హళెబీడు వద్ద రాజధాని కలిగి ఇప్పటి మైసూరు రాజ్య ప్రాంతాన్ని పాలించాడు. నాలుగవవాడు మారవర్మ కులశేఖరుడు (1268-1311) ఇతను పాండ్య దేశాన్ని పాలించాడు. ఈనాటి మదుర, రామనాడ్, తిరునెల్వేలి జిల్లాలు ఈ రాజ్యంలో చేరి ఉండేవి. వ్యాపారం మూలంగా పాండ్య రాజ్యం సంపదతో తులతూగు తూండేది. వీరుగాక కొందరు చిల్లర రాజులుండేవారు; నెల్లూరులో తెలుగు చోళరాజు మూడవ మనమసిద్ధి, ఓఢ్రదేశంలో కళింగ గంగరాజు భామదేవుడూ, కేరళలో రవివర్మా, మంగళూరులో బంకిదేవ ఆలుపేంద్రుడూ మొదలైనవారు.

ఈ రాజుల మధ్య ఎలాటి ఐకమత్యమూ లేకపోగా, కొంత శత్రుత్వం కూడా ఉండటం, అంతఃకలహాలు సాగటమూ అలా ఉద్దీన్ సామ్రాజ్య విస్తరణకు ఎంతగానో తోడ్పడింది.





# భారత చరిత్ర



దేవగిరి రాజైన రామచంద్రదేవుడు అలా ఉద్దీన్ సుల్తానుకు వరసగా మూడేళ్ళు కప్పం చెల్లించ లేదు. పై పెచ్చు, సుల్తానుకు ఓడి పారిపోయి వచ్చిన గుజరాతు రాజు రెండవ రాయకర్ణదేవుడికి రక్షణ ఇచ్చాడు. అందుచేత 1307 మార్చిలో సుల్తాను దేవగిరి పైకి మలిక్ కాఫూర్ నాయకత్వాన సేనలను పంపాడు. కాఫూర్ దేవగిరి పరిసరాలన్నీ కొల్లగొట్టి విధ్వంసం చేశాడు. రామచంద్రదేవుడు ఓటమి అంగీకరించి సంధి కోరాడు. సుల్తాను ఆయనను ఢిల్లీకి రప్పించి, మర్యాద చేసి, ఇక మీదట ఆయన ఢిల్లీ కింద సామంతుగా ఉండి కప్పం చెల్లించేటట్టు సంధి చేసుకున్నాడు.

1303లో కాకతీయ ప్రతాపరుద్రుడిపై అలా ఉద్దీను పంపిన దాడి విఫలం అయినందున 1309లో కాఫూర్‌ను మరొకసారి పంపాడు. కాకతీయుల సంపదను కొల్లగొట్టటమేగాని వారి రాజ్యాన్ని అపహరించి తన రాజ్యంలో కలుపుకోవటం సుల్తాను ఉద్దేశం కాదు. ప్రతాపరుద్రుడు వరంగల్లు కోటలో భద్రంగా కూచుందామనుకున్నాడు గాని చివరకు లొంగిపోక తప్పలేదు. 1310 మార్చిలో ఆయన సంధి బేరానికి దిగి వచ్చి, శత్రువులకు 100 ఏనుగులూ, 1000 గుర్రాలూ, అంతులేని నాణాలూ, మణులూ సమర్పించి, ఏటా ఢిల్లీకి కప్పం చెల్లించ ఒప్పుకున్నాడు.

ఈ విజయాలతో సుల్తానుకు దూరాన ఉన్న దక్షిణ రాజ్యాలపైన కూడా కాంక్ష కలిగింది; అక్కడి ఆలయాలలో అంతులేని ధనరాసులున్నాయి. 1310 నవంబరు 18న మలిక్ కాఫూర్, ఖ్వాజా హాజీల నాయకత్వాన ఢిల్లీ నుంచి పెద్ద సేన బయలుదేరి హొయసల రాజ్యం పైకి నడిచింది. ఈ సేన ద్వార సముద్రం చేరే

**23.** ఖిల్జీ సామ్రాజ్యం - దక్షిణభారతం



సమయానికి హొయసల రాజైన మూడవ వీరబల్లాలుడు యుద్ధానికి సిద్ధంగా లేడు. శత్రు బలాలు హెచ్చుగా ఉండటం చూసి ఆయన సంధికి ఒడబడి తన సంపద యావత్తూ వారికి అప్పగించాడు. ఈ ధనం గాక శత్రువులు 36 ఏనుగులను పట్టుకుని, ఆలయాలలో ఉన్న అంతులేని వెండి బంగారాలను కొల్లగొట్టి, హొయసల రాజకుమారుణ్ణికూడా తమ వెంట పట్టుకుపోయారు.

ద్వారసముద్రంలో 12 రోజులు మాత్రమే ఉండి మలిక్ కాఫూర్ తన సేనలను పాండ్య రాజ్యం మీదికి నడిపించాడు. ఈ రాజ్యాన్ని మాబార్ అనేవారు. పాండ్య రాజ్యంలోని అంతః కలహాలు శత్రువులకు అనుకూలించాయి. పాండ్య రాజైన కులశేఖరుడికి సుందర పాండ్యుడూ, వీర పాండ్యుడు అని ఇద్దరు కొడుకులు. సుందర పాండ్యుడు సక్రమవారసుడు; వీరపాండ్యుడికి వారసత్వపు హక్కు లేదు. కాని కులశేఖరుడికి అతనిపై ప్రేమ హెచ్చుకావటం చేత తన అనంతరం అతనినే రాజు చేద్దామనుకున్నాడు. 1310 మే నెల అంతంలో సుందరపాండ్యుడు తండ్రిని హత్య చేసి రాజ్యం వశపరచుకొన జూశాడు. అన్నదమ్ములకు యుద్ధమయింది. నవంబరు



నెలలో సుందరపాండ్యుడు ఓడిపోయి ముసల్మానుల సహాయం అర్థించాడు.

1311 ఏప్రిలు 14 న తన సేనతో మలిక్ కాఫూర్ పాండ్యరాజధాని అయిన మదురకు వచ్చాడు. మదుర నిర్జనంగా ఉన్నది. వీరపాండ్యుడు తన రాణులతో పారిపోయాడు. ముస్లిములు అరక్షితమైన మదురను కొల్లగొట్టి 512 ఏనుగులూ, 5000 గుర్రాలూ, 500 మణుగుల బరువు గల వివిధ రత్నాలూ సంపాదించారు. మలిక్ కాఫూర్ మాబార్ దేశాన్ని కొల్లగొట్టి 1311 అక్టోబరు 18న ఢిల్లీకి తిరిగి వచ్చినప్పుడు అతని వెంట 612 ఏనుగులూ,





20,000 గుర్రాలూ, 96,000 మణుగుల బంగారమూ, అనేక వందల పెట్టెలనిండా రత్నాలూ ఉన్నాయి!

ఈ విధంగా దక్షిణదేశమంతా ఢిల్లీ సామ్రాజ్యంలో చేరిపోయింది. ఈ సామ్రాజ్యాన్ని విస్తరింప జేసిన అలాఉద్దీన్ పరిపాలన గురించి మనం తెలుసుకోదగిన అంశాలు అనేకం ఉన్నాయి. అతను మొదటిసారిగా రాజ్యపాలనలో మతాధికారులకు "వాక్కు" లేకుండా చేశాడు; రాజ్య తంత్రాన్ని మత నియమాల నుంచి వేరు చేశాడు—రాజ్యం సుస్థిరంగా ఉండటమే ప్రధానాశయంగా పెట్టుకున్నాడు.

అలా ఉద్దీన్ పరిపాలనలో ఆస్తి అనేది చాలా మందికి లేకుండా పోయింది. మాన్యాలు మొదలైనవి రద్దయాయి. దేవాదాయాల లాటివి ప్రభుత్వ పరమయాయి. తాగుడూ, మాదద్రవ్యాలూ, జూదాలూ, ధనికుల విందులూ, వినోదాలూ, సమావేశాలూ నిషేధించబడ్డాయి. ఎవరి దగ్గిరా బంగారంగాని, వెండిగాని లేదు. పన్నులు తీవ్రంగా పెంచబడ్డాయి.

ఇలాటి ఆర్థిక పరిస్థితిని వర్తకులు స్వార్థానికి వినియోగించ కుండా అలా ఉద్దీన్ కట్టుదిట్టాలు చేశాడు. వస్తువుల ధరలు శాసనం ద్వారా నిర్ణయించబడ్డాయి. క్రయవిక్రయాలు బహిరంగంగా జరగాలి. తక్కువ తూకం తూచిన వాడి నుంచి తరుగుదలకు సరిపడే మాంసం కోయమని రాజశాసనం!

1312 దాకా అలాఉద్దీన్ ప్రభ బాగా వెలిగింది. ఆ తరవాత అతనికి చెడ్డరోజులు సంప్రాప్తమయాయి. అతను మలిక్‌కాఫూర్ చేతి కీలు బొమ్మ అయిపోయాడు. ఆ కొజ్జా వాడే ఆయనకు సేనానాయకుడూ, మంత్రీ.

దేశంలో తిరుగుబాట్లు సాగాయి. చివరకు అలాఉద్దీన్ 1316 జనవరి 2 న చనిపోయాడు. ఢిల్లీలోని జామీమసీదుకు ఎదురుగా అలాఉద్దీన్‌ను ఖననం చేసి గోరీ కట్టారు.





# భారత చరిత్ర



అలాఉద్దీన్ విశ్వాసాన్ని చూరగొన్న కొజ్జా వాడు కాఫూర్ విద్రోహంలో తన యజమానికి ఏమాత్రమూ తీసిపోడు. అలాఉద్దీన్ చనిపోయిన మరుక్షణమే అతను అధికారం హస్తగతం చేసుకొనడానికి కుట్ర ప్రారంభించాడు. సుల్తాను చచ్చిన మర్నాడే కాఫూర్ సుల్తాను మరణశాసనం ఒకటి బయటపెట్టాడు. ఇది కృత్రిమ పత్రమైనా కావాలి, లేక సుల్తానును ఒత్తిడి చేసి తయారు చేయించినదైనా కావాలి. ఈ శాసనం ప్రకారం ఖిజ్రఖానుకు రాజ్యార్హత లేకుండా పోయింది. అయిదారేళ్ళ ప్రాయం గల షిహాబుద్దీన్ ఉమర్ సింహాసనానికి వారసుడుగా పేర్కొనబడ్డాడు!

ఈ కుర్రవాడికి పట్టం కట్టి, తాను రాజప్రతినిధి అయి, కాఫూర్ నిరంకుశ పరిపాలన సాగించాడు. రాజ్యలోభంతో అతను అనేక ఘాతుక కృత్యాలు చేశాడు. అలాఉద్దీన్ పెద్ద కొడుకులైన ఖిజ్రఖాన్, షాదీ ఖాన్‌ల కళ్ళు తీయించాడు; రాజమాత ద్రవ్యమంతా అపహరించి, ఆమెను కారాగృహంలో పెట్టించాడు; అలాఉద్దీన్ మూడవ కొడుకైన ముబారక్‌ను ఒక భవనంలో నిర్బంధించి, అతని కళ్ళు కూడా తీయించాలని చూశాడు. కాని 35 రోజుల దుష్పరిపాలనకే కాఫూర్ పాపాలు పండాయి. అలాఉద్దీన్ మాజీ భృత్యులు అతణ్ణి హత్య చేసేశారు. అప్పుడు ఢిల్లీలోని పెద్దలు ముబారక్‌ను చెరవిడిపించి తెచ్చి, బాలుడైన ఉమర్‌కు రాజప్రతినిధిగా ఏర్పాటుచేశారు. ముబారక్ 64 రోజులపాటు రాజప్రతినిధిగా ఉండి, 1316 ఏప్రిల్‌లో తన తమ్ముణ్ణి అంధుణ్ణి చేసి, కుతుబుద్దీన్ ముబారక్ షా అనే పేరుతో ఢిల్లీ సింహాసనం ఎక్కాడు.

కుతుబుద్దీన్ ముబారక్ పరిపాలన కొద్ది కాలంపాటు విజయవంతంగానే సాగింది.







తన తండ్రి చేసిన కఠిన శాసనాలు కొన్నిటిని అతను రద్దు చేశాడు, రాజకీయ ఖైదీలను విడిపించాడు; ఊడలాక్కున్న మాన్యాలను తిరిగి ఇచ్చేశాడు; నిర్బంధ సుంకాలను ఎత్తివేశాడు. ఈవిధంగా ముబారక్ ప్రజా రంజకుడయినాడన్న మాటేగాని, ప్రజలలో రాజభీతీ, గౌరవమూ సన్నగిల్లాయి.

దీనికి తోడు ముబారక్ త్వరలోనే రాజకీయాలు విస్మరించి భోగలాలసుడై పోయాడు. అతను పరిపాలించిన నాలుగేళ్ల నాలుగు మాసాల కాలంలోనూ 'అతనికి తాగుడూ, సంగీతమూ, వినోదాలూ, కానుకలు వెదజల్లటమూ తప్ప మరే 'పనీ లేక పోయిందని ఆనాటి చరిత్రకారుడు వ్రాశాడు.

సుల్తాను, ఖుస్రవ్‌ఖాన్ అనే ఒక నీచుడి చేతిలో కీలుబొమ్మ అయాడు. ఈ ఖుస్రవ్ ఖాన్ మతం మార్చుకున్న ఒక హీనజాతి గుజరాతీవాడు. ఎప్పటికైనా రాజు కావాలనే దురాశతో అతను సుల్తానుకు నీచమైన అభిరుచులు మప్పాడు.

ముబారక్ హయాములో మంగోలులు దండయాత్రలు చెయ్యకపోవటం భారత దేశానికొక గొప్ప మేలయింది. గుజరాతు లోనూ, దేవగిరి (వక్కను)లోనూ రెండు తిరుగుబాట్లు మాత్రమే జరిగాయి. గుజరాతు తిరుగుబాటు అణచబడింది, సుల్తాను మామ గారు గుజరాతులో గవర్నరుగా నియమించ బడ్డాడు. దేవగిరి పైకి సుల్తాను స్వయంగా సేనలను నడిపించాడు. దేవగిరి రాజైన హరపాలదేవుడు పారిపోవ యత్నించి, చిక్కిపోయి, దుర్మరణంపాలయాడు. మలిక్ యక్లకీ అనేవాడు దేవగిరికి గవర్నరుగా నియమించబడ్డాడు. ఈ విధంగా యాదవరాజ్యం నేరుగా సుల్తాను పరిపాలన కిందికి వచ్చింది. సుల్తాను తెలంగాణం పైకి ఖుస్రవ్‌ఖాన్‌ను పంపి, తాను ఏడాదిపాటు దేవగిరిలోనే ఉండి, అక్కడ ఒక పెద్ద మసీదు కట్టించి, ఢిల్లీకి తిరిగి వచ్చాడు.





ముబారక్ ఖలీఫాల అధికృతను తోసి వేసి, ఇస్లాము మతానికి తానే అధిపతిననీ, స్వర్గంలో ఉన్న దేవుడి ఖలీఫాను తానేననీ ప్రకటించి, "అల్‌వాసిక్ బిల్లా" అనే బిరుదు కూడా తగిలించుకున్నాడు.

ఖుస్రవ్ సుల్తానును హతమార్చటానికి యత్నాలు చేస్తున్నట్టు మిత్రులు చెప్పినా లాభంలేకపోయింది. అతను ఖుస్రవ్‌ను పూర్తిగా నమ్మి మోసపోయాడు. 1320 ఏప్రిల్ మాసంలో ఒకనాటి రాత్రి ఖుస్రవ్ భృత్యులలో ఒక హీనజాతివాడు సుల్తానును పొడిచి చంపాడు. అంతటితో 30 ఏళ్ళ ఖల్జీల పరిపాలన అంతమయింది.

ఖుస్రవ్ "నాసిరుద్దీన్ ఖుస్రవ్ షా" అనే పేరుతో ఢిల్లీ సింహాసనం ఎక్కి, తనకు సహాయపడిన బంధువులకూ, ఆటవికులకూ బహుమానాలు పంచాడు. తన ఆధిపత్యం ఆమోదించిన పెద్దలకు లంచాలు పెట్టడం కోసం ఢిల్లీ ఖజానా ఖాళీ చేశాడు. సుల్తాను మిత్రుల పైనా, భృత్యుల పైనా దారుణ హింసాకాండ సాగించి, అతని కుటుంబాన్ని అవమానంపాలు చేశాడు. అతను హిందువుల పట్ల పక్షపాతం చూపాడు. అతని పరిపాలన సాగిన నాలుగు నెలల కొద్ది రోజుల కాలంలో హిందువులు ఉన్నతస్థానాలలోకి వచ్చారు. ఇదే కారణంచేతనే కావచ్చు, అలాయ్ కులీనులకు ఖుస్రవ్ ధోరణి నచ్చలేదు. ఘాజీమలిక్ అనే వాడి నాయకత్వం కింద వారు సుల్తానును ప్రతిఘటించ సమకట్టారు. ఘాజీమలిక్ దిపాల్పూర్ నుంచి బయలుదేరి వచ్చి 1320 సెప్టెంబరు 5 న ఢిల్లీ వద్ద ఖుస్రవ్‌ను ఓడించాడు. ఖుస్రవ్‌కు శిరశ్ఛేదం చేశారు. ఘాజీమలిక్ సుల్తాను కావాలన్నకాంక్ష కనబరచలేదు. తనకు సింహాసనం వద్దని కూడా అన్నాడు. కాని ఢిల్లీ పెద్దల కోరికపై ఘియాసుద్దీన్ తుఘ్లక్ అన్న పేరుతో అతను 1320 సెప్టెంబరులో ఢిల్లీ సింహాసనం ఎక్కాడు.








# భారత చరిత్ర



ఘియాసుద్దీన్ తుఘ్లక్ పేరుతో ఢిల్లీ సుల్తానయిన ఘాజీ మలిక్ వంశం దేశీయమైనదని చెప్పవచ్చు. అతని తండ్రి బల్బన్ హయాంలో భారతదేశానికి వచ్చి, జాత్ కన్యను వివాహ మాడాడు. పుట్టుక చేత తక్కువ స్థితి గలవాడైన ఘాజీ మలిక్ కేవలమూ తన స్వశక్తితో సామ్రాజ్యంలోని అత్యున్నత స్థానాన్ని అందుకున్నాడు. ఢిల్లీ సామ్రాజ్య సరిహద్దులపై మంగోలులు సాగించిన దాడులను అతను ఎంత దక్షతతో తిప్పి కొట్టాడో మనం లోగడ తెలుసుకున్నాం. అతను వృద్ధాప్యంలో ఢిల్లీ సింహాసనం అధిష్ఠించాడు.

ఢిల్లీ పెద్దలు అతన్ని సుల్తానుగా ఎన్నుకోవటంలో ఏ మాత్రమూ పొరపాటు చేయలేదు. అతను రాజ్యానికి వచ్చే సమయానికి పరిస్థితులేమీ బాగాలేవు. అలాఉద్దీన్ మరణానంతరం ఏర్పడిన అరాజకం మూలాన పరిపాలన అంతా దెబ్బ తిన్నది, దూరపు రాష్ట్రాలలో ప్రభుత్వంపట్ల అలక్ష్యం ఏర్పడింది. అయితే ఈ పరిస్థితులను అతను ఎంతో సమర్థతతో ఎదుర్కొన్నాడు. పదవి చేపట్టుతూనే పరిపాలనను క్రమబద్ధం చేసి, పాత పరిపాలనలో ఉండిన దురలవాట్లను రూపు మాపాడు. ముబారక్, ఖుస్రవ్‌లు ఖజానాను ఖాళీ చేసేశారు. అందుచేత అతను నిశితమైన విచారణ జరిపి అక్రమంగా మంజూరైన జాగీర్లు మొదలైన వాటిని రద్దు చేశాడు. ప్రజల క్షేమం నిమిత్తం ఎన్నో చర్యలు తీసుకున్నాడు. రాష్ట్రాలలో నిజాయితీపరులైన గవర్నర్లను నియమించాడు. ఫలసాయంలో పదోవంతో, పదకొండోవంతో మించకుండా శిస్తులు ఏర్పాటు చేసి, అధికార దుర్వినియోగం జరగకుండా కట్టుదిట్టాలు చేశాడు. అధిక సంఖ్యాకులకు ఆశ్రయమైన వ్యవ

## 25. తుఘ్లక్ వంశం-ఘియాసుద్దీన్ తుఘ్లక్



సాయాన్ని ప్రోత్సహించాడు. పంట కాలవలు తవ్వించాడు. తోటలు వేయించాడు. బందిపోటు నుంచి వ్యవసాయదార్లను కాపాడటానికి కోటలు నిర్మింపజేశాడు.

సుల్తాను న్యాయ, రక్షణ శాఖలలాటి ఇతర ప్రభుత్వ శాఖలను కూడా సంస్కరించాడు. దేశంలో శాంతి భద్రతలు కలిగించాడు. పేదలకు సహాయం ఏర్పాటు చేశాడు. మత సంస్థలనూ, కవులనూ పోషించాడు. అమీర్ ఖుస్రవ్ అనే చరిత్రకారుడు అతని ఆస్థాన కవిగా ఉండి, నెలకు వెయ్యి "తనకా"లు తీసుకునేవాడు. తపాలా, సైనికశాఖలు కూడా చక్కబడ్డాయి.

సామ్రాజ్య సంరక్షణలోనూ, సైనిక బలంతో అధిపత్యం కొనసాగించటంలోనూ ఇతను ఖల్జీల పద్ధతినే అనుసరించాడు. అలాఉద్దీన్ అనంతరం, వరంగల్లులో పరిపాలించిన కాకతీయ (రెండవ) ప్రతాపరుద్రుడు బలం చేకూర్చుకుని ఢిల్లీ ప్రభుత్వానికి కప్పం చెల్లించ నిరాకరించాడు. అందుచేత ఘియాసుద్దీన్ తాను సింహాసనమెక్కిన రెండవ సంవత్సరంలోనే తన పెద్ద కొడుకైన ఫక్రుద్దీన్ ముహమ్మద్ జౌనఖాన్ అధిపత్యం కింద ఒక బలాన్ని వరంగల్లు పైకి పంపాడు. ఈ దాడి కుట్రల వల్లనో, ఢిల్లీ సేనలు అంటు వ్యాధులకు గురి



కావటం చేతనో విఫలమయింది. యువరాజు జౌన ఢిల్లీకి తిరిగివెళ్ళాడు.

మరి నాలుగు మాసాల అనంతరం అతని నాయకత్వానే వరంగల్లు పై మరొక దాడి జరిగింది. ఈసారి ప్రతాపరుద్రుడు ఓడి, సకుటుంబంగా శత్రువుకు లొంగిపోయాడు. జౌన ప్రతాపరుద్రుణ్ణి బందీగా ఢిల్లీకి పంపి, వరంగల్లుకు సుల్తాన్‌పూర్ అని నామకరణం చేశాడు. కాకతీయరాజ్యం ఢిల్లీ సామ్రాజ్యంలో లీనం కాకపోయినప్పటికీ తన శక్తిని కోల్పోయింది.

బెంగాలులో గవర్నరుగా ఉండిన ఫీరూజ్ షా 1318 లో మరణించాడు. తరువాత అతని కొడుకుల మధ్య అంతః కలహం ఆరంభమయింది. వారిలో ఘియాసుద్దీన్ బహదుర్ అనేవాడు సోనార్‌గాంవ్ రాజధానిగా పెట్టుకుని తూర్పు బెంగాలును స్వతంత్రంగా ఏలుతూ వచ్చాడు. లఖ్నౌతీ రాజధానిగా బెంగాలును ఏలుతూండిన తన తండ్రి స్థానాన్ని షిహాబుద్దీన్ బుఘ్రాషా అనేవాడు ఆక్రమించాడు. వీరిద్దరికీ నాసిరుద్దీన్ అనే మరొక కొడుకుకూ బెంగాలు రాజ్యం గురించి ఘర్షణ ఏర్పడింది. 1319 లో ఘియాసుద్దీన్ బుఘ్రాషాను ఓడించి బెంగాలు సింహాసనం లాక్కున్నాడు. నాసిరుద్దీన్ ఢిల్లీ సుల్తాను సహాయం అర్థించాడు. 1324 లో సుల్తాను లఖ్నౌతీకి సేనతో వెళ్లి, ఘియాసుద్దీన్ బహదుర్‌ను పట్టుకుని బందీ చేసి, నాసిరుద్దీన్‌ను పశ్చిమ బెంగాలుకు రాజును చేసి, ఉభయ బెంగాలులనూ ఢిల్లీకి సామంతరాజ్యాలు చేసుకున్నాడు.

ఆ తరవాత ఘియాసుద్దీన్ తుఘ్లక్ ఆట్టే కాలం జీవించలేదు. అతని కొడుకు జౌనా నిర్మింపజేసిన ఒక కొయ్య కట్టడం మీద ఉండగా అది కూలింది. దాని ఫలితంగా ఆయన 1325 ఫిబ్రవరి — మార్చిలో మరణించాడు. జౌనా తండ్రి మరణం చేజేతులా చేయించాడని కొందరి విశ్వాసం.





# భారత చరిత్ర



ఘియాసుద్దీన్ మరణించిన మూడు రోజుల అనంతరం రాజకుమారుడు జౌన ముహమ్మద్ బిన్ తుగ్లక్ అనే పేరుతో తాను సుల్తానుగా ప్రకటించుకుని, మరి 40 రోజులకు ఢిల్లీకి వచ్చి అత్యంత వైభవంగా రాజ్యాభిషేకం చేసుకుని, ప్రజలకు వెండి బంగారాలూ, అధికార్లకు బిరుదులూ పుష్కలంగా అర్పించాడు.

ఇతను అతి విచిత్రమైన వ్యక్తి. ఇతను మహా మేధావో, పిచ్చివాడో, రక్తదాహం కలవాడో, సాధువో నిర్ణయించటం కష్టం. అతనికి అనేక శాస్త్రాలలో అసమాన పాండిత్యం ఉన్న మాట ఖాయం. యోధుడుగా కూడా అతని అపజయాలు బహుకొద్ది, విజయాలు అధికం.

నిత్య జీవితంలో కూడా అతనికి ఆ కాలపు వ్యసనా లేమీ లేవు. అంతు లేకుండా దాన ధర్మాలు చేసేవాడు. అయితే అతనికి పుస్తక జ్ఞానం ఉన్నంతగా జీవితానుభవ జ్ఞానం లేకపోయింది. ఆయన పథకాలు సిద్ధాంత రీత్యా అద్భుతంగా ఉండేవి, కాని వాటిని అమలు చేసేసరికి ఉపద్రవాలు కలిగేవి. దీనికి తగ్గట్టుగా అతను ముక్కోపి, తొందరపాటు గలవాడు. ఎదురు చెబితే సహించేవాడు కాడు. తన విధానాలు విఫలమైన కొద్దీ అతని మనస్సు మరింత గందరగోళం చెందింది. ప్రజలకు మేలు జరగాలని ఏవో చర్యలు చేసి, వాటి వల్ల ప్రజలకు ఆనందం కలగక పోయేసరికి, వారిని కృతఘ్నులని నిందించి వారి పట్ల క్రూరంగా ప్రవర్తించాడు.

గంగా యమునల మధ్య ఉండే "దో అబ్"లో తుగ్లక్ పన్నులు హెచ్చించాడు. అది సారవంతమైన ప్రాంతం. కాని అక్కడ కరువు వచ్చిన సమయంలో ఈ అదనపు పన్నులు వచ్చి పడ్డాయి.

## 26. "పిచ్చి" తుగ్లక్





వాటిని అధికారులు క్రూరంగా వసూలు చేశారు. రైతులు పొలాలు వదిలి పెట్టి పారి పోయారు. వారిని తిరిగి రప్పించటానికి సుల్తాను క్రూరమైన శిక్షలు అమలు చేశాడు.

తుఘ్లుక్ (1327) తన రాజధానిని ఢిల్లీ నుంచి దౌలతాబాద్‌కు (దేవగిరికి) మార్చటం కూడా సదుద్దేశంతో చేసిన పనే. దో అబ్, పంజాబు, లాహోరు మైదానాలూ, ఉత్తర తీరాన గుజరాతు, తూర్పున బెంగాలు, దక్షిణాన దక్కను చేరి ఉన్న రాజ్యానికి ఢిల్లీ కన్న దేవగిరి కేంద్రస్థానం.. అదీగాక, ఢిల్లీలాగా అది మంగోలుల దాడికి గురికాదు.

రాజధాని చేసే నిమిత్తం, దేవగిరిలో తుఘ్లుక్ అద్భుతమైన భవనాలు కట్టించాడు. విశాలమైన రహదారి వేయించి దాని కిరు వైపులా నీడ నిచ్చే చెట్లు నాటించాడు. ఢిల్లీ దౌలతాబాదుల మధ్య తపాలా ఏర్పాటు చేయించాడు. దౌలతాబాదుకు వలస వెళ్ళే వారికి పుష్కలంగా ధనం ఇచ్చాడు.

కాని ఢిల్లీ వాసులు కొందరు తమ ఇళ్ళు వాకిళ్ళు వదిలి వెళ్ళటం బాధగా ఉన్నదనే సరికి సుల్తాను వెర్రెత్తిపోయి, ఢిల్లీలోని వారందరూ తమ సామాన్లతో సహా దౌలతా బాదుకు ప్రయాణం కావాలని ఆజ్ఞాపించాడు. ఈ ప్రయాణంలో జరిగిన ఘోరాలన్నిటినీ



మనం నమ్మకపోయినా, 700 మైళ్ళ ప్రయాణం ఎంతో కష్టమైనదై ఉండాలి. దారిలో చాలామంది చచ్చారు. దౌలతాబాదు చేరిన తరవాత కాందిశీకుల మనస్తత్వం ఏర్పడి మరికొందరు చచ్చారు.

అప్పటికి సుల్తాను తన పొరపాటు గ్రహించి, తన రాజధానిని తిరిగి ఢిల్లీకి మార్చి, ప్రజలను తిరిగి పొమ్మని ఆజ్ఞా పించాడు. ఢిల్లీకి ప్రాణాలతో తిరిగి వచ్చిన వారు బహుకొద్దిమంది. ఢిల్లీ శోభ అంతా పోయి పాడుబడినట్టయిపోయింది. దానికి తిరిగి కళాకాంతులు రావటానికి చాలా కాలం పట్టింది.





1329-1330 మధ్య సుల్తాను రాగితో చేసిన సంకేత నాణాలు ప్రవేశపెట్టాడు. ఇది గొప్ప విప్లవచర్య. అయితే ఈ నాణాలు ప్రభుత్వ టంకసాలలో మాత్రమేగాక ఎవరు పడితే వారు ఇళ్ళలో కుప్ప తెప్పలుగా తయారు చెయ్యటం చేత ఆర్థిక దుస్థితి ఏర్పడింది. "ప్రతి హిందువుడి ఇల్లూ ఒక టంకసాల అయింది. సంకేత నాణాలు లక్షల, కోట్ల సంఖ్యలో ఉత్పత్తి అయాయి. గ్రామాధికారులూ, భూస్వాములూ అపార ధనికులయిపోయారు. ప్రతి కమసాలీ రాగి నాణాలు చేశాడు. వీటితో ఖజానా నిండి పోయింది," అని చరిత్రకారులు రాశారు.

ఈ ఘోరం నాలుగేళ్ళ పాటు సాగినాక తన తప్పు తెలుసుకుని తుఘ్లుక్ రాగి నాణా లన్నిటినీ వెండి బంగారాలతో కొన యత్నిం చాడు. ఆయన పోగు చేసిన రాగి నాణాల రాసులు నూరేళ్ళ తరవాత కూడా తుఘ్లుకా బాదులో గుట్టలు గుట్టలుగా కానవచ్చాయి.

1328-29 లో ట్రాన్స్ ఆక్సియానా నుంచి చఘాతయీ నాయకుడు, తర్మాషీరీన్ ఖాన్ ఇండియా పై దండెత్తి వచ్చాడు. ఈ దాడి ఎలా జరిగిందో అలాగే అంత మయింది. తుఘ్లుక్ శత్రువును ఓడించాడో, లంచం పెట్టి పంపేశాడో స్పష్టంగా తెలియదు.

ఇండియాకూ, చీనాకు మధ్య ఉండే కరజల్ పర్వతాన్ని పట్టుకోవటానికి 1337-38 లో తుఘ్లుక్ ఒక పెద్ద సేనను పంపాడు. అననుకూలమైన ప్రదేశం కావటం వల్లా, వర్షాల వల్లా, సరఫరాలు తరిగిపోయీ ఢిల్లీ సేనలు చివరకు అగచాట్లకు గురి అయి, విపరీత నష్టం పొందాయి. తిరిగి వచ్చిన వారి సంఖ్య పదిమంది అని ఒక చరిత్రకారుడూ, ముగ్గురేనని మరొక చరిత్ర కారుడూ చెప్పారు. అయితే దాడి ఆశయం నెరవేరింది. ఆ ప్రాంతపు కొండవారు ఢిల్లీ అధిపత్యం ఆమోదించి, కప్పం చెల్లించారు.





# భారత చరిత్ర



తుఘ్లుక్ వేసిన వెర్రి పథకాలు ప్రజలను చాలా రెచ్చగొట్టాయి. సుల్తాను పై అనేక ప్రాంతాల తిరుగుబాట్లు సాగాయి. క్రమ పాలన అంతమయింది. సుల్తానుకు ఆగ్రహా వేశం హెచ్చిపోయింది. అతడి సామ్రాజ్యం విచ్ఛిత్తి కాసాగింది.

మొదటి రెండు తిరుగుబాట్లనూ సుల్తాను సులువుగానే అణచాడు. మొదటి తిరుగు బాటుదారు సాగర్‌ను ఏలే సామంతుడు బహాఉద్దీన్ గుర్‌షాస్ప్ అనేవాడు; ఘియా సుద్దీన్ మేనల్లుడు. 1326 లేక 1327లో జరిగిన ఈ తిరుగుబాటును సుల్తాను అణచి పెట్టి, బహాఉద్దీన్ చర్మం ఒలిపించి, "రాజద్రోహుల గతి ఇంతే", అని ప్రకటన చేయించాడు. మరుసటి సంవత్సరమే ముల్తాన్, సింద్, ఉచ్ సంస్థానా లేలే బహ్రాం ఐబ అనే వాడు మరింత తీవ్రంగా తిరుగు బాటు చేశాడు.

సుల్తాన్ ఇతన్ని ఓడించి, తల గొట్టించి, ఆ తలను ముల్తాన్ కోట ద్వారానికి వేళ్ళాడ గట్టించాడు.

ఇట్టి చర్యల వల్ల తిరుగుబాట్లు తగ్గకపోగా హెచ్చాయి. 1335 తరవాత హిందూ సామంతులూ, ముస్లిము గవర్నరులూ ఒక రొకరే స్వాతంత్ర్యం ప్రకటించసాగారు. మాబారు గవర్నరు తన పేర నాణాలు కూడా అచ్చు వేయించాడు. సుల్తాను ఇతని పైకి సైన్యాన్ని తీసుకుని బయలు దేరాడుగాని, మార్గమధ్యంలో సైన్యాలు కలరా వాత పడ్డాయి.

ఆ విధంగా మదురలో ముస్లిము రాజ్యం, విజయనగర రాజ్యం మీద 1377-78లో ఓడిపోయినదాకా సాగింది.

1338లో బెంగాలు గవర్నరు ఫ్రకుద్దీన్ ముబారక్ షా స్వాతంత్ర్యం ప్రకటించి తన పేర నాణాలు వేయించాడు. 1340-41లో





అయోధ్య, జఫరాబాద్‌ల గవర్నరు ఐనుల్ ముల్క్ తిరుగుబాటు అమిత ప్రబలమైనది. 1342 నాటికి ఈ తిరుగుబాట్లు అంత మయిన మాట నిజమేగాని, రాజ్యం నిర్వీర్య మయింది, సుల్తాను శక్తులు పూర్తిగా ఉడిగిపోయాయి.

సుల్తానుకు చిక్కులు తీరలేదు. తెలంగాణంలో ప్రోలయనాయకుడూ, అతని అనంతరం కాపయనాయకుడూ ముస్లిము పరిపాలనను ప్రతిఘటించి హిందూ పరిపాలన ఏర్పాటు చేశారు. హొయసల రాజైన మూడవ వీరబల్లాలుడు వారికి సాయం చేశాడు. కృష్ణాతీరాన అలాటి ఉద్యమమే సాగింది. దక్కనులో విజయనగర రాజ్యమూ, ఇతర హిందూ రాజ్యాలూ ఏర్పడ్డాయి. 1347లో దేవగిరి తిరుగుబాటు చేసింది. అక్కడ బహ్మనీ రాజ్యానికి శంకుస్థాపన జరిగింది.

తిరుగుబాటుదార్లను అణచటానికి ఒక చోటి నుంచి మరొక చోటికి పరిగెత్తుతూ ముహమ్మద్ బిన్ తుఘ్లక్ 1351 మార్చి 20 న మరణించాడు. "ప్రజలకు సుల్తాను పీడా, సుల్తానుకు ప్రజల పీడా విరగడ అయింది," అన్నాడు ప్రసిద్ధ చరిత్రకారుడు బదాఊనీ.



ముహమ్మద్ బిన్ తుఘ్లక్ ఆకస్మికంగా యుద్ధరంగాన చావటంతో, సైన్యం నిర్వీర్యం కాకుండా చూడటానికి గాను పెద్దలు ఫీరూజ్ షా అనే వాణ్ణి సుల్తానుగా ప్రకటించారు. ఈ లోపల ఢిల్లీలో కొందరు ఒక కుర్రవాణ్ణి తెచ్చి, అతను చనిపోయిన సుల్తాను కొడుకని చెప్పి సింహాసనం ఎక్కించారు. కాని చివరకు ఆ కుర్రవాడే ఫీరూజ్‌ను సుల్తానుగా ఆమోదించి, శరణుజొచ్చాడు.

ఫీరూజ్ అసమర్థుడు, "పిచ్చి" తుఘ్లక్ ఆఖరు దినాలలో ఏర్పడిన అరాచకాన్ని సరి చెయ్యటం అతనికి సాధ్యం కాలేదు. సామ్రాజ్యంలో కొన్ని ప్రాంతాలు విడి





పోయాయి. ఫీరూజ్‌కు యుద్ధదక్షత కూడా లేదు. కాని యుద్ధాలు చేశాడు. ఒక్కొక్క సారి విజయం సిద్ధించనున్న తరుణంలో వెనక్కు వచ్చేశాడు. ఇతని నగరకోట యుద్ధం ఒకందుకు ప్రసిద్ధమయింది; ఆ సమయంలో అతను జ్వాలముఖీ దేవాలయంలోని 300 సంస్కృత గ్రంథాలను పర్షియనులోకి అనువదింప జేయించాడు.

అతను మత దురహంకారి, హిందువులను పీడించాడు. ఈజిప్టులో ఉండే ఖలీఫాకు తాను సామంతుడనని చెప్పుకున్నాడు. పూర్వం ఏ ఢిల్లీ సుల్తానూ ఈపని చేసి ఉండలేదు. తన ప్రజలను ఇస్లాములో చేరమని కూడా ఇతను ప్రోత్సహించాడు.

ఫీరూజ్‌కు ఖానిజహాన్ మక్బూల్ అనే మంత్రి ఉండేవాడు. ఇతను మొదట తెలంగాణానికి చెందిన హిందువుడు. ఇతను ఇస్లాం మతం పుచ్చుకుని ముహమ్మద్ బిన్‌తుఘ్లక్ హయాంలోనే రాజోద్యోగి అయి, క్రమంగా పైకి వచ్చి ఫీరూజ్‌కు మంత్రి అయాడు. ఇతని దక్షత వల్లనే రాజ్యం నడిచింది. ఇతను 1370 లో మరణించగా ఇతని కొడుకు జూనషా అనేవాడు ఆ పదవిలోకి వచ్చాడు.

ఫీరూజ్ 37 ఏళ్ళు పరిపాలించాడు. ఇతని పాలనలో ప్రజలు సుఖపడ్డారనే చెప్పాలి. మంగోలుల దాడు లేవీ జరగలేదు. వ్యవసాయం నీటి పారుదల సౌకర్యాలతో బాగుపడింది. రైతులు బాగుపడ్డారు. అతను అనేక నగరాలు కట్టించాడు. జౌన్‌పుర్, ఫతేహాబాద్, హిస్సార్, ఫీరూజ్పుర్, ఫీరూజాబాద్ మొదలైనవి అతను కట్టించినవే. అతను ఢిల్లీ శివార్లలో 1200 ఉద్యానాలు వేయించాడు.

చివరి రోజులలో ఫీరూజ్‌కు మతి చలించింది. దీనికి కారణం అతని పెద్ద కొడుకు 1374 లో చావటం. 1388 సెప్టెంబరు 20 న ఫీరూజ్ మరణించాడు.





# భారత చరిత్ర



ఫీరూజ్ చావగానే అతని మనమడు తుఘ్లక్ షా, రెండవ ఘియాసుద్దీన్ తుఘ్లక్ షా అనే పేరుతో, సుల్తాను అయాడు. కాని కొందరు ఉద్యోగులూ, కులీనులూ కుట్ర చేసి **1389** ఫిబ్రవరి **19** న అతన్ని తుదముట్టించారు. అతని అనంతరం అతని దాయాది అయిన అబుబకర్‌ను ఢిల్లీ ప్రముఖులు సుల్తానును చేశారు. ఇదే సమయంలో ఫీరూజ్ కొడుకైన నాసిరుద్దీన్ ముహమ్మద్ పక్షీయులు **1389** ఏప్రిల్ **24** న అతన్ని సామాన వద్ద సుల్తానుగా ప్రకటించారు. అబుబకర్ ప్రత్యర్థులకు తట్టుకోలేక **1390** డిసెంబరులో రాజ్యత్యాగం చేశాడు. నాసిరుద్దీన్ ముహమ్మద్ కూడా ఆరోగ్యం చెడి **1394** జనవరిలో మరణించాడు. అతని అనంతరం అతని కొడుకు హుమయూన్ గద్దె ఎక్కి కొద్ది రోజులు రాజ్యం చేసి ఆ మార్చి **8** నే మరణించాడు. అతని తరువాత రాజ్యానికి వచ్చినవాడు నాసిరుద్దీన్ ముహమ్మద్ ఆఖరు కొడుకు నాసిరుద్దీన్ మహమ్మద్. ఇతనే తుఘ్లక్ వంశపు ఆఖరు రాజు. ఇతనికి నుస్రత్ షా అనే ప్రత్యర్థి ఉండేవాడు; ఇతను ఫీరూజ్ పెద్ద కొడుకు యొక్క కుమారుడు. కొందరు ప్రముఖుల ప్రేరణతో ఇతను రాజ్యాన్ని వశపరచుకొన యత్నించి విఫలుడై, విద్రోహుల చేత చంపబడ్డాడు.

ఫీరూజ్ అనంతరం వచ్చిన వారంతా బలహీనులు. అంతకు పూర్వమే ప్రారంభమైన విచ్ఛిత్తిని వారిలో ఒక్కడు కూడా నివారించలేక పోయాడు. వారందరూ ఢిల్లీ ప్రముఖుల మధ్య సాగిన కుట్రలలో కీలుబొమ్మలుగా వ్యవహరించారు. సింహాసనం కోసం పోటీలుపడ్డ వారి మధ్య అంతర్యుద్ధాలు సాగాయి. ఇందుచేత కేంద్రప్రభుత్వానికి బొత్తిగా పరపతి పోయింది. దేశ

**28.** *తుఘ్లక్ వంశ పరిసమాప్తి*



మంతటా గల సుల్తాను ప్రతినిధులు, ముస ల్మానులూ, హిందువులూ కూడా స్వాతం త్ర్యం ప్రకటించారు. జౌన్పుర్, గుజరాతు, మాల్వా, ఖాందేష్, గ్వాలియర్, మేవాత్ మొదలైనవి స్వతంత్ర రాజ్యాలయాయి.

ఢిల్లీ సామ్రాజ్యం ఇలాటి అరాజక స్థితిలో ఉండగా అమీర్ తీమూర్ అనే వాడు ఇండి యాపై దాడి వచ్చాడు. తీమూర్ భయం కరుడుగా చరిత్ర ప్రసిద్ధి గలవాడు. ఇతను ట్రాన్స్ ఆక్సియానాలో కేష్ అనే చోట 1336 లో పుట్టాడు, ఒక తుర్కు తెగకు చెందిన వాడు. అతను 1369 లో సమ ర్కండ్ సింహాసనానికి వచ్చి, విజయ కాంక్షతో పర్షియా, అఫ్ఘానిస్తాన్, మెస పొటేమియాల పై దాడులు చేశాడు. ఇండి యాలో గల సంపద అతన్ని ఆకర్షించింది.

తీమూర్ మనమడు పీర్ ముహమ్మద్ అనే వాడు 1398 లో ముల్తానును ముట్ట డించి, ఆరు నెలల అనంతరం వశపరుచు కున్నాడు. 1398 ఏప్రిల్‌లో తీమూర్ పెద్ద సేనతో సమర్కండ్ నుంచి బయలు దేరి, సింధూ, ఝీలం, రావీనదులు దాటి, అయేడే అక్టోబరు 13 న ముల్తానుకు ఈశా న్యంగా 70 మైళ్ళ దూరాన గల తలంబ అనే చోటికి వచ్చి చేరాడు. అతను తలం



బను కొల్లగొట్టి అక్కడి పౌరులను కొందరిని వధించి, కొందరిని బందీలుగా పట్టు కున్నాడు. దారి పొడుగునా అనేక నగరాలు కొల్లగొట్టి, ప్రజలను హత్యచేస్తూ డిసెంబరు మొదటి వారం ఆఖరుకు ఢిల్లీ శివార్లు చేరి, తనకు బందీలుగా చిక్కిన సుమారు లక్ష మంది పురుషులను అక్కడ వధ చేయిం చాడు. సుల్తాన్ మహ్మూద్, మల్లూ ఇక్బాల్ అనే వాళ్ళు డిసెంబరు 17 న, 10 వేల అశ్వికదళమూ, 40 వేల కాల్బలమూ, 120 ఏనుగులూ గల పెద్ద సేనతో తీమూర్‌ను ప్రతిఘటించి, ఘోరపరాజయం పొంది చెరొక దారినా పారిపోయారు.





మర్నాడే తీమూర్ ఢిల్లీ ప్రవేశించాడు. అనేక రోజులపాటు ఢిల్లీ నగరం కొల్లగొట్ట బడింది, అక్కడి పౌరులు భయంకరులైన తుర్కీ సైనికుల చేత దారుణంగా చంప బడ్డారు, కొందరు బందీలుగా చిక్కారు. ఢిల్లీలోని శిల్పులు సమర్కండ్‌కు పంప బడి, అక్కడ తీమూర్ తయారుచేసిన పథ కాన్నిబట్టి జుమ్మామసీదు నిర్మించారు.

తీమూర్ ఇండియాలో ఉండి పోదలచ లేదు. ఢిల్లీలో 15 రోజులుండి తిరిగివెళ్ళి పోతూ అతను ఫీరూజాబాద్‌నూ (1399 జనవరి 1), మీరట్‌నూ (జనవరి 9), హరి ద్వారం వద్ద రెండు హిందూ సేనలనూ, సివాలిక్ కొండల వెంబడి కాంగ్రానూ (జన వరి 16) జయించి, జమ్మూను కొల్లగొట్టి అసంఖ్యాకులను హత్య చేయించాడు. ముల్తాన్, లాహోర్, దీపాల్పూర్‌లు ఏల టానికి ఖిజ్‌ఖాన్ సయ్యిద్ అనే వాణ్ణి నియో గించి అతను మార్చి 19 న సింధూ నదిని తిరిగి ఉత్తరించాడు. అతను భారతదేశానికి చేసిన హాని పూర్వం ఏ శత్రువూ ఒక్క దండయాత్రలో చేసి ఉండలేదట.

తీమూర్ దాడి వెంబడి ఢిల్లీ నగరం కరువు కాటకాల వాత పడింది. అక్కడ మిగిలిన పౌరులు కూడా చచ్చారు. రెండు నెల్లపాటు నగరం మీద పక్షి ఎగరలేదట. అసలే క్షీణించి ఉన్న ఢిల్లీ సామ్రాజ్యాన్ని తీమూర్ పూర్తిగా మట్టుబెట్టాడు. 1399లో నుస్రత్ షా సుల్తాను కావాలని యత్నిం చాడు గాని మల్లూ ఇక్బాల్ అతన్ని తరిమి కొట్టాడు. 1401 లో మల్లూ ఢిల్లీకి వచ్చాడు, అతను మహ్మూద్ షాను కూడా ఢిల్లీకి ఆహ్వానించాడు. 1405 నవంబరు 12 న మల్లూ ఇక్బాల్ ఖిజ్‌ఖాన్‌తో పోరి చనిపోగా మహ్మూద్ తిరిగి సుల్తానయ్యాడు. సుమారు 20 ఏళ్ళు నామ మాత్రపు సుల్తా నుగా ఉండి అతను 1413 ఫిబ్రవరిలో చనిపోవటంతో తుఘ్లుక్‌వంశ మంతరించింది.







# భారత చరిత్ర




తుఘ్లుక్ వంశం సుల్తాన్ మహమ్మద్‌తో అంత రించగా, ఢిల్లీ ప్రముఖులు తమలో బల వంతుడైన దౌలత్‌ఖాన్ లోదీని గద్దె ఎక్కిం చారు. అయితే, భారతదేశంలో తీమూర్ ప్రతినిధి అయిన ఖిజ్‌ఖాన్ తాను పాలించే ముల్తాను నుంచి సేనలతో వచ్చి, 1414 మే ఆఖరులో ఢిల్లీని వశపరుచుకున్నాడు. దౌలత్ ఖాన్ ఖైదీ అయి హిస్సార్‌ఫీరూజాకు పంప బడ్డాడు. ఖిజ్‌ఖాన్ మహమ్మదు ప్రవక్త సంతతివాడని కొందరు చరిత్రకారుల నమ్మకం. అందుచేత అతని వంశానికి సయ్యిద్ వంశమని పేరు పెట్టారు. అతను సమర్థుడు కాడు. అతని ఏడేళ్ళ పరిపాల నలో విశేష మేమీలేదు. ఢిల్లీ సామ్రాజ్యం ఢిల్లీ చుట్టూ ఉండే కొద్ది జిల్లాలు దాటలేదు. ఈ కొద్దిమేరలో కూడా తరుచు తిరుగుబాట్లు జరిగేవి. వాటిని అణచటానికి ఖిజ్‌ఖాన్‌తో బాటు అతని మంత్రి తాజుల్ముల్క్ కూడా తీవ్రంగా కృషి చేశాడు. 1421 లో కొద్ది నెలలు తేడాగా ఇద్దరూ చనిపోయారు.

ఖిజ్‌ఖాన్ చనిపోయిన రోజునే (1421 మే 20) అతని కొడుకు ముబారక్ షా ఢిల్లీ ప్రముఖుల అనుమతితో గద్దె ఎక్కాడు. ఇతను కూడా సమర్థుడు కాడు; కొద్ది తిరుగు బాట్లు అణచినప్పటికీ, ఇతని హయాంలో ఖోకర్ల ప్రతిఘటన హెచ్చింది. ఇతని అస్థా నంలోని హిందువుల పలుకుబడి కూడా పెరిగింది. యమునాతీరాన ముబారకాబాద్ అనే నగరం నిర్మింపజేస్తూ, దాన్ని పర్యవే క్షించటానికి వెళ్ళిన సమయంలో హిందూ, ముస్లిము కుట్రదార్లు ఇతన్ని హతమా ర్చారు. 1434 ఫిబ్రవరి 19 న జరిగిన ఈ హత్యకూ, కుట్రదార్లకూ నాయకుడు ఇతని వజీరు సర్వరుల్ముల్క్.

ఇతని అనంతరం ఇతని వారసుడు ముహమ్మద్ అనే వాడు సుల్తానయాడు.

## 29. సయ్యిద్‌లూ, లోదీలూ





ఇతనూ అసమర్థుడే. కుట్రదారైన సర్వ రుల్ముల్క్ చనిపోయిన అనంతరం ఇతను తన సామర్థ్యం ప్రదర్శించి ఉండవలిసింది. కాని అలా జరగలేదు. మాల్వ రాజైన మహ్మూద్ షా ఖల్జీ ఢిల్లీ పైకి వచ్చాడు. అప్పుడు సుల్తానుకు సహాయంగా వచ్చిన లాహోరు గవర్నరు బుహ్లూల్‌ఖాన్ లోదీ, తానే ఢిల్లీ సుల్తాను కావటానికి యత్నించాడు. ఈ ప్రయత్నం విఫలమయినప్పటికీ, సయ్యద్‌ల స్థితి నానాటికీ దిగజారిపోయింది. ఢిల్లీకి ఇరవై కోసుల దూరంలో ఉన్న సామంతులు కూడా తిరుగుబాటుకు సిద్ధపడ్డారు. ముహమ్మద్ షా 1445 ప్రాంతంలో పోయాడు. అతని కొడుకు అలా ఉద్దీన్ ఆలమ్ షా సుల్తానయే సరికి అతని ఏలుబడి కింద ఢిల్లీ నగరమూ, దాని చుట్టుపక్కల కొద్ది గ్రామాలు మాత్రమే ఉన్నాయి! ఈ కొత్త సుల్తాను పాత వారే మేలనిపించాడు; ఇతను రాజ్యాన్ని 1451 లో బుహ్లూల్ ఖాన్ లోదీ పరం చేసి, పారిపోయి తన అభిమాన ప్రదేశమైన బదాఊన్‌లో నివసించాడు.

బుహ్లూల్ ఖాన్ భారతచరిత్రలో ఢిల్లీ సింహాసన మెక్కిన మొదటి అఫ్ఘానీయుడు. ఇతను అఫ్ఘాన్ లోదీ తెగకు చెందినవాడు.



ఇతను లాహోరు, సిర్హిందులను రాజ ప్రతినిధిగా పాలిస్తూ, ఆలమ్ షా వదిలి పోయిన సింహాసనాన్ని, హమీద్ ఖాన్ అనే మంత్రి సహకారంతో, 1451 ఏప్రిలు 19 న అధిష్ఠించాడు. ఇతను, తన ముందు వచ్చిన వారిలాగా కాక, సమర్థుడు, యోధుడు, చురుకైనవాడు. తోటి అఫ్ఘానుల సహాయంతో అతను హమీద్‌ఖాన్‌ను ఖైదులో పెట్టి, అతని ప్రభావాన్ని అరికట్టాడు. చాలా ఏళ్ళుగా స్వాతంత్ర్యం అనుభవిస్తున్న మేవాత్, సంభల్, మైన్పురీ, సుకేత్, రేవరీ మొదలైన వలసల నేలే వారిని లోబరుచుకున్నాడు. జౌన్పుర్ పై యుద్ధం చేసి జయించి,





1486 లో తన పెద్ద కుమారుడైన బార్బక్ షాను అక్కడ రాజ ప్రతినిధిగా నియమించాడు. గ్వాలియర్ రాజైన కిరత్‌సింగ్‌ను శిక్షించి తిరిగి వస్తూ, దారిలో జబ్బుచేసి, జలాలీ వద్ద 1489 జులై మధ్యకాలంలో మరణించాడు.

1489 జులై 17 న సుల్తాను రెండవ కొడుకు నిజామ్ ఖాన్, సుల్తాన్ సికందర్ షా అనే పేరుతో, జలాలీ వద్ద కొత్త సుల్తానుగా ప్రకటించబడ్డాడు. ఇతను చాలా శక్తివంతుడు. ముగ్గురు లోదీ సుల్తానులలోకీ ఇతనే హెచ్చు సమర్థుడు. ఇతను రాజ్యంలోని అరాజకాన్ని తగ్గించటానికి శ్రద్ధగా కృషి చేశాడు. ప్రముఖులైన అఫ్ఘాన్ జాగీర్దార్ల ఆస్తి వివరాలన్నీ తణిఖీ చేయించాడు. సామంతులను అదుపులో పెట్టాడు.

1504 లో ఇతను నేటి ఆగ్రా ఉండే చోట ఒక నగరం నిర్మించి, చివరిదాకా తిరుగుబాటుదార్లను సమర్థతతో నిగ్రహించుతూ, 1517 నవంబరు 21 న ఆగ్రాలోనే మరణించాడు.

ఇతను పోయిన నాడే ఆగ్రాలో ఇతని పెద్ద కొడుకు ఇబ్రాహీమ్ సుల్తాను అయాడు. ఆ సమయంలో ఇబ్రాహీమ్ తమ్ముడైన జలాల్ ఖాన్‌ను జౌన్పుర్‌కు రాజు చెయ్యాలని కొందరు చేసిన ప్రయత్నం విఫలమయింది. జలాల్ పట్టుపడి చంపబడ్డాడు.

కొత్త సుల్తానుకు యుద్ధ నైపుణ్యం ఉన్నదిగాని, సమయజ్ఞుడు కాడు. ఇదే ఇతనికి చేటు తెచ్చింది. తన బలం పెంచుకోవాలని ఇతను ఉన్నతోద్యోగులైన లోహనీ, ఫొర్ములీ, లోదీ తెగలకు చెందిన ప్రముఖులను అతిగా వేధించాడు. అఫ్ఘాన్ ప్రముఖులంతా ఇతనికి శత్రువులై కూర్చున్నారు. సుల్తానుకు కావలిసిన వాళ్ళే అయిన దౌలత్‌ఖాన్ లోదీ, ఆలంఖాన్‌లు కాబూలును పరిపాలించే బాబుర్‌ను ఇండియా పైకి రావలసిందిగా ఆహ్వానించారు!







# భారత చరిత్ర



ఢిల్లీ సామ్రాజ్యం నుంచి అన్ని ప్రాంతాల కన్న ముందుగా స్వతంత్రమైనది బెంగాలు. అది సంపన్నమైన దేశం, ఢిల్లీకి చాలా దూరాన ఉన్నది; అందుచేత దాని పాలకులు మొదటి నుంచీ కేంద్ర పరిపాలనను ధిక్కరిస్తూ వచ్చారు. సుల్తాను బల్బన్ అనంతరం బెంగాలు దాదాపు స్వతంత్రమయింది. దాన్ని ఘియాసుద్దీన్ తుఘ్లక్ తిరిగి స్వాధీనపరచుకుని, మూడు ప్రాంతాలుగా విభజించి, వాటికి లఖ్నౌతీ, సాత్‌గాంవ్, సోనార్‌గాంవ్‌లు రాజధానులుగా ఏర్పాటు చేశాడు. ఇలా చేసినా తిరుగుబాట్లు ఆగలేదు. 1336 అనంతరం ఫఖ్రుద్దీన్ అనే వాడు సోనార్‌గాంవ్‌కు రాజైనాడు. మరికొద్ది కాలానికి ఉత్తర బెంగాలులో అలాఉద్దీన్ ఆలీ షా అనే వాడు స్వాతంత్ర్యం ప్రకటించి, తన రాజధానిని లఖ్నౌతీ నుంచి పాండువాకు మార్చాడు. 1345 ప్రాంతంలో బెంగాలు రాష్ట్రమంతా షంసుద్దీన్ ఇలియాస్ షా పాలన కిందికి వచ్చేసింది. ఇతని కాలంలోనూ, ఇతని కొడుకైన సికందర్ షా కాలంలోనూ కూడా ఢిల్లీ సుల్తానులు బెంగాలును స్వాధీనపరచుకొన యత్నించి విఫలులైనారు. సికందర్ షా 36 ఏళ్ళు దివ్యంగా పరిపాలించి 1398 అక్టోబరులో చనిపోయాడు. ఇతని కొడుకు ఘియాసుద్దీన్ అజమ్ వద్దకు చీనా చక్రవర్తి ప్రతిపక్షి 1408 లో రాయబారం పంపాడు, ఇతను మరుసటి ఏడు తన రాయబారిని చీనాకు పంపాడు. ఇతను 17 ఏళ్ళు పాలించి 1410 లో పోయాడు. ఇతని కొడుకు హంజా షా నామ మాత్రపు రాజు. ఇతని స్థానంలో నిజంగా రాజ్యమేలిన వాడు రాజా గణేశ్ అనే బ్రాహ్మణ జమీందారు. గణేశ్ తన కొడుకు జదు (యదు) అనే వాణ్ణి సింహాసన మెక్కించాడు. అతను





ఇస్లాం మతం పుచ్చుకుని, జలాలుద్దీన్ ముహమ్మద్ షా అనే పేరుతో రాజ్యం చేశాడు. ఇతను 1431 లో పోయాడు. ఇతని కొడుకు షంసుద్దీన్ అహ్మద్ 1442 దాకా దుష్పరిపాలన చేసి కుట్రదారుల చేత హతుడయాడు. కుట్రదారుల మధ్య కీచులాటలలో బెంగాలు సింహాసనం తిరిగి ఇలియాస్ షా వంశీయుల పరమయింది; నాసిరుద్దీన్ మహ్మూద్ అనే వాడు రాజయాడు.

నాసిరుద్దీన్ 17 ఏళ్ళపాటు శాంతియుతంగా పరిపాలించి 1460 లో పోయాడు. ఇతని కొడుకు రుక్నుద్దీన్ బార్బక్ షా వద్ద అనేకమంది అబిసీనియను బానిసలుండే వారు. వారిలో కొందరికి ఇతను పెద్ద పదవు లిచ్చాడు. ఇతను 1474 దాకానూ, ఇతని కొడుకు యూసుఫ్ షా 1481 దాకానూ పరిపాలించారు. యూసుఫ్ షా కొడుకు మందమతి అయినందున బెంగాలు సింహాసనం నాసిరుద్దీన్ మహ్మూద్ కొడుకైన ఫథ్‌షాకు సంక్రమించింది. అయితే అబిసీనియనులు ఒక కొజ్జావాడి నాయకత్వాన కుట్రచేసి ఇతన్ని చంపేశారు. కొజ్జావాడు బార్బక్ షా అనే పేరుతో రాజై, ఫథ్ షాకు విశ్వాసపాత్రుడైన ఇందీల్‌ఖాన్ అనే వాడి చేత హత్య చేయబడ్డాడు. ఇతను



1489 దాకా పాలించిన పిమ్మట ఫథ్ షా కొడుకు రెండవ మహ్మూద్ షా రాజైనాడు. కాని మరుసటి ఏడే సీదీబద్ర్ అనే అబిసీనియను అతన్ని హత్యచేసి, సింహాసనం కాజేసి మూడేళ్ళ చిల్లరకాలం క్రూరంగా పరిపాలించాడు. ఇతని మంత్రి అలాఉద్దీన్ హుసేన్ అనే వాడు చాలా యోగ్యుడు. రాజోద్యోగులు రాజును బందీని చేసి 1493 లో ఈ మంత్రికే పట్టం కట్టారు.

ఇతను అరబ్బువాడు. ఇతని సంతతి బెంగాలును సుమారు అర్థ శతాబ్దం పాటు పరిపాలించారు. వారిలో కొందరు ఉపయుక్తమైన పను లనేకం చేశారు. హుసేన్





షా అనేక శాసనాలు చెక్కించాడు. అతని నాణాలు విరివిగా దొరుకుతున్నాయి. ప్రజా రంజకులైన బెంగాలు ప్రభువులలో అత నొకడు. ఇతను బెంగాలు రాజ్యాన్ని దక్షిణాన ఒరిస్సా దాకా విస్తరింప జేశాడు. మగధదేశాన్ని జౌన్పూర్ పాలకుల నుంచి లాక్కున్నాడు. అసాములోని ఆహోమ్ రాజ్యం పై దాడి చేసి, కూచ్ బిహారులోని కామతాపురాన్ని 1498 లో పట్టుకున్నాడు. ఇతను 1518 లో చనిపోయాడు. ఇతని పెద్ద కొడుకు నసీబ్ ఖాన్ రాజ్యానికి వచ్చాడు. నుస్రత్ షా అనే పేరుతో రాజ్యమేలిన ఇతను కళనూ, శిల్పాన్నీ, సాహిత్యాన్నీ ప్రోత్సహించాడు. "బరాసోనా మసీద్", "కదమ్ రసూల్" అనే గొప్ప మసీదులను గౌర్ వద్ద నిర్మింప జేశాడు. మహాభారతాన్ని బెంగాలీ భాషలోకి అనువదింప జేశాడు. ఇతన్ని రాజభవనంలోని కొజ్జాలు 1533 లో హత్య చేశారు.

ఇతని అనంతరం ఇతని కొడుకు అలా ఉద్దీన్ ఫీరూజ్ షా రాజై, మూడు నెలలు మాత్రమే రాజ్యం చేసి, తన పినతండ్రి అయిన ఘియాసుద్దీన్ మహ్మూద్ షా చేత హత్య చేయబడ్డాడు. ఈ మహ్మూద్ షా హుసేన్‌షా వంశానికి చెందిన ఆఖరు బెంగాలీ రాజు. ఇతన్ని షేర్‌ఖాన్ సూర్ అనే వాడు బెంగాలు నుండి వెళ్ళగొట్టేశాడు.

*జౌన్పూర్ :*

తీమూర్ దాడుల సమయంలో స్వతంత్రమైన జౌన్పూర్ రాజ్యం బుహ్లూల్ లోదీ కాలంలో తిరిగి ఢిల్లీ సామ్రాజ్యంలో చేరిపోయింది. ఈ మధ్యకాలంలో ఈ రాజ్యాన్ని పరిపాలించిన వారిలో షర్కీ వంశపు రాజులు చరిత్ర ప్రసిద్ధులు. వీరు 85 ఏళ్ళు పరిపాలించారు. వారిలో ప్రఖ్యాతుడు ఇబ్రాహీం షా షర్కీ. ఇతను 1402 నుంచి సుమారు 34 ఏళ్ళు పాలించాడు. ఇతను విద్వాంసుడు, లలితకళా సాహిత్య ప్రియుడు.








# భారత చరిత్ర




మాల్వా

1305లో అలాఉద్దీన్ ఖల్జీ చేత జయించబడిన మాల్వా, తీమూర్ దాడుల సమయంలో స్వతంత్రమయింది (1401). దానికి దిలావర్ ఖాన్ ఘూరీ రాజయాడు. రణకౌతుకుడైన ఇతని కొడుకు అల్ఫ్‌ఖాన్ 1422లో వర్తకుడిలా మారు వేషం వేసుకుని ఆకస్మికంగా ఒరిస్సా రాజుపై పడ్డాడు. ఒరిస్సా రాజు అతనికి 75 ఏనుగులు లంచమిచ్చి పంపేశాడు. ఇతని కొడుకు ఘజ్నీ ఖాన్ అసమర్థుడు కావటంచేత అతని మంత్రి మహమ్మద్‌ఖాన్ రాజ్యం కాజేశాడు (1436 మే). ఈ విధంగా మాల్వా ఖల్జీరాజుల అధీన మయింది.

మహమ్మద్ ఖల్జీ యుద్ధ కుశలుడు. అతను గుజరాతు, ఢిల్లీ, బహ్మనీ, మేవారు రాజులతో యుద్ధాలు చేశాడు. ఈ యుద్ధాలన్నిటిలోకీ వినోదకరమైనది, ఇతను మేవారు రాణాతో చేసిన యుద్ధం. ఉభయపక్షాలూ విజయం ప్రకటించాయి! రాణా చితోడ్‌లో విజయ గోపురం నిర్మిస్తే, మాల్వా సుల్తాను మాండూలో ఏడంతస్తుల విజయ స్తంభం నిర్మించాడు! ఏమైనా మహమ్మద్ ఖల్జీ సమర్థుడు, తన రాజ్యాన్ని నాలుగు పక్కలా విస్తరింపజేశాడు. ఈజిప్టులోని ఖలీఫా ఇతన్ని గుర్తించాడు.

1469 జూన్ 1న ఇతను చనిపోగా, రెండు రోజుల అనంతరం ఇతని పెద్ద కొడుకు ఘియాసుద్దీన్ మాల్వాకు సుల్తానయాడు. ఇతని రెండవ కొడుకు రెండవ మహమ్మద్ 1510లో రాజ్యానికి వచ్చి, రాజపుత్రుడైన మేదినీరాయ్‌ని ప్రధానిగా పెట్టుకున్నాడు. అతని వెనుకగా హిందువులు పెద్ద పదవులలోకి వచ్చారు. తిరిగి 1561-62 దాకా మాల్వా మొగలు సేనాపతుల అధీనం కాలేదు.





గుజరాతు

విదేశీ వర్తకపు రేవులు కారణంగా గుజరాతు చాలా సంపన్నమయింది. 1297 లో అలాఉద్దీన్ దానిని జయించి ఢిల్లీ సామ్రాజ్యంలో చేర్చాడు. దానిని పాలించిన సుల్తాను ప్రతినిధులలో జఫర్‌ఖాన్ అనే ముస్లిము మతం పుచ్చుకున్న రాజపుత్రుడు 1401 లో స్వతంత్రం ప్రకటించాడు. 1411 జూనులో గుజరాతుకు రాజైన అహ్మద్ షా అనేవాడు గుజరాతును వాస్తవంగా స్వతంత్రం చేసిన వాడని చెబుతారు. ఇతను 30 ఏళ్ళు పాలించి, గుజరాతు రాజ్యాన్ని విస్తరింప జేశాడు. అహమ్మదాబాదు నగరాన్ని అందంగా నిర్మించాడు. ఇతను 1442 లో మరణించాడు.

అయితే గుజరాతుకు ఖ్యాతి చేకూర్చి, ఆ రాజ్యాన్ని హెచ్చుగా విస్తృత పరచిన వాడు, మహ్మూద్ బేగర్హా అనేవాడు. ఇతను చిన్నతనంలోనే సింహాసనానికి వచ్చి, 53 ఏళ్ళు పాలించాడు. ఇతని శౌర్యపరాక్రమాలనూ, న్యాయబుద్ధినీ అప్పటి చరిత్రకారులు కీర్తించారు. ఇతను అవసానకాలంలో, భారతదేశంలో పోర్చుగీసు వారి ప్రభావం పెరగకుండా చేసేందుకు ఈజిప్టు సుల్తానుతో సంబంధాలు పెట్టుకొన యత్నించాడు.



1508 లో బొంబాయికి దక్షిణంగా చౌల్ వద్ద ఈజిప్టు, భారతీయ బలాలు ఏకమై పోర్చుగీసు నౌకాదళాన్ని ఓడించాయి. అయితే 1509 లో పోర్చుగీసు వారు దియూ వద్ద ముస్లిము నౌకాబలాన్ని అంతంచేసి, తమ సముద్రవర్తకం సుస్థిరం చేసుకుని, దియూ వద్ద ఒక ఫాక్టరీ కట్టటానికి స్థలం కూడా పుచ్చుకున్నారు.

1511 లో మహ్మూద్ బేగర్హా చనిపోయిన అనంతరం చెప్పుకోదగినవాడు అతని మనమడు బహదుర్. ఇతను మాల్వాను అధీనం చేసుకోవటమేగాక, మేవార్‌తోకూడా యుద్ధం చేసి చితోడ్‌ను ముట్టడించాడు.





అయితే హుమాయూన్ హయాంలో మాల్వా తోబాటు, ఇతని రాజ్యంలో చాలా భాగం పోయింది. 1537 లో పోర్చుగీసువారు ఇతన్ని ద్రోహంగా చంపేశారు. 1572 లో, అక్బరు కాలంలో గుజరాతు తిరిగి మొగలుల పరమయింది.

కాశ్మీరు

కాశ్మీరు హిందూ రాజుల పరిపాలనలో ఉండేది. 1315 లో షామిర్జా అనే వాడు కొలువులో ప్రవేశించి, రాజు చనిపోయిన అనంతరం సింహాసనాన్ని స్వాధీన పరచుకున్నాడు. ఇతను 1349 ప్రాంతంలో పోయాడు. తరువాత 46 ఏళ్ళపాటు ఇతని ముగ్గురు కొడుకులూ, ఒకరి తరువాత ఒకరుగా కాశ్మీరును పాలించారు. ఆఖరు వాడు 1394 లో పోగా అతని కొడుకు సికందర్ రాజయాడు.

1420 జూనులో ఇతని రెండవ కొడుకు తన అన్నను ఓడించి కాశ్మీరు సింహాసనాన్ని జైనుల్ అబిదీన్ అనే పేరుతో అధిష్ఠించాడు. ఇతని 50 ఏళ్ళ పరిపాలన చరిత్ర ప్రసిద్ధమైనది. ఇతను దొంగతనాలూ, బందిపోట్లూ అరికట్టాడు; ధరలు అదుపులో ఉంచాడు; ప్రజల పన్నుల భారం తగ్గించాడు; ప్రజా సౌకర్యాలు పెంపొందించాడు; హిందూ పండితులను తన ఆస్థానంలో ఉంచుకున్నాడు; అందరికీ మత స్వాతంత్ర్యం ఇచ్చాడు; మహాభారతాన్నీ, రాజతరంగిణినీ సంస్కృతం నుంచి పర్షియను భాషలోకి అనువదింప జేశాడు.

ఇతను 1470 డిసెంబరులో మరణించిన అనంతరం కాశ్మీరులో పరిపాలన కన్న అరాజకం హెచ్చుగా ఉండింది. 1540 లో హుమాయూన్ బంధువైన మిర్జాహైదర్ కాశ్మీరును జయించాడు. అయితే 1551లో కాశ్మీరు ప్రముఖులితన్ని గద్దె దించేశారు. చివరకు 1555 లో, అక్బరు హయాంలో కాశ్మీరు ఢిల్లీ సామ్రాజ్యంలో చేరిపోయింది.







# భారత చరిత్ర



*ఖాన్ దేశ్*

ముహమ్మద్ బిన్ తుఘ్లక్ సామ్రాజ్యంలో ఖాన్‌దేశ్ ఒక భాగంగా ఉండేది. దానికి పాలకుడైన మలిక్ రాజా ఫారూకీ, ఫీరూజ్ షా అనంతరం చెలరేగిన అల్లకల్లోలంలో స్వాతంత్ర్యం ప్రకటించాడు.

ఇతను 1399 ఏప్రిల్ 29న పోగా, ఇతని కొడుకు మలిక్ నసీర్ రాజ్యానికి వచ్చి, గుజరాతు, బహమనీ పాలకుల చేతుల్లో ఓడిపోయి 1437-38 లో చనిపోయాడు. 1438 మొదలుకుని 1501 దాకా ఖాన్ దేశ్‌ను ఇతని కొడుకూ, మనమడూ, ముని మనమడూ ఏలారు. చివరకు గుజరాతు లాగే ఖాన్‌దేశ్ కూడా 1601లో అక్బరు సామ్రాజ్యంలో ఐక్యమయింది.

*బహమనీ రాజ్యం*

ఢిల్లీని ధిక్కరించి స్వాతంత్ర్యం ప్రకటించిన ముస్లిము రాజ్యాలన్నిటిలోకీ అత్యంత బలీయమైనది దక్కనులోని బహమనీ రాజ్యం. అది "పిచ్చి" తుఘ్లక్ కాలంలో స్వతంత్రమయింది. దక్కనులోని ప్రముఖులు దౌలతాబాదును పట్టుకుని, తమలో ఒకడైన అఫ్ఘాను వాణ్ణి నాసిరుద్దీన్ షా అనే పేరుతో గద్దె ఎక్కించారు. ఇతను రాజ్యం చేయలేక, తానై సింహాసనాన్ని జఫర్‌ఖాన్ అనే వాడి కిచ్చేశాడు. ఇతను అబుల్‌ముజఫర్ అలాఉద్దీన్ బహ్మన్ షా అనే పేరుతో 1347 ఆగస్టు 3న రాజ్యాభిషేకం చేసుకున్నాడు. ఇతని సంతతి వారే బహమనీ రాజులు.

ఇతను తన రాజధానిని గుల్బర్గాకు మార్చాడు; తన అధికారాన్ని ఆమోదించని దక్కను హిందూ రాజులను ఓడించాడు. ఇతను 1358 ఫిబ్రవరి 11న చనిపోయే నాటికి ఇతని సామ్రాజ్యం ఉత్తరాన వైనగంగ నుంచి దక్షిణాన కృష్ణ వరకూ, పడ





మర దౌలతాబాదు నుంచి, తూర్పున భువన గిరి (తెలంగాణం) వరకూ విస్తరించింది. ఇతను అవసానదశలో తన కొడుకును గద్దెకు నియమించాడు. అతని పేరు ముహమ్మద్ షా.

ముహమ్మద్ షా 1377 లో చనిపోగా అతని కొడుకు ముజాహిద్ షా రాజ్యానికి వస్తూనే విజయనగరం పైకి దండెత్తి వెళ్ళి, నగరాన్ని లోబరుచుకోలేక విజయనగర రాజుతో సంధి చేసుకుని తిరిగి వచ్చాడు. ఇతని తరువాత రెండవ ముహమ్మద్ షా రాజుగా చేయబడ్డాడు.

ఇతని అనంతరం 1397 నవంబరులో రాజైన తాజుద్దీన్ ఫీరూజ్ షా విజయనగర రాజుతోనూ, దక్కనులోని ఇతర హిందూ రాజులతోనూ యుద్ధాలు చేశాడు. విజయ నగర రాజకుమార్తెను నిర్బంధంగా తన అంతఃపురకాంతలలో చేర్చుకున్నాడు. కాని 1420 లో ఇతనికి విజయనగర రాజు చేతిలో పానగల్లు వద్ద ఓటమి సంభవించింది. ఈ అపజయానికి ప్రతికృతిగా, ఇతని తమ్ముడు అహ్మద్ షా రాజ్యానికి వచ్చి విజయనగరంతో భయంకరమైన యుద్ధం చేసి జయించాడు. 1424 ప్రాంతంలో ఇతని సేనాపతి వరంగలు



రాజ్యం పైకి దండెత్తి వెళ్ళి కోటను పట్టుకుని, రాజును చంపాడు. అహ్మద్ షా 1435 ఫిబ్రవరిలో పోయాడు.

అటు తరువాత బహమనీ రాజ్యంలో కలతలూ, చీలికలూ ఏర్పడ్డాయి. ముస్లిములలోనే షియా, సున్నీ విభేదాలు తల ఎత్తాయి, ఎన్నో కుట్రలూ కుహకాలూ జరిగాయి. అయినప్పటికీ 1527 దాకా బహమనీ రాజుల పరిపాలన కొన సాగింది.

*దక్కను సుల్తానులు*

బహమనీ సామ్రాజ్య విచ్ఛిత్తితో దక్కనులో అయిదు సల్తనతు లేర్పడ్డాయి. వీటిని పాలించిన వారు : బిరారులో ఇమాద్





షాహీ, అహ్మదునగరులో నిజామ్ షాహీ, బిజాపూర్‌లో ఆదిల్ షాహీ, గోల్కొండలో కుత్బ్ షాహీ, బీదర్‌లో బారీద్ షాహీ వంశాలవారు.

1484 లో మొట్టమొదటగా బిరార్ స్వతంత్రమయింది; ఇది 1574 లో అహ్మద్‌నగర్‌లో లీనమయింది. 1489-90 లో యూసుఫ్ ఆదిల్‌ఖాన్ బిజాపూర్‌ను స్వతంత్రంగా ప్రకటించాడు. ఆదిల్‌షాహీ వంశంలో ఇతని తరువాత చెప్పుకోదగిన సమర్థుడు రెండవ ఇబ్రాహీం ఆదిల్ షా. 1686 లో ఔరంగజేబ్ బిజాపూర్ రాజ్యాన్ని అధీనం చేసుకున్నాడు.

అహ్మద్‌నగర్‌ను స్వతంత్రంగా ప్రకటించిన వాడు మలిక్ అహ్మద్ (1490). 1499 లో ఇతను దౌలతాబాదును జయించి తన రాజ్యాన్ని బలిష్ఠం చేసుకున్నాడు. అహ్మద్ షాహీ రాజుల పరిపాలనలో చెప్పుకోదగినవి : 1550 లో నిజామ్ షా బిజాపూర్‌ను ఎదిరించటానికి విజయనగర రాజుతో చేరాడు; ఇతని తరువాత వచ్చిన వాడు 1565 లో విజయనగరానికి విరుద్ధంగా ఏర్పడిన కూటంలో చేరాడు; 1576 లో అక్బరు కొడుకు మురాద్ దాడిని చాంద్ బీబీ వీరోచితంగా ప్రతిఘటించింది; 1600 లో మొగలులు ఈ రాజ్యంపై దాడి చేశారు; 1633 లో షాజహాన్ దీనిని తన సామ్రాజ్యంలో కలుపుకున్నాడు.

బహమనీ సుల్తానులు ధ్వంసం చేసిన వరంగల్లు రాజ్యపు శిథిలాలపై గోల్కొండ రాజ్యం ఏర్పడింది. దీన్ని పాలించిన కుత్బ్ షాహీ వంశాన్ని స్థాపించినవాడు కులీషా. 1565 లో విజయనగర వ్యతిరేక కూటమిలో చేరిన సుల్తానులలో ఇతని కొడుకు ఇబ్రాహీం కూడా ఉన్నాడు. ఇతను హిందువులకు పెద్ద పదవు లిచ్చాడు.

1687 లో ఔరంగజేబ్ గోలకొండను ముట్టడించి, జయించి మొగలు సామ్రాజ్యంలో చేర్చుకున్నాడు.







# భారత చరిత్ర




విజయనగర సామ్రాజ్యపు ఆరంభ దశను గురించి గాథలే తప్ప చారిత్రకమైన ఆధారాలు తక్కువ. ఈ గాథలలో కూడా వ్యత్యాసాలున్నాయి. సంగముడనే వాడికి అయిదుగురు కుమాళ్ళుండేవారనీ, వారిలో హరిహరరాయలూ, బుక్కరాయలూ ప్రఖ్యాతులనీ, అయిదుగురు అన్నదమ్ములూ కలిసి, తుంగభద్రానది దక్షిణపు గట్టున, ఉత్తరపు గట్టున ఉన్న ఆనెగొంది దుర్గానికి ఎదురుగా, విజయనగరాన్ని నిర్మించి, విజయనగర రాజ్యానికి పునాది వేశారన్నది సర్వత్రా అమోదించబడుతున్నది. వీరిని నగరస్థాపనకూ, రాజ్యస్థాపనకూ పురికొల్పిన వారు మాధవ విద్యారణ్యులనే బ్రాహ్మణ పండితుడూ, ఆయన తమ్ముడు, సాయనుడూ అని చెబుతారు. ఈ సాయనుడే వేదభాష్యం రచించాడు. ఈ అయిదుగురు అన్నదమ్ములూ తెలుగు దేశానికి చెందిన వారనీ, వీరు కాకతీయుల ఓరుగల్లు రాజ్యం నుండి కాందిశీకులై తుంగభద్రా తీరానికి వచ్చారనీ కొందరు చెబుతారు. ఏమైనా ఒకటి నిజం: హరిహరరాయలూ, బుక్కరాయలూ, వారి ముగ్గురు తమ్ములూ ఉత్తరం నుంచి మహమ్మదీయులు చేసే దాడులను ప్రతిఘటించటానికి తీవ్రంగా కృషి చేశారు. దీని ఫలితంగా, భారత దేశపు ఇతర ప్రాంతాల విజృంభించిన పరమత, పరసంస్కృతుల ప్రభావాన్ని అరికట్టి, దాదాపు మూడు శతాబ్దాల పాటు ప్రాచీన భారతీయ మత సంస్కృతులను విజయనగరం పరిరక్షించింది; బహ్మనీరాజ్య ప్రభావాన్ని దక్షిణం నుంచి ప్రతిఘటించి, ఆ ప్రభావం ఉత్తర దేశానికి వ్యాపించకుండా అరికట్టింది. "ఆ కాలపు రాజకీయ పరిస్థితికి ప్రధాన కీలకం విజయనగరమే" అన్నారు

## 33. విజయనగర సామ్రాజ్యం



చరిత్రకారులు. ఇదే భారత చరిత్రలో విజయనగరానికి గల ప్రాముఖ్యానికి ముఖ్య కారణం.

విజయనగరాన్ని పాలించిన మొదటి రాజులు సంగమవంశం వారు. మొదటి హరిహరరాయలూ, మొదటి బుక్క రాయలూ పాలించిన కాలంలో హొయసల రాజ్యంలో అత్యధిక భాగం విజయనగరంలో చేరిపోయింది. అయితే హరిహరరాయలు గాని, బుక్కరాయలు గాని పూర్తిగా రాజ రికం చలాయించలేదని చెబుతారు. 1374 లో బుక్కరాయలు చీనాకు రాయ బారం పంపాడు. 1378-79 లో ఇతని మరణానంతరం ఇతని కొడుకు రెండవ హరిహరరాయలు రాజ్యానికి వచ్చి, "మహా రాజాధిరాజ, రాజపరమేశ్వర" వగైరా బిరు దావళి తగిలించుకున్నాడు. ఇతని పరి పాలనలో సమగ్రశాంతి ఉండినట్టు ముస్లిము చరిత్రకారులు రాశారు గాని, శాస నాలను బట్టి ఇతని కాలంలో విజయనగర సామ్రాజ్యానికీ, ముస్లిములకూ ఘర్షణలు జరిగినట్టు తెలుస్తున్నది.

బహ్మనీ రాజ్యంలాగే విజయనగర రాజ్యం కూడా అనేక రాజ్యాలతో విడవ కుండా యుద్ధాలు చేస్తూ వచ్చింది.



1398 ఆఖరులో రెండవ హరిహరుడి కొడుకైన రెండవ బుక్కరాయలు తండ్రి అనుమతితో, కృష్ణా తుంగభద్రల మధ్య ప్రాంతమైన రాయచూరును పట్టుకొన టానికి బహ్మనీ దేశం పైకి ఉత్తరంగా దండెత్తి వెళ్ళాడు.

ఈ ప్రాంతం కొరకు బహ్మనీ, విజయ నగర రాజ్యాలు మొదటి నుండీ యుద్ధా నికి తలపడుతూ వచ్చాయి.

అయితే ఈ యుద్ధంలో రెండవ బుక్క రాయలు ఫీరూజ్ షా బహ్మనీ చేతిలో ఓడి పోయి, 1399 మధ్యలో పెద్ద పరిహారం చెల్లించి సంధి చేసుకున్నాడు.





అయినప్పటికీ రెండవ హరిహరుడి కాలంలో విజయనగర రాజ్యం దక్షిణ భారత మంతటా విస్తరించింది. మైసూరూ, కన్నడ ప్రాంతమూ, చంగల్పట్టూ, తిరుచి రాపల్లీ, కంచీ విజయనగర రాజు ఏలుబడి కిందికి వచ్చాయి. రెండవ హరిహరుడు శైవుడు, విరూపాక్షస్వామిని ఆరాధించే వాడు, అయినా పరమతసహనం కలవాడు. ఈయన 1406 అగస్టులో చనిపోయాడు. ఆయన అనంతరం ఆయన కుమారుల మధ్య రాజ్యాధిపత్యం కొరకు తగాదా జరిగింది. చివరకు 1406 నవంబరు 5 న మొదటి దేవరాయలు సింహాసనం అధిష్ఠించాడు. ఇతను బహ్మనీ సుల్తానులతో కొన్ని యుద్ధాలలో ఓడిపోయి, 1422 లో చనిపోయాడు.

ఇతని అనంతరం ఇతని కొడుకైన విజయ బుక్కరాయలు (లేక వీరవిజయుడు) కొద్ది నెలలు మాత్రమే రాజ్యం చేశాడు. తరువాత ఇతని కొడుకు రెండవ దేవరాయలు రాజ్యానికి వచ్చాడు. ఇతను బహ్మనీ రాజులతో చేసిన యుద్ధాలలో ఓడిపోయి నష్టపడినప్పటికీ, తన పరిపాలనా విధానాన్ని పూర్తిగా పునర్వ్యవస్థీకరించాడు. బహ్మనీ రాజుల పై పోటీగా ఇతను ముస్లిములను తన సేనలో చేర్చుకున్నాడు; వర్తకాన్ని క్రమబద్ధం చెయ్యటానికిగాను, తన "కుడి భుజ"మైన లక్కన్న (లక్ష్మన్న) అనే వాణ్ణి "దక్షిణ సముద్రాధిపతి"గా నియమించి, సముద్ర వ్యాపార మంతా అతని చేతిలో ఉంచాడు. 1420 లో ఒక ఇటలీ దేశపు యాత్రికుడూ, 1443 లో పర్షియా దేశపు రాయబారీ విజయనగరానికి వచ్చారు. వారిద్దరూ కూడా విజయనగరాన్నీ, విజయనగర సామ్రాజ్యాన్నీ గొప్పగా మెచ్చుకుంటూ రాశారు. ఆ కాలానికి విజయనగర సామ్రాజ్యం దక్షిణ భారతమంతటా విస్తరించి, సింహళతీరం దాకా వ్యాపించింది. ఇది విజయనగర సామ్రాజ్యపు ఉచ్చ దశ.








# భారత చరిత్ర




రెండవ దేవరాయలు 1446లో చనిపోగా, అతని పెద్ద కొడుకు మల్లికార్జునుడు రాజై, తన రాజధాని పైకి ఏకంగా దండెత్తి వచ్చిన బహ్మనీ సుల్తానునూ, ఒరిస్సా (హిందూ) రాజునూ ప్రతిఘటించాడు. 1465 ప్రాంతం దాకా సాగిన ఇతని పరిపాలనలో విజయ నగర రాజ్యానిక ఎలాటి ప్రమాదమూ జరగ లేదు. ఇతని కాలంలోనే చంద్రగిరి రాజైన సాళువ నరసింహుడు ప్రఖ్యాతు డయాడు; ఇతని పూర్వీకులు విజయనగర రాజులకు సామంతులు.

మల్లికార్జునుడి అనంతరం వచ్చిన రెండవ విరూపాక్షుడు అసమర్థుడు. అందు చేత అతని పరిపాలనలో అరాజకస్థితి ఏర్పడింది. దాన్ని ఆధారం చేసుకుని బహ్మనీ సుల్తాను కృష్ణా తుంగభద్రల మధ్య ప్రాంతాన్ని ఆక్రమించాడు; ఒరిస్సా రాజైన రాజా పురుషోత్తమ గజపతి తిరువన్నామలై దాకా వచ్చేశాడు. కొన్ని ప్రాంతాలు తిరగబడ్డాయి.

ఈ దుస్థితిని అరికట్టటానికి సాళువ నరసింహుడు 1486 ప్రాంతంలో రాజును తొలగించి తానే సింహాసనం ఎక్కాడు. ఈవిధంగా సంగమవంశ పరిపాలన అంతమై విజయనగరంలో సాళువ వంశ పరిపాలన ఆరంభమయింది. సాళువ నరసింహుడు ప్రజాభిమానం చూరగొన్నవాడు; తాను పరి పాలించిన ఆరేళ్ళ కాలంలో తిరుగుబాటు చేసిన వారిలో చాలామందిని లోబరుచుకున్నాడు. రాయచూరు ప్రాంతం బహమనీల కిందా, ఉదయగిరి ఒరిస్సా రాజు కిందా ఉండిపోయాయి.

తుళువ దేశపు రాజుల సంతతి వాడైన నరసనాయకు డనేవాడు సాళువ నరసింహుడి సేనాపతిగా ఉండేవాడు. ఇతను అత్యంత విశ్వాసపాత్రుడైనందున, నరసిం

## 34. కృష్ణదేవరాయలు





హుడు తన అనంతరం రాజ్యభారాన్ని నరస నాయకుడి పరం చేశాడు. నరసనాయకుడు రాజ్యభారాన్ని తానే మోస్తూ కూడా సాళువ నరసింహుడి కొడుకు ఇమ్మడి నరసింహు డనే వాణ్ణి సింహాసనం మీద ఉంచి తన ప్రభువుల పట్ల విశ్వాసం చూపాడు.

అయితే నరసనాయకుడు 1505 లో చనిపోగా, అతని కొడుకు వీరనరసింహుడు సాళువవంశపు రాజును రాజ్యభ్రష్టుణ్ణి చేసి తానే సింహాసనం ఎక్కాడు. విజయనగర పరిపాలన తుళువ వంశ రాజులదయింది.

వీరనరసింహుడి అనంతరం రాజ్యానికి వచ్చిన అతని తమ్ముడు కృష్ణదేవరాయలు ఇతర విజయనగర రాజుల కన్న ఎంతో శ్రేష్ఠుడు కావటమేగాక, భారతచరిత్రకు చెందిన ప్రఖ్యాత రాజులలో ఒకడు. అతను వీరుడూ, యుద్ధ కుశలుడూ. తన జీవిత మంతా యుద్ధాలలో గడిపికూడా ఓటమి ఎరగడు. ఆయన ముందుగా తన సామ్రా జ్యం మధ్యనున్న సామంతుల తిరుగుబాటు లణచివేసి, ఉత్తరాన గల తన ప్రతి కక్షులను సాధించ బూనుకున్నాడు. 1511-12 లో దక్షిణ మైసూరులోని ఉమ్మత్తూరు నాయకుడి తిరుగుబాటు అణచబడింది. 1512 లో కృష్ణదేవరాయలు బిజాపూరు



సరిహద్దు లోపల ఉన్న రాయచూరును జయించాడు. ఆయన ముస్లిము రాజ్యాలపై దాడి చేద్దా మనుకున్నాడు గాని, ఆయన మంత్రీ, సేనానీ అయిన సాళువ తిమ్మయ్య అందుకు సమయం రాలేదని చెప్పగా మానుకున్నాడు.

1513 లో కృష్ణదేవరాయలు ఒరిస్సా లోని గజపతి ప్రతాపరుద్రుడిపై దండెత్తాడు. సంగమ వంశ పరిపాలన జరిగే కాలంలో విజయనగర రాజ్యంలోని కొన్ని ప్రాంతా లను గజపతి ప్రతాపరుద్రుడి పూర్వీకులు స్వాధీన పరుచుకున్నారు—వాటిని తిరిగి సంపాదించటానికే ఈ దాడి. 1514 ఆరం





భంలో ఉదయగిరి దుర్గం లొంగిపోయింది. ఒరిస్సా రాజుకు గోలకొండ సుల్తానూ, బీదరు సుల్తానూ సహాయం చేసినప్పటికీ ఏమీ లాభం లేకపోయింది. మరుసటి ఏడు కొండవీడు దుర్గమూ, చుట్టుపక్కల ఉండే చిల్లర దుర్గాలూ ఓడిపోయాయి. ఒరిస్సా యువరాజు వీరభద్రుడు మొదలైనవారు కృష్ణదేవరాయలకు బందీలుగా చిక్కారు. వీరభద్రుణ్ణి ఒక పరగణాకు పాలకుడుగా నియమించి కృష్ణదేవరాయలు తన రాజనీతిజ్ఞత చూపాడు.

ఒరిస్సా పైన మూడవ దండయాత్ర చేసేటప్పుడు కృష్ణదేవరాయలు బెజవాడ (ఇప్పటి విజయవాడ)లో మకాం చేసి, కొండపల్లి దుర్గాన్ని ముట్టడించాడు. ఒరిస్సా రాజు భార్యా, కొడుకూ (వీరభద్రుడు కాదు) ఈ సమయంలో చిక్కారు. అక్కడి నుంచి కృష్ణదేవరాయలు సింహాచలం దాకా వెళ్ళి, ఒరిస్సా రాజును కాళ్ళబేరానికి తెచ్చాడు.

కృష్ణదేవరాయలు సాధించిన చిట్టచివరి ఘనవిజయం రాయచూరు వద్ద. ఇది ఎలా జరిగిందంటే, రాయచూరును తిరిగి సంపాదించాలని ఇస్మాయిల్ ఆదిల్ షా యత్నించాడు; అతనిని కృష్ణదేవరాయలు 1520 మార్చి 19న చిత్తుగా ఓడించాడు. ఆ సందర్భంలో బిజాపూరు రాజ్యమంతా ఆక్రమించబడిందనీ, గుల్బర్గా దుర్గం నేల మట్టమయిందనీ చెబుతారు.

కృష్ణదేవరాయలు తన విజయాలతో ఉత్తర ప్రాంతాల రాజులను అదుపులో ఉంచాడు; తన సామ్రాజ్యాన్ని పడమట దక్షిణ కొంకణం దాకానూ, తూర్పున విశాఖపట్టణం దాకానూ, దక్షిణాన సముద్రతీరం దాకానూ విస్తరింపజేశాడు. హిందూమహాసముద్రతీర ప్రాంతాలలోనూ, దీవులలోనూ కొన్ని విజయనగరానికి లోబడి ఉండేవి. కృష్ణదేవరాయలు తన చివరి కాలాన్ని శాంతియుత పరిపాలనకు వినియోగించాడు.





# భారత చరిత్ర




కృష్ణదేవరాయలు పోర్చుగీసు వారికి కొన్ని సౌకర్యాలు కలిగించి తద్వారా కొంత లాభం పొందాడు. పోర్చుగీసువారు ముస్లిముల నుంచి గోవాను జయించుకున్న అనంతరం, 1510 లో పోర్చుగీసు గవర్నరు భట్కల్ వద్ద ఒక దుర్గాన్ని నిర్మించుకోవటానికి అనుమతి పొందాడు.

ఒక పోర్చుగీసు యాత్రికుడు కృష్ణదేవ రాయలను గొప్పగా పొగడి, ఆయనను మించిన రాజుండడనీ, ఆయనకు గల సంపదా, సామ్రాజ్యమూ, సైన్యమూ మరొక రాజు కుండడనీ అన్నాడు. కృష్ణదేవరాయల కాలంలో విజయనగర సామ్రాజ్య విస్తరణ ఉచ్ఛస్థితి నందుకున్నది, ఆయన పరిపాలనలో కళాసంస్కృతులు పరాకాష్ఠచెందాయి.

తాను స్వయంగా వైష్ణవుడైనప్పటికీ కృష్ణదేవరాయలు హిందూమత శాఖలన్నిటినీ ఆదరించాడు. ఓడిపోయిన శత్రు రాజుల పట్లా, తనకు కైవసమైన నగరాల ప్రజల పట్లా ఎంతో కారుణ్యమూ, ఔదార్యమూ చూపాడు. తాను కవి కావటమేగాక గొప్ప సాహిత్యప్రియుడూ, కవిపోషకుడూనూ. ఆయనకు గల అసాధారణ యుద్ధ తంత్రజ్ఞతను చూసి ఆయన సామంతులూ, ప్రజలూ ఎంతో మెచ్చుకునేవారు. దేవాలయాలకూ, బ్రాహ్మణులకూ ఆయన ఇచ్చిన ధనానికి అంతులేదు. ఈయన పరిపాలనలో విజయనగర సామ్రాజ్యం విస్తరించితే, ఢిల్లీ సామ్రాజ్యం శల్యావశిష్టమైపోయింది.

అయితే విజయనగర సామ్రాజ్యానికి ప్రమాదకారణాలు లేకపోలేదు. ఉత్తర సరిహద్దున గల బలవంతులైన శత్రువులు విజయనగరం పై కన్ను వేసి ఉన్నారు. ఇద్దరు రాజ ప్రతినిధులు తిరుగుబాటు కూడా చేశారు. వీరిలో ఒకడు మధురను పాలించేవాడు. ఇతను కృష్ణదేవరాయలు

## 35. విజయనగర పతనం





బతికి ఉండగానే (1528 లేక 1529) తిరుగుబాటు చేశాడు. అయితే కృష్ణదేవ రాయలు పోక పూర్వమే ఇతనికి తగిన దండన లభించింది.

1529 లోనో 30 లోనో కృష్ణదేవరాయలు చనిపోయి, అతని సవతి తమ్ముడు అచ్యుత రాయలు రాజ్యానికి వచ్చాడు. మధుర పాలకుణ్ణీ, అతనికి ఆశ్రయ మిచ్చిన తిరువాన్కూరు రాజునూ ఇతనే దండించాడు. అచ్యుతరాయలు ఈవిధంగా తిరుగుబాటులను అణచాడేగాని, పరిపాలన పట్ల అశ్రద్ధవహించి, తన బావమరుదు లిద్దరినీ పైకి రానిచ్చాడు. వారిద్దరూ రాజ్యపాలన తమ వశం చేసుకున్నారు.

ఇది సామంతులు సహించలేకపోయినారు. ఆరవీటి సోదరులైన రామరాజు, తిరుమలరాయలు, వెంకటరాయలు అనే వారి నాయకత్వం కింద రాజ ప్రతినిధులు ప్రతిపక్షమైనారు. అది మొదలు విజయనగర సామ్రాజ్యంలో సంక్షోభం తల ఎత్తింది.

1541 (లేక 1542)లో అచ్యుత రాయలు చనిపోగా అతని కొడుకు వెంకటాద్రి (లేక మొదటి వెంకటరాయలు) రాజ్యానికి వచ్చి ఆరు మాసాలే పాలించాడు. అనంతరం అచ్యుతరాయలు తమ్ముడి కొడుకు



సదాశివరాయలు రాజ్యానికి వచ్చాడు. ఇతను తన మంత్రి అయిన రామరాయలు చేతిలో కీలుబొమ్మ. రామరాయలు సమర్థుడు; కృష్ణదేవరాయల అనంతరం క్షీణించిన విజయనగర సామ్రాజ్యాన్ని తిరిగి ఉన్నతికి తెద్దామనుకున్నాడు.

రామరాయలు ఎత్తుగడ ఏమంటే దక్కను సుల్తానుల మధ్య సాగే అంతః కలహాలలో జోక్యం కలిగించుకుని, ఒకసారి ఒకరినీ, మరొకసారి మరొకరినీ బలపరచటం. ఈ ఎత్తుగడ కొంత కాలం పారింది. తరువాత ఐడిసి కొట్టింది. బిజాపూరు మీద దెబ్బతీసే ఉద్దేశంతో రామరాయలు 1543లో అహ్మద్





నగర్, గోలకొండ రాజ్యాలతో సమాఖ్య ఏర్పాటు చేసుకున్నాడు. బిజాపూరు నవాబు అసద్‌ఖాన్ తెలివిగలవాడు; అతను విడి విడిగా గోలకొండతోనూ, విజయనగరంతోనూ శాంతి ఒడంబడికలు చేసుకుని పై సమాఖ్యను భగ్నం చేశాడు.

దక్కను సుల్తానులకు చాలా కాలంగా విజయనగరం పై ద్వేషం రగులుతున్నది. ఒక్క బిరారు తప్ప మిగిలిన దక్కను సల్తనతులన్నీ ఏకమై, 1565 జనవరి 23న రాక్షసతంగడి అనే చోట విజయనగరంతో యుద్ధం చేసి ఓడించాయి. రామరాయలను గోలకొండ నవాబు హుసేన్ నిజాంషా తన చేత్తో చంపేశాడు.

ముస్లిము సేనలు ఈ యుద్ధం తరువాత కొల్లగొట్టిన ధనంతో ప్రతి ఒక్క సాధారణ సైనికుడూ గొప్ప ధనికుడయాడట! మూడో రోజున శత్రు సైనికులు రాజధాని ప్రవేశించారు. నగరం క్రమంగా విధ్వంసం చెయ్యబడింది. అంత సంపత్సమృద్ధంగా ఉన్న నగరం ఆకస్మికంగా నిర్మూలమై పోవటం చరిత్రలో అపూర్వమని చెబుతారు.

తల్లికోట యుద్ధమని చెప్పబడే ఈ యుద్ధం భారత చరిత్రలో ప్రముఖస్థానం కలది. దీనితో దక్షిణ భారతంలో హిందువుల ప్రాభవం అంతరించి, తురుష్క వంశీయుల పరిపాలనకు అవకాశం ఏర్పడింది. అయితే ఈ యుద్ధం అనంతరం కూడా ఆరవీడు రాజులు విజయనగర రాజ్యాన్ని 17 వ శతాబ్దిదాకా నిలబెట్టుకో గలిగారు. దక్కను నవాబుల మధ్య ఏర్పడిన స్పర్థల ఆధారంతో రామరాయల తమ్ముడు తిరుమల రాయలు కొంత లాభం పొందాడు. 1614లో రెండవ వెంకటరాయలు మరణంతో విజయ నగర సామ్రాజ్యం పూర్తిగా అంతరించింది. అయితే 1612 లోనే వెంకటరాయలు అనుమతితో రాజా ఒడయర్ అనేవాడు మైసూరు రాజ్యాన్ని స్థాపించుకున్నాడు.







# భారత చరిత్ర




ఒరిస్సా

సుమారు 1076 నుంచి 1148 దాకా పరిపాలించిన చోడగంగ అనంతవర్మ కింద ఒరిస్సా శక్తివంతమైన రాజ్యంగా రూపొందింది. ఆ రాజ్యం గంగా ముఖం నుంచి దక్షిణాన గోదావరీ ముఖం దాకా వ్యాపించి ఉండినట్టు శాసనాలు చెబుతున్నాయి. చోడ గంగు మతాన్నీ, సంస్కృతాంధ్ర సాహిత్యాలనూ పోషించాడు. ఆయన పరిపాలనలో ఒరిస్సా సాధించిన ఉన్నతికి పూరీ జగన్నాథాలయమే సాక్షి.

ఆయన తరువాత వచ్చినవారు ముస్లిము దాడులను నిరోధించి, ఒరిస్సా సంపదను నిలబెట్టారు. వారిలో ప్రఖ్యాతుడు మొదటి నరసింహుడు (1238-1264) ఆయన బెంగాలు ముస్లిముల పై విజయం సాధించాడు; జగన్నాథాలయ నిర్మాణం పూర్తి చేసి, కోణార్కులో సూర్యాలయం కూడా నిర్మింప జేశాడు. ఆయన అనంతరం గంగ వంశం క్రమంగా నీరసించి సూర్య వంశపు రాజులు వచ్చారు.

ఈ కొత్త వంశానికి మూల పురుషుడు కపిలేంద్రుడు. గంగ రాజుల కాలంలో దిగజారిన కీర్తి ప్రతిష్ఠలను ఇతను తిరిగి నిలబెట్టాడు; తిరుగుబాటులను అణచాడు; బలవంతులైన బీదరు బహ్మనీ రాజులనూ, విజయనగర రాజులనూ జయించాడు; తన రాజ్యాన్ని గంగ నుంచి కావేరి దాకా విస్తరింపజేశాడు. గోపీనాథపుర శాసనంలో ఆయన ఉదయగిరినీ, కంజీవరాన్నీ పట్టుకున్నట్టున్నది.

ఆయన తరవాత వచ్చిన పురుషోత్తముడి (1470-1497) పాలనలో కలతలు ఏర్పడి, గోదావరి దిగువనున్న సగం రాజ్యం జారి పోయింది. కృష్ణకు దక్షిణంగా ఉన్న ప్రాంతాన్ని సాళువ నరసింహుడూ, కృష్ణా





గోదావరీ మధ్య దేశాన్ని బహ్మనీ రాజులూ కాజేశారు. అయితే పురుషోత్తముడి చివరి కాలంలో బహ్మనీ రాజులు తీసుకున్నదీ, కృష్ణకు దక్షిణంగా ఉండే ప్రాంతంలో నేటి గుంటూరు జిల్లా వరకూ తిరిగి ఒరిస్సాకు లభించాయి.

పురుషోత్తముడి కొడుకు ప్రతాపరుద్రుడు (1497-1540) చైతన్యుడికి శిష్యుడూ, సమకాలికుడూనూ. ఇతను రాజ్యానికి వచ్చిన నాటి ప్రాంతాలు కొన్ని దక్కకుండా పోయాయి. ఇందుకు ఒక కారణం విజయనగర రాజు కృష్ణదేవరాయలూ, గోలకొండ కుతుబ్ షాహీ నవాబులూ చేసిన దాడులు. మూడు యుద్ధాల అనంతరం గోదావరికి దక్షిణంగా ఉన్న ఒరిస్సా రాజ్య ప్రాంతమంతా కృష్ణదేవరాయలదయింది. 1522లో గోలకొండ కులీ కుతుబ్ షా ఒరిస్సాపై దాడి చేశాడు.

చైతన్య స్వామి బోధించిన వైష్ణవంకూడా ఒరిస్సా పాలకులూ, ప్రజలూ నిర్వీర్యులు కావడాని కొక కారణ మంటారు. ఏమైనా 16 వ శతాబ్ది ఆరంభం నుంచి ఒరిస్సా ప్రతిభ క్షీణించింది.

1541-42లో కపిలేంద్రుడి వంశంస్థానే భోయివంశం వారు రాజు లయారు. భోయి



అంటే రచయిత. ఈ వంశానికీ పేరు రావటానికి దీని మూల పురుషుడు గోవిందుడు కారణం. ఇతనూ, ఇతని కొడుకూ, ఇద్దరు మనమలూ కలిసి ఒరిస్సాను సుమారు 18 ఏళ్ళు పాలించిన పిమ్మట ఈ వంశాన్ని తొలిగించి సుమారు 1559 లో ముకుంద హరిచందనుడు రాజయాడు. 1568లో చనిపోయే దాకా ఇతను ముస్లిము దాడులను ప్రతిఘటించాడు.

బెంగాలులోని అఫ్ఘాను పాలకులను రెండు పక్కల నుంచి దెబ్బ తీయాలనే ఉద్దేశ్యంతో అక్బరు పాదుషా ముకుందహరిచందనుడితో మైత్రి కోరాడు.





మేవాడ్

రాజపుత్రుల అనన్య ఖ్యాతికి పుట్టినిల్లు మేవాడ్. అక్కడ ఎందరో పరాక్రమ వంతులూ, రణకుశలులూ, నాయకులూ, పాలకులూ, గొప్ప కవులూ జన్మించారు. మేవాడ్‌లో సుప్రసిద్ధమైనది గుహిల రాజ పుత్రవంశం. 7 వ శతాబ్ది నుంచీ వారి ప్రభ ఇక్కడ వెలుగుతూ వచ్చింది.

ఢిల్లీ సామ్రాజ్య విచ్ఛిత్తి కాలంలో అనేక రాజపుత్ర సంస్థానాలలో పునరుజ్జీవ కాంక్ష మొలకెత్తింది. చితోడ్‌కు అలాఉద్దీన్ ఖిల్జీ చేసిన అవమానాన్ని కడిగేసి కీర్తిని తిరిగి సంపాదించుకున్నాక మేవాడ్‌కు చిరకీర్తి తెచ్చినవాడు కుంభరాణా. ఇతను భారత చరిత్రలోనే సుప్రసిద్ధుడు. ఇతను మాల్వా, గుజరాతులను ఏలే ముస్లిము పాలకులతో యుద్ధాలు చేశాడు. ఇతను ప్రతి యుద్ధం లోనూ గెలవక పోయినా తన కున్నది నిల బెట్టుకో గలిగాడు. మేవాడ్ రక్షణకు గాను నిర్మించిన 84 దుర్గాలలో 32 కుంభరాణా నిర్మించినవే. ఇతను నిర్మించిన వాటిలో ప్రశంసనీయమైనది కుంభలగఢ్ దుర్గమూ, జయ స్తంభమూనూ.

కుంభరాణా కవి, పండితుడు. గొప్ప గాయకుడు. 1469 ప్రాంతంలో ఇతని కొడుకు ఇతన్ని హత్య చేశాడు.

సంగ్రామరాణా (లేక సంగరాణా) కుంభ రాణా మనమడు. 1509 ప్రాంతంలో ఇతను మేవాడ్‌కు రాజయాడు. ఇతను మహా యోధుడు. ఇతనికి ఒక కన్నూ, ఒక కాలూ పోవటమేగాక, శరీరం మీద 80 గాయా లుండేవి. ఇతను మాల్వా, ఢిల్లీ, గుజరాతు లతో యుద్ధం చేసి విజయాలు సాధించాడు. మేవాడ్ ఉన్నతి కోసం ఇతను కృషి చెయ్యటంతో ఇతనికీ ఇతరులకూ పోటీ సంభ వించింది. ఈ పోటీ ఫలితమే ఖానువ యుద్ధం. దీన్ని గురించి ముందు ముందు తెలుసుకుంటాం.






# భారత చరిత్ర




భారతదేశానికి మొగలులు రాక పూర్వం అఫ్ఘాను తురుష్కుల పాలనలో ఉండిన ఢిల్లీ సల్తనతు క్షీణదశకు రావటమూ, అందువల్ల భారతదేశ మంతటా వేరువేరు స్వతంత్ర రాజ్యా లేర్పడటమూ, ఆ రాజ్యాల మధ్య సాగిన కలహాలూ మొదలైన విష యాలు లోగడ తెలుసుకున్నాం.

1526 కు పూర్వం మొగలులు ఉత్తర భారతంపై చేసిన దాడులు విఫలమయాయి. తీమూర్ ఢిల్లీ సామ్రాజ్యం పై దాడి చేసి పంజాబును వశపరచుకోవటం వల్ల అఫ్ఘాన్ సామ్రాజ్యం మరింత బలహీన మయిందే గాని, మొగలుల పరిపాలనకు పునాది ఏర్పడ లేదు. అలాటి పునాది ఏర్పరచిన వాడు బాబరు. అటు తరవాత కూడా 30 ఏళ్ళ పాటు అఫ్ఘానులకూ, మొగలాయీలకూ ఘర్షణ సాగి, చివరకు అక్బరు హయాంలో మొగలుల ఆధిపత్యం సుస్థిరమయింది.

బాబరు తండ్రి తీమూర్ వంశానికి చెందిన వాడు. తల్లి ఛంగిజ్ ఖాన్ వంశానికి చెంది నది. అతను 1483 లో పుట్టాడు. అతను 11 ఏళ్ళవాడై ఉండగా తండ్రి నుంచి ఫర్ఘాన (ఇప్పుడు చీనా తుర్కిస్తానులో ఒక భాగం)ను జాగీరుగా పొందాడు. అయితే అతను చిన్నతనంలో అనేక కష్టాలు పడి రాటు తేలాడు. తీమూర్‌కు రాజధానిగా ఉండిన సమర్కండును జయించాలని ఇతను 1497 లోనూ, 1503 లోనూ చేసిన ప్రయత్నాలు విఫలమయాయి. దీనికి తోడు ఫర్ఘాన కూడా పోయింది. అతను ఒక ఏడాదిపాటు తల దాచుకునే చోటు లేక సంచార జీవితం గడిపాడు.

కాని ఈ దుస్థితిలో కూడా అతనికి భారత దేశాన్ని జయించే కోరిక కలిగింది. అతను ఒక గ్రామాధికారి ఇంట తల దాచుకున్న సమయంలో, ఆ గ్రామాధికారి తల్లి, నూట

## 37. మొగలాయి సామ్రాజ్యం : బాబరు



పదకొండేళ్ళ వృద్ధు, అతనికి తీమూర్ దాడు లను గురించి కథలు చెప్పింది. దానితో అతనికి కూడా తన పూర్వీకుడి లాగా భారత దేశం పై దండెత్తా లనిపించింది.

ఇందుకు మొదటి మెట్టుగా అతను 1504 లో కాబూలును ఆక్రమించాడు; ఉజ్బెగ్‌ల రాజ్యంలో తిరుగుబాట్లు అతనికి ఈ పని చెయ్యటానికి ఉపకరించాయి. సమర్కండ్ ను ఆక్రమించటానికి అతను చేసిన మరొక యత్నం 1512 లో విఫల మయింది. వాయువ్య దిశ తనకు అచ్చి రాదని రూఢి చేసుకుని బాబరు ఆగ్నేయ దిశకు తన దృష్టి మరల్చాడు. భారతదేశపు నడి బొడ్డు చేరుకునే అవకాశం అతనికి దొరకటానికి మరి 12 ఏళ్ళు పట్టింది. ఢిల్లీ సామ్రాజ్య శిథిలావస్థలో తమలో తాము కొట్లాడుకుంటున్న రాజులలో కొందరు బాబరును రమ్మని ఆహ్వానించారు.

ఈ ఆహ్వానాన్ని అందుకుని బాబరు 1524 లో పంజాబుకు వచ్చి, లాహోరు ఆక్రమించాడు. అతను తమకు సహాయం రాలేదనీ, హిందూస్తానాన్ని జయించ వచ్చా డనీ అతన్ని ఆహ్వానించిన వారికి తెలిసి పోయి, వా రతనిపై ఎదురు తిరిగారు. అతను కాబూలుకు తిరిగి పోవలిసివచ్చింది.



బాబరు పెద్ద సేనను అయత్తం చేసుకుని 1525 నవంబరులో పంజాబును ఆక్ర మించి, దానికి రాజైన దౌలత్ ఖాన్ లోడీని లోబరచుకున్నాడు. అక్కడి నుంచి అతను ఢిల్లీలో నామ మాత్రపు సుల్తానుగా ఉన్న ఇబ్రాహీమ్ లోడి పైకి వెళ్ళి, 1526 ఏప్రిలు 21 న పానిపట్టు వద్ద అఫ్ఘాన్ బలాలతో యుద్ధం చేసి జయించాడు. లోడీ సుల్తానుకు యుద్ధ తంత్ర మేమీ తెలియని కారణం చేత 12 వేల బాబరు సైన్యం లక్షమంది శత్రు సైనికులను ఒక్క పూటలో మట్టు పెట్టింది. బాబరు వెంటనే ఢిల్లీ, ఆగ్రా నగరాలను వశపరచుకున్నాడు.





అప్పటికీ అతని విజయం పూర్తి కాలేదు. సంగరాణా ఆధిపత్యం కింద ఉన్న రాజపుత్ర సమాఖ్య చాలా ప్రబలమైనది. మొగలు సైనికులు యుద్ధరంగంలో రాజపుత్ర సేనలను చూసి వణికి పోయారు. బాబరుకు కూడా తాను గెలవనని భయం పట్టుకున్నది. అతను తన శిబిరంలో పానపాత్రలను పగల గొట్టి, మద్య మంతా పారబోసి, తన సైనికులకు ఘాటైన ఉద్బోధలు చేసి, యుద్ధం చేస్తామని వారి చేత కురానుపై ప్రమాణాలు చేయించాడు.

1527 మార్చి 16న, ఆగ్రాకు పడమట ఖానువ (లేక కాన్వా) అనే గ్రామం వద్ద ఉభయపక్షాలకూ యుద్ధం జరిగింది. రాజపుత్రు లోడిపోయారు. సంగరాణా కొద్దిమంది అనుచరులతో పారిపోయి మరి రెండేళ్ళ అనంతరం చనిపోయాడు.

బాబరు జీవితాంతం వరకూ అఫ్ఘానులతో పోరాటం సాగిస్తూనే వచ్చాడు. అతను చేసిన మూడవ ప్రముఖ యుద్ధం బిహారు బెంగాలు అఫ్ఘానులతో. 1529 మే 6న గంగా తీరాన, పాట్నాకు ఎగువగా, గోగ్రా సంగమం వద్ద జరిగిన ఈ యుద్ధంలో కూడా అఫ్ఘానులు చిత్తుగా ఓడారు. బాబరు స్థాపించిన మొగలాయి సామ్రాజ్యం అప్పటికే ఓక్సస్ నుంచి గోగ్రా నది దాకానూ, హిమాలయాల నుంచి గ్వాలియరు దాకానూ విస్తరించింది. తరవాత కొద్ది రోజులకే, 1530 డిసెంబరు 26న బాబరు ఆగ్రాలో మరణించాడు. అతని మరణం గురించి ఒక కథ చెబుతారు. అతని కొడుకు హుమాయూన్ జబ్బు పడ్డాడనీ, బాబరు ఆ జబ్బును తన కిచ్చి తన కొడుకును కాపాడమని దేవుణ్ణి ప్రార్థించాడనీ, దాని ఫలితంగా హుమాయూన్ కోలుకుని, రెండు మూడు నెలల అనంతరం బాబరు వ్యాధితో మరణించాడనీ చెబుతారు. బాబరును కాబూలు తీసుకుపోయి, ఖననం చేశారు.





# భారత చరిత్ర




బాబరు చనిపోయిన మూడు రోజుల అనంతరం హుమాయూన్ పట్టాభిషిక్తు డయాడు. అప్పు డతని వయసు ఇరవైమూడేళ్ళు. అప్పటి పరిస్థితి ఏమాత్రమూ బాగా లేదు. అతనికి అన్ని వైపులా అదృశ్య దుష్టశక్తులు పొంచి ఉన్నాయి. రాజ కుటుంబంలోనే ఐక్యత లేదు. హుమాయూన్ తమ్ముళ్ళు (కామ్రాన్, హిందాల్, అస్కరీ) కాక, అతని దాయాదులైన ముహమ్మద్ జమాన్, ముహమ్మద్ సుల్తాన్ అనే వాళ్ళు కూడా సింహాసనం మీద కన్ను వేశారు. దాని కోసం వాళ్ళు కత్తులు దూయటానికి కూడా సిద్ధంగానే ఉన్నారు. దర్బారులో కూడా కొందరు అమీర్ల కదే ఆలోచన!

దీనికి తోడు సేనలో కూడా ఐక్యత లేదు. అందులో నానా జాతుల వాళ్ళూ ఉన్నారు; వాళ్ళ మధ్య శత్రుత్వా లుండేవి. అందు చేత హుమాయూన్ తన బంధువులనుగాని, కొలువులో ఉన్న వాళ్ళనుగాని, సైన్యాన్నిగాని నమ్మే పరిస్థితి లేదు. సామ్రాజ్యం చూడబోతే కొత్తగా ఏర్పడినది, సుస్థిరమైనది కాదు. బాబరు చేత ఓడించబడినవా రెవరూ నిర్వీర్యులు కాలేదు. రాజపుత్రుల ఓటమి తాత్కాలికమైనది. అఫ్ఘానులు ఓటమి పొందారే గాని నిర్మూలించబడలేదు. చెల్లాచెదరై పోయిన అఫ్ఘాను కులీనులు తిరుగుబాటు కోసం వేచి ఉన్నారు; వారికి లేనిదల్లా సరి అయిన నాయకుడు. (షేర్ షా ఈ లోటును భర్తీ చేశాడు.) మరొక అంశ మేమంటే, గుజరాతును పాలించే బహదుర్ షా తన శక్తి పెంచుకుని హుమాయూన్‌కు తీవ్రమైన ప్రతి కక్షిగా పరిణమించాడు.

ఆ స్థితిలో హుమాయూన్‌కు అత్యవసరమైన లక్షణాలు—యుద్ధ తంత్రజ్ఞతా, రాజనీతిజ్ఞతా, పరిపాలనా సామర్థ్యమూ—









మూడూ లేవు. అందుచేత అతను తనకు తానే ప్రబల శత్రువై కూర్చున్నాడు. అతనికి ఉన్నతమైన అభిరుచులూ, సంస్కార ప్రియత్వమూ ఉన్నాయే గాని, తండ్రికి ఉండిన కార్యదీక్షా, పట్టుదలా లేవు. కొద్ది పాటి విజయం కంటబడితే చాలు జనానాలో దూరి, నల్లమందు వేసుకుని కలలుగంటూ, శత్రువుకు అవకాశ మిచ్చేవాడు. కఠినంగా శిక్షించవలసిన వారిని జాలి దలిచి మన్నించే వాడు. గుర్రం పైన ఉండవలిసిన తరుణంలో విస్తరిముందు కూర్చుని విందు కుడిచే వాడు. "హుమాయూన్" అంటే అదృష్టశాలి అని అర్థం. అతని కది సార్థక నామం కాదు.

తన సింహాసనం పై కన్ను వేసి ఉన్న తన తమ్ములను గట్టి అదుపులో ఉంచటానికి బదులుగా వారికి పరగణా లిచ్చేశాడు—అస్కరీకి సంభల్, పెద్ద తమ్ముడు కామ్రాన్‌కు కాబూల్, కందహార్‌లూ ఇచ్చాడు. ఈ కామ్రాన్ లాహొర్ లోని హుమాయూన్ సేనాపతిని బెదిరించి పంజాబునూ, దానికి తూర్పుగా ఉండే హిస్సార్ ఫీరూజనూ కూడా కాజేశాడు. ఈ విధంగా హుమాయూన్ తన తండ్రి కూర్చిన సామ్రాజ్యాన్ని తునాతునకలు చేసేశాడు. సింధు




ప్రాంతమూ, దాని అవతలి ప్రాంతమూ సైనిక సమీకరణకు సర్వోత్తమమైన దేశాలు; అవి కాస్తా కామ్రాన్ అధీన మయాయి. హిస్సార్‌ఫీరూజ వశంకావటంతో పంజాబు నుంచి ఢిల్లీకి వెళ్ళే రహదారి కూడా కామ్రాన్‌కు హస్తగతమయింది.

అయితే తొలి యుద్ధాలలో హుమాయూన్‌కు విజయం లభించక పోలేదు. బుందేల్ ఖండ్ లోని కాలింజల్ రాజా అఫ్ఘానుల పక్షపాతి అన్న అనుమానంతో, హుమాయూన్ తాను గద్దె ఎక్కిన అయిదారు మాసాల తరవాత ఆ రాజా పైకి యుద్ధానికి వెళ్ళాడు. అయితే తూర్పున





అఫ్ఘానుల దుశ్చర్యలు మితిమీరటం చేత అతను కాలింజరు రాజా వద్ద కొంత పరిహారం పుచ్చుకుని వచ్చెయ్యవలిసి వచ్చింది. దొరా వద్ద అతను అఫ్ఘానుల పై ఘన విజయం సాధించి, జౌన్పూర్ నుంచి సుల్తాన్ మహమ్మద్ లోడీని తరిమివేశాడు. అఫ్ఘాన్ యోధుడైన షేర్ ఖాన్ అధీనంలో ఉన్న చునార్‌ను హుమాయూన్ ముట్టడించాడు; అయితే అక్కడి తిరుగుబాటును నిర్మూలించకుండానే, షేర్ ఖాన్ నామ మాత్రపు లొంగుబాటును ఆమోదించి ముట్టడి ఎత్తివేశాడు. ఆ కారణంగా, హుమాయూన్ పశ్చిమాన గుజరాతు పాలకుడైన బహాదుర్ షాతో తలపడుతున్న సమయంలో షేర్ ఖాన్ తన శక్తులను బాగా పెంచుకో గలిగాడు.

హుమాయూన్ బహాదుర్ షా పైకి ఎత్తి వెళ్ళటానికి తగినంత కారణం ఉన్నది. అతని ప్రబల శత్రువులైన అనేకమంది అఫ్ఘాన్ శరణార్థులను బహాదుర్ షా చేరదీశాడు. మేవాడ్ సామ్రాజ్యం క్షీణస్థితిలో ఉండటం ఆసరా చూసుకుని తన రాజ్యాన్ని విస్తృతం చేసుకున్నాడు. హుమాయూన్ అఫ్ఘానుల పై తాను సాధించిన విజయాన్ని గాలికి వదిలేసి, 1534 లో మాల్వా వద్దకు చేరే సమయానికి, మాల్వాను అదివరకే తన రాజ్యంలో కలుపుకున్న బహాదుర్ షా చితోడ్ దుర్గాన్ని ముట్టడించాడు.

బహాదుర్ షాతో సతమతమవుతున్న మేవాడ్ రాణి కర్ణావతి తన శత్రువును ప్రతిఘటించటానికి హుమాయూన్ సహాయం అర్థించింది. హుమాయూన్ ఆమె ప్రార్థనను తోసి పుచ్చుటమేగాక, స్వప్రయోజనదృష్ట్యా అయినా వెంటనే బహాదుర్ షాను ప్రతిఘటించాడు కాడు; బహాదుర్ షా తుర్కీ ఇంజనీర్ల సహాయంతోనూ, పాశ్చాత్యుల ఫిరంగులతోనూ రాజపుత్రులను ఓడించి, చితోడ్ దుర్గాన్ని మట్టుపెడుతుంటే మొగలు చక్రవర్తి చూస్తూ ఊరుకున్నాడు!





# భారత చరిత్ర




పానిపట్టు వద్దా, గోగ్రా వద్దా బాబరుకు ఓడిపోయినప్పటికీ అఫ్ఘాన్ నాయకులు పూర్తిగా నిహతులు కాలేదు. తగిన నాయకుడే ఉంటే, కొత్తగా స్థాపితమైన మొగలు పరిపాలనను ప్రతిఘటించటానికి వారు పరవళ్ళు తొక్కుతున్నారు. షేర్ ఖాన్ సూర్ అనే వాడు వారికి తగిన నాయకుడుగా లభించాడు. అతని నాయకత్వం కింద అఫ్ఘానులు మొగలుల ఆధిపత్యాన్ని తాత్కాలికంగా తుడిచిపెట్టి, కొద్దికాలం పాటు తమ ఆధిపత్యాన్ని పునఃప్రతిష్ఠించుకో గలిగారు కూడా.

షేర్ ఖాన్ సూర్ కథ బాబర్, అక్బర్ల అద్భుత కథలకు తీసిపోయేది కాదు. అతను ఫరిద్ అనే పేరుతో అతి సామాన్యమైన జీవితం ప్రారంభించి, అష్టకష్టాలూ పడి, స్వప్రతిభతో పైకి వచ్చాడు. అతను సూర్ తెగకు చెందిన అఫ్ఘాను వాడు. అతని తాత ఇబ్రాహీమ్, తన కొడుకైన హసనును వెంటబెట్టుకుని పెషావరు ప్రాంతం నుంచి తూర్పుగా ప్రయాణం చేసి, బాజ్వార పరగణాలో సైనికవృత్తి చేసుకుంటూ స్థిరపడ్డాడు. అక్కడే 1472 లో ఫరిద్ జన్మించి ఉండవచ్చు.

కొంత కాలానికి ఇబ్రాహీమ్‌కు ఢిల్లీ జిల్లాలో ఉద్యోగమయింది. అతని కొడుకు హసన్, జౌన్పూర్ గవర్నరు వద్ద ఒక జాగీరు సంపాదించుకున్నాడు. హసన్‌కు ఇతర భార్యలున్నారు. ఫరిద్ సవతితల్లి హసన్‌ను తన చెప్పు చేతలలో ఉంచుకున్నందు వల్ల, ఫరిద్ తన 22వ ఏట ఇల్లు విడిచి జౌన్పురు వెళ్ళాడు. అప్పటి నుంచీ అతని జీవితంలో సంఘర్షణ ఆరంభమయింది. అందులో రాటు తేలి అతను మహా వీరుడయాడు. కష్టపడి చదువుకుని పర్షియన్ భాషా వాఙ్మయాలలో పారంగతుడయాడు.

**39. అఫ్ఘానుల పునర్విజృంభణ**



అతను సైన్యంలో హెచ్చు భాగం తన పక్షం చేసుకుని, సర్వస్వతంత్రు డయాడు.

చునార్ పాలకుడైన తాజ్‌ఖాన్ తన చిన్న భార్య అయిన లద్‌మాలికతో హెచ్చు ప్రేమగా ఉంటున్నాడని అతని పెద్దకొడుకు తండ్రిని హత్య చేశాడు. అయితే వైధవ్యం ప్రాప్తించిన లద్‌మాలిక షేర్‌ఖాన్‌ను పెళ్ళాడి, చునార్ దుర్గాన్ని అతనికి ఇచ్చేసింది. 1531 లో హుమాయూన్ పై అఫ్ఘానులు తిరుగుబాటు చేశారు. అప్పటికి ఆ తిరుగుబాటుతో షేర్‌ఖాన్‌కు ఏమీ సంబంధం లేదు. హుమాయూన్ చునార్ దుర్గాన్ని ముట్టడించాడు. షేర్‌ఖాన్ లొంగిపోయి ఆత్మరక్షణ చేసుకున్నాడు.

తమ పై షేర్‌ఖాన్ పెత్తనం నానాటికీ పెరుగుతూండటం సహించలేక లోహనీ అఫ్ఘానులూ, జలాల్‌ఖాన్ సైతం అతన్ని నిర్మూలింప యత్నించారు. షేర్ ఖాన్ ఈ ప్రయత్నాన్ని భగ్నంచేశాడు. ఆ మీదట వారు, 1533 సెప్టెంబరులో, బెంగాలు రాజైన మహమ్మద్ షాను ఆశ్రయించారు. బిహారు నగరానికి తూర్పున సురజ్‌గర్ వద్ద షేర్‌ఖాన్ బెంగాలు సుల్తానునూ, లోహనీలనూ ఓడించాడు. ఈ విజయం షేర్‌ఖాన్ జీవితంలో ఒక పెద్ద సోపానమయింది.

హుమాయూన్ గుజరాతు రాజైన బహదుర్ షా పైకి దండెత్తిపోయిన అదనులో షేర్‌ఖాన్ అకస్మికంగా బెంగాలు రాజధాని గౌర్ వద్ద ప్రత్యక్షమయాడు. బెంగాలు సుల్తాను మహమ్మద్ షా దుర్బలుడు; అతను షేర్‌ఖాన్‌కు 13 లక్షల బంగారు నాణాల విలువ గల పరిహారమూ, మూడు వేల చదరపుమైళ్ళ లోపు గల ప్రాంతమూ ఇచ్చుకుని సంధి చేసుకున్నాడు. ఇందు వల్ల షేర్‌ఖాన్ బలమూ, ప్రతిష్ఠా పెరిగాయి. గుజరాతు పాలకుడు బహదుర్ షా దియూకు పారిపోయాక, అనేక అఫ్ఘాన్ నాయకప్రముఖులు షేర్‌ఖాన్ పక్షమయారు.







# భారత చరిత్ర



బెంగాలును పూర్తిగా స్వాధీనపరచుకునే ఉద్దేశంతో షేర్ ఖాన్ 1537 అక్టోబరు మధ్యలో బెంగాలుపై దాడిచేసి, రాజధాని అయిన గౌర్‌ను ముట్టడించాడు. గుజరాతు, మాల్వాలను జయించి తిరిగివస్తూ ఆగ్రాలో జల్సాలలో మునిగి ఉన్న హుమాయూన్‌కు తన సామ్రాజ్యానికి తూర్పున ఎసరు వచ్చిందని చాలా ఆలస్యంగా తెలిసింది. అతను షేర్ ఖాన్‌ను ప్రతిఘటించటానికి డిసెంబరు రెండో వారంలో బయలుదేరాడు. బయలుదేరిన వాడు తిన్నగా గౌర్‌కు వెళ్ళక మధ్య దారిలో చునార్‌కు ముట్టడి వేశాడు. చునార్‌లోని సైన్యం మొగలు బలాలకు లొంగకుండా ఆరు మాసాలు నిలబడింది. ఈ ఆరు మాసాలలో షేర్ ఖాన్ బెంగాలులో యుద్ధం సాగించి, 1538 ఏప్రిలులో గౌర్‌ను నిర్జించాడు.

బిహారులో పరాభవం పొంది హుమాయూన్ 1538 జులైకి గౌర్ చేరుకునే సరికి, షేర్ ఖాన్ అతన్ని ప్రతిఘటించక, బిహారు జౌన్పుర్‌లలో గల మొగలు రాజ్య ప్రాంతాలపై దాడి చేసి, పశ్చిమాన కనౌజ్ వరకూ గల ప్రాంతాన్ని కొల్లగొట్టాడు.

ఈ లోపల గౌర్ వద్ద జల్సాలలో మునిగి ఉన్న హుమాయూన్ పడమటి ప్రాంతంలో షేర్ ఖాన్ చేస్తున్న చర్యలను గురించి విని కంగారు పడి, బెంగాలు నుంచి ఆగ్రాకు బయలుదేరాడు. దారిలో షేర్ ఖాన్ సేనలూ, అఫ్ఘాన్‌సేనలూ హుమాయూన్‌నెదిరించి చిత్తుగా ఓడించాయి (1539 జూను). మొగలు సేనలు నాశనమయాయి. గంగలోకి అనాలోచనగా దూకిన హుమాయూన్‌నొక నీరు మోసేవాడు కాపాడాడు. ఢిల్లీ సుల్తానుపై విజయం సాధించటంతో షేర్ ఖాన్ ఆధిపత్యం పడమట అస్సాం

## 40. అఫ్ఘాన్ సామ్రాజ్య పునఃప్రతిష్ఠ





పర్వతశ్రేణుల దాకా, తూర్పున చిటగాంగు దాకా, ఉత్తరాన హిమాలయాల దాకా, దక్షిణాన బంగాళాఖాతం దాకా విస్తరించింది. అతను షేర్ షా అనే బిరుదు ధరించి, తన పేర నాణాలు ముద్ర వేయించాడు.

మరుసటి ఏడు హుమాయూన్ తన రాజ్యం కొరకు మరొక యత్నం చేశాడు ; ఈ యత్నంలో అతని సోదరుల సహకారం, ఎంత యత్నించినా, అతనికి లభించలేదు. **1540** మే **17** న కనౌజ్‌కి ఎదురుగా మొగలు, అఫ్ఘాన్ సైన్యాలు తలపడ్డాయి. అఫ్ఘానులే జయించారు. హుమాయూన్ ప్రాణాలతో తప్పించుకున్నాడు. ఈ విధంగా బాబరు చేసిన కృషి యావత్తూ నీరుగారిపోయి, హిందూస్థానం పై అఫ్ఘానుల ప్రభుత్వం తిరిగి నెలకొన్నది. ఇదిమొదలు పదిహేనేళ్ళ పాటు హుమాయూన్ దేశద్రిమ్మరిగా జీవించాడు.

ఈ స్థితిలో కూడా బాబరు మిగతా కొడుకులు హుమాయూన్‌కు అండగా నిలబడలేదు. హుమాయూన్ లాహోరు వెళ్ళి వాళ్ళ సహకారాన్ని ఎంతగానో అర్థించాడు; ప్రయోజనం శూన్యమయింది. ఈ పరిస్థితులలో షేర్ షా తన రాజ్యాన్ని సులువుగా విస్తరించుకున్నాడు. అతను పంజాబులో కొంత భాగం జయించాడు; **1542** లో రాజపుత్రులతో యుద్ధం చేసి మాల్వాను లోబరచుకున్నాడు; మధ్య భారతంలోని రాయిసిన్ దుర్గం పై దండెత్తి వెళ్ళాడు. కొంత ప్రతిఘటన జరిపి చివరకు రాయిసిన్ దుర్గమూ, సేనలూ ఓటమి అంగీకరించాయి. తమను క్షేమంగా మాల్వా దాటి వెళ్ళి పోనిస్తే దుర్గాన్ని అఫ్ఘానుల పరం చేస్తామన్నారు రాజపుత్రులు. కాని, వారు దుర్గం నుంచి బయటికి రాగానే అఫ్ఘానులు దుర్గంపైన పడి దౌష్ట్యం సాగించారు. తమ భార్యా బిడ్డల మానాలను కాపాడగలందులకై వారిని రాజపుత్రులు చంపేసి,





శత్రువులతో వీరోచితంగా పోరాడుతూ, ప్రాణాలర్పించారు. ఇది 1543 లో జరిగింది. ఈ సంఘటన షేర్ షాకు పెద్ద కళంకంగా భావించబడుతున్నది.

పంజాబులోని షేర్ షా ప్రతినిధి సింధు, ముల్తాను రాజ్యాలను అఫ్ఘాను సామ్రాజ్యంలో చేర్చాడు. ఇక షేర్ షాకు మిగిలిన ప్రబల శత్రువు మార్వారు రాజైన మాల్దేవుడు. అతను యుద్ధకోవిదుడు. అతని రాజ్యం 10 వేల చదరపు మైళ్ళ మేర విస్తరించింది. మాల్దేవుడికి ఓడిపోయిన రాజపుత్రులు కొందరు ప్రేరేపించగా, షేర్ షా 1544 లో అతని పైకి దండెత్తి వెళ్ళాడు. మాల్దేవుడు యుద్ధానికి సిద్ధంగానే ఉన్నాడు.

అయితే మాల్దేవుడి బలాలతో అతని దేశంలోనే తలపడటానికి జంకి, షేర్ షా కుయుక్తి పన్నాడు; కొందరు రాజపుత్ర సేనాపతులు తనకు సహాయపడతామని వాగ్దానం చేసినట్టు లేఖలు సృష్టించి వాటిని మాల్దేవుడికి పంపాడు. మాల్దేవుడు బెదిరిపోయి, యుద్ధ ప్రయత్నం మానేసి, తన సివన్ దుర్గంలో దూరి దాక్కున్నాడు. అయినప్పటికీ అనేక మంది రాజపుత్ర వీరులు తమ బలాలతో అఫ్ఘాను సేనల నెదిరించి, అద్వితీయ పరాక్రమం ప్రదర్శించి పోరాడారు. యుద్ధంలో చివరకు షేర్‌షా గెలిచాడే గాని, అనేక వేలమంది సైనికులను పోగొట్టుకుని, తన సామ్రాజ్యాన్ని కూడా పోగొట్టుకున్నంత పని చేశాడు. అదే రాజపుత్రులకు చావు దెబ్బ కూడా అయింది. ఉత్తర హిందూస్థానం పై అఫ్ఘాన్ పరిపాలన ఏర్పడింది. షేర్ షా అజ్మీరు నుంచి అబూ వరకూ గల ప్రాంతాన్నంతా క్రమంగా జయించుకుంటూ వచ్చాడు. చివరకు అతను కాలింజర్ దుర్గాన్ని ముట్టడించి, లోబరచుకున్నాడు. ఈ సమయంలో— 1545 మే 22 న తుపాకి మందు పేలిన కారణంగా షేర్ షా చనిపోయాడు.





# భారత చరిత్ర



యోధుడుగా కన్న పాలకుడుగా షేర్ షా మరింత గణనీయుడని చెప్పాలి. అతను అయిదేళ్ళే రాజ్యం చేశాడు. కాని ఆ కొద్ది కాలంలోనే అతను ఒక ఆదర్శప్రాయమైన పరిపాలనావ్యవస్థ నెలకొల్పాడు. "ఈ పఠాను చూపిన వివేకం ఏ ప్రభుత్వమూ–చివరకు బ్రిటిషు ప్రభుత్వం కూడా—ప్రదర్శించ లేదు," అని ఒక పాశ్చాత్య చరిత్రకారు డన్నాడు. భూమి శిస్తు వసూళ్ళూ, రైతుల హక్కులూ, కబులియతులూ, పట్టాలూ మొదలైనవి కలకాలం ప్రామాణికంగా ఉండే టట్టు అతను ఏర్పాట్లు చేశాడు. సుంకాలు విధించటంలో అక్రమాలకు అవకాశం లేకుండా చేశాడు. దేశరక్షణకు గాను అతి నిడుపైన రహదార్లు వేయించాడు. తూర్పు బెంగాలులోని సోనార్‌గాంవ్ నుంచి సింధు నదిదాకా అతను వేయించిన 1500 కోసుల నిడివి గల గ్రాండ్ ట్రంక్ రోడ్డు ఇప్పటికీ ఉన్నది. అతను రహదార్ల వెంట హిందూ, ముస్లిము బాటసారులకు సరాయ్‌లు నిర్మించాడు. "బంగారు కాసుల సంచి పక్కన పెట్టుకుని నిర్జనస్థలంలో పడుకున్న వాడికి సైతం" చోరభయం లేకుండా చేశాడు. అతని పాలనలో అందరికీ ఒకే రకం న్యాయం జరిగింది. రాజకుటుంబంవారు కూడా న్యాయ చట్టానికి అతీతులు కారు.

షేర్ షా అనామకుడుగా జన్మించి కూడా కేవలమూ స్వప్రతిభతో పైకి వచ్చి భారత దేశపు అగ్ర చక్రవర్తులలో ఒక డనిపించు కున్నాడు. అక్బరుకు పూర్వం అతనిలాటి ప్రజారక్షకులు లేరు. అక్బరు సాధించిన అనన్య పరిపాలనకు పునాది అతనే వేశాడని చెప్పవచ్చు. షేర్ షా అంత త్వరలో చావ నట్టయితే భారత చరిత్రలో మొగలు యుగ మంటూ ఉండేదే కాదేమో నని ఒక ప్రఖ్యాత చరిత్రకారుడన్నాడు.

## 41. మొగలు సామ్రాజ్య పునఃప్రతిష్ఠ



షేర్ షా తోబాటు అతను పునరుద్ధరించిన అఫ్ఘాన్ సామ్రాజ్యం శిథిలమయింది. అంతః కలహాలూ, అరాజకమూ ప్రబలాయి. షేర్ షా తరవాత అతని కొడుకు సలీమ్‌షా సుల్తానయాడు. అతను కూడా తండ్రిలాగే సమర్థుడు, కాని అతను త్వరలోనే-1554 నవంబరులో—పోయాడు. అతని మైనరు కుమారుణ్ణి అతని మేనమామ అదిల్‌షా చంపించి, తానే సుల్తానయాడు. ఈ అదిల్ షా వ్యర్థుడు. ఇతని హయాంలోనే అఫ్ఘాన్ సామ్రాజ్యం విచ్ఛిన్నం కాసాగింది.

ఇది హుమాయూన్‌కు చాలా లాభించింది. అతను పదిహేనేళ్ళపాటు తల దాచుకునే చోటు లేక సంచార జీవితం గడిపాడు. అతని తమ్ము లతని పట్ల ద్రోహులుగా ప్రవర్తించారు. అందరిలోకీ పెద్ద భ్రాతృద్రోహి కామ్రాన్.

హుమాయూన్‌కు అనేకమంది శరణార్థులు పరివారంగా తయారయారు. సింధు రాష్ట్రంలో శిబిరం ఏర్పాటు చేసుకుని, తన సామ్రాజ్యాన్ని తిరిగి గెలుచుకొనటానికి హుమాయూన్ చేసిన ప్రయత్నం ఫలించలేదు. సింధు గవర్నరయిన షా హుసేన్ శత్రుత్వం ఇందుకంతరాయమయింది.



1542 తొలి మాసాలలో హుమాయూన్, సింధు ఎడారిలో సంచారం చేస్తున్న కాలంలోనే, హమీదా బాను బేగమును పెళ్ళాడాడు. ఆమె షేక్ అలీ అంబర్ జైనీ కుమార్తె. హుమాయూన్‌కు రాజపుత్ర రాజులు ఆశ్రయం ఇవ్వటానికి జంకారు. అతను అమర కోట వెళ్ళాడు. అక్కడి రాజు పేరు రాణాప్రసాద్. ఠట్టా, హక్కర్ రాజ్యాలు గెలవటానికి హుమాయూన్‌కు తోడ్పడతానని మాట ఇచ్చి, రాణాప్రసాద్ చివరకు ఏమీ చెయ్యలేదు.

1542 నవంబరు 23న అమరకోటలోనే అక్బరు పుట్టాడు.





భారత దేశంలో తనకు సహాయం పుట్టదని రూఢి చేసుకుని హుమాయూన్ పర్షియాకు వెళ్ళి, అక్కడి రాజైన షా తహమాస్ప్ సహాయం అర్థించాడు. హుమాయూన్ షియా మతం పుచ్చుకునేటట్టూ, అతను విజయం పొందాక కందహర్‌ను తన వశం చేసేటట్టూ షరతులు పెట్టి, పర్షియా రాజు హుమాయూన్‌కు 14,000 సేన నిచ్చాడు.

తన తండ్రి లాగే హుమాయూన్ కూడా పర్షియా సహాయంతోనే భారత దేశాన్ని జయించవలసి వచ్చింది.

1545 లో కందహర్, కాబూలులు హుమాయూన్ వశమయాయి. అయితే అతను కందహర్‌ను పర్షియనుల వశం చెయ్యలేదు; కందహర్ కారణంగా మొగలులకూ, పర్షియనులకూ కొంత ఘర్షణ సాగిందికూడా. కామ్రాన్‌ను ఖైదీగా పట్టుకుని, గుడ్డివాణ్ణి చేసి మక్కాకు పంపేశారు. ఇలా చేయటానికి హుమాయూన్ ఒకంతట ఒప్పుకోలేదు. అస్కరీని కూడా మక్కాకే పంపేశారు. హిందాల్ అనేవాడు మాత్రం దొమ్మిలో చచ్చాడు.

1555 నవంబరులో హుమాయూన్ హిందూస్తానాన్ని తిరిగి జయించటానికి బయలుదేరాడు. 1555 ఫిబ్రవరిలో లాహోరూ, జులైలో ఢిల్లీ, ఆగ్రాలూ హుమాయూన్ వశమయాయి. అతను తన అసమర్థతతో కోల్పోయిన రాజ్యంలో కొంత భాగం తిరిగి జయించుకోగలిగాడు.

తాను పడిన కష్టాల ద్వారా హుమాయూన్ మనస్తత్వం ఏ మాత్రం మారిందో తెలుసుకునేటందుకు అవకాశం లేకపోయింది. 1556 జనవరి 24న అతను ఢిల్లీలో తన లైబ్రరీ మెట్ల మీద నుంచి ప్రమాద వశాన జారిపడి మరణించాడు. ఫిబ్రవరి 14 న, పదమూడేళ్ళ వయసులో ఉన్న అక్బరును సుల్తానుగా ప్రకటించారు.







# భారత చరిత్ర




## 42. అక్బరు—తొలి సమస్యలు

హుమాయూన్ అనంతరం పాదుషాగా ప్రకటించబడే నాటికి అక్బరు తన రక్షకుడైన బైరమ్ ఖాన్ వెంబడి పంజాబులో ఉన్నాడు. అయితే అతను పేరుకు మాత్రమే పాదుషా; భారత దేశానికి చక్రవర్తి అని చెప్పుకునే హక్కు అక్బరు కెంత ఉండిందో, షేర్షా వారసులకు కూడా అంత ఉండింది.

నిజానికి 1556 లో భారత దేశ రాజకీయ పరిస్థితి చాలా క్లిష్టంగా ఉన్నది. షేర్ షా పోయాక అతని వారసులు అంతఃకలహాలలో పడిపోయారు. షేర్ షా అమలు చేసిన సంస్కరణల సత్ఫలితాలు ప్రజలకు దక్కకుండా పోయాయి. దేశాన్ని భయంకరమైన క్షామం పట్టి పీడించసాగింది.

దేశంలోని వివిధ ప్రాంతాల గల స్వతంత్ర రాజ్యాలు ఆధిపత్యం కోసం ఘర్షణ పడుతున్నాయి. అక్బరుకు మారుతల్లి కొడుకైన మీర్జా ముహమ్మద్ హకీమ్ కాబూలును దాదాపు స్వతంత్రుడు గానే పాలిస్తున్నాడు. కాశ్మీరు, హిమాచల రాజ్యాలు స్థానిక ముస్లిము పాలకుల కింద స్వతంత్రంగా ఉన్నాయి. షేర్ షా మరణించిన నాటి నుంచి సింధు, ముల్తానుల పై చక్రవర్తి ఆధిపత్యం లేదు. అలాగే ఒరిస్సా, మాల్వా, గుజరాతుల స్థానిక పరిపాలన పైన ఎవరి పెత్తనమూ లేదు. వింధ్యకు దక్షిణాన విస్తృతమైన విజయనగర సామ్రాజ్యమూ, ఖాన్దేష్, బిరార్, బీదర్, అహ్మద్నగర్, గోల్కొండల సల్తనతులూ ఉన్నాయి; వాటి పాలకులకు ఉత్తర దేశ రాజకీయాలను గురించి ఆసక్తి లేదు. పశ్చిమ తీరాన గోవా, దియూలలో పోర్చుగీసువారి ప్రభావం జాస్తిగా ఉన్నది. చనిపోయే కాలానికి హుమాయూన్ తిరిగి గెల్చుకున్న పూర్వ సామ్రాజ్య భాగం చాలా కొద్దిపాటిది. ఆగ్రా నుంచి మాల్వా దాకానూ, జౌన్పుర్లోనూ





పెత్తనం అదిల్‌షాది. ఢిల్లీ నుంచి కాబూలుకు పొయ్యే దారిలో కొంత భాగం షా సికందర్ చేతిలో ఉన్నది. హిమాలయాల నుంచి గుజరాతు సరిహద్దు దాకా ఉన్న భాగం ఇబ్రాహిమ్ ఖాన్ అధీనంలో ఉన్నది. షేర్ షా రాజ్యంలో అధిక భాగం సూర్ వంశీయుల అధీనం లోనే ఉన్నది.

అక్బరు రాజ్యానికి వచ్చిన కొద్ది కాలానికే, ఆదిల్ షా సూర్‌కు మంత్రీ, సేనాపతీ అయిన హీమూ అనే వాడు మొగలుల పై ఎత్తి వచ్చి, గవర్నరు తార్దీ బేగ్‌ను ఓడించి, ఆగ్రా, ఢిల్లీలను వశపర్చుకున్నాడు. ఢిల్లీని కాపాడలేక పోయినందుకు తార్దీ బేగ్ కు బైరమ్ మరణ దండన విధించాడు.

తరవాత హీమూ, రాజా విక్రమజిత్ (విక్రమాదిత్యుడు) అన్న బిరుదు తగిలించుకుని, 1500 ఏనుగులతో కూడిన పెద్ద సేనతో సహా, సుప్రసిద్ధమైన పానిపట్టు యుద్ధ క్షేత్రంలో అక్బరు, బైరముల నెదుర్కొన్నాడు. ఆరంభంలో హీమూదే పై చెయ్యిగా ఉండింది, కాని ప్రమాద వశాన ఒక బాణం వచ్చి హీమూ కంటిలో దిగబడి, అతనికి స్పృహ తప్పిపోవటంతో అతని సైనికులు భయపడి చెల్లాచెదురై పోయారు. ఈ దశలో ఉండగా అతను చంపబడ్డాడు. అతన్ని అక్బరు తన చేత్తోనే చంపాడని కొందరూ, అక్బరు చంప నిరాకరిస్తే, బైరం చంపాడని కొందరూ అన్నారు.

అఫ్ఘాన్, మొగలుల సంఘర్షణలో మొగలుల పక్షానిదే పై చేయి అని స్పష్టమయినది పానిపట్టు రెండవ యుద్ధంలో. ఢిల్లీ ఆగ్రాలు తిరిగి మొగలుల అధీనమయాయి. 1557 మే నెలలో సికందర్ సూర్ మొగలులకు లొంగిపోయాడు. తూర్పు పరగణాలలో అతని కొక మాన్యం ఇచ్చారు, కాని త్వరలోనే అక్బరు అతన్ని వెళ్ళగొట్టేశాడు; 1558-59 లో అతను బెంగాలులో శరణాగతుడుగా చనిపోయాడు.





ముహమ్మద్ ఆదిల్ బెంగాలు గవర్నరుతో మాంఘిర్ వద్ద యుద్ధం చేస్తూ 1556 లో చనిపోయాడు. ఇబ్రాహిమ్ సూర్ నానా దేశాలు తిరిగి, చివరకు ఒరిస్సాలో తల దాచుకున్నాడు. 1567-68 లో అక్కడే అతను హత్యా చేయబడ్డాడు. అంతటితో, భారతదేశం పై అక్బరు ఆధిపత్యాన్ని సవాలు చేయగల సూర్ వంశీయు డెవడూ లేకుండా పోయాడు.

ఇన్ని విజయాలు సమకూరినా అక్బరు నామ మాత్రపు పాదుషాయే. అతని రక్షకుడైన బైరమ్ ఖాన్‌దే అసలు పెత్తనం. తాను స్వతంత్ర పాలకుడుగా ఉండాలని అక్బరు కాంక్షించటమే గాక, అతని తల్లి హమీద బాను బేగమ్, అతన్ని పెంచిన తల్లి మాహం అనగా, ఆమె కొడుకు ఆదమ్ ఖాన్ కూడా అక్బరును ప్రోత్సహించి, బైరమ్‌ను వదిలించుకోమన్నారు. 1560 లో అక్బరు పరిపాలన తానే స్వయంగా చూసుకుంటానని బహిరంగా ప్రకటించి, బైరమ్ ఖాన్‌ను రక్షకుడి పదవి నుంచి తొలగించాడు. బైరమ్ అక్బరు నిర్ణయాన్ని శిరసావహించి, మక్కాకు పోతానన్నాడు. అతన్ని శీఘ్రంగా మక్కాకు పంపే పని చూడమని అక్బరు పీర్ ముహమ్మద్ అనే వాణ్ణి పురమాయించాడు. పీర్ ముహమ్మద్ ఒకప్పుడు బైరమ్ కింద పని చేసినవాడూ, బైరమ్‌కు వ్యక్తిగతంగా శత్రువూనూ. అందుచేత బైరమ్ ఈ అవమానం సహించలేక తిరుగబాటు చేసి, జల్లందర్ వద్ద ఓడిపోయాడు. అయినా అతను పూర్వం తనకు చేసిన మేలు మరవక అక్బరు అతని పట్ల ఔదార్యం ప్రదర్శించాడు.

1561 జనవరిలో బైరమ్ మక్కాకు వెళుతూండగా ఒక లోహని అఫ్ఘాను వాడు అతన్ని హత్యా చేశాడు. అక్బరు అతని కొడుకైన అబ్దుర్ రహీమ్ అనే వాణ్ణి చేరదీసి పైకి తెచ్చాడు.







# భారత చరిత్ర



బైరమ్‌ను వదిలించుకున్న తరవాత కూడా రెండేళ్ళపాటు (1560-1562) అక్బరు పూర్తిగా స్వతంత్రుడు కాలేదు.

అతన్ని పెంచిన తల్లీ, ఆమె కొడుకు ఆదమ్‌ఖాన్ అనేవాడూ పెద్ద ఎత్తున అతనిపై పెత్తనం చలాయించారు.

వారి ఔద్ధత్యం చాలా కాలం సహించి చివరకు అక్బరు ఆదమ్‌ఖాన్‌ను చంపించే శాడు. నలభై రోజులపాటు పుత్రశోకంతో కుమిలి కుమిలి అతని తల్లి కూడా చచ్చి పోయింది.

1562 మే నెలలో అక్బరు పూర్తిగా స్వతంత్రుడయాడు.

సామ్రాజ్య నిర్మాణంలో అక్బరు సాటి లేనివాడు. అతను దాదాపు 40 ఏళ్ళపాటు తన రాజ్యాన్ని విస్తరించుకుంటూ వెళ్ళాడు. ఆయన ఒక్కొక్క ప్రాంతాన్నీ ఎలా జయించినదీ తెలుసుకుందాం.

మధ్య పరగణాలలోని ఉత్తర ప్రాంతంలో గరహ్ కటంగ అన్న రాజ్యానికి బీర్ (వీర) నారాయణుడు రాజు. అతను మైనరు. అతని తల్లి దుర్గావతి, రాజ్య భార మంతా మోసేది. ఆమె అసామాన్య రాజ పుత్ర సుందరి గానూ, అమిత పరాక్రమ వంతురాలు గానూ ప్రసిద్ధి చెందినది.

ఈ రాజ్యం మీదికి 1564 లో అక్బరు ఆసఫ్‌ఖాన్ అనేవాణ్ణి పంపాడు. యుద్ధంలో ఆసఫ్‌ఖాన్ జయించాడు. దుర్గావతి అవ మానం కన్న మరణమే మేలని ఎంచి ఆత్మహత్య చేసుకున్నది. బీర్ నారా యణుడు ప్రాణం ఉన్నంతసేపూ పోరాడి చనిపోయాడు. కాలక్రమాన అక్బరు ఈ రాజ్యంలో కొంత భాగం స్వాధీనపరచు కుని మిగిలినది రాజ వంశీయులకు తిరిగి ఇచ్చాడు. అక్బరు తీసుకున్న భాగమే తర వాత భోపాలు రాజ్య మయింది.

## 43. అక్బరు రాజ్య విస్తరణ



ఉత్తరభారతంలో రాజపుత్రుల ప్రాభవం ఇంకా బలంగానే ఉన్నది; భారత చరిత్రలో రాజపుత్ర స్థానం ఇంకా ప్రముఖ పాత్ర నిర్వహిస్తూనే ఉన్నది. రాజపుత్రుల సహకారం లేకుండా తాను సామ్రాజ్యం నిర్మించలేనన్న సంగతి సూక్ష్మబుద్ధి అయిన అక్బరు గ్రహించాడు.



పఠానుల లాగా మొగలులు "గడ్డలో పుట్టినవారు" కారు, పైనుంచి వచ్చినవారు. అందుచేత అక్బరు రాజపుత్రుల సామరస్యం కోసమూ, తన కృషి కంతటికీ వారి సహకారం సంపాదించటానికీ ప్రయత్నించాడు. వివేకమూ, ఔదార్యమూ గల విధానాలు అవలంబించి అతను అనేక మంది రాజపుత్రుల సానుభూతి ఎంతగా చూరగొన్నాడంటే, వారు అతని సామ్రాజ్యం కొరకు అపారమైన సేవ చేసి, తమ రక్తాన్ని కూడా ధారపోశారు. రాజపుత్రుల సేవా శౌర్యాల పైనా, మొగలుల రాజకీయ చతురత పైనా అక్బరు సామ్రాజ్యం నిర్మాణ మయింది.

1562లో అంబరు (జయపూరు) రాజైన రాజా బిహారీమల్లు అక్బరుకు లొంగిపోయి, అతనితో వివాహ సంబంధాలు ఏర్పరుచుకున్నాడు. అయన తన కొడుకైన భగవాన్‌దాసునూ, మనమడైన మానసింహుణ్ణీ వెంటబెట్టుకుని ఆగ్రాకు వెళ్ళి, అక్బరు కొలువులో ప్రవేశించి, 5 వేల సేనకు అధిపతి అయాడు. అతని కొడుకూ, మనవడూ కూడా సైనికోద్యోగాలు సంపాదించుకున్నారు.

ఈ విధంగా మొగలు చక్రవర్తులకు నాలుగు తరాలపాటు భారతీయ వీరుల సేవ లభించింది.

కాని మేవారు మాత్రం లొంగి రాలేదు. పై పెచ్చు, మాల్వా నుంచి పారిపోయి శరణార్థిగా వచ్చిన బాజ్ బహదుర్‌కు ఆశ్రయం ఇచ్చింది. మేవార్ స్వతంత్రత





అక్బరుకు కంటకమయింది. అయితే, సంగరాణా అనంతరం అతని కొడుకు ఉదయసింహుడు అసమర్థుడు కావటమూ, మేవారులో అతఃకలహా లేర్పడటమూ అక్బరుకు సహాయకారి అయింది. ఇది మంచి అదనుగా భావించి అతను మేవార్‌పై యుద్ధ యత్నాలు తలపెట్టాడు.

1567 అక్టోబరులో అక్బరు చితోడ్ కోటను ముట్టడించాడు. ఉదయసింహుడు తన దుర్గాన్ని విధికి వదిలేసి తాను కొండల లోకి పారిపోయాడు. కాని అతని పరివారంలో ఉన్న జయమల్లు, పట్టాల వంటి మహా యోధులు నాలుగు మాసాల పాటు—1567 అక్టోబరు 20 లగాయతు, 1568 ఫిబ్రవరి 23 దాకా—అక్బరు బలాలను వీరోచితంగా ప్రతిఘటించారు. చివరకు జయమల్లు అక్బరు పేల్చిన తుపాకి గుండు వాత పడ్డాడు. తరవాత పట్టా కూడా చనిపోయాడు. మిగిలిన వా రందరూ కత్తి పట్టి యుద్ధం చేస్తూ, ఒక్కడైనా మిగల కుండా చనిపోయారు. శత్రువుల చేతిలో పడకుండా రాజపుత్ర స్త్రీలు ఏక చితిలో దూకి దహనమైపోయారు.

తరవాత అక్బరు చితోడ్ దుర్గం ససైన్యంగా ప్రవేసించాడు. చితోడ్ పతనం చూసి హడలెత్తి అనేక మంది రాజపుత్రులు అక్బరుకు పాదాక్రాంతు లయారు. 1569లో రణ్థంభోర్ రాజు తన దుర్గం తాలూకు తాళపు చెవులను అక్బరు కిచ్చి, అక్బరు కొలువులో చేరాడు. అదే ఏడు కాలింజర్ రాజు కూడా అక్బరు శరణుజొచ్చాడు. కాలింజర్ పతనం మొగలు సామ్రాజ్య విస్తరణలో ఒక ప్రముఖ ఘట్టంగా చరిత్రకారులు చెబుతారు.

1570 లో బికానేర్, జైసల్మేర్ రాజులు మొగలు చక్రవర్తికి లొంగిపోవడమే గాక, అతనికి తమ కూతుళ్ళ నిచ్చి పెళ్ళి కూడా చేశారు.





# భారత చరిత్ర



రాజపుత్ర సంస్థానాలవీ ఒకటొకటిగా అక్బరు పాదుషాకు పాదాక్రాంతమైపోగా, మేవాడ్ ఒక్కటే లొంగ నిరాకరించింది. ఉదయసింహుడు తన రాజధానిని కోల్పోయినా స్వేచ్ఛను కోల్పోలేదు. 1572 మార్చి 3 న అతను ఉదయపూరుకు 19 మైళ్ళ దూరాన గోగుందా అనే చోట చనిపోయాడు. ఆ తరవాత మేవాడ్‌కు అతని కొడుకు ప్రతాపుడు సాటిలేని నాయకత్వం వహించి, తన వంశానికి ఎలాటి కళంకమూ రాకుండా మొగలులను తీవ్రంగా ప్రతిఘటించాడు. అతని ప్రతిఘటన అత్యంత కష్టసాధ్యమైనది. అతనికా రాజధాని లేదు, చెప్పుకోదగిన సహాయం లేదు; అతని ప్రత్యర్థి "ప్రపంచ మంతటికీ అద్వితీయ సంపన్నుడైన" ఢిల్లీ పాదుషా!

1576 ఏప్రిలులో మొగలు సైన్యాలు అంబరు రాజైన మానసింహుడి నాయకత్వానా, ఆసఫ్ ఖాన్ నాయకత్వానా ప్రతాపుడి రాజ్యంపై దాడి చేశాయి, గోగుందా సమీపంలో హల్దీఘాట్ కనుమ వద్ద ఘోరమైన యుద్ధం జరిగింది. అందులో ప్రతాపుడు ఓడిపోయాడు. ఆ యుద్ధంలో ప్రతాపుడు చనిపోయి ఉండవలసిందే; కాని ఝాలరాజు తానే రాణా నని ప్రకటించి శత్రువులను తన పైకి కేంద్రీకరించు కోవటంతో ప్రతాపుడు ప్రాణాలతో బయటపడగలిగాడు. అతను ప్రసిద్ధమైన తన "చైతక్" అనే గుర్రం మీద కొండల్లోకి వెళ్ళిపోయాడు. అతని దుర్గాలు ఒకదాని వెంబడి మరొకటి శత్రువులకు చిక్కిపోయాయి. అంత దుర్దశలోనూ ప్రతాపుడు శత్రువుకు లొంగిపోయే మాట తలపెట్టలేదు. తనను వేటకుక్కల్లాగా, విడవకుండా వెన్నాడే శత్రువులకు అందకుండా అతను ఒక కొండ నుంచి మరొక కొండకు





మారుతూ, వన్యఫలాలతో తన కుటుంబాన్ని పోషించాడు. తరగని పరాక్రమంతో అతను శత్రువుతో యుద్ధాలు చేసి తన దుర్గాలలో చాలా భాగం తిరిగి స్వాధీన పరుచుకోగలిగాడు. ఈ పోరాటాలను అతను జీవితాంతం వరకూ కొనసాగించి, 1597 జనవరి 19న తన 57వ ఏట మరణించాడు.

రాణాప్రతాపుడు భారత చరిత్రకు చెందిన అద్భుత వ్యక్తులలో ఒకడు. రాజపుత్రులలో అతన్ని మించగల రణకుశలులూ, పరిపాలనా దక్షులూ ఉండిన మాట నిజమేగాని, శౌర్య పరాక్రమాలలోనూ, దేశభక్తిలోనూ, అతనికి సాటి రాగలవాడు మరొకడు లేడు.

అక్బరు అనారోగ్యం కారణంగా మేవాడ్ పై మరి యుద్ధం చెయ్యలేదు. కాని అప్పటికే ఆయన అనేక ఇతరప్రాంతాలు జయించాడు. వాటిలో చరిత్ర ప్రాముఖ్యం గలది గుజరాతు పై విజయం. ఓడరేవుల వల్లా, వర్తక సౌకర్యాల వల్లా గుజరాతు ఢిల్లీ పాదుషాలను మొదటినుంచీ ఆకర్షిస్తూనే వచ్చింది. గుజరాతుకు నామ మాత్రపు రాజుగా వుండిన మూడవ ముజఫర్ షా అయోగ్యుడు. 1572 లో అక్బరు గుజ



రాతు పై స్వయంగా దండయాత్ర నడిపి, యుద్ధాలలో విజయం పొంది, గుజరాతు రాజుకు భరణం ఇచ్చి తొలగించాడు. సూరత్ నగరం ఒకటిన్నరమాసాల ముట్టడి అనంతరం, 1573 ఫిబ్రవరి 26 న అక్బరు వశమయింది. ఈ సమయంలోనే పోర్చుగీసు వారికి అక్బరుతో పరిచయం ఏర్పడింది; వారతని మైత్రి వాంఛించారు.

అయితే అక్బరు తన కేంద్రమయిన ఫతేపూర్ సిక్రీకి తిరిగి వెళ్ళగానే గుజరాతులో తిరుగుబాట్లు తలఎత్తాయి. అతని మనుష్యులే అందులో పాల్గొన్నారు. అక్బరు మండిపడి, 600 మైళ్ళ దూరం పదకొండు





రోజుల కాలంలో ప్రయాణించి అహమ్మదా బాదు చేరుకుని, తిరుగుబాట్లన్నిటినీ పూర్తిగా అణచివేశాడు. 1573 సెప్టెంబరు ఆరంభం నుంచి గుజరాతు మొగలు సామ్రాజ్యంలో అంతర్భాగమయింది. ఇందు వల్ల, రాజ్యానికి ఆర్థికంగా చాలా లాభించింది. మొగలులకు పోర్చుగీసు వారితో సంబంధాలు ఏర్పడటమే గాక సామ్రాజ్యానికి సముద్రతీరపు రేవులు లభ్యమయాయి. అయితే మొగలులు నౌకాబలాలను సృష్టించుకునే ఆలోచన తలపెట్ట లేదు. ఈ కారణం చేతనే పాశ్చాత్యులు సులువుగా భారతదేశం లోకి చొరబడ గలిగారు.

గుజరాతు అనంతరం బెంగాలు అక్బరు వశమయింది. బెంగాలు పాలకులయిన సూర్ వంశపు రాజులు ముహమ్మద్ ఆదిల్‌షా పాలించే కాలంలో స్వాతంత్ర్యం ప్రకటించి 1564 దాకా పాలించారు. అటు తరవాత బిహారు గవర్నరు బెంగాలు పరిపాలన కూడా తన వశం చేసుకున్నాడు. 1572 లో ఈ గవర్నరు (సులేమాన్) చనిపోగా అతని కొడుకు దావూద్ అక్బరుకు ఎదురు తిరిగి ఆయన ఆగ్రహానికి గురి అయాడు. 1574 లో అక్బరు ససైన్యంగా బెంగాలుకు వచ్చి దావూద్‌ను తొలగించి, మునిమ్ ఖాన్ వెంట తన బలాలను బెంగాలులో ఉంచి వెళ్ళిపోయాడు. దావూద్ ఒరిస్సాకు చేరుకుని, 1575 మార్చి 3 న సువర్ణరేఖా నదీ తీరాన మొగలు సైన్యాలతో యుద్ధం చేసి ఓడాడు. అయితే మునిమ్‌ఖాన్ మెతకదనం చేత అతను ఓడి కూడా శిక్ష పొందక, ఆ ఏడు అక్టోబరులో బెంగాలును తిరిగి జయించ బూనుకున్నాడు. చివరకతను 1576 జులైలో రాజమహల్ వద్ద జరిగిన యుద్ధంలో ఓడి చనిపోయాడు. అయితే 1592 వరకూ బెంగాలులో కొందరు స్థానిక పరిపాలకులు మొగలు పరిపాలనను ప్రతిఘటించుతూనే వచ్చారు.





# భారత చరిత్ర




1595 నాటికి అక్బరు సామ్రాజ్యం హిమాలయాల నుంచి నర్మదా తీరం దాకానూ, హిందూకుష్ పర్వత పంక్తి నుంచి బ్రహ్మపుత్రానదీ తీరం దాకానూ విస్తరించింది. అక్బరు తన సామ్రాజ్యాన్ని దక్కనుకు కూడా విస్తరింపజేసి, అహమ్మద్‌నగర్, బిజాపూర్, గోల్కొండ, ఖాన్దేష్ సల్తనతులను లోబరుచుకోవాలని ఆలోచించాడు. పోర్చుగీసు వారిని సముద్ర తీరం నుంచి లోపలికి రాకుండా చెయ్యాలనే ఉద్దేశం కూడా అక్బరుకున్నది.

దక్షిణదేశం లోని సల్తనతులు పరస్పర కలహాలతో దుర్బలమైపోయి ఉండటం చేత మొగలులను నిరోధించే స్థితిలో లేవు. 1591 లో అక్బరు ఈ సంస్థానాలకు తన రాయబారులను పంపి, వారు తనకు లోబడి ఉండేటట్టు అంగీకరించమని కోరాడు. కాని ఒక్క సుల్తాను కూడా అందుకు స్పష్టంగా అంగీకరించలేదు. ఖాన్దేష్ నవాబు మియాబహదుర్‌షా నిరాకరించాడు కూడా.

దౌత్యం విఫలం కాగా, అక్బరు తన రెండో కొడుకు మురాద్‌నూ, బైరమ్‌ఖాన్ కొడుకు అబ్దుర్రహీమ్‌నూ సేనాపతులుగా చేసి పెద్దసేనను అహమ్మద్‌నగరు పైకి పంపాడు. 1595 లో ముట్టడి జరిగింది. చాంద్‌బీబీ ఈ ముట్టడిని సాహసోపేతంగా ప్రతిఘటించింది. మొగలులు ఆమెతో 1596 లో సంధి చేసుకుని, బిరార్ తమ అధీన మయేటట్టూ, బాలుడైన చాంద్‌బీబీ కుమారుడు అహమ్మద్‌నగరు రాజుగా ఉంటూ అక్బరు ఆధిపత్యాన్ని ఆమోదించేటట్టూ ఒడంబడిక చేసుకున్నారు. చాంద్‌బీబీ తన పరిపాలన వదిలేసుకున్నది. అయితే ఆమె సలహాకు భిన్నంగా అహ్మద్‌నగరు లోని ఒక పక్షం వారు ఒడంబడికను

## 45. అక్బరు నిర్యాణం





ఉల్లంఘించి, బిరారు నుంచి మొగలులను తరిమెయ్యటానికి యుద్ధం సాగించారు. 1597 ఫిబ్రవరిలో గోదావరీ తీరాన సూప వద్ద మొగలులకు విజయం లభించింది. చాంద్ బీబీ దుర్మరణం పొందింది. 1600 లో మొగలులు అహమ్మద్‌నగరును సునాయాసంగా వశపరచుకున్నారు.

ఖాన్దేష్ విజయానికి అక్బరు స్వయంగా బయదేరాడు. అది అతని అఖరు విజయం. అప్పటికే అక్బరు పైన అతని కొడుకు సలీమ్ తిరుగుబాటు చేసి, అలహాబాదుకు వెళ్ళి తానొక స్వతంత్ర రాజు నని ప్రకటించాడు. అతను 1602 లో తన తండ్రికి అత్యంత ఆప్తమిత్రుడైన అబుల్ ఫజల్‌ను హత్య చేయించాడు. 1603 లో సుల్తానా సలీమా బేగమ్ తండ్రి కొడుకులకు తాత్కాలికంగా రాజీ కుదిర్చింది గాని, అది దక్కలేదు. సలీమ్ మళ్ళీ అలహాబాదుకు వెళ్ళిపోయి, అదరగండంగా ప్రవర్తించ సాగాడు. మానసింహుడు మొదలైన కొందరు అక్బరు సింహాసనాన్ని సలీమ్ కొడుకైన ఖుస్రవ్‌కు వచ్చే ఏర్పాటు చేయాలన్నారు, కాని మరి కొంద రిందుకు వ్యతిరేకించారు. అక్బరు కొడుకుల్లో అప్పటికి సలీమ్ ఒకడే సజీవుడుగా ఉన్నాడు. అక్బరు అతన్ని "అల్లరి వెధవ" గా పరిగణించి క్షమించేశాడు. ఆ తరవాత అక్బరు ఎంతో కాలం జీవించ లేదు; అతను 1605 అక్టోబరు 17న మరణించాడు.

అక్బరు అపూర్వ వ్యక్తి కావటానికి అనేక ప్రభావాలు దోహదం చేశాయి. తీమూర్ సంతతి వారు విజేతలే అయినప్పటికీ లలిత కళా ప్రియులు. సూఫీ తత్వ ప్రభావం వారి నలా తయారుచేసింది. అక్బరుకు అతని తల్లి పరమత సహనం అలవడ చేసింది. కాబూల్ ఆస్థానంలో ఉన్నప్పుడు అక్బరుకు అనేకమంది సూఫీ భక్తుల సంపర్కం కలిగింది. అతనికి తన రాజ





పుత్ర భార్యల ద్వారా హిందూ మత సంపర్కం కూడా కలిగింది.

వీటన్నిటికీ తోడుగా, యావద్భారతంలో మొగలు సామ్రాజ్యం స్థాపించాలన్న అతని ఆశయం కూడా అతని మతవైఖరిని కొంత వరకు నిర్ణయించింది. వివిధ మతాల మధ్య సాగిన దారుణ సంఘర్షణలు చూసి అక్బరుకు మతిపోయింది. అన్ని మతాలకూ అమోదకరంగా ఉండే మతాన్ని ప్రవచించి తన సామ్రాజ్యంలో మత సామరస్యం నెల కొల్పాలని అక్బరు కలలు కనేవాడు.

అతను ముస్లిము మతవేత్తలనే గాక, హిందూ, జైన, పార్సీ, క్రైస్తవ మత ప్రవీణులను సమావేశ పరిచి వారితో చర్చలు జరిపాడు. అతను అన్ని మతాలలోనూ ఎంతో మంచి చూశాడు, కాని ఏ మతాన్నీ స్వీకరించలేదు; "దీని ఇలాహీ" అనే ఒక కొత్త మతాన్ని ప్రచారం చేశాడు. అందులో ఇస్లాము, హిందూ, క్రైస్తవ మతాంశ లుండేవి. అతను ఈ మతాన్ని బలాత్కారంగా ఎవరికీ అంటగట్టలేదు. అయితే అతను ముస్లిము మత గురువులను మాత్రం పూర్తిగా నిగ్రహంలో ఉంచి, వారి ఆటలు సాగకుండా చేశాడు. అక్బరు మత దృష్టి జాతీయాదర్శ చిహ్న మనాలి.

భారత చరిత్రలో అక్బరుకు ప్రముఖ స్థానం ఇచ్చినవి ఆతని వ్యక్తిగతమైన గుణాలు—యుద్ధ కౌశలమూ, ఉదార స్వభావమూ, న్యాయ పరిపాలనా, సంస్కారమూ, పరేంగితజ్ఞతా మొదలైనవి. "ఆయన సాధారణ వ్యక్తి కాదు, దేవాంశ గలవాడు," అని జహంగీర్ తన తండ్రిని గురించి అన్నాడు. అక్బరు అమితమైన ధైర్యమూ, శరీర బలమూ గలవాడు. యుద్ధంలోగాని, వేటలోగాని అతను భయపడి ఎరగడు. అతని వర్తనా, సంభాషణా ఎంతో ఇంపుగా ఉండి, అవతలి వాళ్ళను బలంగా ఆకర్షించేవి.








# భారత చరిత్ర



అక్బరు చనిపోయిన ఒక వారం అవతల సలీమ్ ఆగ్రాలో నూరుద్దీన్ మహమ్మద్ జహాంగీర్ పాద్‌షా ఘాజీ అనే పేరుతో పట్టం కట్టుకున్నాడు. అన్ని రకాల ప్రజల ఆదరానికీ పాత్రుడయే ఉద్దేశంతో అతను అనేక చర్యలు అమలు చేశాడు.

గద్దె ఎక్కే నాటికి జహాంగీర్ వయసు **36.** చక్రవర్తి పదవి అతనికి ఎంతో కాలం సుఖస్వప్న మనిపించకుండా, అతని పెద్ద కొడుకు ఖుస్రవ్ అతని మీద ఎదురు తిరిగాడు. ఖుస్రవ్ అంటే అక్బరుకూ, మేనమామ అయిన మానసింహుడికీ, ఇంకా అనేకమందికీ చాలా ముద్దు. అక్బరు ఇంకా చనిపోక ముందే ఖుస్రవ్‌కూ, అతని తండ్రికీ చెడింది. తండ్రి రాజ్యానికి వచ్చిన అయిదు నెలలకు ఖుస్రవ్ ఆగ్రా నుంచి పంజాబుకు పారిపోయి, అక్కడ పితూరీ లేవదీశాడు. జహాంగీర్ ఆలస్యం చెయ్యకుండా పెద్ద సేనను వెంటబెట్టుకుని, తన కొడుకు పై దండెత్తి వెళ్ళాడు.

ఉభయ పక్షాలకూ జరిగిన యుద్ధంలో ఖుస్రవ్ చిత్తుగా ఓడిపోయాడు. అతను ఖైదు శిక్ష పొందాడు. అతని అనుచరులు చిత్రహింసలకు గురి అయారు. ఖుస్రవ్ **1622** వరకు జైలులోనే యాతన అనుభవించి చనిపోయాడు.

**1611** మే నెలలో జహాంగీర్ నూర్ జహాఁను పెళ్ళిచేసుకున్నాడు. ఆమె అసలు పేరు మిహ్రున్నిసా. ఆమె తన పదిహేడో ఏట ఆలీకులీబేగ్ ఇస్తర్ఝు అనే పర్షియన్‌ను పెళ్ళాడింది. ఈయన బెంగాలులోని బర్ద్వాన్‌ను జాగీరుగా పొంది, షేర్ అఫ్ఘాన్ అనే బిరుదు కూడా సంపాదించుకున్నాడు.

అయితే ఈ షేర్ అఫ్ఘాన్ తిరుగుబాటు వైఖరి అవలంబించ సాగాడు. అతన్ని శిక్షించమని జహాంగీర్ కుతుబుద్దీన్ అనే





వాణ్ణి సేనతో పంపాడు. యుద్ధంలో కుతుబుద్దీన్ చనిపోయినప్పటికీ, అతని అనుచరులు మిహ్రున్నిసా భర్తను ముక్కలు ముక్కలుగా నరికేశారు. మిహ్రున్నిసా తన పసి కూతురుతో సహా జహాంగీరు రాజభవనానికి చేరి, నాలుగేళ్ళ అనంతరం చక్రవర్తిని పెళ్ళాడటమే గాక, అతని పట్టపు రాణి కూడా అయింది. ఆమెకు భర్త "నూర్‌జహాఁ" (ప్రపంచపు వెలుగు) అని పేరు పెట్టుకున్నాడు.

నూర్‌జహాఁ అద్వితీయ సౌందర్యవతీ, కళాప్రియురాలూ, తెలివిగలదీనూ. అయితే ఆమెకు అన్నిటి కన్న ఇష్టమైనది అధికారం. ఆమె తన భర్తను పూర్తిగా వశపరుచుకుని, తన తండ్రికీ, అన్నకూ కొలువులో ఉన్నత పదవు లిప్పించింది; తన మొదటి సంబంధం కుమార్తెను జహాంగీర్ కడగొట్టు కొడుకైన షహర్యార్ కిచ్చి పెళ్ళి చేసి, తన ప్రతిభ మరింత పెంచుకున్నది.

జహాంగీరు కాలంలో కొన్ని ప్రముఖ విజయాలు మొగలులకు లభించాయి. బెంగాలులో మొగలులకు అఫ్ఘానులు 1612 దాకా పక్కలో బల్లెంగా ఉంటూనే వచ్చారు. ఉస్మాన్‌ఖాన్ అనే వాడి నాయకత్వం కింద జరిగిన అఫ్ఘాన్ తిరుగుబాటు




1612 మార్చి 12 న అంతమయింది. తలపై దెబ్బ తగిలి ఉస్మాన్‌ఖాన్ చనిపోయాడు. అటు తరవాత బెంగాలులో అఫ్ఘానులు తల ఎత్తలేదు. అదే విధంగా మేవార్ కూడా జహాంగీరు కాలంలోనే మొదటి సారిగా మొగలుల ఆధిక్యతను ఆమోదించింది.

దక్కనులో అహమ్మద్ నగరు ఒకటి మొగలులకు లొంగనే లేదు. మొగలు సేనలు అహమ్మద్‌నగరుతో సుదీర్ఘమైన యుద్ధం చేశాయి. ఈ యుద్ధం నడిపిన వారిలో యువరాజు ఖుర్రమ్ కూడా వున్నాడు. ఇతను 1616 లో తాత్కాలికంగా





అహమ్మద్‌నగరు కోటను పట్టుకున్నందుకు తండ్రి ఎంతో పొంగిపోయి అతనికి "షా జహాఁ" (ప్రపంచానికి రాజు) అన్న బిరుదూ, ఇతర కానుకలూ ఇచ్చాడు... కోట్ల కొద్దీ రూపాయలూ, వేల కొద్దీ ప్రాణాలూ బలి అయాయి, కాని దక్కనులో మొగలు సామ్రాజ్యపు సరిహద్దు 1605 నాడుండిన చోటు నుంచి ఒక్క అంగుళం ముందుకు జరగలేదు!

నూర్‌జహాఁ తనకు రావలిసిన సింహాసనాన్ని ఆమె అల్లుడైన షహర్యార్‌కు కట్టబెడుతుందని షాజహాఁ తండ్రి పై తిరుగుబాటు చేశాడు. అయితే అతను 1623లో ఓడిపోయి, 1625 లో తండ్రితో రాజీపడి, తన కొడుకులను దారాషుకోహ్, ఔరంగజేబ్‌లను రాజధానికి పంపి, తాను తన భార్య అయిన ముమ్‌తాజ్‌మహల్ తోనూ, తన ఆఖరు కొడుకైన మురాద్ తోనూ నాసికలో ఉండిపోయాడు.

షాజహాఁ ఓటమికి కారకుడు మహబత్ ఖాన్ అనేవాడు. అతను సైనికాధికారిగా ప్రజ్ఞ చూపి పైకి వచ్చాడు. అతని ఉన్నతి చూసి ఓర్వలేక నూర్‌జహాఁ అతని పై కత్తి కట్టింది. మహబత్‌ఖాన్ ఎదురు తిరిగి, జహాంగీర్ కాబూలుకు వెళ్ళేటప్పుడు ఆయనను పట్టుకుని ఝీలమ్‌నది ఒడ్డున ఖైదు చేశాడు. నూర్‌జహాఁ తప్పించుకు పారిపోయి, తన భర్తను విముక్తుణ్ణి చెయ్యటానికి వ్యర్థ ప్రయత్నాలు చేసి, చివరకు తిరిగి వచ్చి ఖైదులో తన భర్తను చేరుకున్నది.

చివరకు మహబత్‌ఖాన్ కంటిలో దుమ్ము చల్లి జహాంగీర్, నూర్‌జహాఁలు బయట పడ్డారు. మహబత్‌ఖాన్ పారిపోయి షాజహాఁ శరణుజొచ్చాడు. అయితే మరి కొద్ది రోజులకే, 1627 అక్టోబరు 28 న, జహాంగీర్ చక్రవర్తి చనిపోయాడు. అతని శవానికి రావీనది తీరాన షాహ్‌దర వద్ద అందమైన సమాధి నిర్మించారు.







# భారత చరిత్ర



1627 అక్టోబరులో తన తండ్రి చనిపోయే నాటికి షాజహాఁ దక్కనులో ఉన్నాడు. అతని అన్నలైన ఖుస్రవ్, పర్వేజ్ అనే వాళ్ళిద్దరూ అప్పటికే చనిపోయారు. అతని తమ్ముడైన షారియార్ తన అత్తగారైన నూర్‌జహాఁ ప్రోత్సాహంతో తాను చక్రవర్తి నని లాహోరు నుంచి ప్రకటన చేశాడు. ఆ తరుణంలో ముంతాజ్‌మహల్ తండ్రి అయిన ఆసఫ్‌ఖాన్ షాజహాఁకు బాసటగా నిలబడి, ఉత్తరదేశానికి వచ్చెయ్యమని షాజహాఁకు కబురు పంపి, అతను వచ్చే దాకా సింహాసనం మీద ఖుస్రవ్ కొడుకైన దావర్‌బక్ష్‌ను కూర్చోబెట్టాడు. తరవాత అతను లాహోరులో ఉన్న షారియార్ పైకి దాడి వెళ్ళి, యుద్ధంలో అతన్ని ఓడించి, అతని కళ్ళు తీసేయించాడు.

షాజహాఁ త్వరగా ఢిల్లీ చేరుకుని, 1628 ఫిబ్రవరిలో చక్రవర్తిగా అభిషిక్తుడయాడు. అటు పైన అతను తన పదవికి అడ్డంగా ఉన్న వారందరినీ లోకాంతరాలకు పంపేశాడు. పరిస్థితులు అతనికి బాగా అనుకూలించాయి. అతనికి సహాయపడిన ఆసఫ్‌ఖాన్ ప్రధానమంత్రి అయాడు. అదే విధంగా మహబత్‌ఖాన్ అనేవాడు అజ్మీరుకు గవర్నరుగా నియమించబడ్డాడు.

చక్రవర్తి పై ఇద్దరు వ్యక్తులు తిరుగుబాటు చేశారు. ఒకడు బుందేలా రాజైన జుఝార్‌సింగు, రెండవ వాడు ఖాన్‌జహాఁ లోడీ అనే అఫ్ఘాను ప్రముఖుడు, మాజీ దక్కను వైస్రాయి. షాజహాఁ గద్దె ఎక్కిన రెండేళ్ళలోనూ ఈ రెండు తిరుగుబాట్లూ జరిగి, అణచివేయబడ్డాయి. ఇందులో రెండో తిరుగుబాటు బలీయమైనది; దానికి నిజాముల్‌ముల్క్ అనే అహమ్మద్‌నగరు నవాబూ, మహారాష్ట్రులూ, రాజపుత్రులూ సహాయపడ్డారు. అయితే షాజహాఁ ఈ తిరుగు

## 47. షాజహాఁ



బాటు బలాన్ని గుర్తించి, తగిన బలాన్ని ప్రయోగించి తిరుగుబాటు దారును సమూలంగా నాశనం చేశాడు.

బెంగాలులో సాత్‌గాంవ్ వద్ద స్థిరపడిన పోర్చుగీసు వారు తమ వ్యాపార మేదో తాము చూసుకోక, హుగ్లీ వద్ద బలమైన స్థావరం ఏర్పాటు చేసుకుని చక్రవర్తికి విరుద్ధమైన చర్యలకు దిగారు. వారు పుగాకు వర్తకుల వద్ద సుంకాలు వసూలు చెయ్యటమే గాక, బానిస వ్యాపారం కూడా సాగించి, ముంతాజ్ మహల్ వద్ద ఉండే ఇద్దరు బానిస యువతులను పట్టుకున్నారు. షాజహాఁ ఉత్తరువు పై 1632 జూను 24 న మొగలు సైన్యాలు హుగ్లీని ముట్టడించాయి. యుద్ధంలో అనేక మంది పోర్చుగీసు వారు చచ్చారు. చాలా మంది ఖైదీలుగా ఆగ్రాలో యమయాతన లనుభవించారు.

తన తండ్రి తాతల లాగే షాజహాఁ కూడా తన సామ్రాజ్యాన్ని దక్షిణాన విస్తరింపజేయ యత్నించాడు. నిజాంషాహీల పరిపాలన కింద ఉండిన అహమ్మద్‌నగరు మొగలు సరిహద్దుకు సన్నిహితంగా ఉండటం చేత దానికి మొగలుల తాకిడి జాస్తిగా ఉండేది. 1626 నాటికి మలిక్ అంబరు చనిపోయాడు; అతని కొడుకు ఫతేఖాన్ అప్రయోజ



కుడు కావటాన అహమ్మద్‌నగరు రాజ్యం దుర్బలమై ఉన్నది. అహమ్మద్‌నగరు సుల్తాను పై ద్రోహం చేసి ఫతేఖాన్ మొగలులతో చేరి, సుల్తానును చంపి, పదేళ్ళ వయసు గల సుల్తాను కొడుకును పేరుకు గద్దె మీద ఉంచి తానే అధికారం చెలాయించాడు. 1631 లో ఈ నీచుడు మొగలుల వద్ద పదిన్నర లక్షల రూపాయలు లంచం పుచ్చుకుని దౌలతాబాదు కోటను వారి వశం చేశాడు. 1633 లో అహమ్మదునగరు మొగలు సామ్రాజ్యంలో చేరిపోయింది.

గోల్కొండ, బిజాపూరు రాజ్యాలు స్వతంత్రంగా ఉండటమూ, వాటి పాలకులు షియా





తెగకు చెందినవారు కావటమూ షాజహాఁ సహించలేక పోయాడు. 1629 లో గోల్కొండ మీదా, 1631 లో బిజాపూరు మీదా మొగలు సైనిక చర్యలు ప్రారంభ మయాయి. 1635 లో ఈ రెండు రాజ్యాల పాలకులూ షాహజీకి రహస్యంగా సహాయ పడ్డారు; ఇది తెలిసి షాజహాఁ ఈ దేశాల వారిని తనకు లోబడి ఉండమనీ, కప్పం కట్టమనీ, షాహజీకి సహాయం చెయ్యగూడ దనీ ఆదేశించటమే గాక, తానే స్వయంగా సేనలతో బయలుదేరి వచ్చి, 1636 ఫిబ్రవరి 21 న దౌలతాబాదు చేరాడు. ఇది చూసి బేజారెత్తి, గోల్కొండ సుల్తాను అబ్దుల్లాషా లొంగిపోయి, షరతు లామోదించాడు.

కాని బిజాపూరు సుల్తాను ఆదిల్‌షా యుద్ధసన్నద్ధు డయాడు. బిజాపూరును మూడు పక్కల నుంచి మూడు మొగలు సేనలు ముట్టడించాయి. బిజాపూరు సైని కులు తమ రాజధానిని రక్షించుకో గలిగారు గాని మిగతా రాజ్యాన్ని మొగలులు కొల్ల గొట్టారు. 1636 లో బిజాపూరు సుల్తాను సంధికి ఒడబడ వలిసి వచ్చింది. అతను ఢిల్లీ చక్రవర్తికి లోబడి ఉండటానికి సమ్మతించాడు.

ఈ విధంగా దక్కను రాజ్యాలు కూడా మొగలు సామ్రాజ్యంలో అంతర్భాగా లయాయి. షాజహాఁ 1636 జులై 11 న దక్కను నుంచి తిరిగి వెళ్ళిపోయి, దక్కనులో వైస్రాయిగా పనిచెయ్యటానికి తన మూడవ కొడుకైన ఔరంగజేబును పంపాడు. మొగలు సామ్రాజ్యం యొక్క దక్కను విభాగంలో ఆ నాడు ఖాన్‌దేశ్, బిరార్, తెలంగాణా, దౌలతాబాదు రాష్ట్రా లుండేవి; వాటిపై రాబడి సాలుకు 5 కోట్ల రూపాయ లుండేది; అందులో 64 కొండ దుర్గా లుండేవి, వాటిలో కొన్ని ఇంకా షాహజీ లాంటి శత్రు నాయకుల అధీ నంలో ఉండేవి.





# భారత చరిత్ర




దక్కనులో వైస్రాయిగా వచ్చే నాటికి ఔరంగజేబు 18 ఏళ్ళ యువకుడు. అతను సామ్రాజ్య శత్రువులను అణచటానికి దీక్షగా కృషి చేశాడు; సూరత్ సముద్ర తీరానికీ, ఖాన్‌దేశ్‌కూ మధ్యగా ఉన్న బాగ్లానాను పట్టుకుని, కొన్ని దుర్గాలను షాహజీ నుంచి లాగేసుకున్నాడు.

దక్కను వైస్రాయి పదవి నిర్వహించటంలో ఔరంగజేబుకు అనేక ప్రతిబంధకాలేర్పడ్డాయి. డబ్బు లేకపోవటం ఒకటి. అంత కన్న ముఖ్యమైన దేమంటే అతని అన్న అయిన దారాషుకోహ్ నాయకత్వాన ఔరంగజేబుకు విరుద్ధంగా ఒక కూటమి ఏర్పడింది. షాజహాంకు దారాషుకోహ్ అంటే చాలా ఇష్టం. ఈ పరిస్థితులలో ఔరంగజేబు 1644 లో తన వైస్రాయి పదవికి రాజీనామా ఇచ్చి, 1645 ఫిబ్రవరిలో గుజరాతుకు గవర్నరుగా నియోగించబడ్డాడు.

ఔరంగజేబు తన పెద్ద అన్న శత్రుత్వం మూలాన ఢిల్లీలో ఉండలేక పోయాడు. 1653 ఆరంభంలో అతను రెండోసారి దక్కనుకు వైస్రాయిగా వచ్చాడు. ఆ సమయంలో అక్కడి పరిపాలన అయోమయ స్థితిలో ఉన్నది. ఆర్థిక పరిస్థితి అధ్వాన్నంగా ఉన్నది. తన వెంట దివానుగా వచ్చిన ముర్షిద్ కులీఖాన్ సహాయంతో ఔరంగజేబు శిస్తు విధానాలను ఏర్పాటు చేసి రైతులకూ, ప్రభుత్వానికీ కూడా లాభదాయకంగా ఉండే చరిత్రాత్మకమైన ఏర్పాట్లు కొనసాగించాడు. వాటితో దక్కను సౌభాగ్యం పెంపొందింది. 1658 నాటికి ఔరంగాబాదు ప్రాంతంలో ఒక్క సెంటు బంజరుభూమి కూడా లేదట.

1636 నుంచీ గోల్కొండ ఢిల్లీకి లోబడి ఉండి కూడా కప్పం సరిగా చెల్లించటం లేదు. గోల్కొండ సుల్తాను కింద మంత్రిగా





ఉన్న మీర్‌జుమ్లాను సుల్తాను సరిగా చూడక పోయే సరికి, అతను మొగలులను శరణు జొచ్చాడు. గోల్కొండ పై ఔరంగజేబు దెబ్బ తీయటానికి ఈ రెండు సాకులూ దొరికాయి.

మీర్‌జుమ్లా అసలు పేరు ముహమ్మద్ సయీద్. అతను పర్షియా దేశపు వర్తకుడు. అతను వజ్రాలూ, ఇతర రత్నాలూ విక్రయించి అంతులేని ధనం సంపాదించి, గోల్కొండ సుల్తా నయిన అబ్దుల్లాకుతుబ్‌షా వద్ద కొలువు కుదిరాడు. అతను అసాధారణమైన తెలివితేటలూ, యుద్ధతంత్రజ్ఞతా, పరిపాలనా సామర్థ్యమూ ప్రదర్శించి ప్రధానమంత్రి అయాడు. ఈ పదవిలో ఉంటూ అతను నిరంకుశంగా ప్రవర్తించ సాగాడు. అంతేగాక, సొంతాన అతను యుద్ధాలు చేసి, కర్ణాటక ప్రాంతాలలో విస్తృత ప్రాంతాలు స్వాధీనపరచు కున్నాడు. 300 మైళ్ళ నిడివీ, 50 మైళ్ళ వెడల్పూ గల ఈ ప్రాంతం నుంచి అతనికి ఏటా 40 లక్షలు రాబడి ఉండేది. దానితో అతను సొంతంగా ఒక సేనను, ఫిరంగులతో సహా, ఏర్పాటు చేసుకున్నాడు. అతనికి రాజనే పేరు లేకపోయినా, రాజు కుండే హంగు లన్నీ ఉండేవి. నానాటికీ పెరిగి పోతున్న మీర్‌జుమ్లా బలాన్ని చూసి భయ



పడి సుల్తాను, అతని కొడుకు ముహమ్మద్ అమీన్‌ఖాన్‌నూ, అతని కుటుంబాన్నీ అరెస్టు చేసి, మీర్‌జుమ్లాను లొంగదీసు కోవాలని చూశాడు. మీర్‌జుమ్లా ఢిల్లీ చక్రవర్తి తోనూ, ఔరంగజేబు తోనూ కుట్ర చేశాడు.

ఔరంగజేబు కుమారుడైన ముహమ్మద్ సుల్తాన్ తండ్రి ఆజ్ఞ పైన 1656 జనవరిలో హైదరాబాదు పైన దాడిచేశాడు. ఫిబ్రవరి 7 న ఔరంగజేబు స్వయంగా గోల్కొండ పై దాడి జరిపించాడు.

మొగలు సైనికులు దేశాన్ని కొల్లగొట్టారు. ఔరంగజేబు ఉద్దేశం గోల్కొండ రాజ్యాన్ని కబళించెయ్యాలనే.





అయితే ఇది కొనసాగకుండా దారాషు కోహ్, జహాఁఆరాలు అడ్డపడి తమ తండ్రి అయిన షాజహాఁ చేత ఔరంగజేబుకు ఉత్తరువు పంపి గోల్కొండ ముట్టడి ఎత్తింప జేశారు. 1656 మార్చి 30న ముట్టడి అంత మయింది. గోల్కొండ సుల్తాను చక్రవర్తికి పరిహార కానుకగా 10 లక్షలు నగదూ, రంగీర్ జిల్లా అర్పించుకున్నాడు. సుల్తాను కుమార్తెను ఔరంగజేబు కొడుకు ముహమ్మదు సుల్తాను కిచ్చి పరోక్షంగా వివాహం జరిపారు. సుల్తాను అనంతరం ఆయన అల్లుడు సుల్తా నయేటట్టుగా లోపాయికారీ ఒప్పందం కూడా జరిగింది. మీర్‌జుమ్లా గోల్కొండ రాజ్యానికి ప్రధానమంత్రిగా త్వరలోనే నియమించబడ్డాడు.

పోతే బిజాపూరు అంతు తేల్చవలిసి ఉన్నది. 1656 నవంబరు 4 న ఆదిల్‌షా చనిపోయాడు, 18 ఏళ్ళ వయసు గల ఆయన కొడుకు రాజ్యానికి వచ్చాడు. ఈ కుర్రవాడు చనిపోయిన సుల్తాను కొడుకు కాడనీ, ఎవరి కొడుకుకో తెలియదనీ, అందుచేత బిజాపూరు పై దండెత్తి వెళ్ళటానికి అనుతించవలిసిందనీ ఔరంగజేబు తండ్రికి రాసి అనుమతి పొందాడు. బిజాపూరు పాలకుల వారసత్వ సమస్యలతో ఢిల్లీకి ఎలాటి సంబంధమూ లేదు. ఇది పూర్తిగా అధర్మ యుద్ధం. ఇందులో ఔరంగజేబుకు మీర్‌జుమ్లా సహాయపడ్డాడు. 1657 జనవరిలో దాడి ఆరంభమయింది. మార్చి ఆఖరులో బీదరు దుర్గమూ, ఆగస్టు 1 న కల్యాణీ దుర్గమూ లొంగిపోయాయి.

1657 సెప్టెంబరులో షాజహాఁ మంచాన పడ్డాడు. వెంటనే అతని కొడుకుల మధ్య పదవి కోసం భయంకరమైన పోరాటం ప్రారంభమయింది. షాజహాఁ వ్యాధితోనే గాక, అవమానం తోనూ, కొడుకుల తగవుల వల్ల కలిగిన మానసిక పీడతోనూ తీసుకుని చనిపోయాడు.





# భారత చరిత్ర



షాజహాఁ 1657 లో జబ్బుపడే నాటికి అతని నలుగురు కొడుకులూ బాగా పెద్ద వాళ్ళే—దారాషుకోహ్ (43), షుజా (41), ఔరంగజేబు (39), మురాద్ (33). వీళ్ళు కాక ఆయన కిద్దరు కుమార్తె లుండే వారు; పెద్దది జహాఁఆరా దారాషుకోహ్ పక్షం, రెండోది రోషనారా ఔరంగజేబు పక్షం.

అందరిలోకీ తండ్రికి ఆత్మీయుడు దారా. అతనే తన అనంతరం రాజ్యానికి రావాలని షాజహాఁ కోరిక. దారా మతం విషయాలలో ఉదార భావం కలవాడు; వేదాంతమూ, బైబిలూ, సూఫీ గ్రంథాలూ చదివాడు. అతను బ్రాహ్మణపండితుల సహాయంతో అథర్వవేదాన్నీ, ఉపనిషత్తులనూ పర్షియను భాష లోకి అనువదింప జేశాడు.

రెండవవాడు షుజా బెంగాలుకు గవర్నరుగా ఉండేవాడు. అతను తెలివిగలవాడూ, యుద్ధంలో పరాక్రమం కలవాడు అయిన మాట నిజమే కాని, మితిమీరిన భోగలాలసత్వం మూలంగా అతనికి కార్యదీక్ష, మెలకువా ఉండేవి కావు. నాలుగోవాడు మురాద్ గుజరాతు గవర్నరు. అతను నిష్కపటీ, ఉదారుడూ, సాహసీ, కాని పెద్ద తాగుబోతు; నాయకత్వానికి పనికిరానివాడు.

మూడో వాడైన ఔరంగజేబే అన్నివిధాలా అందరి కంటె కూడా సమర్థుడు; కష్టపడి పని చేసేవాడు; రాజనీతి లోనూ యుద్ధతంత్రం లోనూ ప్రవీణుడు; అసాధారణమైన పరిపాలనాదక్షత కలవాడు.

షాజహాఁకు జబ్బు చేసినప్పుడు ఆగ్రాలో దారా ఒక్కడే ఉన్నాడు. ఈ వార్త వింటూనే అతని తమ్ములు, తమ తండ్రి నిజంగా పోయే ఉంటాడనీ, ఆ సంగతి దారా కప్పిపెట్టాడనీ అనుమానించారు. బెంగాలు రాజధాని అయిన రాజమహాలులో ఉన్న షుజా తానే చక్రవర్తినని ప్రకటించు

## 49. షాజహాఁ సంతానం





కుని, ఢిల్లీకి బయలుదేరాడు. వారాణసి దాకా వెళ్ళాక అతన్ని తిరిగి బెంగాలుకు తరిమారు.

మురాద్ కూడా అహమ్మదాబాదులో తానే చక్రవర్తి నని 1657 డిసెంబరు 5 వ ప్రకటించుకున్నాడు. మాల్వా లో అతను ఔరంగజేబును కలుసుకున్నాడు. ఇద్దరూ కలిసి దేవుడి పైనా, ప్రవక్త పైనా ప్రమాణం చేసి ఒక ఒప్పందం చేసుకున్నారు. దాని ప్రకారం, కొల్లగొట్టే ధనంలో ఒక వంతు మురాద్‌ది, రెండు వంతులు ఔరంగజేబుది; సామ్రాజ్యం గెలుచుకున్నాక పంజాబు, అఫ్ఘానిస్తాను, కాశ్మీరు, సింధు దేశాలు మురాద్‌కు చెందుతాయి, వాటికి అతను స్వతంత్ర రాజుగా ఉంటాడు.

వీ రిద్దరూ తమ తమ సేనలను వెంట బెట్టుకుని దండయాత్ర బయలుదేరారు. షాజహాఁ వారి పైకి జోధపూరు రాజైన జస్వంతసింహుణ్ణీ, కాసిమ్‌ఖాన్ అనే వాణ్ణీ సేనలతో పంపాడు. ఉభయ పక్షాలూ ధర్మాత్ (ఉజ్జయినికి 14 మైళ్ళు) వద్ద, 1658 ఏప్రిలు 15న తలపడ్డాయి. ఈ యుద్ధంలో ఔరంగజేబుకు చారిత్రక మైన విజయం లభించింది. జస్వంత సింహుడు పారిపోయి జోధపూరు చేరితే అతని భార్య కోటద్వారాలు మూయించింది.



ఔరంగజేబు, మురాద్‌లు విజయులై, చంబల్ నది దాటి, ఆగ్రాకు 8 మైళ్ళు తూర్పుగా ఉన్న సమూగర్ మైదానాన్ని చేరే సరికి, దారా 50 వేల సేనతో వారిని ప్రతిఘటించాడు. దారుణమైన యుద్ధం జరిగింది. అందులో దారా ఎక్కిన ఏనుగు దెబ్బతిన్నది. అతను దాని నుంచి దిగి గుర్ర మెక్కాడు. దారా ఎక్కిన ఏనుగు అంబారీ ఖాళీగా ఉండటం చూసి, అతను చచ్చా డనుకుని, చావగా మిగిలిన అతని సైనికులు పారిపోయారు. విధిలేక దారా కూడా ఆగ్రాకు పారిపోయాడు. అతని సైనిక శిబిరం, ఫిరంగులతో సహా, ఔరంగజేబుకు





చిక్కింది. సమూగర్ యుద్ధంతో షాజహాఁ వారసుడు ఔరంగజేబని తేలిపోయింది. అతను ఆగ్రా పైకి ఎత్తివచ్చి, జూను 8న కోటను వశపరుచుకున్నాడు; కోటను రక్షించటానికి కోటలో వారు చేసిన ప్రయత్నాలు ఫలించలేదు. షాజహాఁ తన కొడుకుకు బందీ అయిపోయాడు. తనను ప్రతిఘటించిన కోటలో వారికి శిక్షగా యమునా నదీ జలం కోటకు వెళ్ళకుండా ఔరంగజేబు నిరోధిస్తే, షాజహాఁ బావుల లోని ఉప్పునీరు తాగవలసి వచ్చింది. ఆయన తన కొడుక్కు, "హిందువులు యోగ్యులు, చచ్చిపోయిన తండ్రులకు జల తర్పణా లిస్తూనే ఉంటారు. నువు మహ గొప్ప ముసల్మానువై ఉండి బతికుండగానే నాకు నీరు లేకుండా చేశావు," అంటూ ఒక పద్యం రాసి పంపాడు.

షాజహాఁ సాదా సౌకర్యాలు కూడా లేని సామాన్య ఖైదీగా ఉంచబడ్డాడు. తన తండ్రి పాట్లను గురించి జహాఁఆరా ఎన్ని విజ్ఞాపనలు చేసినా ఔరంగజేబు పెడచెవిని బెట్టాడు. రాను రాను షాజహాఁ తన పరిస్థితికి అలవాటు పడిపోయి, వైరాగ్యం అవలంబించి, అస్తమానమూ మతం లోనే మునిగి ఉంటూ, జహాఁఆరా ఒక్కతే తోడుగా కాలం గడిపి, 1666 జనవరి 22న తన 74వ ఏట మరణించాడు.

ఔరంగజేబు ఎత్తులు ఈపాటికి మురాద్ తెలుసుకున్నాడు. 1658 జూన్ 13న ఔరంగజేబు ఆగ్రా నుంచి ఢిల్లీకి వెళుతుండగా, రూపనగరు వద్ద అతను అన్నకు ఎదురు తిరిగాడు. ఔరంగజేబు అతన్ని యుక్తితో బందీగా పట్టుకుని, మూడేళ్ళ పాటు వేరు వేరు జైళ్ళలో ఉంచి, 1661 డిసెంబరు 4న మరణదండనకు గురి చేశాడు. ఈ లోపలనే, అంటే 1658 జులై 21న, ఔరంగజేబు ఢిల్లీలో చక్రవర్తిగా అభిషిక్తు డయాడు.





# భారత చరిత్ర




ఔరంగజేబు పట్టాభిషేకం రెండు మార్లు జరిగింది. అతను అగ్రా అక్రమించగానే, 1658 జులై 21 న, మొదటిసారి పట్టాభిషిక్తు డయాడు. అతని రెండవ పట్టాభిషేకం 1659 జూన్‌లో అత్యంత వైభవోపేతంగా జరిగింది. ఈ మధ్యకాలంలో అతను తన శత్రుశేషాన్ని నిర్మూలించాడు. షుజా 1659 జనవరి 5న అలహాబాదు సమీపంలో ఖజ్వాహ్ వద్ద చిత్తుగా ఓడించబడి మీర్ జుమ్లా చేత ఢాకా దాటి అరాకాన్ దాకా తరుమబడి, తరవాత పత్తా లేకుండా పోయాడు. దారా షుకోహ్ ఢిల్లీ నుంచి లాహోరు పారిపోయి, అక్కడి నుంచి సకుటుంబంగా ముల్తాను చేరి, అక్కడి నుంచి తరుమబడి గుజరాతుకుపోయి, తరవాత అజ్మేరుకు నాలుగు మైళ్ళ దూరాన గల దేవరాయ్ వద్ద మూడురోజులు ఔరంగజేబు బలాలతో పోరాడి, ఓడిపోయి, భారత దేశంలో నిలువ నీడ కానక, సరిహద్దుకు పారిపోతూ, దారిలో తన భార్య అయిన నాదిరాబేగమ్‌ను కోల్పోయి, దైవోపహతుడై, మిత్రుడనుకున్న అఫ్ఘాన్ నాయకుడి చేత వంచించబడి, ఔరంగజేబుకు భృత్యుడైన బహాదుర్‌ఖాన్‌కు చిక్కి, 1659 ఆగస్టు 30 న శిరశ్ఛేదం పొందాడు.

ఔరంగజేబు "ఆలమ్‌గీర్" (ప్రపంచ విజేత) అనే బిరుదుతో సింహాసనం ఎక్కాడు. రెండు శతాబ్దాలుగా విస్తరించుతూ ఉండిన మొగలు సామ్రాజ్యం ఇతని హయాంలో మరింత జోరుగా విస్తరించింది. అతని కింది అధికారులు అతనికి కొత్త రాజ్యాలు సంపాదించి పెట్టారు. బిహారు గవర్నరయిన దావూద్‌ఖాన్ 1661 లో పలమౌ జయించి పెట్టాడు. ఆ యేడే, బెంగాలు గవర్నరయిన మీర్ జుమ్లా అహోమ్‌ల పై దండెత్తాడు.

50. ఔరంగజేబు—సామ్రాజ్యవిస్తరణ







ఆహోమ్‌లు మంగోలు జాతికి చెందినవారు. వారు 13 వ శతాబ్ది లోనే ఎగువ బర్మా నుంచి బ్రహ్మపుత్రానదీ లోయ లోకి వచ్చి దాన్ని ఆక్రమించుకుని, క్రమంగా తమ రాజ్యాన్ని విస్తరింప జేసుకుని, హిందూ మతాచారా లవలంబించి స్థిరపడ్డారు.

మీర్‌జుమ్లా పెద్ద సేనతో 1661 నవంబరులో ఢాకా నుంచి కదిలి ఆహోమ్‌ల అధీనం నుంచి కూచిబిహారునూ, అస్సామునూ జయించి, 1662 మార్చి 17న ఆహోముల రాజధాని అయిన గఢ్‌గాంవ్ చేరాడు. మీర్‌జుమ్లా శత్రువులతో కన్న ప్రకృతితో హెచ్చుగా పోరాడి చివరకు ఎలాగో విజయం సాధించాడు. ఆహోమురాజు జయధ్వజుడు సంధికి వచ్చి, యుద్ధపరిహారమూ, ఏటా కప్పమూ చెల్లించటానికి ఒప్పుకున్నాడు. మీర్‌జుమ్లా ఢాకాకు తిరిగి వస్తూ, 1633 మార్చి 30 న దారిలో చనిపోయాడు. ఆహోములు కామరూపా రాజ్యాన్ని తిరిగి ఆక్రమించుకున్నారు.

మీర్‌జుమ్లా స్థానంలో బెంగాలు గవర్నరుగా వచ్చిన షైస్తఖాన్, ఔరంగజేబుకు మేనమామ కొడుకు. అతను దాదాపు 30 ఏళ్ళపాటు ఆ పదవిలో ఉండి, పోర్చుగీసు సముద్రపు దొంగలను శిక్షించాడు.



వాయువ్య సరిహద్దు ఔరంగజేబుకు తీరని సమస్య అయింది. ఆ ప్రదేశంలో జీవించే వివిధ అఫ్ఘాన్ తెగలవారు దృఢమైన వాళ్ళు, భూమి సారరహిత మైనది. అందుచేత వారు బందిపోటు ముఠాలుగా తయారయి, పంజాబు రాష్ట్రం లోని పట్టణాలను కొల్లగొట్ట సాగారు. మొదట్లో ఔరంగజేబు వారిని డబ్బుతో కొనజూచాడు, కాని కొండ జాతులవాళ్ళ మీద ఆ ఎత్తు పారలేదు. 1667 ఆరంభంలో భాగూ అనే వాడి నాయకత్వం కింద యూసుఫ్‌జాయీలు సాయుధ పితూరీ సాగించారు. వారి దళాలు హజార జిల్లా మీదా, పశ్చిమ పెషావర్, అటోక్







జిల్లాల మీదా విరుచుకు పడ్డాయి. ఆ పితూరీ అణచ బడింది. 1672 లో అక్మల్‌ఖాన్ నాయకత్వాన అఫ్రీదీలు మొగలుల పై తిరగబడ్డారు. వారితో యుద్ధం చేసి మొగలులు ఘోరంగా ఓడిపోయారు.

అక్మల్‌ఖాన్ ఖ్యాతి మిన్ను ముట్టింది. అటోక్‌కూ కందహారుకూ మధ్య నున్న పఠాను లందరూ యుద్ధసన్నద్ధు లయారు. ఖత్తక్ తెగకు చెందిన పఠానులు అఫ్రీదీలతో చేరారు. వారి నాయకుడు ఖూష్‌హాల్‌ఖాన్ గొప్ప కవి. అతను తన కలం తోనూ, కత్తి తోనూ తన అనుచరులను జాతీయ పోరాటానికి పురికొల్పాడు. 1674 ఫిబ్రవరిలో అఫ్ఘానులు సామ్రాజ్య సేనలను ప్రతిఘటించారు. ఆ యుద్ధంలో మొగలు సేనాపతి షుజావత్‌ఖాన్ చచ్చాడు. అతని సేన కొంత బతికి బయటపడింది.

ఈ దుర్ఘటనతో ఔరంగజేబు మేలుకుని, సరిహద్దురాష్ట్రంలో సామ్రాజ్యం పరువు నిలిచి ఉండటానికి గట్టి యత్నం అవసరమని గ్రహించాడు. అతను 1674 జులైలో పెషావరు ప్రాంతానికి వెళ్ళి, తన రాజ నీతి నంతా ఉపయోగించి, బహుమానాలూ, పింఛనులూ, పదవులూ, జాగీర్లూ ఇచ్చి, వశమైనవారిని వశపరచుకుని, వశం కాని వారిని సైనిక బలంతో నిర్జించాడు. ఈ "విభజించి పాలించే" సమరస విధానంలో అఫ్ఘానిస్తాను గవర్నరైన అమిన్‌ఖాన్, అతని భార్య సాహిబ్‌జీ ఇచ్చిన సలహాలు ఔరంగజేబుకు బాగా తోడ్పడ్డాయి. (విభజించి పాలించటాన్ని ఔరంగజేబు, "రెండు ఎముకలను ఒకదాని కొకటి వేసి కొట్టి, రెంటినీ విరవటం" అనేవాడు.)

మొగలుల సరిహద్దు యుద్ధాలు విజయవంతమే అయినా, మొగలాయీ సేనలు సరిహద్దులో హెచ్చుగా నియోగించబడి ఉండటం, శివాజీ సాధించిన విజయాలకు కారణభూతమై చివరకు చెరుపే చేసింది.





# భారత చరిత్ర




ఔరంగజేబు దీక్షగల సున్నీ ముసల్మాను. ఆయన పరిపాలనను మతం నుంచి వేరుగా ఉంచక, కురాను సిద్ధాంతాల ప్రకారం పాలన సాగించాడు. వేడుకలూ, నృత్య గానాలూ నిషేధించాడు. ఆయనను "సింహాసన మెక్కిన సన్యాసి" అన్నారు. 1679లో మతాంతరుల పై జిజియా పన్ను పునరుద్ధరించాడు. ఆయన మతాన్నీ, పరిపాలననూ ఏకం చెయ్యటం పొరపాటు.

ఔరంగజేబు ప్రవేశపెట్టిన కొత్త విధానాలపై మొట్టమొదటగా తిరుగుబాటు చేసినవారు మథురకు చెందిన జాట్‌లు. గోక్లా అనే జమీందారు నాయకత్వం కింద వారు 1669 లో ఒక పితూరీ చేసి, ఫౌజ్‌దారైన అబ్దున్ నబీ అనే వాణ్ణి చంపేసి, వాడి దౌష్ట్యం నుంచి ఒక ఏడాదిపాటు విముక్తి పొందారు. తరవాత హసన్ అలీ ఖాన్ అనే వాడు సేనతో సహా కొత్త ఫౌజ్‌దారుగా వచ్చి, గోక్లాను చంపి, అతని కుటుంబం వారికి ఇస్లామ్ మత మిప్పించాడు. 1685 లో రాజారామ్ నాయకత్వం కింద జాట్‌లు తిరిగి విజృంభించారు. 1688 లో వారు సికంద్రా వద్ద గల అక్బరు సమాధిని కొల్లగొట్టారు. రాజారామ్ చంపబడ్డాడు, ఈ తిరుగుబాటు కూడా అణచబడింది.

ఔరంగజేబు పై రెండవ తిరుగుబాటు చేసినవాడు ఛత్రసాల్ అనే బుందేలా రాజు. ఛత్రసాల్ తండ్రి చంపత్‌రాయ్ కూడా ఔరంగజేబు పై తొలిరోజులలో తిరగబడ్డాడు గాని, తాను చక్రవర్తికి బందీగా చిక్కే ప్రమాదం ఏర్పడే సరికి ఆత్మహత్య చేసుకున్నాడు. శివాజీని చూసి ఛత్రసాల్ తన మతం కోసమూ, బుందేలా స్వాతంత్ర్యం కోసమూ వీరోచితంగా పోరాడి, మొగలుల పై అనేక విజయాలు సాధించాడు. బుందేల్ ఖండ్, మాల్వాల లోని హిందువులు అతని

## 51. ఔరంగజేబు—తిరుగుబాట్లు



వెనక దృఢంగా నిలబడ్డారు. మాల్వా తూర్పు ప్రాంతంలో అతను స్వతంత్ర రాజ్యం ఏర్పరచుకుని, 1731 లో తాను మరణించిన దాకా ఏలాడు. అతని రాజధాని పన్నా.

ఔరంగజేబు మొదటిసారిగా సిక్కులను తనకు శత్రువులు చేసుకున్నాడు. 15, 16 శతాబ్దులలో దేశంలో మత పునరుద్ధరణోద్యమం ప్రబలినప్పుడు గురునానక్ సిక్కు మతాన్ని స్థాపించాడు. నానక్ అనంతరం అంగద్, అమర్‌దాస్, రామదాసులు సిక్కు గురువు లయారు. అక్బరుకు రామదాసంటే అమిత భక్తి ఉండేది. ఆయన రామదాసుకు అమృతసర్ వద్ద కొంత భూమి ఇచ్చాడు. అక్కడ ఒక కొల నుండేది. దానిని పెద్దది చేసి, అక్కడ సుప్రసిద్ధమైన దేవాలయం నిర్మించారు.

అయిదవ సిక్కుగురు వైన అర్జన్‌మల్ (1581-1606) సిక్కు మతాన్ని బాగా వ్యాపింపజేసి, "ఆదిగ్రంథం" రచించాడు. ఇదే సిక్కుల తొలి మతగ్రంథం. ఆయన కాలంలో ధనం కూడా బాగా పోగయింది. వెనుకటి గురువుల లాగా కాక ఈయన రాజకీయాలలో ప్రవేశించి, ఖుస్రవ్‌ను బల పరిచాడు. ఆ కారణంగా జహంగీర్ ఈయ



నను రాజద్రోహిగా ప్రకటించి 1606 లో చంపించాడు. ఆయన కొడుకు హరగోవింద్ గురువై, సేనలను సమీకరించి, 1628 లో సంగ్రామ అనే చోట మొగలు సేనలపై విజయం కూడా సాధించాడు.

1668 లో, తేగ్ బహదుర్ అనే సిక్కు గురువు చక్రవర్తి పై కత్తికట్టి, కాశ్మీరు లోని బ్రాహ్మణులను రెచ్చగొట్టాడు. ఔరంగజేబు ఆయనను పట్టి ఢిల్లీకి తెప్పించి, "ఇస్లామ్ మతం పుచ్చుకుంటావా, తల ఇచ్చుకుంటావా?" అని అడిగాడు. తేగ్‌బహదుర్ తల ఇవ్వటానికే సిద్ధ పడ్డాడు. ఔరంగజేబు ఆయన తల తీయిం





చటంతో సిక్కులు మొగలుల పైన యుద్ధానికి తలపడ్డారు.

తేగ్‌బహదుర్ కొడుకు గురుగోవింద్ అపూర్వ భారతీయ వ్యక్తులలో ఒకడు. ఆయన సిక్కుల ఈ నాటి ఆచారాలన్నీ తీర్చిదిద్ది, వారు శత్రువులకు వెన్ను చూపరాదన్న నియమం ఏర్పాటు చేశాడు, గొప్ప వీరుడు, మొగలులతో పోరాటాలు జరిపాడు.

మొగలు సామ్రాజ్యానికి ఎంతో సేవ చేసిన రాజపుత్రులను శత్రువులుగా చేసుకుని ఔరంగజేబు చాలా నష్టపడ్డాడు. ఆయన తొందరపడి, రాజా జయసింగ్ మరణానంతరం అంబరునూ, జస్వంత సింగు మరణానంతరం మార్వారునూ తన అధీనంలోకి తీసుకున్నాడు. దానితో రాజపుత్ర కుటుంబాలు రెచ్చిపోయాయి. మార్వారుకు చెందిన రాథోడ్‌లూ, మేవారుకు చెందిన సిసోదియాలూ ఏకమయారు. దుర్గాదాసు అనే అపూర్వ వ్యక్తి వారికి తోడయాడు. దుర్గాదాసు భీష్మద్రోణులను పోలిన వ్యక్తి. ఆయన ప్రభుభక్తీ, పరాక్రమమూ, యుద్ధ నీతీ అసమానమైనవి.

ఔరంగజేబు రాజపుత్రస్థానం మీదికి తన కొడుకుల వెంట సేనలను పంపాడు. చితోడ్ సులువుగా అధీనమయింది. అక్బరు రాజకుమారుడి కింద కొంత సేనను చితోడ్ వద్ద ఉంచి, ఔరంగజేబు మిగిలిన సేనతో అజ్మీరు పైకి వెళ్ళాడు. రాజపుత్రులు అక్బరు సేనల పై భయంకరమైన గొరిల్లా యుద్ధం సాగించి, మొగలు సేనను "స్తంభింప" జేశారు. ఈ అపజయానికి అక్బరు అసమర్థతే కారణమని ఔరంగజేబు అతన్ని సేనా నాయకత్వం నుంచి తొలగించి అవమాన పరిచాడు. రాజపుత్రుల సహాయం యొక్క విలువ తెలిసిన అక్బరు 70 వేల రాజపుత్ర సేనతో తన తండ్రినే ఎదిరించ యత్నించాడు గాని, అతని అవివేకం వల్లనే ఆ ఎత్తు పారలేదు.





# భారత చరిత్ర



ఔరంగజేబు పరిపాలనా కాలంలో సగం ఉత్తరదేశ వ్యవహారాలు చూడటంలోనే గడిచిపోయింది. దక్కను (దక్షిణదేశ) వ్యవహారాలను ఆయన వైస్రాయిలు (రాజ ప్రతినిధులు) చూస్తూవచ్చారు. దక్కను లోని సుల్తానులు తాము తిన్న దెబ్బల నుంచి కోలుకోని కారణంగా అక్కడ మహారాష్ట్ర సామ్రాజ్యం దృఢపడి, మొగలు సామ్రాజ్యానికీ, అధికారానికీ సవాలుగా నిలబడ సాగింది.

ఈ సంగతి మొదట ఔరంగజేబు గుర్తించ లేదు. తన కొడుకు అక్బరుకూ, మహారాష్ట్రరాజు శంభాజీ (శివాజీ కొడుకు)కీ సఖ్యత పొసగటం చూసి ఔరంగజేబు తన దక్కను విధానాన్ని మార్చుకున్నాడు. ఆయన మేవారుతో సంధి చేసుకుని, 1681 జూనులో సైన్యసమేతంగా దక్కనుకు బయలుదేరాడు.

అక్బరును పట్టుకొనటానికి ఔరంగజేబు నాలుగేళ్ళ పాటు విశ్వప్రయత్నం చేశాడు; మహారాష్ట్రులతో యుద్ధాలు చేసి విఫలుడయాడు. కొన్ని మహారాష్ట్ర దుర్గాలను మొగలులు జయించిన మాట నిజమే గాని, శివాజీ చేత ఉత్తేజితులైన మహారాష్ట్రులను అణచివెయ్యటం సాధ్యం కాలేదు.

అటు తరవాత ఔరంగజేబు దక్కను సల్తనతులను జయించే పనికి పూనుకున్నాడు. 1685 ఏప్రిలు 11 న మొగలు సేనలు బిజాపూరును ఆఖరుసారి ముట్టడించాయి. మరుసటేడు జులైలో ఔరంగజేబు స్వయంగా అక్కడికి వెళ్ళాడు. ఆదిల్‌షాహీ వంశానికి ఆఖరు వాడైన సికందర్ సుల్తాను చక్రవర్తికి లొంగిపోయాడు. యూసుఫ్ ఆదిల్‌షా వంశం అక్కడితో అంతమయింది. ఔరంగజేబు బిజాపూరునగరం ప్రవేశించి సికందర్ రాజభవనం లోని చిత్తరువులనూ,

## 52. ఔరంగజేబు—దక్కను విజయాలు



కుడ్య చిత్రాలనూ పూర్తిగా ధ్వంసం చేయించాడు. బిజాపూరు స్వాతంత్ర్యం కోల్పోవటమే గాక పాడుపడిపోయింది కూడా.

1687 ఫిబ్రవరిలో ఔరంగజేబు తన బలాలను గోల్కొండకు తీసుకుపోయి కోటను ముట్టడించాడు. ఈ ముట్టడిని గోల్కొండ 8 మాసాల పాటు విజయవంతంగా ప్రతిఘటించింది. గోల్కొండ సుల్తాను అబుల్ హసన్ కొలువులో ఉంటున్న అబ్దుల్లాపనీ అనే అఫ్ఘాన్ వాడు ఔరంగజేబుకు అమ్ముడుపోయి, కోట ముఖద్వారం తెరిచి, మొగలు సేనలను కోటలో ప్రవేశించనిచ్చాడు. గోలకొండ ఔరంగజేబు వశమయింది.

అబుల్‌హసన్ దౌలతాబాదుకు వెళ్ళిపోయి, ఏడాదికి 50,000 రూపాయల భరణం తీసుకున్నాడు.

దక్కను సల్తనతులను వశపరచుకున్నాక ఔరంగజేబు మహారాష్ట్ర విజృంభణను అణచటానికి పూనుకున్నాడు. ప్రారంభంలో అయన ప్రయత్నాలు విజయవంతమయాయి. 1689 మార్చి 11 న శంభాజీ మరణ శిక్ష పొందాడు. రాయగఢ్ పట్టుబడింది. అయన తమ్ముడు రాజారాం ఒక్కడే మొగలులకు చిక్కకుండా పారి



పోయాడు. మిగిలిన అయన కుటుంబం ఖైదీలుగా పట్టుబడింది.

అటు తరవాత తంజావూరు, తిరుచినాపల్లి రాజ్యాలు కూడా ఔరంగజేబుకు లోబడి కప్పాలు కట్టాయి. 1690 నాటికల్లా ఔరంగజేబు దాదాపు యావద్భారతానికి సామ్రాట్టు అయాడు. అయితే ఈ ఉచ్ఛదశే ఆయన పతనానికి నాంది కూడా అయింది. ఇంతగా విస్తరించుకున్న మొగలు సామ్రాజ్యాన్ని ఒక్క రాజధాని నుంచి ఒక్క వ్యక్తి పాలించటం సాధ్యమయే పనికాదు. ఔరంగజేబుకు అంతటా శత్రువులు పుట్టుకొచ్చారు. వారిని జయించ





వచ్చుగాని, అణచివెయ్యటం సాధ్యం కాదు. ఉత్తర భారతంలోనూ, మధ్య భారతంలోనూ అరాజక పరిస్థితు లేర్ప డ్డాయి. పరిపాలనలో తాత్సారమూ, అవినీతీ ప్రబలింది. దక్కనులో మారుమూల ఉన్న చక్రవర్తికి తన ఉద్యోగులను అదుపుచేసే దారిలేదు. రాజపోషణ లేని కారణం చేత కళాసంస్కృతులు ఏనాడో దెబ్బతిన్నాయి. సుదీర్ఘమైన ఔరంజేబు పరిపాలనా కాలంలో ఒక చక్కని కట్టడం గాని, కళాఖండంగాని, కావ్యం గాని ఔరంగజేబు పరిపాలనకు అంకితం కాలేదు. దక్కను యుద్ధాలతో ఖజానా ఖాళీ అయింది. స్థానిక పాలకులూ, జమీందార్లూ రాజశాసనాన్ని ధిక్కరించి యథేచ్ఛగా ప్రవర్తించారు. జీతాలు సక్ర మంగా ముట్టక సైనికులు తిరుగుబాటు చేశారు. చక్రవర్తి కుటుంబ పోషణకూ, సేనకూ బెంగాలు నుంచి గడువు తప్ప కుండా వచ్చే కప్పమే ఆధారమయింది.

ఇంత జరిగినా మహారాష్ట్రులు లొంగి రానేలేదు. 1691 లో వారు తిరిగి తమ శక్తులను కూడగట్టుకుని మొగలులపై జాతీయసమరం సాగించారు. వారికి కొంత కాలంపాటు రాజారాం నాయకత్వం వహిం చాడు, 1700 లో రాజారాం మరణా నంతరం వీరనారి అయిన ఆయన భార్య తారాబాయి మహారాష్ట్రులకు నాయకత్వం వహించింది.

శిథిల మవుతున్న తన సామ్రాజ్యాన్ని ఎలాగైనా కాపాడుకుందామని ఔరంగజేబు దాన్ని తన కొడుకులకు విభజించుదా మనుకున్నాడు. కాని కొడుకులు తండ్రి మాట వినలేదు. 1707 మార్చి 3 న ఔరంగజేబు అహ్మద్‌నగరులో ప్రాణాలు విడిచాడు. ఆయన భౌతిక దేహాన్ని దౌలతా బాదుకు తెచ్చి, బుర్హానుద్దీన్ అనే ప్రఖ్యాత ముస్లిముసాధువు సమాధి ఉండే ఆవర ణలో సమాధి చేశారు.





# భారత చరిత్ర



దేవగిరిని యాదవ రాజులు పాలించిన కాలంలో మహారాష్ట్రులు ఉత్తమమైన రాజకీయ, సాంస్కృతిక సంప్రదాయాలు నెలకొల్పుకున్నారు. కాని, అలా ఉద్దీన్ హయాంలో యాదవ రామచంద్రదేవుడు పతనం కావడంతో వారు తమ స్వాతంత్ర్యాన్ని కోల్పోయారు. అయితే మరి నలభై సంవత్సరాల అనంతరం వారిలో తిరిగి చైతన్యం కానవచ్చింది. బహమనీ రాజ్యంలోనూ, దాని అనంతరం వెలసిన సల్తనతులలోనూ వారు ప్రముఖ పాత్ర నిర్వహించి, 17వ శతాబ్ది ఉత్తరార్థంలో భారత చరిత్రలోనే అత్యంత ప్రాముఖ్యం సంపాదించుకున్నారు. ఈ శతాబ్దిలోనే మహారాష్ట్రులకొక జాతీయ రాజకీయ వ్యవస్థ ఏర్పాటయింది. వారి జాతీయ సమైక్యతను సాధించినది శివాజీ అయినప్పటికీ అతనికి పూర్వమే చాలా దోహదం జరిగింది.

అందుకు అనుకూలించిన అంశాలలో మహారాష్ట్ర నైసర్గిక స్వరూప స్వభావాలు కూడా ఉన్నాయి. మహారాష్ట్రం సులువుగా జయింపదగినది కాదు. ఉత్తరదక్షిణాలుగా ఉన్న సహ్యాద్రీ, తూర్పుపడమరలుగా ఉన్న వింధ్య, సాత్పుర పర్వతశ్రేణీ, నర్మదా, తపతీ నదులూ, దుర్జేయమైన అనేక కొండదుర్గాలూ మహారాష్ట్రానికి అంగరక్షలు. అక్కడి భూమి రాతి భూమి, వర్షం తక్కువ, వ్యవసాయానికి అనుకూలం కాదు; అందుచేత మహారాష్ట్రులలో భోగలాలసతా, బద్ధకమూ లేవు. వారిలో ఆత్మవిశ్వాసమూ, కృషీ, నిష్కపటమూ, ధైర్యమూ, కష్టజీవనంతో సంతృప్తీ, సాంఘిక సమతా, అభిమానమూ జాస్తి. ఏకనాథ్, తుకారామ్, రామదాస్, వామన పండిత్‌ల లాటి మత సంస్కర్తలు మహారాష్ట్రులకు శతాబ్దాల తరబడి సర్వమానవ





సమానత్వమూ, దైవభక్తి నూరిపోశారు, కులాన్ని బట్టీ, హోదాను బట్టీ అధిక్యత రాదన్నారు, కర్మ మార్గాన్ని బోధించారు. వీరి బోధల ఫలితంగా మహారాష్ట్రులలో కలిగిన ఉత్తేజనం విప్లవానికి నాంది అయింది. శివాజీ గురువైన రామదాస్ సమర్థ్ (సమర్థ రామదాసు) తాను రచించిన "దాసబోధ" అనే గ్రంథం ద్వారానూ, మఠాలలో శిష్యులకిచ్చిన బోధలద్వారానూ, సంఘ సంస్కరణకూ, జాతీయ పునరుజ్జీవనానికీ అపారంగా తోడ్పడ్డాడు. సాంఘిక విప్లవకారు లందరూ తమ గేయాలను మహారాష్ట్ర భాషలో రచించారు. 15, 16 శతాబ్దులలో శక్తివంతమైన మహారాష్ట్ర సాహిత్యం ఏర్పడి, ప్రజలలో గొప్ప చైతన్యం తెచ్చిపెట్టింది. వీటన్నిటినీ బట్టి శివాజీ మహారాష్ట్రాన్ని ఏకచ్ఛత్రం కిందికి తీసుకురాక పూర్వమే, మహారాష్ట్రులకు ఏక భాషా, ఏక సంస్కృతీ, ఏక జీవనమూ 17వ శతాబ్దిలో ఏర్పడ్డాయి. మిగిలి ఉన్నదల్లా ఏక రాజ్యమే, దాన్ని శివాజీ సాధించాడు. అతని కొడుకులు ఢిల్లీ దురాక్రమణను దీర్ఘకాలం పాటు ప్రతిఘటించారు. పీష్వాల హయాములో మహారాష్ట్ర సామ్రాజ్య విస్తరణ కూడా జరిగింది.



దక్కను సల్తనతులలో కొలువు చేసిన కారణంగా మహారాష్ట్రులకు రాజకీయ పరిజ్ఞానమూ, యుద్ధ తంత్ర పరిజ్ఞానమూ లభించిన మాట కూడా నిజమే. శివాజీ తండ్రి అయిన శాహజీ అహమ్మద్‌నగరు సుల్తాను సైన్యాలలో అశ్విక సైనికుడుగా మొదట చేరి, క్రమంగా ఉన్నతికి వచ్చి, ఆ సంస్థానంలో విస్తృతమైన జాగీర్లు సంపాదించి, నిజామ్‌షాహి పరిపాలన చివరి దశలో తన ఇష్టం వచ్చినవాణ్ణి గద్దె ఎక్కించగల స్థితికి వచ్చాడు. అయన విజయం చూసి ఇతరులకు కన్నుకుట్టింది. అందుచేత, అహమ్మద్‌నగర్ సంస్థానం షాజహాన్ పరమై





నప్పుడు, 1636 లో ఆయన బిజాపూరు సుల్తాను కొలువులో ప్రవేశించాడు. ఇక్కడ కూడా ఆయన ఎంతో కీర్తి సంపాదించి, కర్ణాటక ప్రాంతంలో విస్తృతమైన మాన్యం సాధించాడు. ఇదిగాక, ఆయన అహమ్మద్ నగరు కొలువులో ఉండగా సంపాదించిన పాత జాగీరు ఆయనకు దక్కింది.

శివాజీ శాహజీ పెద్దభార్య కుమారుడు. అతను శివనేర్‌కొండ దుర్గంలో 1630లో జన్మించాడు. (బికనేర్‌కోట లైబ్రరీలో లభించిన శివాజీ జాతకచక్రం ప్రకారం 1627 సరిగా కనబడుతుంది.) శాహజీ తన పెద్ద భార్య అయిన జీజాబాయినీ, తన కొడుకు శివాజీనీ, దాదాజీఖోండదేవ్ అనే సమర్థుడైన బ్రాహ్మణుడికి అప్పగించి, తాను తన చిన్నభార్యతో సహా తన కొత్త జాగీరుకు వెళ్ళిపోయాడు.

జీజాబాయి అమిత ధర్మచింత గలది. ఆమె తన కొడుక్కు పాతకాలపు వీర గాథలూ, నీతి కథలూ చెప్పి, అతనిలో మతాభిమానం రేకెత్తించింది. శివాజీ జీవితం పై అతని తల్లి ప్రభావం అపారం. దాదాజీఖోండదేవ్ కూడా అతనిలో ధైర్య సాహసాలను బాగా నాటాడు.

శివాజీ చదువుకున్నదీ లేనిదీ మనకు తెలియదు. కాని అతను గొప్ప ధీరుడూ, సాహసీగా తయారై, విజాతీయుల నుంచి దేశమాతకు విముక్తి కలిగించాలనే దృఢ సంకల్పాన్ని అలవరుచుకున్నాడు. పశ్చిమ కనుమలలో మావల మనే ప్రాంతం ఉన్నది. దాని నిడుపు 90 మైళ్ళు, వెడల్పు సుమారు 12 లేక 14 మైళ్ళు. అక్కడ కొండజాతివారు నివసిస్తారు. శివాజీకి చిన్నతనంలోనే ఈ మావలీలతో సన్నిహితత్వం ఉండేది. అతను పెద్దవాడయాక ఈ పరిచయం బాగా అక్కరకు వచ్చింది. అతని తొలి సహచరులూ, ఉత్కృష్ట సైనికులూ, ఉత్తమ సేనాపతులూ మావలీలే.





# భారత చరిత్ర



శివాజీ తల్లి దేవగిరిని ఏలిన యాదవరాజ వంశానికి చెందినది, తండ్రి ధైర్యసాహసాలకు పేరుమోసిన మేవారు సిసోదియా సంతతివాడు. సాధారణ మరాఠీ సైనికుడైన శివాజీలో స్వతంత్రరాజ్య స్థాపనకాంక్ష కలిగించే ఆవేశం రెండు పక్షాల నుంచీ సంక్రమించింది. అయితే అది దుస్సాహసంతో కూడిన కోరికే. కాని సాహసం ఫలిస్తే ఊహాతీతమైన లాభాలున్నాయి.

మహారాష్ట్రుల విజృంభణకు దక్కను సల్తనతుల శక్తి తరిగిపోతూ ఉండటమూ, ఢిల్లీ వారికి ఉత్తర దేశంలోనే ప్రతిఘటనలు జాస్తిగా ఉంటూండటమూ దోహదమయింది. శివాజీ 1646 లో తోరణదుర్గం పట్టుకుని, త్వరలోనే రాజగఢదుర్గాన్ని తోరణకు అయిదు మైళ్ళు తూర్పున నిర్మించాడు. దాదాజీ ఖోండదేవ్ ఈ చర్యలను హర్షించినట్టు కనబడదు. 1647లో దాదాజీ ఖోండదేవు మరణించిన మీదట శివాజీకి మరింత స్వేచ్ఛ లభించింది. అతను ఇంకా అనేక దుర్గాలను సంపాదించాడు. వాటిలో కొన్ని బిజాపూరు సంస్థానం తాలూకు స్థానికాధికారులవి, మరి కొన్ని ఇతరులవి. ఈ దుర్గాలను సంపాదించటానికి శివాజీ బలప్రయోగమూ, లంచాలూ, కుయుక్తులూ కూడా అవలంబించాడు. ఇలా సంపాదించిన దుర్గాలు కాక, కొన్ని కొత్త దుర్గాలను కూడా అతను నిర్మించాడు. ఈ విధంగా అతను పెద్ద భూభాగం ఆక్రమించుకుని, దానికి అనేక కొండదుర్గాలను రక్షణగా ఏర్పాటు చేసుకున్నాడు.

శివాజీ చర్యలకుగాను బిజాపూరు సంస్థానం వారు తమ కొలువులో ఉన్న అతని తండ్రిని నిర్బంధంలో ఉంచి, శివాజీ తన దౌష్ట్యాన్ని మానితేనే విడుదల చేస్తామన్నారు. ఆ కారణంగా శివాజీ 1649-56

## 54. శివాజీ విజృంభణ



మధ్యకాలంలో బిజాపూరు సుల్తానులపై ధ్వజమెత్తటం మానుకున్నాడు. అయితే ఈ కాలాన్ని అతను వ్యర్థంగా పోనివ్వక తాను గెలిచిన ప్రాంతాలను బలపరుచుకున్నాడు. జావళీ అనే చిన్న, అర్ధ స్వతంత్ర మరాఠీదేశం చంద్రరావుమోరే పరిపాలనలో ఉండేది; శివాజీ చంద్రరావుమోరేను తన మనుషుల చేత చంపించి, 1656 జనవరిలో జావళీని వశపరుచుకున్నాడు. అప్పటికి శివాజీ రాబడి రెట్టింపుకు పైగా పెరిగింది.

1657 లో శివాజీకి మొగలులతో మొట్టమొదటి సంఘర్షణ ఏర్పడింది. ఆ సమయంలో ఔరంగజేబు తన సేనలతో బిజాపూరును ముట్టడించటం చూసి, శివాజీ మొగలు పాలనలో ఉన్న అహమ్మద్‌నగరు, జున్నర్ల పైన దాడిచేసి జున్నర్‌నగరాన్ని కొల్లగొట్టాడు. వెంటనే ఔరంగజేబు ఆ ప్రాంతాలకు బలాలను పంపి శివాజీని ఓడించాడు. ఆదిల్‌షా ఔరంగజేబుతో సంధి చేసుకున్నప్పుడే శివాజీ కూడా సంధి చేసుకున్నాడు. ఔరంగజేబు శివాజీని ఎంత మాత్రమూ నమ్మలేదు. అయితే తన తండ్రికి చాలా జబ్బుగా ఉండి తాను ఉత్తర దేశానికి వెంటనే వెళ్ళిపోవలసి



ఉండటం చేత ఔరంగజేబు ఏదో ఒక విధమైన సంధికి ఒప్పుకున్నాడు.

తరవాత శివాజీ తన సేనలతో ఉత్తర కొంకణం మీదపడి, కల్యాణ్, భివండీ, మాహులీలను పట్టుకుని దక్షిణాన మాహాడ్ దాకా వెళ్ళాడు.

బిజాపూర్ సుల్తానుకు ప్రస్తుతానికి మొగలుల బెడదలేదు, అందుచేత అతను శివాజీని నిశ్శేషంగా నిర్మూలించటానికి నిశ్చయించి, 1659 ఆరంభంలో అఫ్జల్‌ఖాన్ అనే ప్రసిద్ధసేనాని కింద పెద్ద సేనను పంపుతూ శివాజీనిగాని, శివాజీ శవాన్నిగాని తీసుకురావలిసిందిగా ఆదేశించాడు.







ఒక పక్షంరోజులలో అఫ్జల్‌ఖాన్ సాతారాకు ఉత్తరంగా 20 మైళ్ళలో ఉన్న వాయీ అనే చోటికి చేరాడు. ప్రతాపగఢ దుర్గం నుంచి శివాజీని బయటికి రప్పించటం అతనికి సాధ్యంకాలేదు. అందుచేత అతను తనతో సంప్రతింపులకు రమ్మని శివాజీని ఆహ్వానించటానికి కృష్ణాజీభాస్కర్ అనే ఒక బ్రాహ్మణుణ్ణి పంపాడు. కృష్ణాజీకి గౌరవ మర్యాదలు చూపి శివాజీ, అఫ్జల్ ఖాన్ అసలు ఆలోచన ఏమిటని అడిగాడు. బిజాపూరుసేనాని దురుద్దేశంతో ఉన్నట్టు కనబడుతుందని కృష్ణాజీభాస్కర్ అన్నాడు. అఫ్జల్ వద్దకు శివాజీ దూతగా వెళ్ళివచ్చిన గోపీనాథు డనేవాడు కూడా ఈ మాటే అని ఉండటం చేత శివాజీ జాగ్రత్తపడ్డాడు. అతడు తన దుస్తుల అడుగున కవచం ధరించి, పైకి నిరాయుధుడులాగే కనబడినా రహస్య ఆయుధాలు ధరించి అఫ్జల్‌ను కలుసుకోవటానికి బయలుదేరాడు.

అఫ్జల్ చాలా ఒడ్డూ పొడుగూ గల మనిషి, శివాజీ చాలా పొట్టివాడు. ఇద్దరూ ఆలింగనం చేసుకునే క్షణంలోనే అఫ్జల్ తన ఎడమచేత్తో శివాజీ కంఠాన్ని బలంగా బిగించిపట్టి, కుడిచేత్తో శివాజీని కత్తితో పొడవ యత్నించాడట. కవచం శివాజీని కాపాడింది. మరుక్షణమే శివాజీ తన చేతులకు ఉక్కుగోళ్ళు గల తొడుగులు తగిలించుకుని, వాటి సహాయంతో, అఫ్జల్‌ను చీల్చి చంపేశాడు.

ఆ ప్రాంతాలనే మాటువేసి ఉన్న శివాజీ సైనికులు నాయకుడులేని బిజాపూర్ సైనికులను ఓడించి, వాళ్ళ శిబిరాన్ని కొల్లగొట్టారు.

అఫ్జల్‌ను చంపటంలో శివాజీ ద్రోహం చేసినట్టు కొందరు చరిత్రకారులు రాశారు గాని, ద్రోహం తలపెట్టినవాడు అఫ్జలే నని మరాఠీ చరిత్రకారు లన్నది నిజంగా కనబడుతుంది.







# భారత చరిత్ర



అఫ్జల్‌ఖాన్ మరణా నంతరం శివాజీ దృష్టి దక్షిణకొంకణం మీదికీ, కోల్హాపూరు మండలం మీదికీ మళ్ళింది. అయితే 1660 జులై లో సొదీజౌహర్ నాయకత్వాన బిజాపూరు సేనలు, శివాజీ ఉండిన పనహాలా దుర్గాన్ని చుట్టుముట్టాయి. శివాజీ ఆ దుర్గాన్ని వదిలిపెట్టవలిసి వచ్చింది. త్వరలోనే అతనికి మరొక ప్రమాదం కూడా ఎదురయింది. దక్కనుకు కొత్తగా గవర్నరయిన షైస్తఖాన్, పూనాను అక్రమించి, చాకన్‌దుర్గాన్ని వశపరచుకుని, కల్యాణమండలం నుంచి మహారాష్ట్రులను తరిమేశాడు.

అయితే శివాజీ, మొగలుల సంగతి తేల్చుకునేటందుకు గాను, బిజాపూరుతో సంధి చేసుకున్నాడు. ఈ సందర్భంలో శివాజీకి అతని తండ్రి సహాయం లభించింది; ఆయన బిజాపూరులో ఇంకా ప్రముఖుడుగానే ఉన్నాడు. రెండేళ్ళపాటు శివాజీ బలాలకూ, మొగలు బలాలకూ ఎదురు మదురుగా యుద్ధాలు జరిగాయి. 1663 ఏప్రిలు 15 నాటి రాత్రి శివాజీ కొంత మంది అనుచరులతో సహా రహస్యంగా, పూనాలోని షైస్తఖాన్ మందిరం ప్రవేశించి, చుట్టూ ఉన్న అంగరక్షకులనూ, ఆడబానిసలనూ తప్పుకుని, దక్కను గవర్నరు శయ్యాగారంలోకి వెళ్ళి, అతనిని గాయపరిచి, అతని కొడుకును చంపి, అలాగే ఒక సరదారునూ, నలభైమంది పరిచారకులనూ, ఆరుగురు అంతఃపుర స్త్రీలనూ హతమార్చి, నిరపాయంగా, సమీపంలో ఉన్న సింహగడదుర్గానికి వెళ్ళిపోయాడు. షైస్తఖాన్ చావలేదు గాని, అతని బొటనవేలు పోయింది.

ఈ సాహస చర్యతో శివాజీ కీర్తిప్రతిష్ఠలు పెరిగాయి. త్వరలోనే అతను ఇలాటి సాహసచర్య మరొకటి చేశాడు. 1664





జనవరి 16—20 తేదీల మధ్య అతను సూరత్ పైన పడి, దాన్ని కొల్లగొట్టాడు. పశ్చిమ తీరాన అంత భాగ్యవంతమైన రేవుపట్టణం మరేదీ లేదు.

శివాజీ చేసిన ఇలాటి చర్యలు దక్కనులో మొగలుల కీర్తికీ, పలుకుబడికీ గొడ్డలిపెట్టయాయి. అందుకని ఔరంగజేబు 1665 లో శివాజీని నిర్జించటానికి కొంత సైన్యాన్ని పంపాడు. అంబరు రాజైన జయసింగూ, దిలీర్ ఖాన్ అనే వాడూ ఆ సైన్యానికి అధిపతులు.

జయసింగు రణవిద్యలోనూ, రాజనీతిలోనూ గట్టివాడు. అతను పురందరదుర్గాన్ని ముట్టడించాడు. మొగలులు శివాజీ రాజధాని అయిన రాజగడదుర్గాన్ని కూడా ముట్టడించారు. మొగలులను ప్రతిఘటించడంలో గల కష్టనష్టాలను గ్రహించి, శివాజీ 1665 జూను 22 న జయసింగుతో పురందర వద్ద సంధి చేసుకుని, తన దుర్గాలలో ఇరవై మూడింటిని మొగలుల కిచ్చి, తాను పన్నెండు మాత్రమే ఉంచుకున్నాడు. అతను మొగలులకు దక్కను యుద్ధాలలో సహాయంగా 5,000 అశ్వికసైనికులను తోడివ్వటానికి కూడా ఒప్పుకున్నాడు. తరవాత జయసింగు బిజాపూరు పైన యుద్ధం



చేసినప్పుడు ఆ యుద్ధంలో శివాజీ పాల్గొన్నాడు కూడా. జయసింగు శివాజీకి పెద్ద ఆశలు పెట్టి, ఆగ్రాలోని మొగలుదర్బారుకు వెళ్ళటానికి ఒప్పించాడు. శివాజీ తన కొడుకైన శంభూజీని వెంటబెట్టుకుని బయలుదేరి, 1666 మే 9 న ఆగ్రా చేరాడు.

అయితే మొగలుదర్బారులో శివాజీకి పెద్ద పరాభవం జరిగింది. ఔరంగజేబు అతన్ని 5 వేలకు సర్దారుగా మాత్రమే పరిగణించాడు. శివాజీ అవమానం భరించలేక అల్లరిచేసి మూర్ఛపోయాడు. ఒళ్ళు తెలిశాక అతను పాదుషాను నిందించాడు. పాదుషా అతన్ని నిర్బంధంలో పెట్టించాడు. మరొక







[illegible] పరిస్థితిలో హతాశుడైపోలేదు. కాని శివాజీ ఒక యుక్తి పన్నాడు. [illegible] తనకు వ్యాధి కుదిరినట్టు ప్రకటించి, అందుకు గాను రోజూ బ్రాహ్మణులకు, [illegible] లలో పళ్ళూ, మిఠాయీ, ఖైదు నుంచి బయటికి పంపసాగాడు. కొద్దిరోజులు అయ్యాక కావలివాళ్ళు గంపలను తనిఖీ చెయ్యకుండానే బయటికి పోనిచ్చారు. శివాజీ, అతని కొడుకూ [illegible] గంపలో [illegible] మొగలు వేగులవాళ్ళ కళ్ళలో దుమ్ము జల్లి తప్పించుకుపోయారు. తన కొడుకును మధురలో ఒక మహారాష్ట్ర బ్రాహ్మణ గృహంలో ఉంచి, శివాజీ బిచ్చగాడి వేషంలో అలహాబాదూ, కాశీ, గయా, తెలంగాణాల మీదుగా 1666 నవంబరు 30న స్వస్థలానికి చేరుకున్నాడు.

ఆ తరవాత మూడేళ్ళపాటు శివాజీ మొగలులతో [illegible] వెళ్ళలేదు. ఈ కాలంలో ఔరంగజేబు అతనికి రాజా అనే బిరుదూ, బిరారులో ఒక జాగీరూ ఇచ్చాడు. అయితే 1670 లో తిరిగి శివాజీకీ మొగలులకూ ఘర్షణ ఆరంభమయింది. శివాజీ తాను లోగడ మొగలులకు దత్తం చేసిన దుర్గాలను దాదాపు అన్నిటినీ తిరిగి గెలుచుకున్నాడు. 1670 అక్టోబరులో సూరత్ నగరాన్ని రెండోసారి కొల్లగొట్టాడు.

1674 జూను 16 న శివాజీ ఛత్రపతి అన్న బిరుదుతో రాయగడకు రాజుగా అత్యంత వైభవంతో పట్టాభిషేకం జరుపుకున్నాడు. అతను గోలకొండ సులాను మైత్రి సంపాదించి, ఒక్క సంవత్సరంలోనే జింజీ, వెల్లూరు, పరిసర ప్రాంతాలను జయించాడు (1677). శివాజీ కీర్తితో బాటు అతని రాజ్యం కూడా విస్తరించింది. అందులో 100 దుర్గాలుండేవి. అతని తార ఉచ్చలో ఉండగానే అతను తన 53 వ ఏట, 1680 ఏప్రిలు 14 న మరణించాడు.








# భారత చరిత్ర



శివాజీ కేవలమూ మహావీరుడూ, యుద్ధ తంత్రజ్ఞుడూ మాత్రమే కాదు, పరిపాలనలో చాలా సమర్థుడు. అందుచేత అతను ప్రజా పాలనను సంఘటించటం లోనూ, రాజనీతి లోనూ గొప్ప విజయాన్ని సాధించాడు. ఆయన పరిపాలనలో తానే సర్వాధికారి. అయితే రాజ్యతంత్రం నడపటానికి ఆయన కింద అష్టప్రధాను లుండేవారు. పేష్వా అనే వాడు ముఖ్యమంత్రి. అమాత్యు డనే వాడు ఆర్థికమంత్రి. మంత్రి అనే వాడు రాజుగారి నిత్య కార్యక్రమాల చిఠా తయారు చేసేవాడు. సచివు డనేవాడు రాజుగారికి లేఖకుడుగా ఉంటూ, జమ్మా బందీ పనులు చూస్తాడు. సుమంతు వైదేశిక వ్యవహారాలు చూస్తాడు. సేనాపతి సైన్యానికి అధిపతి, పండిత్‌రావు అనేవాడు రాజ పురోహితుడు. న్యాయాధీశుడు అనేవాడు ప్రధాన న్యాయమూర్తి.

రాజ్యాంగంలో 30 శాఖ లుండేవి. రాజ్యం అనేక రాష్ట్రాలుగా విభజించి ఉండేది. ఒక్కొక్క రాష్ట్రాని కొక రాజ ప్రతినిధి ఉండేవాడు. శివాజీ తన రాజ్యంలో పన్నులు వసూలు చెయ్యటమే గాక, మొగలుల అధీనం లోనూ, బిజాపూరు నవాబు అధీనం లోనూ, పోర్చుగీసువాళ్ళ అధీనం లోనూ ఉండే కొన్ని ప్రాంతాలలో కూడా "చౌథ్" అనే పన్ను వసూలు చేసేవాడు.

శివాజీ తన సైన్యాన్ని కూడా పునర్నిర్మించి, చాలా పటిష్ఠం చేశాడు. అందులో నౌకాశాఖ చేర్చాడు, తన సేనలకు గాను ఫిరంగులూ, తుపాకులూ సంపాదించాడు. శివాజీకి అనేక దుర్గా లుండేవి. ప్రతి దుర్గానికీ సమాన ప్రతిపత్తి గల ముగ్గురు అధికారులు—హవల్దార్, సబ్నీస్, సర్నోబత్— ఉండేవారు. ప్రతి సేన లోనూ అన్ని

**56. శివాజీ పరిపాలన**



కులాల వాళ్ళూ ఉండేటట్టు శివాజీ చూశాడు. సేనలో క్రమశిక్షణ మహానిశితంగా ఉండేది. సేనల వెంట స్త్రీలు ఉండరాదు. ఏ సైనికు డైనా స్త్రీని వెంటబెట్టుకుని వెళితే వాడికి శిరశ్ఛేదమే దండన. బ్రాహ్మణులనూ, గోవు లనూ సైనికులు బంధించరాదు. వాహనా లుగా ఎద్దులను మాత్రం పట్టుకోవచ్చును. యుద్ధకాలంలో సైనికులు నిర్దుష్టప్రవర్త నులై ఉండాలి.

శివాజీ సైన్యం లోని అశ్వికవిభాగంలో 25 అశ్వికులు ఒక దళం. వారి పైన ఒక హవల్దా రుండేవాడు. అయిదుగురు హవల్దా రుల పైన ఒక జుమ్లాదా రుండేవాడు. పదిమంది జుమ్లాదార్ల పైన ఒక హాజారీ ఉండేవాడు. హాజారీల పైన పాంజ్‌హాజా రీలూ, సర్నొబత్ అనే సర్వసేనానీ ఉండే వారు. కాల్బలంలో తొమ్మిదిమంది సైని కులు ఒక దళం, వారి పైన ఒక నాయిక్ ఉండేవాడు. అయిదుగురు నాయికుల పైన ఒక హవల్దారూ, ఇద్దరు, ముగ్గురు హవల్దార్ల పైన ఒక జుమ్లాదారూ, పదిమంది జుమ్లా దార్ల పైన ఒక హాజారీ ఉండేవారు.

యోధుడు గానూ, పాలకుడు గానూ కూడా భారతచరిత్రలో శివాజీకి గల స్థానం గొప్పది. అతను తన ఎదటికి వచ్చిన వాణ్ణి



మంత్రముగ్ధుణ్ణి చేసేసేవాడు: ధైర్యసాహ సాల తోనూ, రాజతంత్రం తోనూ అతను జాగీర్దారు పదవి నుంచి ఛత్రపతి పదవికి వచ్చాడు. చెల్లాచెదురుగా ఉండిన మహా రాష్ట్ర జాతిని అతను ఏకం చెయ్యగలిగాడు. అతను నిర్మించిన మరాఠీజాతి, 18 వ శతాబ్దిలో కూడా భారతదేశాని కంతకూ బలవత్తర మైనదిగా ఉండి, బ్రిటిషు బలాన్ని ప్రతిఘటించి, పోటీ చేసింది.

జాతీయ పునరుజ్జీవనం కలిగించటాని కవసరమైన గుణాలన్నీ శివాజీలో ఉండేవి. అతను రంజిత్‌సింగు లాగా విదేశీయుల సహకారంతో రాజ్యపాలన సాగించలేదు.





అతని సైన్యాలకు అతని మనుషులే శిక్షణ ఇచ్చారు. అతను చేసిన ఏర్పాట్లు దీర్ఘ కాలం నిలిచాయి, ఇతరుల చేత అనుక రించబడ్డాయి. అతన్ని తీవ్రంగా విమర్శిం చిన ముస్లిముచరిత్రకారులు సైతం అతని సద్గుణాలను ఒప్పుకున్నారు. అతను తన రాజ్యం లోని ప్రజల గౌరవం తన గౌరవంగా భావించాడు. తనకు చిక్కిన ముస్లిము పిల్లలనూ, స్త్రీలనూ తాను గౌరవించి, తన సైనికులు గౌరవించేటట్టు చూశాడు. ఈ విషయంలో ఎవరు తన ఆజ్ఞలను మీరినా తీవ్రంగా శిక్షించాడు. అతనెన్నడూ స్త్రీల జోలికీ, మసీదుల జోలికీ, యుద్ధంలో పాల్గొనని వారి జోలికీ పోలేదు. యుద్ధ ఖైదీలను మర్యాదగా విడుదల చేశాడు. దేశీయ సామ్రాజ్యం స్థాపించటం తన ఏకైక లక్ష్యంగా పెట్టుకుని, దాని కోసం దీక్షగా కృషిచేశాడు. కాని ఆ పని ముగిసే లోపల అతని ఆయువు పూర్తి అయింది.

అభ్యంతర జీవితంలో కూడా శివాజీ చాలా నీతిపరుడు. ఆ కాలపువారిలో ఉండిన వ్యసనాలు అతనిలో లేవు. తన తల్లీ, గురు వైన సమర్థరామదాసూ చిన్నతనంలో బోధించిన ఆదర్శాలను అత నెన్నడూ మరవలేదు. మహారాష్ట్ర జాతిని ఉద్ధరించ టాని కతను మతం మీద హెచ్చుగా ఆధార పడ్డాడు. హిందూమతోద్ధరణను ఎప్పుడూ ప్రోత్సహించాడు. అతని దృష్టిలో మతం ఒక సజీవశక్తి; అది మనిషియొక్క శీలాన్నీ, సౌజన్యాన్నీ పెంపొందిస్తుంది. అందుచేతనే అతనిలో మతోన్మాదం లేదు. ఇతర మతాల పట్ల అతనికి ద్వేషమూ లేదు. ముస్లిముసంతు లంటే అతనికి చాలా భక్తి; మసీదులు వగైరాల దీపాల ఖర్చు కింద మాన్యా లిచ్చేశాడు. అతని అను చరులు ఏ స్థలాన్నయినా కొల్లగొట్టినప్పుడు, మసీదులనూ, కొరానునూ, స్త్రీలనూ మర్యా దగా చూసేవారు.







# భారత చరిత్ర




శివాజీ అనంతరం అతని పెద్ద కొడుకు శంభూజీ (శంభాజీ) రాజ్యానికి వచ్చాడు. ఇతను భోగలాలసుడే గాని గొప్ప శూరుడు. ఇతనికి కవికులశు డనే ఉత్తరదేశపు బ్రాహ్మణుడు ముఖ్య సలహాదారుగా ఉండే వాడు. శంభూజీ పరిపాలనలో మహారాష్ట్ర రాజ్యం బలహీన మయింది, కాని స్తంభించి పోలేదు. మొగలుల వల్ల గల ప్రమాదం శంభూజీకి బాగా తెలును. ఔరంగజేబు దక్కనుకు తెచ్చిన పెద్ద సేనలతో అతను ధైర్యంగా పోరాడాడు. అయితే, 1689 ఫిబ్రవరి 11 న, రత్నగిరికి 22 మైళ్ళ దూరాన ఉన్న సంగమేశ్వరం వద్ద, అతను ముకర్రబ్‌ఖాన్ అనే వాడికి దైవికంగా చిక్కిపోయాడు. అదే సమయంలో అతని సలహాదారు కవికులశుడూ, మరి ఇరవైఅయిదుగురు ముఖ్యానుచరులూ కూడా పట్టుబడిపోయారు. మొగలులు శీఘ్రంగానే అనేక మరాఠాదుర్గాలను పట్టుకుని, మరాఠా రాజధాని అయిన రాయగఢాన్ని కూడా ముట్టడించారు.

అయితే శంభూజీ తమ్ముడు రాజారాం సన్యాసివేషం వేసుకుని రాయగఢ నుంచి తప్పించుకు పోయి, అనేక అగచాట్లు పడి, చివరకు కర్ణాటకప్రాంతం లోని జింజీ చేరుకున్నాడు. ఈ లోపుగా మరాఠారాజధాని శత్రు వశమయింది. శంభూజీ కుటుంబం, అతని పసికొడుకు శాహూతోసహా మొగలులకు చిక్కారు. మహారాష్ట్ర ప్రభ నిర్మూలమైనట్టే కనబడింది.

కాని శివాజీ చేత ఉత్తేజితులైన వాళ్ళు అంత సులువుగా లొంగేవాళ్ళు కారు. వాళ్ళు మొగలులతో తిరిగి జాతీయవిమోచన సమరం ఆరంభించారు. ఈ సమరంలో చివరకు మొగలుల శక్తులన్నీ నీరు కారిపోవటం జరిగింది. ఈ సమరానికి

57. శివాజీ అనంతరం



మహారాష్ట్రుల తరఫున నాయకత్వం వహిం చిన వారు రామచంద్రపంత్, శంకరజీ మల్హార్, పరశురామ్‌త్రింబక్.

ఇప్పుడు ఔరంగజేబుకు ఎదురైనది "ప్రజాయుద్ధం." దీన్ని ఎలా కొనసాగించాలో ఔరంగజేబుకు తెలియలేదు. మరాఠా రాజ్యం గాని, రాజసైన్యం గాని ఉంటే దాన్ని నిర్మూలించవచ్చు, కాని అవి లేవు. సంతాజీ ఘోర్పడే, ధనాజీ జాదవ అనే సమర్థులైన ఇద్దరు మరాఠానాయకులు ఎక్కడబడితే అక్కడ తమ సేనలతో విరుచుకుపడి, మొగలులకు తీవ్రమైన సంక్షోభమూ, తీరని నష్టమూ కలిగించి, మెరపు లాగా ఎటో వెళ్ళిపోయేవారు. వీళ్ళు చక్రవర్తి శిబిరాలను కూడా కొల్లగొట్టారట. మొత్తం మీద అనేకమంది మొగలు అధికార్లు తమ భద్రత కోసం మహారాష్ట్రులకు "చౌథ్" చెల్లించిన మాట నిజం. కొందరు శత్రువుతో చేరిపోయి చక్రవర్తి ప్రజలనే దోచారు. సంతా,ధనాల పేర్లు దిక్కుదిక్కులా ప్రతిధ్వనించాయి. వారా కాలానికి వీరాధి వీరులు. మొగలుసామ్రాజ్యవాదులు వీరి నేమీ చెయ్యలేకపోయారు.

జుల్‌ఫికర్‌ఖాన్ అనే మొగలు సేనాని జింజీకి దాదాపు ఎనిమిదేళ్ళపాటు ముట్టడి



వేసి, చివరకు 1698 జనవరిలో దాన్ని పట్టుకున్నాడు. అయితే రాజారాం అక్కడి నుంచి సాతారాకు పారిపోయాడు. అక్కడ అతను బలమైన సేనను పోగుచేసుకుని, ఉత్తరదక్కనులో ఉన్న ఔరంగజేబు బలాల పై యుద్ధం చేశాడు. 1699 డిసెంబరులో మొగలులు సాతారా దుర్గాన్ని ముట్టడించారు.

1700 మార్చి 12 న రాజారాం చనిపోయాడు. అంత దాకా ముట్టడిని వీరోచితంగా ప్రతిఘటించిన మహారాష్ట్రులు కొన్ని షరతుల మీద దుర్గాన్ని మొగలుల అధీనంచేశారు.







ఇది మొదలు పాదుషా స్వయంగా ఒక్కొక్క మరాఠాదుర్గాన్నే వశపరుచుకో నారంభించాడు. కాని అది వ్యర్థప్రయత్నమే అయింది. ఏమంటే, ఇవాళ చిక్కిన దుర్గం రేపు చెయి జారిపోయేది. యుద్ధం అనంతంగా సాగుతూ పోయింది.

రాజారాం మరణానంతరం అతని భార్య తారాబాయి మహారాష్ట్రులకు నాయకురాలయింది. ఆమె తన కొడుకైన మూడవ శివాజీ తరఫున రాజ్యం చేస్తూ, అసాధారణ ప్రతిభ కనబరిచింది. ఆమె భర్త జీవించి ఉన్నప్పుడే పరిపాలనా వ్యవహారాలలో ఆమె చాకచక్యానికీ, సమర్థతకూ గొప్ప ఖ్యాతి వచ్చింది.

రాజ్యం కోసం జరిగే కుమ్ములాటలను అణచిపెట్టి, తారాబాయి మొగలుల ప్రాంతాలలోని సిరంజ్, మందసోర్ మొదలైన ఆరు సుబాలను కొల్లగొట్టటానికి చురుకైన దాడులను ఏర్పాటు చేసింది.

మరాఠాదండులు 1703 లో బిరారు పైనా, 1706 లో గుజరాతు పైనా దాడి చేసి, బరోడాను కొల్లగొట్టాయి. 1706 ఏప్రిలు, మే నెలలలో ఒక పెద్ద మహారాష్ట్ర సేన అహమ్మద్‌నగర్ లోని పాదుషా శిబిరం పైకి వెళ్ళింది. వారిని చెదరగొట్టటం మొగలులకు బ్రహ్మప్రయత్న మయింది.

ఈ సమయానికి మహారాష్ట్రులు తమ బలాలను చక్కగా కూడగట్టుకుని, దక్కనులోనూ, మధ్యభారతం లోని కొన్ని ప్రాంతాలలోనూ దాదాపు తమకు పోటీ లేకుండా చేసుకో గలిగారు. వాళ్ళు మొగలు సేనా నాయకులను పూర్తిగా బెదరగొట్టారు. వారి యుద్ధతంత్రంలో కూడా దర్పం ప్రవేశించింది. వారిలో మొగలులంటే ఏ మాత్రమూ భయం లేదు. ఎక్కడికి వెళ్ళినా జయం తమదే నన్నట్టు వెళ్ళారు. వారిని అణచడానికి ఔరంగజేబు చేసిన ప్రయత్నాలన్నీ వృథా అయాయి.







# భారత చరిత్ర



1707 మార్చి 3న ఔరంగజేబు చనిపోయాడు. వెంటనే మొగలుసామ్రాజ్యం విచ్ఛిన్నం కాసాగింది. ఆయన కొడుకులు ముగ్గురూ రాజ్యం కోసం ఒకరినొకరు చంపుకోవటానికి తలపడ్డారు. పెద్దవాడు ముఅజ్జం కాబూలు లోనూ, రెండోవాడు అజం గుజరాతు లోనూ, మూడోవాడు కామ్‌బక్ష్ బిజాపూరులోనూ గవర్నర్లుగా ఉంటున్నారు. వీళ్ళు కొట్టుకు చస్తారని ఊహించే ఔరంగజేబు తన సామ్రాజ్యాన్ని ముగ్గురూ పంచుకోవాలని విల్ రాసిపెట్టాడు. తండ్రి కోరిన ప్రకారం రాజ్యాన్ని పంచుకోవటానికి ముఅజ్జం ఇష్టపడ్డాడు. కాని రెండోవాడు అజం ఒప్పుకోలేదు. 1707 జూనులో వాళ్ళిద్దరూ ఆగ్రాకు దగ్గిరలో జాజౌ అనే చోట యుద్ధానికి తలపడ్డారు. ఆ యుద్ధంలో అజం ఓడిపోవటమేగాక, ప్రాణాలే పోగొట్టుకున్నాడు. తరవాత కొద్దిరోజుల అనంతరం ముఅజ్జం కామ్‌బక్ష్‌తో కూడా హైదరాబాదు సమీపంలో యుద్ధం చేసి గెలిచాడు. కామ్‌బక్ష్ గాయపడి, 1708 లో చనిపోయాడు.

బహదుర్ షా అనే పేరుతో ముఅజ్జం ఢిల్లీ గద్దె ఎక్కాడు. కాని అప్పటికే వయసు చెల్లటంచేత మొగలుసామ్రాజ్య విచ్ఛిత్తిని అతను ఆపలేకపోయాడు. 1712 ఫిబ్రవరి 27న బహదుర్‌షా చనిపోగానే అతని కొడుకులు నలుగురూ రాజ్యం కోసం మళ్ళీ యుద్ధం చేసుకున్నారు. అందులో మిగిలిన ముగ్గురూ చావగా, పెద్దవాడు జహాందార్‌షా, జుల్‌ఫికర్ ఖాన్ అనేవాడి సహాయంతో గద్దె ఎక్కాడు. జుల్‌ఫికర్‌ఖాన్ అతని ప్రధాన వజీరయాడు.

అయితే జహాందార్‌షా లాల్‌కుమారి అనే ఆడదాని చేతిలో కీలుబొమ్మగా ఉండి, ఆటగాళ్ళనూ, పాటగాళ్ళనూ, నటులనూ స్వైరవిహారం చెయ్యనిచ్చాడు. చివరకతన్ని

58. మొగలుసామ్రాజ్య విచ్ఛిత్తి



అతని తమ్ముడి కొడుకు ఫరుఖ్‌సియర్ అనేవాడు ఢిల్లీ కోటలో గొంతుపిసికి చంపించి, 1713 లో తానే చక్రవర్తి అయి, జుల్‌ఫికర్‌ఖాన్‌ను ఉరితీయించాడు.

ఫరుఖ్‌సియర్ పాదుషా కావటానికి ఇద్దరు సయ్యిద్ సోదరులు, హుసేనాలీ, అబ్దుల్లా అనేవాళ్ళు తోడ్పడ్డారు. ఫరుఖ్ సియర్ వట్టి హీనుడూ, పిరికిపందా. మీర్ జుమ్లా లాటి సయ్యిద్ వ్యతిరేకుల బోధలు విని, సయ్యిద్‌సోదరుల పట్ల కృతఘ్నుడుగా ప్రవర్తించి, వాళ్ళచేత కళ్ళు పీకించుకుని, దారుణ దుర్మరణం పాలయాడు.

తరవాత సయ్యిద్ సోదరులు నామ మాత్రపు చక్రవర్తులను సింహాసనం మీద ఎక్కించి తామే రాజ్యమేలుతూవచ్చారు. వారి సహాయంతో సింహాసనమెక్కిన వారిలో బహదుర్‌షా నాలుగో కొడుక్కు కొడుకైన రోషన్‌అఖ్తర్ అనేవాడు సయ్యిద్ సోదరులకు ఎదురుతిరిగాడు. ఇతను ముహమ్మద్‌షా అనే పేరుతో చక్రవర్తి అయి, దక్కను నవాబైన నిజాముల్ ముల్క్ సహకారం సంపాదించి, కాలక్రమాన ఇద్దరు సయ్యిద్‌లనూ కడతేర్చాడు.

ముహమ్మద్‌షా చాలాకాలం పాలించాడు గాని, సామ్రాజ్య విచ్ఛిత్తిని అరికట్టే దక్షత



అతనిలో లేకపోయింది. దక్కనూ, ఔధూ, బెంగాలూ సామ్రాజ్యాధికారం కిందినుంచి వైదొలగిపోయాయి. మహారాష్ట్రులూ, ఆగ్రా ప్రాంతంలో ఉండే జాట్‌లూ, పంజాబులో సిక్కులూ, తదితరులూ సర్వస్వతంత్రులుగా వ్యవహరించారు. గోరుచుట్టుపై రోకటి పోటులాగా, నాదిర్‌షా దాడితో ఢిల్లీ సామ్రాజ్యం చావుదెబ్బ తిన్నది. ఔరంగజేబు చనిపోయిన మూడు దశాబ్దాల కాలంలో యావద్భారతస్థాయిన మొగలు సామ్రాజ్యమన్నది లేకుండాపోయింది.

నాదిర్‌షా పర్షియా నుంచి భారతదేశం పైకి దండెత్తి వచ్చాడు. అతన్ని ప్రతిఘ





టించటానికి కాబూలు, పంజాబుల గవర్నర్లు ప్రయత్నించి విఫలులై, సైన్యాలను సహాయం పంపమని ఢిల్లీకి కబురు చేశారు. ఢిల్లీలో పదవుల కీచులాటల వల్ల వారి మొర ఆలకించినవారు లేకపోయారు.

నాదిర్‌షా ఆరంభంలో ఒక దొంగల ముఠాకు నాయకుడు. అతను కష్టాలనుభవించి శౌర్యపరాక్రమాలు అలవరచుకున్నాడు. అఫ్ఘానుల నుంచి అతను పర్షియాను కాపాడాడు. అటుతరవాత కొంత కాలాని కతను పర్షియాకు రాజే అయాడు. 1738 లో అతను భారతదేశంపైకి బయలుదేరి, 1739 కల్లా ఘజ్నీ, కాబూలూ, లాహెూరూ పట్టుకున్నాడు. అంత అయినా ఢిల్లీ దర్బారులో చైతన్యం కలగలేదు. నాదిర్‌షా సేనలు ఢిల్లీకి కొద్ది మైళ్ళలోకి వచ్చాకనే వారు మేలుకున్నారు. 1739 ఫిబ్రవరిలో మొగలు సైన్యాలకూ పర్షియా సైన్యాలకూ యుద్ధం జరిగింది. పాదుషా ఓడిపోయి, సంధిబేరానికి దిగాడు. నాదిర్‌షా, పాదుషాతో సహా రాజభవనానికి వచ్చాడు.

మొదట్లో ఢిల్లీ ప్రశాంతంగానే ఉన్నది. కాని ఎవడో, నాదిర్‌షా చచ్చినట్టు పుకారు లేపాడు. ఢిల్లీ పౌరులు పర్షియను సైనికులను కొందరిని చంపారు. నాదిర్‌షా ఉగ్రుడై ఢిల్లీపౌరులను చిత్రవధ చెయ్యమని ఉత్తరువిచ్చాడు. ఉదయం 8 లగాయతు అపరాహ్ణం 3 గంటల దాకా నరవధ సాగిందట. స్త్రీలను బానిసలుగా పట్టుకున్నారు. ఇళ్ళు తగలబెట్టారు. చచ్చినవారినీ, గాయపడినవారినీ, హిందువులనూ, మహమ్మదీయులనూ కలగలిపి దహనంచేశారు. ఢిల్లీ పౌరుల వద్దనుంచి మూడుకోట్ల రూపాయలు దౌర్జన్యంగా వసూలు చేయబడ్డాయి.

నాదిర్‌షా కోహినూర్‌వజ్రాన్నీ, నెమలి సింహాసనాన్నీ తీసుకుని, ఖజానాను తుడిచిపెట్టి మరీ వెళ్ళాడు. సింధునదికి అవతల ఉన్న ప్రాంతాలు పర్షియనులకు పోయాయి.





# భారత చరిత్ర



1747 లో నాదిర్‌షా హత్యచేయబడ్డాడు. అతని సేనాపతులలో ఒకడైన అహ్మద్‌షా అబ్దాలీ అనేవాడు అఫ్ఘానిస్తానుకు స్వతంత్ర పరిపాలకుడయాడు. ఇతను నాదిర్‌షా వెంట ఇండియాకు వచ్చి, మొగలు సామ్రాజ్యం ఎలాటి హీనస్థితిలో ఉన్నదో కళ్ళారా చూసి ఉన్నాడు. అందుచేత అతను అఫ్ఘాను రాజుగా కాస్త కాలు నిలవదొక్కుకోగానే భారతదేశం పైకి దాడి వచ్చి, 1748-1767 మధ్యకాలంలో అనేక దండయాత్రలు జరిపాడు.

ఇవి కేవలమూ కొల్లగొట్టడం కోసం జరిగిన దండయాత్రలు కావు, భారతదేశంలో మొగలుల అధికారాన్ని తుడిచిపెట్టేసి, అఫ్ఘానుల ఆధిపత్యాన్ని తిరిగి ప్రతిష్ఠ చేయాలనే ధోరణి ఈ దండయాత్రల వెనక ఉన్నది. ఈ ప్రయత్నానికి భారతచరిత్రలో ఎంతో ప్రాముఖ్యం కూడా ఉన్నది.

అహ్మద్‌షా మరొకందుకు కూడా దాడులు తలపెట్టాడు: దేశాంతరాలలో విజయాలు సాధించటంచేత స్వదేశంలో అతని ప్రతిష్ఠ మరింత బలపడుతుంది; భారతదేశాన్ని కొల్లగొట్టిన డబ్బుతో తన సైన్యానికి జీతాలూ, సేనాపతులకు బహుమానాలూ ఇవ్వవచ్చు.

1748 లో అహ్మద్‌షా పంజాబుపై చేసిన తొలి దండయాత్ర అచ్చిరాలేదు. పంజాబు గవర్నరు అతన్ని ఓడించి పంపాడు. కాని మరి రెండేళ్ళ అనంతరం అహ్మద్‌షా పంజాబుపై రెండవ దాడి చేసి గెలిచాడు. పంజాబు గవర్నరుకు ఢిల్లీ నుంచి ఎలాటి సహాయమూ అందలేదు. 1751 చివరలో అహ్మద్‌షా భారతదేశం పై మరొక దండయాత్ర చేసి, కాశ్మీరును జయించి, సిర్‌హింద్ వరకూ గల మొగలుసామ్రాజ్యపు పశ్చిమ ప్రాంతాన్ని మొగలు చక్రవర్తి నుంచి గుంజుకున్నాడు.

## 59. అఫ్ఘాను దండయాత్రలు





అయితే 1756 లో పంజాబు రాష్ట్రంలో అరాజకపరిస్థితి ఏర్పడి, మొగలు ప్రధాని అయిన ఇమాదుల్‌ముల్క్ అనేవాడి అధీనం లోకి వచ్చేసింది. అహ్మద్‌షా అబ్దాలీ ఆ ఏడు నవంబరులో నాలుగోసారి దండయాత్ర చేసి, 1757 జనవరి 23 నాటికి ఢిల్లీ చేరుకుని, ఆ నగరాన్ని కొల్లగొట్టాడు. మొగలు చక్రవర్తి (రెండవ ఆలంగీర్) అబ్దాలీకి పంజాబు, కాశ్మీరు, సింధు, సిర్‌హింద్ జిల్లాలు అర్పించుకుని రాజీపడ్డాడు. అబ్దాలీ 1757 ఏప్రిలులో స్వదేశానికి తిరిగి వెళ్ళాడు.

1757 మే లగాయతు 1758 ఏప్రిలు దాకా అబ్దాలీ కొడుకు తీమూర్‌షా అనేవాడు లాహోరులో వైస్రాయిగా ఉన్నాడు. అతని పరిపాలనలో అరాజకత్వం పెచ్చుమీరింది. సిక్కునాయకుడికి ఒకడికి అత్యాచారం జరిగే సరికి సిక్కులు ఒక్కుమ్మడిగా అంతటా తిరుగుబాటు చేశారు. జలందరు పరగణాకు గవర్నరుగా ఉండిన ఆదీన బేగ్ ఖాన్ అనేవాడు అఫ్ఘానుల పై తిరగబడి మహారాష్ట్రులను సాయం పిలిచాడు. రఘునాథరావు నాయకత్వాన పెద్ద మరాఠీ సేన 1758 ఏప్రిలులో పంజాబుపై దాడి చేసి, లాహోరు ఆక్రమించి, అఫ్ఘానులను వెళ్ళగొట్టింది. అయితే మరాఠీ సేనలు లాహోరును ఆరు మాసాలు మాత్రమే తమ



అధీనంలో ఉంచుకున్నాయి. 1759 అక్టో బరులో అబ్దాలీ అయిదోసారి భారతదేశం పై దండయాత్ర చేసి, పంజాబును చివరకు స్వాధీనం చేసుకున్నాడు.

భారతదేశం పై ఆధిపత్యం కొరకు అఫ్ఘానులకూ, మరాఠీలకూ మధ్య ఘర్షణ క్రమంగా తీవ్రదశకువచ్చి, 1761 జనవరి 14 న పానిపట్టువద్ద ఉభయపక్షాలకూ యుద్ధం జరిగింది. 1762 లో అబ్దాలీ తిరిగి వెళ్ళాడు. తరవాత సిక్కులు విజృంభించి లాహొూరు గవర్నరును హత్యచేశారు. అందు చేత అబ్దాలీ 1764 మార్చిలో లాహొూరు వచ్చి, రెండు వారాలపాటు మాత్రమే ఉండి, స్వదేశంలో పరిస్థితులు విషమించగా తిరిగి పోయాడు. అతను 1767 లో సిక్కులను అణచటానికి మళ్ళీ ఒకసారి వచ్చాడు, కాని అతను విఫలుడయాడు. పంజాబులో లాహొూరూ, మరి కొన్ని జిల్లాలూ, సిక్కుల అధీనంలోకి వచ్చాయి.

భారత చరిత్రలో అబ్దాలీ దండయాత్రల ప్రాముఖ్యం ఏమిటి? వాటి ప్రభావం చాలా ఉన్నది. అవి మొగలుసామ్రాజ్య విచ్ఛిత్తిని మరింత చురుకుగా కొనసాగించాయి; మరాఠీ సామ్రాజ్య విస్తరణకు అవి అడ్డు పడ్డాయి; సిక్కుల శక్తులను పరోక్షంగా పెంచాయి; అఫ్ఘాను దండయాత్రల వల్ల ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీవారు చాలా భయోత్పాతం చెందారు; అబ్దాలీ మరణించిన అనంతరంకూడా వారికా బెదురు కొంత కాలం పోనేలేదు.

ఢిల్లీ కేంద్రం దుర్బల మవుతున్నకొద్దీ, సామ్రాజ్యంలోని వివిధ రాష్ట్రాలలోని రాజ ప్రతినిధులు లాంఛనప్రాయంగా తాము ఢిల్లీ చక్రవర్తికి లోబడి ఉన్నట్టు చెప్పుకుంటున్నా వాస్తవానికి స్వతంత్రులుగా వ్యవహరించ సాగారు. ఈ విధంగా సామ్రాజ్యంలో అనేక కొత్త ముస్లిము సంస్థానాలు వెలిశాయి.





# భారత చరిత్ర



### దక్కను

మొగలు సామ్రాజ్యంలో ఒక పరగణాగా ఉండిన దక్కనుసుబా నిజాముల్‌ముల్క్ కింద స్వతంత్ర రాజ్యమయింది.

బహదుర్‌షా హయాంలో ఇతమ రెండు సార్లు ఉద్యోగం చేసి, ఆ తరవాత ఫ్రరుఖ్‌సియార్ చేత **1713** లో దక్కను గవర్నరుగా నియమించబడి, నిజాముల్‌ముల్క్ బిరుదు పొందాడు.

ఇంతలో ఫ్రరుఖ్‌సియార్ పరిపాలన అంతమయింది. నిజాముల్‌ముల్క్‌ను మాల్వాకు పంపారు. ఇక్కడనే అతను తన భవిష్యత్తుకు దోహదం చేసుకున్నాడు. ఇతని వైఖరి సయ్యిద్‌లకు నచ్చక ఇతన్ని బదిలీ చేస్తూ ఉత్తరువులు జారీ చేశారు. ఈసారి అతను ఉత్తరువులను ఉల్లంఘించి, తన పైన కత్తిగట్టిన సయ్యిద్‌లను హతమార్చాడు.

**1720** అంతంలో దక్కను తిరిగి నిజాముల్‌ముల్క్ అధీనంలోకి వచ్చింది. ఢిల్లీ దర్బారులో వుండే అమీన్‌ఖాన్ అనే వజీరు చనిపోగా, నిజాముల్‌ముల్క్‌కు ఆ పదవి ఇచ్చి, అతన్ని **1722** ఫిబ్రవరిలో ఢిల్లీకి పిలిపించారు. ఢిల్లీదర్బారు వాతావరణం చాలా కలుషితంగా ఉన్నది. పాదుషా అంతరంగికులు అతని సలహాలు వినక పోగా అతనిపై పాదుషాకు చాడీలు చెప్పారు. ఇది చూసి విసిగిపోయి అతను, **1723** డిశంబరు మూడో వారంలో పాదుషాకు చెప్పకుండా దక్కనుకు బయలుదేరాడు.

చెప్పుడుమాటలు విని పాదుషా, అతను తనపై తిరుగుబాటు చేస్తున్నాడని నమ్మి, హైదరాబాదు గవర్నరయిన ముబారిజ్ ఖాన్‌కు, నిజాముల్‌ముల్క్‌ను యుద్ధంతో ప్రతిఘటించమని ఉత్తరువు పంపాడు. గెలిస్తే దక్కనుకు వైస్రాయి అవుతానన్న

**60.** మొగలుసామ్రాజ్య విచ్ఛిత్తి: స్వతంత్ర ముస్లిమురాజ్యాలు



ఆశతో ముబారిజ్‌ఖాన్ నిజాముల్‌ముల్క్‌తో 1724 అక్టోబరు 11న బిరారులో యుద్ధం చేసి, నిజాముల్‌ముల్క్ చేతిలో చచ్చాడు. పాదుషా నిజాముల్‌ముల్క్‌ను తుద ముట్టించలేకపోగా అతన్ని దక్షిణదేశాని కంతకూ వైస్రాయిగా గుర్తించి, అతనికి అసఫ్‌జాహ్ అన్న బిరుదు కూడా ఇవ్వ వలసివచ్చింది. అసఫ్‌జాహీలే చివరిదాకా నిజాము రాష్ట్రాన్ని పరిపాలించారు. హైదరాబాదు స్వతంత్ర సంస్థానం కావటా నికి ఇదే నాంది. 1748 మే21న, 91వ ఏట నిజాముల్‌ముల్క్ మరణించాడు.



*బెంగాల్*

1705 లో బెంగాలు గవర్నరుగా నియమించబడిన ముర్షిద్‌కులీఖాన్ బలవంతుడూ, సమర్థుడూనూ. అతను బెంగాలు రాజధానిని ఢాకా నుంచి ముర్షిదాబాదుకు మార్చాడు. 1727 లో ఇతని మరణానంతరం ఇతని అల్లుడు షుజాఉద్దీన్‌ఖాన్ గవర్నరయాడు. ఇతని హయాంలోనే బిహారుసుబా బెంగాలుసుబా దాకా విస్తరించబడింది. అలివర్ది అనేవాడు బిహారుకు పాలకుడుగా నియమించబడ్డాడు. 1739 లో షుజాఉద్దీన్‌ఖాన్ చనిపోయి అతని కొడుకు గవర్నరు కాగా, అలివర్ది మరికొందరితో చేరి కుట్రచేసి బెంగాలు గవర్నరును హత్య చేసి, బెంగాలును ఆక్రమించాడు. అతను బెంగాలును స్వతంత్రంగానే పాలించ సాగాడు. మంచి పాలకు డనిపించుకోదగిన లక్షణా లతని కున్నాయి.

అయితే అలివర్ది పరిపాలన సుఖంగా సాగలేదు. ఏటా మహారాష్ట్రులు బెంగాలు పైన దండయాత్ర చేస్తూవచ్చారు. ఇతని కింద ఉండిన అఫ్ఘాన్ సేనానులూ, బిహారులోని వాళ్ళూ ఏకమై కుట్ర చేసి, తిరుగుబాటు చేసి ప్రమాదం తెచ్చిపెట్టారు.

అలివర్ది మహారాష్ట్రుల ధాటికి తట్టుకోలేక ఏటా వారికి 12 లక్షలరూపాయల చౌథ్





చెల్లించే షరతు మీద వారితో ఒడంబడిక చేసుకున్నాడు. ఒరిస్సా నుంచి తనకు వచ్చే రాబడిలో కొంత భాగం కూడా అతను వారికి ఇచ్చాడు. 1756 ఏప్రిల్‌లో ఇతని మరణానంతరం ఇతని మనమడు నవాబ్ సిరాజుద్దౌలా (అసలు పేరు మీర్జామహమ్మద్) బెంగాలు పాలకు డయాడు. ఇతని పరిపాలన కొద్ది కాలమే సాగినా, అది బెంగాలు చరిత్రలోనూ, భారత చరిత్రలోనూ కూడా ఒక ముఖ్యమైన మలుపుగా పరిణమించింది.

ఔధ్ (అవధ్)

ఔధ్‌సుబాలో ఈ నాటి ఔధ్ మాత్రమే గాక, దానికి తూర్పుగా ఉండే వారాణసి కూడా చేరి ఉండేది. అలహాబాదు, కాన్పూరు పరిసరాలు కూడా అందులో చేరి ఉండేవి. ఔధ్ రాజ్యాన్ని స్థాపించిన సాదత్‌ఖాన్ అనేవాడు ఖరాసాన్ నుంచి వలస వచ్చాడు. 1724 లో ఔధ్ గవర్నరుగా నియమించబడి, శీఘ్రకాలంలోనే విశేష ఖ్యాతి సంపాదించాడు. నాదిర్‌షా దాడి జరిగిన సమయంలోనే ఇతన్ని ఢిల్లీకి రప్పించారు. ఆ యేడే అతను ఆత్మహత్య చేసుకున్నాడు.

అతని అనంతరం అతని అల్లుడు సఫ్దర్‌జంగ్ ఔధ్‌కు గవర్నరయాడు. 1748 లో ఇతన్ని ఢిల్లీలో వజీరుగా నియోగించారు. 1754 లో చనిపోయే ముందు దాకా ఇతను సమకాలీన భారతచరిత్రలో ప్రముఖ పాత్ర నిర్వహించాడు. ఇతన్ని నిజాముల్‌ముల్క్ కొడుకూ, మనమడూ ప్రతిఘటిస్తూ వచ్చారు.

సఫ్దర్‌జంగ్ అనంతరం ఇతని కొడుకు షుజాఉద్దౌలా ఔధ్‌ను సమర్థవంతంగా పరిపాలించి, తాను కూడా ఢిల్లీలో వజీరుగా నియమింపబడి, ఉత్తర భారతదేశ చరిత్రలో ప్రముఖ పాత్ర నిర్వహించి, 1775 లో చనిపోయాడు.





# భారత చరిత్ర



18 వ శతాబ్దిలో కలిగిన హిందూ పునర్వి జృంభణ భారతచరిత్రలో ఒక ముఖ్య ఘట్టం. శిథిల మవుతున్న మొగలు సామ్రాజ్యంలో రాజపుత్రులూ, సిక్కులూ, జాత్‌లూ, మహారాష్ట్రులూ తమతమ ఆధి పత్యాలను ప్రతిష్ఠించుకున్నారు. ఢిల్లీ పాదుషా కొలువు చేస్తూనే జోధ్‌పూరు, జైపూరు రాజులు మొగలు సామ్రాజ్యంలో ఒక పెద్ద భాగాన్ని తమ అధీనంలోకి తెచ్చుకున్నారు.

గురుగోవిందుడు 1708 లో ఒక అఫ్ఘానువాడి చేత హత్య చేయబడ్డాక సిక్కులకు బాందా నాయకుడై, గోవిందు పిల్లలను హత్యచేసిన వజీర్‌ఖాన్‌ను చంపి, సిర్‌హిందునూ, యమునా సట్లెజ్ నదుల మధ్య ప్రాంతాన్నీ వశపరుచుకున్నాడు. అయితే ఈ విజయం దక్కలేదు. మొగలు పాదుషా ఇతన్ని బంధించి, ఇతని కొడుకును ఇతని కళ్ళముందే చంపించి, ఇతన్ని ఏనుగుల చేత తొక్కించాడు. అయితే సిక్కులు పూర్తిగా అణగారి పోలేదు. కపూర్ సింగ్ అనేవాడు "దల్‌ఖాల్సా" అనే సంస్థకు పునాది వేశాడు. సిక్కులు రావీనదీ తీరాన దలేవాల్ అనే దుర్గాన్ని నిర్మించి, క్రమంగా విజయవంతులయారు. నాదిర్‌షా దాడులు వారికి చాలా తోడ్పడ్డాయి.

కాని మొగలు సామ్రాజ్య శిథిలాలపై తమ ధ్వజాన్ని నిలబెట్ట యత్నించిన వారిలో అత్యంత శక్తిమంతులు మహారాష్ట్రులు. అయితే కొంతకాలం వీరు అంతఃకలహాలలో ఉండి పోయారు. శివాజీ కొడుకైన శాహూజీని ఢిల్లీ షాదుషా బంధవిముక్తుణ్ణి చేసిన అనంతరం అతనికీ, తారాబాయికీ మధ్య కలహాలేర్పడి, యుద్ధాలు కూడా జరిగాయి. ఈ సంఘర్షణలో చిట్టచివరకు శాహూజీ నెగ్గటానికి బాలాజీ విశ్వనాథ్ అనే

**61. హిందువుల పునర్వ్యజృంభణ**







కొంకణ దేశపు చిత్పావన బ్రాహ్మణు డొకడు సహాయపడ్డాడు.

చిన్న గుమాస్తాగా జీవితం ప్రారంభించిన బాలాజీ విశ్వనాథుడు తన బుద్ధి కౌశలం చేత పైకి వచ్చి 1713 నవంబరు 16న శాహూజీ చేత పేష్వా (ప్రధానమంత్రి)గా నియమించబడ్డాడు. పేష్వా హోదా కంటె "ప్రతినిధి" హోదా ఎక్కువైనది. అయినప్పటికీ బాలాజీ, అతని కొడుకైన బాజీ రావూ అత్యంత సమర్థులై, మరాఠా సామ్రాజ్యానికి ఛత్రపతుల కంటె కూడా పేష్వాలకే ఎక్కువ ప్రాముఖ్యం సంపాదించారు.

మొగలు సామ్రాజ్యం శిథిలావస్థలో ఉండటాన్ని మహారాష్ట్రులు తమకు అనుకూలంగా ఉపయోగించుకున్నారు. హుసేనాలీ దక్కనుకు వచ్చినప్పుడు బాలాజీ విశ్వనాథుడు ఆయన చేత అతి ముఖ్యమైన ఒప్పందం చేయించి, పాదుషా చేత అమోదింప జేయించాడు. మహారాష్ట్రులు తన పక్షాన ఉండగలందులకై 1714లో హుసేనాలీ చేసిన ఈ ఒడంబడిక ప్రకారం, శివాజీనుంచి మొగలులు జయించిన ప్రాంతాలన్నీ శాహూకు తిరిగి రావటమే గాక, ఖాందేశ్, గోంద్వానా, బిరార్, హైదరాబాదు, కర్ణాటక ప్రాంతాలలో మరాఠీలు జయించిన ప్రాంతాలు కూడా అతనికి దక్కాయి; దక్కనులోని ఆరు సుబాల లోనూ అతను చౌథ్, సర్దేశముఖీ శిస్తులు వసూలు చేసే అధికారాన్ని పొంది, దానికి ప్రతిఫలంగా పాదుషా ఉపయోగార్థం 15000 గుర్రాలను పోషించటానికీ, ఏటా 10 లక్షలు కప్పం చెల్లించటానికీ, దక్కనులో శాంతి భద్రతలను కాపాడటానికీ ఒప్పందం జరిగింది. ఈ ఒప్పందం ప్రకారం శివాజీ ఆదర్శమైన సంపూర్ణ స్వాతంత్ర్యం మహారాష్ట్రులకు సిద్ధించలేదు, ఏమంటే మహారాష్ట్రులపైన ఢిల్లీ పాదుషా ఆధిపత్యం అమోదించబడింది. అయినప్పటికీ ఈ ఒప్పందం





మహారాష్ట్ర చరిత్రలో ఒక అతి ముఖ్యమైన ఘట్టమని చెప్పాలి; దీని మూలంగా మహారాష్ట్రులు ప్రభుత్వ శిస్తులకు భాగస్వాములయారు, సామ్రాజ్యంలోని ఒక ప్రాంతంలో వారికి గల హక్కులు గుర్తించబడ్డాయి.

ఢిల్లీలో సయ్యిద్ వ్యతిరేక పక్షం విజృంభించడం చూసి, వారిని అణచటానికి సయ్యిద్ హుసేనాలీ ఢిల్లీ పైకి దండెత్తి వెళుతూ, తన కొత్త మిత్రులను వెంట తీసుకువెళ్ళి, ఫర్రుఖ్‌సియర్‌ను గద్దెదించి, మరొక కీలు బొమ్మను గద్దె ఎక్కించాడు. 1719 లో మహారాష్ట్రులు ఢిల్లీ పైకి వెళ్లటం కూడా వారి చరిత్రలో ముఖ్య సంఘటనే. దాని ఆధారంపైననే బాలాజీ విశ్వనాథుడు మహారాష్ట్ర సామ్రాజ్య నిర్మాణానికి పథకం ఆలోచించాడు. మహారాష్ట్రుల బలం ఇతర విధాలుగా కూడా పెరిగింది. రాజారాం హయాములో జాగీర్లు పునరుజ్జీవనం పొందటం చేత శూరులైన మహారాష్ట్రులు చిన్న చిన్న స్వతంత్ర రాజ్యాలను ఏర్పాటు చేసుకున్నారు.

పేష్వా పదవి బాలాజీ విశ్వనాథుడి వంశానికి హక్కు భుక్తమయింది. 1720లో బాలాజీ విశ్వనాథుడు మరణించిన మీదట, యువకుడైన అతని కుమారుడు బాజీరావు పేష్వా అయాడు. అతను యుద్ధతంత్రంలోనే గాక, పరిపాలనా వ్యవహారాల్లో కూడా సమర్థుడు.

అతను ఎంతో దూరదృష్టితోనూ, చొరవతోనూ మహారాష్ట్ర సామ్రాజ్యానికి అవసరమైన విధానాన్ని రూపొందించాడు. నర్మదా నదిని దాటి మొగలు సామ్రాజ్య కేంద్రాన్నే దెబ్బ తీయాలని అతని పథకం. "చెట్టు ఎండి పోతున్నది. కాండాన్నే నరికేద్దాం. శాఖలు వాటంతట అవే పడి పోతాయి. మన బావుటా కృష్ణానది మొదలుకుని సింధూనది దాకా ఎగురుతుంది," అని అతను శాహూకు సలహా ఇచ్చాడు.





# భారత చరిత్ర



తన అనుచరులు కొందరికి ఉత్తర ప్రాంతాలను జయించటం అంతగా ఇష్టం లేదు, కాని బాజీరావు శాహూజీని ఒప్పించాడు. హిందూరాజులకు తన కృషి ఆదరణీయంగా ఉండగలందులకు అతను "హిందూ పాద్ పాద్షాహీ" (హిందూ సామ్రాజ్యం) అన్న నినాదాన్ని లేవదీశాడు.

1723 డిసెంబరులో అతను మాల్వాపై దాడి చేసినప్పుడు హిందూ రాజులు అంతులేని త్యాగాలు చేసి అతనికి తోడ్పడ్డారు. అంతర్యుద్ధాల ఫలితంగా గుజరాతు మహారాష్ట్రులకు చిక్కింది. అయితే మహారాష్ట్రులలోనే బాజీరావుకు ఒక ప్రతి పక్షం ఏర్పడింది. దానికి నాయకుడు త్రింబక్‌రావ్ ధాబాదే అనేవాడు. అతను గుజరాతుకు సేనాపతి. బాజీరావు పైగల ఈర్ష్య కొద్దీ, కోల్హాపూరును ఏలే శివాజీ వంశస్థుడైన రెండవ శంభూజీ రాజా, నిజాముల్ ముల్క్‌లు త్రింబక్‌రావుతో చేరారు. అయితే బాజీరావు యుక్తిగా తన శత్రువుల ఆలోచనలను భగ్నం చేసేశాడు. 1731 ఏప్రిలు 1 న బిల్హాపూరు మైదానం మీద యుద్ధం జరిగింది. అందులో త్రింబక్‌రావు ఓడిపోయి, ప్రాణాలను కోల్పోయాడు. బాజీరావు సాధించిన ఈ విజయం పేష్వాల చరిత్రలో ఒక ప్రముఖ ఘట్టం. దీనితో అతన్ని ప్రతిఘటించగల శత్రువు లెవరూ లేకుండా పోయారు. అతను 1731 ఆగస్టులో నిజాముల్‌ముల్క్‌తో ఇలా సంధి చేసుకున్నాడు: నిజాముల్‌ముల్క్ తన అధికారాన్ని దక్షిణదేశంలోనూ, పేష్వా ఉత్తర దేశంలోనూ యథేచ్ఛగా కొనసాగించుకోవచ్చును.

అదృష్టవశాన బాజీరావుకు అంబరు రాజైన 2 వ జయసింగు మైత్రీ, ఛత్రసాల్ బుందేలా మైత్రీ లభించింది. బాజీరావు





1737 లో ఢిల్లీ సమీపానికి తన సేనలను తరలించుకు పోయాడు. అయితే పాదుషా బాధ పడతాడని ఢిల్లీనగరం పై దాడి చెయ్య లేదు. ఈ మహారాష్ట్రుల పీడ వదిలించు కోవాలని పాదుషా నిజాముల్ ముల్క్ సహాయం కోరాడు. ఆరేళ్ళక్రితం తాను బాజీరావుతో చేసుకున్న ఒప్పందాన్ని ఉల్లం ఘించి నిజాముల్‌ముల్క్ బాజీరావును అణగదొక్కాలని బయలుదేరి వెళ్ళాడు. భోపాల్ వద్ద ఉభయ పక్షాలకూ జరిగిన యుద్ధంలో నిజాముల్‌ముల్క్ ఓడి పోయి బాజీరావుతో కొత్త సంధి చేసుకున్నాడు. దీని ఫలితంగా మాల్వా యావత్తూ బాజీ రావు దయింది. నర్మదా చంబల్ నదుల మధ్య నున్న దేశం పై అతనికి అధి పత్యం లభించింది. దీనిని పాదుషాయే ధృవపరిచాడు; పేష్వా ఖర్చుల కింద 50 లక్షల రూపాయలను ఇచ్చుకోవలిసి వచ్చింది.

ఈ ఒప్పందం వల్ల దేశంలో కొంత భాగాన మహారాష్ట్రుల ఏలుబడి మరింత సుస్థిరమని గుర్తింపుకు వచ్చింది.

1739 లో, పశ్చిమతీరాన పోర్చుగీసుల అధీనంలో ఉండిన సాల్సెట్, బసీను లను మహారాష్ట్రులు పట్టుకున్నారు. అయితే త్వర



లోనే బాజీరావును నాదిర్‌షా దండయాత్రను గురించిన వార్త కలవర పెట్టింది. అతను ఇరుగు పొరుగున ఉండే ముస్లిములతో వైరం కట్టిపెట్టి, నాదిర్‌షా పై సమిష్టిప్రతిఘటనకు గాను యత్నించాడు. కాని ఈ ప్రయత్నం ముగిసేలోపునే బాజీరావు తన 42 వ ఏట, 1740 ఏప్రిలులో అకాలమరణం వాత పడ్డాడు. అతని మరణంతో మహారాష్ట్ర సామ్రాజ్యానికి తీరని నష్టం కలిగింది. మహా రాష్ట్ర సామ్రాజ్య వ్యవస్థాపకులలో అతను రెండవ వాడని చెప్పవచ్చు.

బాజీరావు హయాంలో మరాఠాల ఖ్యాతి శక్తులు బాగా పెంపొందిన మాట నిజమే





గాని, మహారాష్ట్రదేశం ఐక్యతను కోల్పో యింది. దీనికి కారణం జాగీర్దారీ విధానం తిరిగి అమలులోకి రావటం. అక్కడక్కడా అర్ధస్వతంత్ర మహారాష్ట్ర రాజ్యాలు వెలిశాయి; కేంద్రప్రభుత్వం క్రమంగా దుర్బలమై, చివరకు భగ్నమైపోయింది. పైకి వచ్చిన అర్ధ స్వతంత్ర రాజ్యాలలో మొదటిది బిరారు; దానికి రాజు రఘూజీ భోంస్లే. అదేవిధంగా బరోడాలో గాయక్వార్లు అధిపతులయారు. బాజీరావు కింద పని చేసి కీర్తి సంపాదించిన రనోజీసింధియా మాల్వాలో ఒక ప్రాంతానికి అధిపతి అయాడు. మాల్వాలో మరొక ప్రాంతానికి అధిపతి అయిన మల్హార్‌రావుహోల్కర్ కూడా బాజీరావు కింద దక్షతతో పనిచేసిన సేనానాయకుడే.

బాజీరావు అనంతరం అతని పెద్ద కొడుకు రెండవ బాలాజీ పేష్వా అయాడు. (ఇతనినే నానాసాహెబ్ అనీ, బాలాజీ బాజీ రావనీ కూడా పిలిచేవారు.) ఇతను పేష్వా కావటానికి మరాఠానాయకు లనేకులు వ్యతిరేకించారు. కారణమేమంటే, ఇతను పద్దెనిమిదేళ్ళ బాలుడు; భోగలాలసుడు; తండ్రికి గల సామర్థ్యం ఇతనిలో లేదు. అయినా ఇతను బొత్తిగా అసమర్థుడు కాడు. సేనలను ఆయత్తం చెయ్యటంలోనూ, యుద్ధ తంత్రంలోనూ అతను తన తండ్రిని అనుకరించాడు.

1749 లో షాహూ చనిపోతూ రాజ్యాధికారాన్ని పేష్వాలకు దత్తంచేసేశాడు. శివాజీ వంశానికి తారాబాయి మనమడు వారసుడుగానూ, వంశవర్ధకుడుగానూ ప్రకటించబడ్డాడు. అయితే తారాబాయి ఈ ఏర్పాటును వ్యతిరేకించి, పేష్వాతో యుద్ధం చేసి, బాలుడైన రాజును పట్టి, నిర్బంధంలో ఉంచింది. అయితే యుద్ధంలో పేష్వాకే విజయం లభించింది. అదిమొదలు మహారాష్ట్ర సమాఖ్యకు పేష్వాయే నాయకుడయాడు.





# భారత చరిత్ర




బొలాజీబాజీరావు నాయకత్వం కింద కూడా మహరాష్ట్ర సామ్రాజ్య విస్తరణ కొంత జరిగింది. 1757 మార్చిలో శ్రీరంగపట్టణం వద్ద మహారాష్ట్ర సైన్యాలు ప్రత్యక్షమయాయి. కృష్ణానదికి దక్షిణంగా ఉండే ప్రధాన రాజ్యాల వారందరూ మహారాష్ట్రులకు కప్పాలు చెల్లించవలసి వచ్చింది. ఆర్కాటు నవాబు చౌథ్ బాపతు పాత బాకీ కింద రెండు లక్షలు నగదు ఇచ్చి, మరొక రెండున్నరలక్షలు దఫాలవారిగా చెల్లించుకుంటానన్నాడు.

మహారాష్ట్రులు బిదనూరు, మైసూరు సంస్థానాల పైన కూడా దాడులు చేశారు; క్లైవు, వాట్సన్‌ల నాయకత్వాన ఆంగ్రియా అనే నౌకాధిపతితో పోరాటం సాగించే ఇంగ్లీషు వారికి సహాయం చేశారు. మహారాష్ట్రుల పురోగమనానికి కొంత అడ్డు తగిలిన వారెవరంటే, మైసూరు సేనాపతి హైదరూ, బుస్సీ అనే ఫ్రెంచివాడూ, హైదరాబాదుకు నిజాముగా ఉండిన ఆలీ.

అయితే పేష్వా తమ్ముడి కొడుకైన సదాశివరావు అనేవాడు 1760 లో ఉద్గీర్ వద్ద నిజామును ఓడించాడు. బుస్సీ కింద నిజాముసేనలో ఫిరంగి నిపుణుడుగా పని చేసిన ఇబ్రాహిం ఖాన్‌గర్దీ అనేవాడు మహారాష్ట్రులతో చేరాడు; అతనికి పాశ్చాత్య యుద్ధ తంత్రం తెలుసును. ఈ యుద్ధంలో ఓడిన ఫలితంగా నిజాము మహారాష్ట్రులకు బిజాపూరు సంస్థానం మొత్తంగానూ, ఔరంగాబాదులో చాలా హెచ్చు భాగమూ, బీదరులో కొంత భాగమూ ఇచ్చుకుని, దౌలతాబాదు దుర్గంతో సహా అనేక దుర్గాలు వారి వశం చెయ్యవలసి వచ్చింది. ఈ విధంగా దక్షిణదేశంలో మొగలుసామ్రాజ్యంలోని కొంత భాగం మహారాష్ట్రులు చేజిక్కించుకున్నారు.

63. బాలాజీబాజీరావు





మహారాష్ట్రులు ఉత్తర దేశంలో ఇంతకు మించిన విజయాలు సాధించారు. 1756 అంతంలో మల్హార్‌రావు హోల్కర్, రఘునాథరావులు కొద్ది వారాల తేడాలో తిరిగి ఉత్తరానికి పంపబడ్డారు. రఘునాథరావు నాలుగు మాసాల పాటు రాజపుత్రస్థానంలో ఉండి పోవలిసి వచ్చింది. అందు చేత అతను సఖారాంబాపు అనే వాడి నాయకత్వాన 20,000 మంది సైనికులను "దో అబ్" ప్రాంతానికి పంపాడు. సఖారాం బాపు తెలివిగా జాత్‌లను మంచి చేసుకుని, 1757 లో ఢిల్లీపై దాడిచేసి, ఢిల్లీలో అబ్దాలీ చేత నియంతగా నియమించబడిన నాజిబుద్దౌలా అనే వాడిచేత తమ షరతులపై సంధి చేసుకోవటానికి ఒప్పించారు.

1758 మార్చిలో సిర్‌హింద్, ఏప్రిలులో లాహోరు మహారాష్ట్రులకు చిక్కాయి. అదీనబేగ్ అనేవాణ్ణి పంజాబులో తమ రాజప్రతినిధిగా మహారాష్ట్రులు నియమించారు. అయితే ఈ ప్రాంతాన్ని దక్కించుకోవటానికి తగిన సన్నాహాలు జరగని కారణంచేత రఘునాథుడి "ఘన విజయం" రాజకీయంగానూ, ఆర్థికంగానూ కూడా బోలెడంత నష్టాన్ని కలిగించింది; అబ్దాలీతో మరొక యుద్ధం అనివార్యం చేసింది.

1758 అక్టోబరు 13 న అదీనబేగ్ మరణించటంతో పంజాబులో అరాజకం ప్రబలింది. దానిని సరిచేయటానికి పేష్వా 1759 లో దత్తాజీసింధియా అనే వాణ్ణి పెద్ద సేనతో పంజాబుకు పంపాడు. దత్తాజీ సింధియా పాలకుడుగా సాబాజీసింధియా అనే వాణ్ణి నియమించాడు. కాని త్వరలోనే బలమైన దుర్రానీ సేనలు వచ్చిపడి, పంజాబును జయించాయి. 1759 నవంబరులో పంజాబును పూర్తిగా జయించి, అహ్మద్‌షా అబ్దాలీ ఢిల్లీ పైకి వెళ్ళాడు.

ఈ సమయంలో మహారాష్ట్రులకు ఎవరూ సాయపడక పోవటమే వారి అప





జయానికి కారణం. రుహేలాలూ, ఔధ్ నవాబూ అబ్దాలీ పక్షమయారు. రాజపుత్రులు తటస్థంగా ఉండి పోయారు. సిక్కులు కూడా వారికి సహాయపడలేదు. ఇందుకు కారణం బాలాజీబాజీరావు అనుసరించిన విధానాలే. అతను తన తండ్రి విధానాలలో రెండు మార్పులు చేశాడు. ఒకటి, పాశ్చాత్య యుద్ధతంత్రం నిమిత్తం అతను తన సేనలోకి అన్నిరకాల వృత్తి సైనికులనూ రానిచ్చి, సైన్యంలో ఐక్యతా, క్రమశిక్షణా లేకుండా చేశాడు. అతను చేసిన రెండవ పొరపాటు "హిందూ-పాద్-పాద్‌షాహీ" నినాదానికి స్వస్తి చెప్పటం; ఆ నినాదం హిందూ రాజ్యాల నన్నిటినీ ఏకం చెయ్యటానికి ఉపకరించేది. అందుచేత అతని అనుచరు[illegible] ముస్లిము విచక్షణ లేకుండ[illegible]ంతాల పైనపడి బంది పోటు[illegible] పెంచారు. ఈ కారణంగా దుర్రానీ సేనలను ఎదుర్కొవలసి వచ్చేసరికి మహారాష్ట్రులకు ఎవరూ సాయం రాకపోగా, లోగడ సహాయపడిన వారిలో అనేకమంది దుర్రానీల పక్షం కావటం జరిగింది.

1759 ఆఖరుదినాలలో దత్తాజీ సింధియా అబ్దాలీ చేతిలో స్థానేశ్వరం వద్ద ఓడిపోయి, ఢిల్లీ కేసి తిరోగమించాడు. దారిలో, ఢిల్లీకి ఉత్తరాన పదిమైళ్ళ దూరాన బరారీఘాట్ అనేచోట అఫ్ఘానులు అతన్ని 1760 జనవరి 9న చంపేశారు. దుర్రానీ అశ్విక దళాల ధాటికి తట్టుకోవటం మల్హార్‌రావు హోల్కర్ మొదలైన వారికి సాధ్యం కాలేదు. అంతకు పూర్వమే నిజామును ఓడించి కీర్తిమంతుడైన సదాశివరావు భావును పేష్వా పెద్ద సేనతో పంపుతూ, పదిహేడేళ్ళ వయసుగల తన కొడుకును విశ్వాస్ అనే వాణ్ణి, సేనలన్నిటి పైనా నామమాత్రపు సేనాపతిగా చేసి ఉత్తర దేశానికి పంపాడు.







# భారత చరిత్ర



మొదట సదాశివరావు భావు చాలా వివేకం ప్రదర్శించాడు. అతను తన బలాలనూ, సాధన సంపత్తినీ పెంపొందించుకుని, రాజపుత్రుల సఖ్యం సంపాదించటానికి కృషి చేశాడు. 1760 ఆగస్టు 3 న ఢిల్లీ అతని వశమయింది. అటుపైన భావుకు కష్టాలు ఆరంభమయాయి. సూరజ్‌మల్ అనే వాడు, అతనితో అభిప్రాయ భేదాలు రావటంచేత, అతని పక్షం వదిలేశాడు. మల్హార్‌రావు హోల్కరుకు కూడా అతనితో విభేదం ఏర్పడింది. దీనికితోడు ఢిల్లీ ఆక్రమణ అతని కష్టాలను పెంచింది. ఆగస్టు మధ్యలో అతను ఢిల్లీని వదిలిపెట్టి, 1760 అక్టోబరు 29 నాటికి పానిపట్టు చేరాడు.

ఈలోపుగా అబ్దాలీ ఆలీగఢ్‌ను పట్టుకుని, ఔధ్ నవాబైన షుజా ఉద్దౌలా స్నేహం సంపాదించాడు. 1760 నవంబరు 1 నాటికి అబ్దాలీ పానిపట్టు చేరాడు.

చరిత్రప్రసిద్ధమైన పానిపట్టు రణక్షేత్రంలో అఫ్ఘాను బలాలూ, మహారాష్ట్ర బలాలూ తలపడ్డాయి. అబ్దాలీ సైన్యంలో 30 వేల అశ్వికులూ, 30 వేల కాల్బలమూ ఉన్నారు. మహారాష్ట్ర సేన 45,000 సంఖ్య గలది. సంఖ్యలోనే గాక గుర్రాలలోనూ, ఫిరంగులలోనూ, వ్యూహంలోనూ, కవచాలలోనూ అబ్దాలీ సేన మెరుగైనది.

రెండున్నర మాసాలపాటు ఉభయ సేనల మధ్యా చిల్లర సంఘర్షణలు సాగాయి. వీటిలోనే మహారాష్ట్రులు చాలా దెబ్బతిన్నారు. ముఖ్యంగా వారికి ఆహారపు కొరత తీవ్రంగా ఏర్పడింది. చివరకు 1761 జనవరి 14 న మహారాష్ట్ర సైన్యం శత్రువుపై యుద్ధానికి బయలుదేరింది.

అబ్దాలీ తన సేనావ్యూహాన్ని ఈ విధంగా ఏర్పాటు చేశాడు: మధ్య భాగంలో 18,000 మంది సైనికులు అబాలి వజీరైన

## 64. మూడవ పానిపట్టుయుద్ధం







షావలీఖాన్ నాయకత్వాన నిలబడ్డారు; దానికి కుడి, ఎడమ పార్శ్వాల అయిదేసి వేల సంఖ్యగల సేనలు, హెచ్చుగా అశ్విక దళాలతో కూడుకున్నవి, అమర్చబడ్డాయి; వీటికి నాజిబుద్దౌలా, షుజా ఉద్దౌలాలు అధిపతులు.

భావు మహారాష్ట్ర సేనలను కూడా మూడు విభాగాలు చేశాడు. మధ్య సేన అతని నాయకత్వం కిందనే ఉన్నది. వామ పార్శ్వపు సేనలో ఇబ్రాహీంఖాన్‌గార్దీ సైనికులూ, కుడిపక్క సేనలో మల్హార్ రావు హోల్కర్ దళాలూ ఉన్నాయి.



మహారాష్ట్రులు ఫిరంగులతో యుద్ధం ప్రారంభించారు. వారు అత్యంత ధైర్య సాహసాలతో పోరాడి, ఆరంభంలో కొద్దిపాటి విజయం సాధించారు. ఇబ్రాహీంఖాన్‌గార్దీ దుర్రానీ సేనల కుడి పార్శ్వం పైన చూపిన ధాటికి, ఎనిమిది, తొమ్మిది వేల మంది రుహేలాలు చావటమో, గాయపడటమో జరిగింది. అదే విధంగా, షావలీఖాన్ కింద వున్న దుర్రానీ మధ్య సేనను సదాశివరావు భావు తీవ్రంగా దెబ్బ తీయించి, దాదాపు గెలిచినంత పని చేశాడు.

కాని అబ్దాలీ తన మధ్య సేనలోకి 13,000 మంది కొత్త సైనికులను పంపి ఎదురు దెబ్బతీశాడు. అప్పటికే మహారాష్ట్రుల త్రాణ తరిగి పోయింది. అయినా భావు ప్రాణాలకు తెగించి పోరాటం సాగించాడు. అపరాహ్ణం రెండుంబావు వేళకు విశ్వాసరావు తుపాకీగుండు తగిలి చని పోయాడు. ఆ మీదట భావు మరింత సాహసంతో పోరాటం సాగించాడు, కాని ఫలితం లేకపోయింది. రెండుమ్ముప్పావు గంటకల్లా, "కన్నుమూసి తెరిచేలోగా మహారాష్ట్ర సేన హారతి కర్పూరంలాగా హరించి పోయింది."

అయిదుగురు దుర్రానీ అశ్వికులు సదాశివరావు ఆభరణాలకు ఆశపడి అతని తల నరికేశారు. ఈ విధంగా సదాశివరావు భావు

తన జాతి గౌరవం కోసం ప్రాణాలు బలి పెట్టాడు. అయితే పానిపట్టు వద్ద మహారాష్ట్రులకు అపజయం సిద్ధించటానికి కారణం సదాశివరావే; అతను ఇతరుల అభిప్రాయాలను లక్ష్యపెట్టాడు కాడు, అనేక తప్పుడు అంచనాలు వేశాడు కూడా. ఓటమితోబాటు, ప్రముఖ మహారాష్ట్ర సేనా నాయకులందరూ రణరంగాన ప్రాణాలు వదిలారు. అనేకమంది సైనికులూ, అమాం బాపతు మనుషులూ, స్త్రీలూ, పిల్లలూ సహా, వధించబడ్డారు.

ఈ అపజయం మహారాష్ట్ర జాతి కంతకూ తీరని దెబ్బ అయింది. ఒక తరానికి చెందిన మహారాష్ట్రనాయకు లందరూ ఒక్కసారిగా నశించారు. ప్రతి మహారాష్ట్ర గృహమూ ఈ యుద్ధంలో ఎవరినో ఒకరిని బలి పెట్టింది. మహారాష్ట్రులు 50,000 గుర్రాలనూ, రెండులక్షల పశువులనూ, అనేకవేల ఒంటెలనూ, 500 ఏనుగులనూ, అంతులేని ధనాన్నీ, నగలనూ దోపిడీ ద్వారా కోల్పోయారు. ఈ దుర్వార్త చెవిని పడ్డాక అసలే వ్యాధిగ్రస్తుడై ఉన్న పేష్వా ఆటేకాలం జీవించలేదు; 1761 జూను 23 న ఆయన పూనాలో చనిపోయాడు.

ఈ పానిపట్టుయుద్ధం మహారాష్ట్రుల కీర్తి ప్రతిష్ఠలకు గొడ్డలిపెట్టయింది. పేష్వాల అధికారం దారుణంగా దెబ్బతిన్నది. అయితే మహారాష్ట్రులు తిరిగి కోలుకోగలిగారు. పేష్వా మాధవరావు కీర్తిమంతుడు కావటమే గాక, మొదటి పేష్వా ఆశయాలను అమలు జరప యత్నించాడు. 1772 లో అతను మరణించడం మహారాష్ట్రజాతికి మరొక పానిపట్టు అపజయం అయిందని చెబుతారు.

అయినా పానిపట్టు యుద్ధం భారత చరిత్రలో ఒక విషమ ఘట్టం. ఆ యుద్ధంలో మహమ్మదీయులూ, మహారాష్ట్రులూ పరస్పరం నిర్వీర్యపరచుకోవటం వల్ల బ్రిటిషువారు లాభం పొందారు.





# భారత చరిత్ర




**15** వ శతాబ్ది ఆఖరులో పాశ్చాత్యులు భూగోళం మీద సాధించిన అన్వేషణల మూలంగా వివిధ దేశాలమధ్య కొత్తవాణిజ్య సంబంధాలేర్పడి, అనేక దేశాల చరిత్రలో కొత్త అధ్యాయాలు ప్రారంభమయాయి. అలాటి మార్పులకు పునాది వేసిన సంఘటనలలో ప్రముఖమైనది వాస్కోడగామా ఇండియాకు రావటం. ఇతను 1498 మే 27 న కాలికట్ రేవులో అడుగుపెట్టాడు.

పైదేశాలవారు మనదేశానికి రావాలంటే రెండేమార్గాలు: ఒకటి వాయువ్యసరిహద్దు మీదుగా గల నేలమార్గం: రెండవది సముద్రమార్గం. మొగలులు నేలమార్గాన్ని బాగానే సంరక్షించారు గాని, సముద్రమార్గాలను కాపాడుకునే యత్నం చెయ్యలేదు. వారేనాడూ సముద్రం పైన అధిపత్యం కోరలేదు. సముద్రమార్గాలను రక్షించుకునే యత్నం చేసినవారు మహారాష్ట్రులొక్కరే.

వాస్కోడగామా పోర్చుగీసు (బుడతకీచు) నావికుడు. అతను లిస్బన్‌నగరం నుంచి బయలుదేరి ఆఫ్రికాను చుట్టి, ఇండియాకు వచ్చాడు. జామొరిన్ అనే బిరుదు గల కాలికట్ పాలకు డతనికి స్నేహం చూపాడు. అతని రాకతో పోర్చుగలుకూ ఇండియాకూ మధ్య వర్తకసంబంధాలేర్పడ్డాయి.

నిజానికి అంతకు పూర్వం కూడా పాశ్చాత్య దేశాలకూ, ఇండియాకూ మధ్య వర్తక సరుకుల రవాణా జరుగుతూనే ఉండేది. అయితే 7 వ శతాబ్ది లగాయితు ఇండియాకూ, పాశ్చాత్య దేశాలకూ మధ్య జరిగే సముద్ర రవాణాలు అరబ్బుల చేతిలో ఉండేవి; హిందూమహాసముద్రం మీదా, ఎర్రసముద్రం మీదా గల వర్తకమార్గాలు ఆ అరబ్బుల కింద ఉండేవి. ఇప్పుడా మార్గాలను పోర్చుగీసు వర్తకులు ఉపయోగించసాగారు.

## 65. పోర్చుగీసులు







1500 మార్చి 9న పేడ్రోఅల్వారెజ్ కాబ్రల్ అనే పోర్చుగీసు నౌకాధిపతి 13 వర్తకనౌకలను వెంటబెట్టుకుని లిస్బను నుంచి ఇండియాకు బయలుదేరాడు. ఇలా వర్తకానికి వచ్చిన పోర్చుగీసులు తమ వర్తక మేదో తాము చూసుకోక, తూర్పు సముద్ర ప్రాంతాలకు చెందిన వర్తకమార్గాలను తమ గుత్తసొమ్ము చేసుకునే దుర్బుద్ధితో ఇతర వర్తకనౌకలను పీడించ సాగారు. అరబ్బు వర్తకుల ద్వారా లాభం పొందుతూ వచ్చిన కాలికట్ పాలకుడు ఈ కారణంగా పోర్చుగీసువారికి శత్రువయాడు. పోర్చుగీసువాళ్ళు కూడా కాలికట్ పరిపాలకుడి విరోధి అయిన కొచ్చిను పాలకుడి లాటి మరికొందరు రాజులతో స్నేహం సంపాదించి దక్షిణ భారతదేశపు రాజకీయ కుట్రలలో వేలుపెట్టారు.

భారతదేశంలో పోర్చుగీసువారి ఆధిపత్యానికి నిజమైన పునాది వేసినవాడు అల్ఫోన్సోడి అల్బుకర్క్ అనేవాడు. ఇతను మొదటిసారి ఇండియాకు 1503 లో ఒక నౌకాదళానికి నాయకుడుగా వచ్చి, అధికారుల మెప్పు సంపాదించి, 1509 లో పోర్చుగీసు గవర్నరుగా నియోగించబడి, ఇండియాలో పోర్చుగీసు వారి వ్యవహారాలు చూడసాగాడు. బిజాపూరు సల్తనతులోని దైన గోవాను ఇతను 1510 లో పట్టుకున్నాడు. ఇది సంపన్నమైన రేవుపట్టణం. అల్ఫోన్సో పరిపాలనా కాలంలో గోవానగర రక్షణలు బలపరచబడ్డాయి. దాని వాణిజ్యం కూడా పెంపొందింది. భారతదేశంలో పోర్చుగీసు సంతతి అధికం కాగలందులకు ఇతను తన దేశస్థులు భారతస్త్రీలను పెళ్ళాడ ప్రోత్సహించాడు. ఇతను ముస్లిముల పట్ల చాలా దారుణంగా ప్రవర్తించినా, తన జాతివారికి చాలా ఉపకారం చేశాడు. 1515 లో ఇతను చనిపోయే నాటికి నౌకాబలంలో పోర్చుగీసు వారికి సాటిరాగలవారెవరూ







భారతదేశంలో లేరు. పశ్చిమతీర మంతా వారి అధీనంలోనే ఉండింది.

అల్బకర్క్ అనంతరం వచ్చినవారు సముద్రతీరాన ఒక్కొక్క నగరమే స్థాపిం చుతూ వచ్చారు. దియూ, దమాన్, సల్సెట్, బసీన్, చౌల్, బొంబాయిలూ, మద్రాసు వద్ద శాంతోమ్, బెంగాలులో హుగ్లీ ఇలాటివే. పోర్చుగీసు ఆధిపత్యం సింహళంలో చాలా మేర విస్తరించింది. అయితే కాలక్రమాన ఈ ప్రదేశాలన్నీ వారి అధీనం నుంచి పోయాయి. దియూ, దమాన్, గోవాలు మాత్రమే చాలా కాలం వారికి దక్కి, చివ రకు 1963 లో అవి స్వతంత్రభారతంలో చేరిపోయాయి.

భారత వాణిజ్యం పోర్చుగలుకు చాలా లాభించింది. అది చూసి అనేక పాశ్చాత్య దేశాలలో ఈస్టిండియా కంపెనీలు పుట్టు కొచ్చాయి. ఇంగ్లాండులో పుట్టిన కంపెనీ 1600 లో "తూర్పు" సముద్రాలలో వ్యాపారం సాగించే గుత్తాధికారం రాజు నుంచి పొందింది. 1602 లో డచ్చి ఈస్టిం డియా కంపెనీ తూర్పు సముద్రాలలో వర్తకం సాగించడానికి మాత్రమే గాక, కొన్ని ప్రాంతాలు ఆక్రమించి, కోటలూ అవీ కట్టే పద్ధతిలో ఒడంబడికలు చేసుకోవ డానికి కూడా రాజాధికారం పొందింది. 1616 లో డెన్మార్కు వారు వచ్చారు. 1664 లో ఏర్పడిన ఫ్రెంచిఈస్టిండియా కంపెనీ రాజకీయంగా పెద్దపాత్ర నిర్వహిం చింది. ఇలాగే ఇంకా అనేక ఈస్టిండియా కంపెనీలు పుట్టుకొచ్చాయి.

సహజంగా వీటి మధ్య పోటీలు ఏర్ప డ్డాయి. 17 వ శతాబ్ది పూర్వార్థంలో పోర్చు గీసు, డచ్చి, ఇగ్లీషుకంపెనీలు మూటి మధ్యా బహుముఖ ద్వంద్వపోరాటాలు సాగాయి. ఈ పోరాటాలలో నెగ్గలేకా, మరికొన్ని ఇతర కారణాల వల్లా పోర్చుగీసువారి ప్రతిభ 18 వ శతాబ్దిలో బాగా తరిగిపోయింది.





# భారత చరిత్ర



1605 నుంచి ప్రాచ్యంలో పోర్చుగీసు వారిని డచ్చివారు జయించసాగారు. వారు 1639 లో గోవాకు ముట్టడి వేశారు. 1658 నాటికి సింహళంలోని పోర్చుగీసు వలస లన్నీ డచ్చివారి అధీనంలోకి వచ్చాయి. వ్యాపారమే డచ్చివారిని ఇండియాకు తెచ్చింది. వారు గుజరాతులోనూ, కోర మండలతీరానా, బెంగాలు, బీహారు, ఒరిస్సా లలోనూ ఫాక్టరీలు నిర్మించారు. 17 వ శతాబ్ది అంతటా సుగంధద్రవ్య వ్యాపారం వారి గుత్తగా సాగింది. ఇండియాకూ, దూరప్రాచ్య దీవులకూ మధ్య డచ్చివారు వ్యాపారం పునరుద్ధరించి, విజయనగర సామ్రాజ్యంనాటి సంబంధాలను మళ్ళీ ఏర్పాటు చేశారు. దేశంలోని వివిధ ప్రాంతాల నుంచి నీలిమందూ, ముడిపట్టూ, సూరేకారమూ, బియ్యమూ, నల్లమందూ సూరతునగరంలో డచ్చివారికి చేరేవి.

అయితే 17 వ శతాబ్దిలో డచ్చివారికి ఇంగ్లీషువారికీ పోటీ వచ్చింది. ఒకప్పుడు పోర్చుగీసువారికీ, ఇంగ్లీషువారికీ సంఘర్షణ లుండినా, అవి క్రమంగా సమసిపోయాయి. పోర్చుగీసువారు రెండవ చార్లెస్ (ఇంగ్లండు) రాజుకు బొంబాయిని భరణంగా ఇచ్చారు. అయితే ఇంగ్లీషువారి వర్తకాన్ని డచ్చివారు తీవ్రంగా ప్రతిఘటించారు. డచ్చివారి ప్రధాన స్థావరం మలేయు, ఇంగ్లీషువారిది ఇండియా; అయినా ఉభయులకూ ఇండియాలో సంఘర్షణ తప్పలేదు. 1672-1674 మధ్యకాలంలో డచ్చివారు తమ సూరతుకూ, ఇంగ్లీషువారి బొంబాయికీ మధ్య రాకపోకలను అనేకమార్లు భగ్నం చేశారు; బంగాళాఖాతంలో మూడు ఇంగ్లీషు వర్తకనౌకలను పట్టుకున్నారు. 1759 దాకా ఉభయుల మధ్యా వ్యాపార పోటీ తీవ్రంగానే సాగింది.

66. పాశ్చాత్యుల వర్తకపోటీలు





ఇంగ్లీషు ఈస్టిండియాకంపెనీ ఇండియాలో మొట్టమొదటి ఫాక్టరీలు ఏర్పాటు చేసే ప్రయత్నం 1608 లో జరిగింది. కంపెనీ తరఫున కాప్టెన్ హాకిన్స్ అనేవాడు 1609 లో జహంగీర్ దర్బారుకు వచ్చి, సూరతులో ఇంగ్లీషుఫాక్టరీ స్థాపించటానికి పాదుషా అనుకూల్యం కూడా సంపాదించాడు. అయితే సూరతువర్తకులూ, పోర్చుగీసువారూ పాదుషా అనుమతికి అడ్డు తగిలారు. 1611 లో హాకిన్స్ ఆగ్రా నుంచి బయలుదేరి సూరతు చేరేసరికి, సర్ హెన్రీ మిడిల్టన్ అనేవాడు మూడు ఓడలతో వచ్చి సూరతు వర్తకులను భయపెట్టాడు. అందుచేత వారు 1612 లో కాప్టెన్ బెస్ట్ అనే వాడి కింద రెండు బ్రిటిషు ఓడలను సూరతు రేవులోకి రానిచ్చారు. పోర్చుగీసువారు యుద్ధానికి తలపడితే, కాప్టెన్ బెస్ట్ వారిని ఓడించాడు. ఇంగ్లీషువారు సూరతులో శాశ్వతంగా ఫాక్టరీ నిర్మించుకోవటానికి అనుమతించుతూ జహంగీర్ 1613 లో ఫర్మానా ఇచ్చాడు. త్వరలోనే బ్రిటిషురాజు వద్ద నుంచి ఒక రాయబారి మొగలుదర్బారుకు వచ్చి వర్తక ఒడంబడిక చేసుకోగోరాడు. ఈ రాయబారి పేరు సర్ టామస్ రో. ఇతను 1615 ఆఖరు నుంచి 1618 ఆఖరు దాకా



మొగలు దర్బారులో ఉండి, వర్తకపు ఒడంబడిక సాధించలేక పోయినప్పటికీ, కంపెనీవారు మొగలు సామ్రాజ్యంలో అనేక చోట్ల ఫాక్టరీలు నిర్మించటానికి పాదుషా అనుమతీ, ఇతర సౌకర్యాలూ సాధించాడు. దీని ఫలితంగా సూరత్, ఆగ్రా, అహమ్మదాబాదు, భరూచి లలో ఇంగ్లీషు ఫాక్టరీలు వెలిశాయి. ఇంగ్లీషురాజు తనకు భరణంగా లభించిన బొంబాయిని, 1668 లో ఏడాదికి పదిపౌనుల (సవర్ల) కిరాయికి కంపెనీ పరం చేశాడు. కొద్ది సంవత్సరాలలోనే బొంబాయినగరం బాగా పెరిగి, 1687 నాటికి సూరతుపట్టణాన్ని మించిపోయి, పశ్చిమ







తీరాన బ్రిటిషువారికి ప్రధాన వ్యాపార కేంద్ర మయింది.

తూర్పుతీరాన మచిలీపట్టణంలో బ్రిటిషు వారొక ఫాక్టరీ 1611 లో పెట్టారు. గోల్కొండ రాజ్యానికి అది ప్రధాన రేవు. ఏటా 500 పగోడాలు (1750 రూపాయలు) సుంకం చెల్లించి, గోల్కొండ రాజ్యంలోని రేవు లన్నిటా స్వేచ్ఛగా వ్యాపారం చేసుకునేటందుకు ఇంగ్లీషువారికి అనుమతి ఇస్తూ గోల్కొండ సుల్తాను 1632 లో ఫర్మానా జారీచేశాడు. 1634 లో తిరిగి మరొక ఫర్మానా కూడా ఇదే షరతుతో జారీ అయింది. కాని స్థానికాధికారులు ఇంగ్లీషువారి వద్ద డబ్బు గుంజుతూ వచ్చారు. అందుచేత వారు మరొక రేవు కోసం చూడసాగారు.

1639 లో చంద్రగిరిరాజు మదరాసును బ్రిటిషువారికి కవులు కిచ్చాడు. అక్కడ వారు రక్షణలతో కూడిన ఫాక్టరీ నిర్మించారు. ఇదే ఫోర్ట్ సేంట్ జార్జ్. ఈ కోట నిర్మించాక మచిలీపట్నం ప్రాముఖ్యం పోయి, మదరాసే బ్రిటిషువారి ముఖ్య కేంద్ర మయింది.

బ్రిటిషువారి ప్రాభవం వ్యాప్తి చెంద సాగింది. 1633 లో మహానది డెల్టాలోని హరిహరపురం వద్దా, బలాసోర్‌లోనూ వారు కొత్తఫాక్టరీలు ఏర్పాటు చేశారు. 1651 లో బ్రిజ్‌మన్ అనేవాడి ఆధిపత్యాన హుగ్లీ వద్ద మరొక ఫాక్టరీ వెలిసింది. అటుతరవాత కొద్దికాలానికే పాట్నాలోనూ, కాసింబాజార్ లోనూ ఫాక్టరీలు ఏర్పడ్డాయి.

ఆ కాలంలో బ్రిటిషువారు బెంగాలులో ప్రధానంగా పట్టు, నూలువస్త్రాలూ, సూరేకారమూ, చక్కెరా వగైరాల వ్యాపారం సాగించారు. 1658 నాటికి, బెంగాలు, బీహారు, ఒరిస్సా, కోరమండల్ తీరంలోని బ్రిటిషు వలస లన్నీ ఫోర్ట్ సేంట్ జార్జ్ అధీనంలోకి తేబడ్డాయి.





# భారత చరిత్ర



17 వ శతాబ్ది పూర్వార్ధంలో ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీ అంతగా లాభం చేసుకోలేదు, కాని ఉత్తరార్ధంలో బ్రిటిషు ప్రభుత్వం నుంచి కొత్త సౌకర్యాలు పొంది పైకి వచ్చింది. దానికి మూలధనం కూడా ఏర్పడటంతో ఆర్థికచిక్కులు తొలగాయి.

ఈ కాలంలోనే దానికి "కోరలు" వచ్చాయి. అంత దాకా శాంతియుతంగా వ్యాపారం చేసుకుంటూ వచ్చిన కంపెనీ శక్తిమంతంగా తయారై కొన్ని ప్రాంతాలను స్వాధీనం చేసుకునే ప్రయత్నంలో పడింది. దీనికి కొంత కారణం దేశంలోని అరాజక పరిస్థితే. 1669 నుంచి బొంబాయి గవర్నరుగా పని చేసిన జీరల్డ్ అంగియర్ అనే వాడు కంపెనీ డైరెక్టర్లకు రాస్తూ, "ఇక నుంచీ మీరు చేత కత్తిపట్టి మీ వ్యాపారాన్ని నిర్వహించుకోవలసి ఉంటుంది," అని హెచ్చరించాడు.

కంపెనీ పాలసీలో మార్పు వచ్చింది. ఇండియాలో బ్రిటిషు వలస ఏర్పాటు కావటానికి కృషి ప్రారంభ మయింది. కంపెనీ ప్రముఖులలో అగ్రేసరుడైన సర్ జాన్ చైల్డ్, 1688 డిసెంబరులో బొంబాయి రేవునూ, పశ్చిమ తీరాన గల మొగలు రేవులనూ ముట్టడించాడు. అనేక మొగలు నౌకలు పట్టుబడ్డాయి.

అయితే ఇది తొందరపాటు చర్యగా పరిణమించింది. మొగలు సామ్రాజ్యం ఇంగ్లీషువాళ్ళు అనుకున్నంత దుర్బలంగా లేదు. సర్ జాన్ చైల్డ్ ఔరంగజేబుకు క్షమాపణ చెప్పుకుని, తాను పట్టుకున్న మొగలు నౌకలతో బాటు లక్షన్నరరూపాయలు పరిహారం కూడా ఇచ్చుకోవలసి వచ్చింది. 1690 ఫిబ్రవరిలో ఔరంగజేబు బ్రిటిషు వారు వర్తకం చేసుకునేటందుకు లైసెన్సు మంజూరు చేశాడు.

67. ఈస్టిండియా కంపెనీ పెరుగుదల





బెంగాలులో కూడా ఇంగ్లీషువారి వ్యాపార సౌకర్యం నిమిత్తం సుల్తాన్ షుజా 1651లో ఒక ఫర్మానూ, 1656 లో ఒక నిషానూ జారీ చేశాడు. కాని షుజా అనంతరం అతని వారసులు ఆ సౌకర్యాలను రద్దుచేశారు. 1672 లో షైస్తఖాన్ జారీ చేసిన ఫర్మాను లాభాన్ని కూడా ఇంగ్లీషు కంపెనీ ఆచరణలో పొందలేక పోయింది. అందుచేత కంపెనీ వారు బలప్రయోగంతో తమ పబ్బం గడుపు కోవటానికి నిశ్చయించి, హుగ్లీలో ఒక కోట నిర్మించారు. 1686 అక్టోబరులో ఇంగ్లీషు వారికీ, మొగలులకూ యుద్ధం జరిగింది. ఇంగ్లీషువారు హుగ్లీ నుంచి పారిపోయి, నదీ ముఖంలో ఉన్న ఒక దీవి చేరి, అక్కడి నుంచి సంధి సంప్రదింపులు జరిపారు. సంధి అయితే జరిగింది గాని, మరుసటి ఏడు కాప్టెన్ విలియం హీత్ అనేవాడి నాయకత్వాన ఇంగ్లండు నుంచి ఒక నౌకా దళం వచ్చి, చిటగాంగును ఆక్రమించ టానికి ప్రయత్నించి విఫలమయింది.

1690 లో ఔరంగజేబుతో చేసుకున్న సంధి అనంతరం ఇంగ్లీషువారు ఇలాంటి చిలిపి చేష్టలు కట్టిపెట్టారు. జాబ్ చార్నోక్ అనే ఇంగ్లీషు ఏజెంటు వివేకం గలవాడు. అతను 1690 అగస్టులో బెంగాలులోని



సుతమతీ అనే చోట ఒక ఇంగ్లీషు ఫాక్టరీ నిర్మింపజేశాడు. 1691 ఫిబ్రవరిలో మొగలుచక్రవర్తి ఉత్తరువు పైన, బెంగాలు లోని పాలకుడైన ఇబ్రాహింఖాన్ ఒక ఫర్మాను జారీ చేస్తూ, ఇంగ్లీషువారికి ఎలాటి సుంకాలూ లేకుండానూ, వారు ఏటా 3 వేల రూపాయలు ఇచ్చేటట్టూ ఏర్పాటు చేశాడు.

బర్ద్వాన్‌జిల్లా లోని జమీందారు (శోభా సింగు) తిరుగుబాటు చేయటం సాకుగా పెట్టుకుని ఇంగ్లీషువారు 1696 లో తమ ఫాక్టరీకి రక్షణలు నిర్మించుకున్నారు. మరి రెండేళ్ళ అనంతరం వారు, సుతమతీ, కలికాతా (కలకత్తా), గోవిందపూరు అనే





మూడు గ్రామాలను 1200 రూపాయలకు కొనుక్కున్నారు.

ఇంగ్లండులో రెండవ చార్ల్స్, రెండవ జేమ్స్ పరిపాలించిన కాలంలో కంపెనీ చాలా లాభం పొందింది. అయితే 1694 లో ఈ కంపెనీకి గల గుత్తాధికారాలను అంతం చేస్తూ బ్రిటిషు పార్లమెంటు ఒక తీర్మానం చేసి, ఇండియాతో వ్యాపారం కొనసాగించే హక్కు ప్రతి ఇంగ్లీషువాడికీ ఉన్నదని నిర్ణయించింది. 1698 లో ఇది చట్టం అయింది. జనరల్ సొసైటీ అనే ఒక నూతన సంస్థ కూడా ఏర్పాటయింది. పాత కంపెనీ, తన వ్యాపారహక్కులను దక్కించుకొనటానికి 1707 లో ఈ సంస్థలో చేరింది. అయితే పాత కంపెనీకి పోటీగా "ఇంగ్లీషు వర్తకుల కంపెనీ" అంటూ మరొకటి బయలుదేరింది.

ఈ కొత్త కంపెనీ తరఫున సర్ విలియం నోరిస్ అనేవాడు రాయబారిగా మొగలు దర్బారుకు వచ్చి తమ కంపెనీకి ప్రత్యేక సౌకర్యాలు కోరాడు. ఈ కోర్కె అమలు కాలేదు. చివరకు ఈ రెండు కంపెనీలూ ఏకమై, 1793 దాకా గుత్తవ్యాపారం పోటీ లేకుండా సాగించాయి.

18 వ శతాబ్దంలో తొలి 40 ఏళ్ళపాటు ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీ వ్యాపారం అభివృద్ధి చెందింది. దేశంలోని రాజకీయ అవ్యవస్థ ఆ వ్యాపారానికి చెప్పుకోదగిన అవాంతరా లేమీ కలిగించలేదు. 1715 నుంచీ మొగలు దర్బారుకు కంపెనీ తరఫున రాయబారి కూడా ఉంటూ వచ్చాడు. రాయబార వర్గానికి చెందిన వైద్యుడొకడు (విలియం హామిల్టన్) చక్రవర్తి ఫరుఖ్ సియర్‌కు చికిత్స కూడా చేశాడు. ఇందువల్ల కంపెనీకి లాభించింది. వారు లోగడ చెల్లించుతూ వచ్చిన సుంకాలు కొన్ని మాఫీ చేయబడ్డాయి. బొంబాయిలో సిక్కా వేసే కంపెనీ నాణాలకు మొగలు సామ్రాజ్యమంతటా చలామణీ లభించింది.





# భారత చరిత్ర




కలకత్తా గ్రామం నగరంగా పెరిగింది. 1735 నాటికి అక్కడి జనసంఖ్య లక్ష అయింది. అక్కడి రేవులో ఏటా పదివేల టన్నుల సరుకు కదిలేది. పడమటి తీరాన మటుకు ఇంగ్లీషువాళ్ళ వర్తకం 18 సంవత్సరాల పాటు దెబ్బ తిన్నది. దానికి కారణం మరాఠీ నౌకాధిపతులకూ, పోర్చుగీసువారికీ మధ్య సాగిన సంఘర్షణే. అటు తరవాత ఇంగ్లీషు వ్యాపారం బాగానే సాగింది. 1744 నాటికి బొంబాయిలోని జనసంఖ్య 70,000. 1739 లో ఇంగ్లీషు కంపెనీ పేష్వాతో ఒప్పందం చేసుకుని, మరాఠీ నౌకాధిపతులపై యుద్ధాలు చేసి, వారి స్థావరాలైన సువర్ణదుర్గం, ఘేరియాలను పట్టుకున్నది. ఘేరియాను పట్టుకున్నవారిలో క్లైవ్ కూడా ఉన్నాడు.

ఫ్రెంచి ఈస్టిండియా కంపెనీవారు సూరత్, మచిలీపట్టణం నగరాలలో ఫాక్టరీలు స్థాపించారు. 1674 లో పుదుచ్చేరి గ్రామాన్ని సంపాదించి, ఫ్రెంచి వలసగా అభివృద్ధి చేశారు. 1706 నాటికి పుదుచ్చేరిలోని జనసంఖ్య 40,000 (ఆ ఏడు కలకత్తా జనసంఖ్య 22,000 మాత్రమే). 1725 లో మాహే, 1739 లో కారైకాల్ వారి అధీనంలోకి వచ్చాయి. చాలా కాలం ఫ్రెంచివారు తమ వ్యాపారం మాత్రమే చూసుకున్నారు. కాని 1742 లో వారికి రాజకీయ తృష్ణ పుట్టుకొచ్చింది. భారత దేశంలో ఫ్రెంచిసామ్రాజ్యం నెలకొల్పాలని డూప్లే సంకల్పించాడు. ఈ విధంగా బ్రిటిషు వారికీ, ఫ్రెంచివారికీ మధ్య సంఘర్షణ ఏర్పడి, భారత చరిత్రలో ఒక కొత్త అధ్యాయం సృష్టి అయింది.

ఇరవైఏళ్ళపాటు కర్ణాటక ప్రాంతంలో ఇంగ్లీషువారికీ, ఫ్రెంచివారికీ సంఘర్షణ కొనసాగి, చివరకు భారతదేశంలో ఫ్రెంచి

68. మొదటి కర్ణాటకయుద్ధం





వారి అధికారం అంతరించింది. దీని ఫలి తంగా భావి భారత భాగ్య విధాతలు ఇంగ్లీషు వారే కాని, ఫ్రెంచివారు కారని కూడా స్పష్టమయింది. ఈ సంఘర్షణ వల్ల దేశానికి అనుకోని పరిణామాలు జరిగిన కారణంగా కర్ణాటక యుద్ధానికి మన చరిత్రలో ప్రాముఖ్యం ఏర్పడింది.

నిజానికి ఈ సంఘర్షణ అతి క్షుద్రమైన వ్యాపార పోటీగా ప్రారంభమై, క్రమంగా పెరిగి, మొగలు సామ్రాజ్యాన్ని కబళించ టానికి జరిగిన యుద్ధంగా పరిణమించింది.

కర్ణాటక (కొరమండల్) తీరాన ఇంగ్లీషు వర్తకానికి మద్రాసూ, ఫ్రెంచి వర్తకానికి పుదుచ్చేరీ ముఖ్య కేంద్రాలుగా ఉండేవి. రెండూ రక్షణ బలాలతో కూడిన నగరాలే. ఒక్కొక్క నగరంలోనూ సుమారు 500 మంది తెల్లవాళ్ళూ, 25,000 మంది భార తీయులూ ఉండేవారు. పుదుచ్చేరీకి కొంచెం దక్షిణాన ఉన్న సెంట్ డేవిడ్ కోట ఒకటి ఇంగ్లీషువారికి అదనంగా ఉండేది. ఈ మూడు నగరాలూ సముద్ర తీరాన ఉన్నవే. వీటిని రక్షించుకోవాలన్నా, ఈ నగరాలలో సరు కులు దించుకోవాలన్నా సముద్రంపైన ఆధి పత్యం అవసరం. స్థానిక ప్రభుత్వాలకు నౌకాబలాలు లేని కారణం చేత సముద్రాధి



పత్యపు పోటీ పూర్తిగా ఇంగ్లీషు, ఫ్రెంచి వారికే పరిమితమయింది. స్థానిక ప్రభుత్వా లకు సముద్రం మీదనే కాక, భూమి మీద కూడా ఆధిపత్యం లేకుండా పోయింది. కర్ణాటక ప్రదేశమంతటా రాజకీయ అవ్యవస్థ ఏర్పడింది. కర్ణాటక ప్రాంతం దక్కను సుబేదారు కింద ఒక పరగణాగా ఉండేది, దాన్ని ఆర్కాటు నవాబు గవర్నరుగా ఏలు తూండేవాడు. అయితే దక్కను సుబేదారైన నిజాముల్‌ముల్క్ స్వతంత్రుడుగా వ్యవహ రించినట్టే, ఆర్కాటు నవాబు కూడా స్వతంత్రరాజులాగా వ్యవహరించసాగాడు. ఉత్తర దేశపు రాజకీయాలలోనూ, మహా







రాష్ట్రులతోనూ మునిగి తేలుతున్న నిజాము కర్ణాటక వ్యవహారాలపైన తన దృష్టి కేంద్రీకరించ లేకపోయాడు.

అయితే 1743 లో ఆయన దృష్టి కర్ణాటకం కేసి తిరిగింది. అంతకు మూడేళ్ళ క్రితం మహారాష్ట్రులు కర్ణాటకం పైన పడి దోచుకుని, గవర్నరును చంపి, అతని అల్లుణ్ణి, చందా సాహెబ్ అనేవాణ్ణి ఖైదీగా సాతారాకు పట్టుకుపోయారు. గవర్నరు కొడుకు మహారాష్ట్రులకు ఒక కోటి రూపాయలిచ్చి తన ప్రాణాన్నీ, రాజ్యాన్నీ కాపాడుకో జూశాడు, కాని అతన్ని అతని దాయాది ఒకడు హత్య చేశాడు. ఇలాటి సంఘటనలతో కర్ణాటక ప్రాంత ప్రజలు ఆందోళన పడి పోయారు. అందుకని నిజాము స్వయంగా కర్ణాటకానికి వెళ్ళి, అన్వారుద్దీన్ ఖాన్ అనేవాణ్ణి కర్ణాటక నవాబుగా నియమించి పరిస్థితి చక్కబరచ యత్నించాడు. కాని ఈ ప్రయత్నం కొనసాగలేదు. జాగీర్లు అనుభవిస్తున్న పాత నవాబు బంధుగణం కొత్త నవాబు రాకను సహించలేదు.

ఈ విధంగా కర్ణాటకంలో చెలరేగిన అశాంతి ఇంగ్లీషు, ఫ్రెంచి వ్యాపారాలను ఏ విధంగానూ బాధించలేదు. అప్పట్లో వారు కూడా, తమ వ్యాపారానికి తభావతు వస్తే తప్ప, భారత రాజకీయాల చాయలకు రాలేదు. ఇలాగే జరిగిపోయినట్టయితే ఏమయేదో చెప్పలేం. కాని, 1740-48 మధ్య యూరపులో జరిగిన ఆస్ట్రియా రాజ వారసత్వపు యుద్ధంలో ఇంగ్లండు చిక్కుకున్నది. ప్రాన్సు కూడా చిక్కుకున్నది. అయితే రెండుదేశాలూ వ్యతిరేక పక్షాలవలంబించాయి. ఈ వైరం ఆ దేశాల వర్తకాలకు కూడా సంక్రమించింది. ఇలా జరగకుండా, ఇండియా పొలిమేరలో ఉభయ దేశాలకూ శాంతి ఉండేటట్టు చెయ్యాలని పుదుచ్చేరి గవర్నరు డూప్లే చేసిన సూచన అమలు జరగలేదు.







# భారత చరిత్ర




మొట్టమొదట ఇంగ్లీషు నౌకాదళం ఫ్రెంచి నౌకలను పట్టుకున్నది. ఫ్రెంచివారికి యుద్ధ నౌకలు లేకపోయే సరికి, డూప్లే మారిషస్ దీవుల నుంచి ఎనిమిది యుద్ధనౌకలను తెప్పించాడు. ఇంగ్లీషు నౌకలు ఏ కారణం చేతనో ఫ్రెంచి నౌకలతో యుద్ధం చెయ్యక, మద్రాసు తీరాన్ని ఫ్రెంచివారి వాత వదిలి పెట్టి, బెంగాలులోని హుగ్లీకి ప్రయాణమై వెళ్ళిపోయాయి.

ఫ్రెంచివారు మద్రాసుపై సముద్రం దిక్కు నుంచీ, భూమి దిక్కు నుంచీ కూడా ముట్టడించారు. ఒక వారంలో మద్రాసు వారికి లొంగింది. ఈ ముట్టడిలో ఆరుగురు మాత్రమే చనిపోయారు.

కాని అంతటితో యుద్ధం ముగియు లేదు. కొత్తగా కర్ణాటక గవర్నరయిన అన్వారుద్దీన్ మద్రాసు వద్ద గల ఫ్రెంచి బలాలపైకి పెద్ద సేనను పంపాడు. అప్పటికే మద్రాసును ఆక్రమించుకున్న అల్ప సంఖ్య గల ఫ్రెంచిసేన నవాబుగారి పెద్ద సేనలను చెదరగొట్టింది. నవాబు సేనలు శాంతోమ్‌కు తిరోగమించి, అటుగా వచ్చిన అదనపు ఫ్రెంచి బలాల చేతిలో మరొక సారి ఓడిపోయాయి. ఈ అపజయాల ఫలితాలు తరవాత తెలుసుకుందాం.

ఇంతలో పెద్ద తుఫాను వచ్చి మద్రాసు తీరంలోని నౌకలు నష్టపడి, మద్రాసు విడిచి వెళ్ళిపోయాయి. డూప్లే మద్రాసును నిలువు దోపిడీ చేశాడు. ఫ్రెంచి నౌకాబలం వెళ్ళిపోగానే సముద్రతీరం తిరిగి ఇంగ్లీషువారిదయింది. డూప్లే ఫోర్ట్‌సెంట్‌డేవిడ్‌ను 18 మాసాలు ముట్టడించి కూడా జయించలేకపోయాడు. ఈ లోపల (1748 జూన్) ఇంగ్లండు నుంచి పెద్ద నౌకాదళం వచ్చి, పుదుచ్చేరిని సముద్రం మీది నుంచీ, నేల మీది నుంచీ కూడా ముట్టడించింది. కాని

## 69. డూప్లే తంత్రజ్ఞత





ఫ్రెంచివారికి ఓటమి సంభవించలేదు. ఇంతలో యూరపులో యుద్ధం ముగిసింది. ఇంగ్లాండుకూ, ఫ్రాన్సుకూ రాజీ అయింది. ఫ్రెంచివాళ్ళు మద్రాసును ఇంగ్లీషువారి పరం చేశారు.

ఈ సంఘర్షణ నుంచి డూప్లే గొప్ప గుణ పాఠం నేర్చుకున్నాడు. దాని ఫలితంగా అతను ఒక కొత్త ఎత్తుగడ ప్రారంభించాడు. దేశీయులైన రాజుల మధ్య స్పర్థ లున్నప్పుడు ఎవరో ఒకరి పక్షం చేరి రెండవవాణ్ణి ఓడించి, లాభం పొందటం. అన్వారుద్దీన్ పంపిన అంత పెద్ద సేనా కొద్దిమంది పాశ్చాత్య సైనికుల చేతిలో దెబ్బతిన్నది. అందుచేత యుద్ధంలో సంఖ్యాబలం కన్న సైనికుల క్రమశిక్షణా, అధునాతన ఆయుధాలూ ముఖ్యం. ఆసియా సైన్యాలు ఈ రెంటిలోనూ వెనకబడినవి కావటం చేత కొద్దిపాటి యూరోపియన్ సైన్యాల ముందు కూడా నిలబడ లేవు. కొంతమంది దేశీయ రాజులకు సైనిక సహాయం చేసి, యుద్ధాల్లో వారిని గెలిపించి, వారి అండతో ఇంగ్లీషు వారిని తాను అణచివేయవచ్చునని డూప్లే ఆలోచన చేశాడు.

డూప్లేకు అదృష్టం కలిసి వచ్చింది కూడా. కర్నాటక, దక్కను సింహాసనాల కోసం



ఆ సమయంలో ఘర్షణలు సాగుతున్నాయి. కర్నాటక నవాబు కాగోరిన చందాసాహెబు తోనూ, నిజాము నవాబు కాగోరిన ముజఫర్ జంగ్‌తోనూ డూప్లే రహస్య ఒప్పందాలు చేసుకున్నాడు. (అసఫ్ జాహ్ నిజాముల్ ముల్క్ 1748 లో దక్కను రాజ్యం స్థాపించాడు. అతని అనంతరం అతని కొడుకు నాసిర్ జంగ్ నవాబయాడు. అయితే అసఫ్ జాహ్ మనమడైన ముజఫర్ జంగును మొగలు చక్రవర్తి దక్కను సుబేదారుగా నియమించాడు. ఆ కారణం చేత ముజఫర్ జంగ్ దక్కను సింహాసనాన్ని ఎక్కగోరాడు.)









1749 ఆగస్టు 3 న కర్నాటక సింహాసనం కోసం అంబూరు వద్ద యుద్ధం జరిగింది. అందులో అన్వారుద్దీన్ చనిపోయాడు. అతని కొడుకు ముహమ్మదాలీ తిరుచినాపల్లి పోయి దాక్కున్నాడు. తిరుచినాపల్లిని ముట్టుబెట్టటానికి ఒక ఫ్రెంచిదళం బయలుదేరి వెళ్ళింది.

డూప్లే ఎత్తుగడకు ప్రతిగా ఇంగ్లీషువారేమీ చేయలేకపోయారు. వారు ముహమ్మదాలీకి అండగా తిరుచినాపల్లికి కొంత బలాన్ని పంపారు. డూప్లే సహాయంతో ముజఫర్ జంగ్ దక్కనుకు అధిపతి అయి, కృష్ణకు దక్షిణాన ఉన్న మొగలు భూభాగానికి డూప్లేను గవర్నరుగా నియమించి, పుదుచ్చేరి పరిసరాలూ, ఒరిస్సా తీర ప్రాంతాలూ అతని పరం చేశాడు. సుప్రసిద్ధమైన మచిలీపట్టణం వర్తకనగరం కూడా డూప్లే పరమయింది. డూప్లే, తన కింద ఉన్న ఉద్యోగులలో అగ్రగణ్యుడైన బుస్సీనీ, కొంత ఫ్రెంచిసేననూ ముజఫర్ జంగ్ కింద కొలువుంచాడు. ఈ విధంగా నిజామ్ పరిపాలనలో ఫ్రెంచి వారికి గొప్ప ప్రాభవం ఏర్పడింది.

డూప్లే సాధించిన ఈ ఘనవిజయం అతని మిత్రులకూ, శత్రులకూ కూడా అత్యాశ్చర్యం కలిగించింది. తిరుచినాపల్లి దుర్గంలో తలదాచుకున్న ముహమ్మదాలీతో కూడా ఒక ఒప్పందానికి రాగలిగితే డూప్లే విజయం పరిపూర్ణమవుతుంది. తిరుచినాపల్లిని పట్టుకోమని డూప్లే పంపిన సేన తంజావూరును పట్టుకునే వ్యర్థప్రయత్నంలో పూర్తిగా చితికిపోయింది. అందుచేత డూప్లే యిక రాజకీయ తంత్రం ఉపయోగించ నిశ్చయించాడు.

అయితే ఈలోగా ఇంగ్లీషువారు ముహమ్మదాలీకి పెద్దసేనతో సహాయం వచ్చి, అతను డూప్లే ఎత్తులకు లొంగకుండా భీష్మించుకునేలాగా చూశారు.







# భారత చరిత్ర




పరిస్థితి ఎలా వచ్చిందంటే, డూప్లే ఎత్తులు పారేపక్షంలో మద్రాసులో బ్రిటిషువారి బావుటా దిగిపోవలిసిందే. ఈ పరిస్థితిలో ఇంగ్లీషువారికి రక్షకుడుగా సాండర్స్ అనే ఆయన తటస్థపడ్డాడు. ఈ సాండర్స్ కొత్త గవర్నరుగా వచ్చి 1750 సెప్టెంబరులో పదవి పుచ్చుకున్నాడు. సాండర్స్ ప్రేరణతో ఇంగ్లీషు బలాలు ఫ్రెంచి బలాలతో బాహాటంగా పోరాటానికి తలపడ్డాయి. ఇంగ్లీషువారి ప్రేరణతో ముహమ్మదాలీ డూప్లేను అనేక మాసాలపాటు మభ్యపెట్టి ఉంచాడు. ఈలోపుగా బ్రిటిషు బలాలకు మైసూరు, తంజావూరు రాజుల మద్దతూ, మురారీరావు అనే మహారాష్ట్ర నాయకుడి మద్దతూ లభించింది.

బ్రిటిషువారి విజయాలకు రాబర్ట్ క్లైవ్ కూడా తోడ్పడ్డాడు. అతను బ్రిటిషు కంపెనీలో సివిలు ఉద్యోగిగా మద్రాసు వచ్చాడు. క్లైవు 200 మంది తెల్ల సైనికులనూ, 300 మంది సిపాయీలనూ వెంటబెట్టుకుని వెళ్ళి ఆర్కాటును ఆక్రమించాడు. అతను ఊహించినట్టే ఆర్కాటు నవాబు తన రాజధానిని కాపాడుకోవటానికి తన సేనలో అధిక భాగాన్ని ఆర్కాటుకు పంపాడు. క్లైవు 53 రోజులపాటు ఆర్కాటు నగరాన్ని వీరోచితంగా కాపాడాడు (1751 సెప్టెంబరు, అక్టోబరు మాసాలు.)

ఆర్కాటును వశపరచుకోవటంతో బ్రిటిషువారి పరపతీ, వారి యుద్ధ నైపుణ్యమూ ప్రసిద్ధిలోకి వచ్చాయి. ఫ్రెంచివారు బెదిరారు. వారి నాయకుడు శ్రీరంగ ద్వీపంలో దాక్కున్నాడు. క్లైవు సలహాపై బ్రిటిషువారు ఆ ద్వీపాన్ని ముట్టడించి, 1752 జూను 9న లోబరచుకుని, ఫ్రెంచి సేనానాయకుణ్ణీ, సైనికులనూ ఖైదీలుగా పట్టుకున్నారు. చందాసాహెబు లొంగిపోయి

## 70. ఇంగ్లీషువారు—సిరాజుద్దౌలా





శిరశ్ఛేదం పొందటంతో ఫ్రెంచివారి అపజయం పూర్తి అయింది.

అయినప్పటికీ డూప్లే తన రాజకీయపు ఎత్తుగడలనుగాని, తిరుచినాపల్లి దుర్గాన్ని పట్టుకునే ప్రయత్నాన్నిగాని విరమించలేదు. అతని ఎత్తుగడలు కొంతవరకు పారుతూండగానే ఫ్రెంచి ప్రభుత్వం అతనిని వెనక్కు పిలిపించింది. డూప్లే చేసిన దూరాలోచన ఫ్రెంచి ప్రభుత్వానికి అంతు పట్టలేదు; అతను చేసిన యుద్ధాలలో అపజయాలూ, అందుకుగాను జరిగిన ధనవ్యయమూ చూసి వారు విసిగిపోయారు. ఫ్రాన్సు నుంచి ఒక రాయబారి వచ్చి, బ్రిటిషువారితో ఒక విధమైన సంధి చేసుకున్నాడు.

ఇంగ్లీషువారికీ, ఫ్రెంచివారికీ మధ్య కుదిరిన ఈ సంధి, యూరప్‌లో "ఏడేళ్ళ యుద్ధం" ప్రారంభం కావటంతో భగ్నమయింది. ఆ యుద్ధంలో ఫ్రాన్స్ ఇంగ్లాండులు శత్రుపక్షాలలో చేరటం చేత, భారతదేశంలోని ఇంగ్లీషు, ఫ్రెంచి వర్గాలవారు పోరాటానికి దిగవలిసి వచ్చింది.

ఈ ఘర్షణలో కూడా ఫ్రెంచివారు, కర్నాటకంలో లాగే, బెంగాలులో కూడా నష్టపోయారు. అప్పట్లో బెంగాలు సుబేదారు పరిపాలనలో ఉండేది. సుబేదారు



పేరుకు ఢిల్లీ పాదుషా కిందివాడే అయినా, వాస్తవంగా స్వతంత్ర రాజులాటివాడు. బెంగాలు నవాబైన అలీవర్దీఖాన్ 1756 ఏప్రిలు 9 న మరణించగా, ఆయన ఆఖరు కుమార్తె కొడుకైన సిరాజుద్దౌలా బెంగాలు నవాబు అయాడు. అలీవర్దీఖాన్ అస్వస్థుడుగా ఉండి, సిరాజుద్దౌలా తాను పరిపాలన చేస్తున్న కాలంలోనే అతనికీ ఇంగ్లీషువారికీ మధ్య మంచి సంబంధాలు లేవు. ఏమంటే కలకత్తా నగరాన్ని ఫ్రెంచి దాడుల నుంచి కాపాడటానికి ఇంగ్లీషువారు అదనపు రక్షణలను నిర్మించారు. కర్నాటకంలో జరిగిన సంఘటనలు విని ఉన్న సిరాజుద్దౌలాకు







ఇది ఎంత మాత్రమూ సమ్మతం కాలేదు; ఇంగ్లీషువారు నవాబు అనుమతి లేకుండా, కోటగోడలు నిర్మించి, వాటి పైన ఫిరంగులు ఏర్పాటు చేశారు.

నిజానికి సిరాజుద్దౌలా నవాబు అవుతాడని ఇంగ్లీషువారు అనుకోలేదు; అతని శత్రు పక్షంలో చేరినవాడైన దివాన్ రాజవల్లభుడు నవాబు అవుతాడని పూర్తిగా నమ్మి అతన్ని మంచి చేసుకున్నారు. (ఈ రాజవల్లభుడు ఆలీవర్దీ పెద్ద కుమార్తె అయిన ఘసితి బేగమ్ కింద దివాను.)

సిరాజుద్దౌలా నవాబుగా గద్దె ఎక్కుతూనే, కొత్తగా కట్టిన రక్షణలు నిర్మూలించవలసిందని ఇంగ్లీషువారిని హెచ్చరించాడు. "మీరు వర్తకులు; వర్తకం చేసుకున్నంత కాలం మాకు మీతో పేచీ లేదు," అని అతను కాసింబజార్‌లోని ఇంగ్లీషు ఫాక్టరీ అధిపతి అయిన వాట్స్‌కు కబురుచేశాడు. కలకత్తాలో ఇంగ్లీషువారి ఆశ్రయంలో ఉన్న రాజవల్లభుడి కుటుంబాన్ని తనకు వశపరచవలసినదిగా కూడా అతను ఇంగ్లీషు గవర్నరు డ్రేక్‌కు కబురు చేశాడు. కాని ఇంగ్లీషువారు అతని ఉత్తరువులను ఖాతరు చెయ్యలేదు.

సిరాజుద్దౌలా మంచి కార్యదక్షత ప్రదర్శించి, జూను 4 న కాసింబజారులోని ఫాక్టరీ స్వాధీనపరచుకుని, అక్కడి నుంచి కదిలి 16 తేదీకి కలకత్తా చేరాడు. గవర్నర్ డ్రేక్, సేనాపతీ, తదితర ప్రముఖ ఇంగ్లీషు వ్యక్తులూ దుర్గాన్ని విడిచిపెట్టి వెళ్ళి, తమ నౌకలలో తలలు దాచుకున్నారు. 20 న ఫోర్ట్ విలియం సిరాజుద్దౌలో వశమయింది.

(సిరాజుద్దౌలా ఇదే చొరవను చివరిదాకా చూపించి ఉంటే భారత చరిత్ర ఎలా ఉండేదో! కాని అతను రానురాను శాపగ్రస్తుడిలాగా అయిపోయి అనేక పొరపాట్లు చేశాడు. వీటివల్ల ఇంగ్లీషువారు లాభం పొందారు.)







# భారత చరిత్ర



నవాబు చేత దెబ్బతిన్న ఇంగ్లీషువారు తమ పరిస్థితి అనుకూల పరచుకోవటానికి ఎత్తులు సాగించారు. వారికి బెంగాలులోని రాజకీయ పరిస్థితి బాగా తెలుసు. వారు కలకత్తా నుంచి ఫుల్టా చేరి, నవాబు శత్రు వర్గాలతో రాయబారాలు సాగించారు. కలకత్తాకు అధికారిగా సిరాజుద్దౌలా చేత నియమించబడిన మానిక్‌చాంద్, ఓమిచాంద్, జగత్‌సేఠ్ లాటి కోటీశ్వరులూ ఇంగ్లీషువారికి "అమ్ముడు" పోయారు; ఈ కోటీశ్వరులకు నవాబు దర్బారులో చాలా పలుకుబడి ఉన్నది. ఈ విధంగా ఇంగ్లీషువారు నవాబు కింద గోతులు తవ్వుతూనే, తమ వ్యాపారం గురించి నవాబుకు విజ్ఞాపన పత్రాలు అందజేస్తూవచ్చారు.

కలకత్తా నవాబు ఆక్రమణలోకి పోయిందని తెలియగానే మద్రాసులోని ఇంగ్లీషువారు కలకత్తాకు సేనలను పంప నిశ్చయించారు. ఫ్రెంచివారితో యుద్ధానికిగాను సాయుధసైనిక, నౌకాబలాలు ఆయత్తమై ఉండనే ఉన్నాయి. క్లైవ్, అడ్మిరల్ వాట్సన్‌ల నాయకత్వాన ఈ రెండు బలాలనూ అక్కడికి పంపటానికి నిర్ణయం జరిగింది. డిసెంబరు 14న ఈ బలాలు బెంగాలు చేరాయి.

నవాబుకు ఈ యుద్ధసన్నాహం గురించి ఏమీ తెలీదు. ఫుల్టన్ లోని బ్రిటిషువారు అతని వద్ద ఇంకా ప్రార్థనలు చేస్తూనే ఉన్నారు. వారికి అమ్ముడు పోయిన దర్బారు ప్రముఖులు నవాబుతో, "పాపం, వ్యాపారం చేసుకు నేవాళ్ళు!" అని వారి పక్షాన మాట్లాడుతూనే ఉన్నారు.

ఇంగ్లీషు కంపెనీకి లోగడ ఉండిన హక్కులను అమలులోకి రానివ్వటమే గాక, నష్టపరిహారం కూడా చెల్లించవలసిందని వాట్సన్ 17 డిసెంబరున నవాబుకు ఉత్తరం





రాశాడు. క్లైవు కలకత్తా మీదికి దండెత్తాడు. కలకత్తాకు అధిపతిగా ఉండిన మానిక్ చాంద్ యుద్ధ ప్రయత్నాలు చేస్తున్నట్టు అభినయిస్తూ ముర్షిదాబాదుకు పారిపోయాడు. చెప్పుకోదగిన యుద్ధమేమీ జరగకుండానే కలకత్తా 1757 జనవరి 2 న క్లైవు వశమయింది. ఇంగ్లీషువారు కలకత్తాలోని అనేక గొప్ప భవనాలను ధ్వంసం చేసి, హుగ్లీని కొల్ల గొట్టారు.

ఇంత జరిగినా సిరాజుద్దౌలా కలకత్తాకు వచ్చి, ఫిబ్రవరి 9 న "ఆలీనగర్ సంధి" ద్వారా ఇంగ్లీషువారు అడిగినదంతా ఇచ్చేశాడు. తన కిందివాళ్ళలో విశ్వాసం నశించో, మరే కారణం చేతనో నవాబుకు ఇంగ్లీషు వారితో పేచీలు పెట్టుకో వద్దనిపించింది.

ఈ సమయంలోనే యూరపులో "ఏడేళ్ల యుద్ధం" రావటమూ, భారత దేశంలోని ఫ్రెంచి, ఇంగ్లీషువారి మధ్య యుద్ధాలకు అవకాశం ఏర్పడటమూ జరిగింది. ఫ్రెంచి వారి కింద ఉన్న చంద్రనగరును ఇంగ్లీషు వారు జయించ గోరారు. అయితే సిరాజుద్దౌలా ఇందుకు ఆక్షేపణ తెలిపి, ఆలీనగరు సంధి నిబంధనలకు అది విరుద్ధమన్నాడు. ఆయన తన రాజ్యంలోని ఫ్రెంచివారిని కాపాడాలన్న నిశ్చయం ప్రకటించాడు గాని,



అందుకు తగిన చర్య లేవీ తీసుకోలేదు. మార్చి 1757 లో క్లైవు వాట్సనులు చంద్రనగరును సులువుగా జయించారు. హుగ్లీలోని ఫౌజ్‌దారయిన నందకుమార్ అనే వాడు తన కింద ఉన్న పెద్ద సేనను దూరంగా తీసుకు పోకపోతే ఇంగ్లీషువారు చంద్రనగరును గెలిచి ఉండక పోదురు. నందకుమారుడు ఇంగ్లీషువారి వద్ద లంచం పుచ్చుకుని ఉండవచ్చు. కాని నవాబు నందకుమారుకు ఇంగ్లీషువారిని నిరోధించమని ఉత్తరువు పంపలేదు.

పారిపోయి వచ్చిన ఫ్రెంచివారికి నవాబు తన దర్బారులో రక్షణ ఇచ్చాడు. ఇంగ్లీషు





వారు ఎన్ని ఆశలు చూపినా అతను ఫ్రెంచి శరణార్థులను వెళ్ళగొట్టలేదు. తాము ఫ్రెంచివారితో యుద్ధం సాగిస్తూ ఉండగా బెంగాలు నవాబు ఫ్రెంచివారి పట్ల సాను భూతి కలిగి ఉండటం తమకు క్షేమం కాదని ఇంగ్లీషువారు గ్రహించారు. అందు చేత వారు సిరాజుద్దౌలాను గద్దె దించి, మరొకణ్ణి ఆ స్థానంలో ఉంచ నిశ్చయిం చారు. కుట్ర జరిగింది. ఈ కుట్రలో మీర్ జాఫర్, రాయ్ దుర్లభ్—ఈ ఇద్దరూ నవాబు కింద సేనాపతులే—జగత్ సేఠ్ అనే కోటీశ్వరుడూ చేరారు. కానున్న నవాబు మీర్ జాఫర్. జూన్ 10 న కుట్రదారులకూ ఇంగ్లీవారికీ ఒక ఒప్పందం జరిగింది; ఇంగ్లీషువారు సైనిక సహాయం చేస్తారు, అందుకుగాను కుట్రదారులు ఇంగ్లీషు కంపె నీకీ, దాని అధికారులకూ ప్రతిఫలం ముట్ట చెబుతారు. ఓమిచాంద్ అనేవాడు కొల్ల గొట్టిన సొత్తులో పెద్ద వాటా అడిగాడు. క్లైవు ఒప్పందానికి మాయనకలు ఒకటి తయారుచేసి, అందులో ఓమిచాంద్ కోరిన విధంగా ఒక క్లాజు చేర్చాడు. దీనిపై వాట్సన్ సంతకం చేయ నిరాకరించగా, క్లైవు అతని సంతకాన్ని ఫోర్జరీ చేయించాడు.

ఫ్రెంచివారిని వెనక వేసుకుని ఇంగ్లీషువారి శత్రుత్వం సంపాదించుకున్న సిరాజుద్దౌలా, చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్టుగా, ద్రోహులైన తన అధికారుల సలహా పాటించి ఫ్రెంచివారిని తన ఆస్థానం నుంచి పంపెయ్య నిశ్చయించాడు. వాళ్లు వెళ్లిపోతూ, నవాబు పైన కుట్ర జరుగుతున్నదని హెచ్చరించారు. ఈ కుట్ర గురించి నవాబుకు తప్ప అందరికీ తెలుసు. అప్పుడైనా నవాబు మీర్ జాఫర్‌ను బంధించినట్టయితే మిగిలిన కుట్రదారులకు హడలు పుట్టి ఉండేది. అతను మీర్ జాఫర్ చేసిన ప్రమాణాలు నమ్మి, అతన్ని సేనాపతిగా ఉంచుకుని యుద్ధయత్నాలు ఆరంభించాడు!





# భారత చరిత్ర




**1757** జూన్ 22 న క్లైవు తన సేనలతో సహా భాగీరథీ నదీతీరాన ప్లాసీ వద్ద గల మామిడితోపు వద్ద దిగాడు. నవాబు సైనిక బలాలన్నీ రాజద్రోహం చేశాయి. హుగ్లీ వద్దనూ, కాత్వా వద్దనూ గల నవాబు బలాలు ఇంగ్లీషువారిని నిరోధించ యత్నించ లేదు. నవాబు సేనలు ప్లాసీ వద్ద అదివరకే స్థావరం ఏర్పచుకుని ఉన్నాయి.

జూను 23 ఉదయం ఉభయ పక్షాలకూ యుద్ధం ప్రారంభ మయింది. పెద్ద పెద్ద సేనలను వెంటబెట్టుకుని ఉన్న మీర్ జాఫర్ గాని రాయ్ దుర్లభ్ గాని కదిలి యుద్ధానికి రాలేదు. ఒక ఫ్రెంచి అధికారిని సహాయం తీసుకుని మోహన్‌లాల్, మీర్ మదన్ అనేవాళ్ళు కొద్ది బలాలతో యుద్ధ రంగానికి వచ్చారు. ఈ కొద్ది సేనతోనే అరగంటసేపు పోరిన మీదట క్లైవు తన బలాలను చెట్లమాటుకు తీసుకుపోయాడు, మీర్ జాఫర్ ద్రోహం చెయ్యక తన బలాలను యుద్ధానికి తెచ్చినట్టయితే ఇంగ్లీషువారికి ఘోరపరాజయం కలిగివుండేది.

వెకక్కు తగ్గిన క్లైవు తన సైనికాధికారులతో సంప్రతించి, రోజల్లా శత్రువుపై ఫిరంగులు పేల్చటానికీ, అర్ధరాత్రివేళ నవాబు శిబిరాన్ని దొమ్మి చేయటానికీ తీర్మానించాడు. అయితే ప్రమాదవశాన ఒక ఫిరంగిగుండు వచ్చి తగిలి మీర్ మదన్ చనిపోయాడు. నవాబు బెదిరిపోయి, మీర్ జాఫర్‌ను పిలిచి సలహా అడిగాడు. ఆ ద్రోహి నవాబుకు, యుద్ధం చేస్తున్న సేనలను ఉపసంహరించమని సలహా ఇచ్చాడు.

నవాబుగారి ఉపసంహరణ ఉత్తరువు అందే సమయానికి మోహన్‌లాల్ ఇంగ్లీషు బలాలపై తీవ్రంగా తుపాకిగుళ్ళ వర్షం కురిపిస్తున్నాడు. అతని సైనికులు క్షేమకరమైన మాట్ల నుంచి కాల్పులు చేస్తున్నారు.





"యుద్ధవిరమణకు ఇదా సమయం? జయాపజయాలు ఇప్పుడే తేలిపోనున్నాయి," అని మోహన్‌లాల్ నవాబుకు జవాబు పంపాడు.

నవాబు మీర్ జాఫర్ కేసి చూశాడు. మీర్ జాఫర్ బెట్టుగా, "నాకు తోచిన సలహా చెప్పాను. ఆ పైన ఏలినవారు ఏం చేసినా సరే," అన్నాడు.

మీర్ జాఫర్ వైఖరి చూసి, అసలే భయ పడిపోతున్న నవాబు మరింత బెదిరిపోయి, సేనను ఉపసంహరించమని మోహన్‌లాల్‌కు కబురు మీద కబురు పంపాడు. చిట్టచివరకు, ఎంతో ముందుకు వెళ్ళిన మోహన్‌లాల్ తన సేనను వెనక్కు తీసుకు రావలసి వచ్చింది.

మోహన్‌లాల్ సైనికులు వెనక్కు తిరిగి వచ్చేటప్పుడు, విద్రోహులైన సైనికముఠాలు యుద్ధరంగం నుంచి పారిపోతూండటం కన బడింది. అది చూసి వీళ్ళు కూడా పారి పోసాగారు. చివరకు సైనికుల పలాయనం అంతకంతకూ బహిరంగంగానూ, భారీగానూ జరిగి, కొద్దిసేపట్లోనే శిబిరం పూర్తిగా ఖాళీ అయిపోయింది!

ఈ సంగతి విని నవాబు సిరాజుద్దౌలా నిర్ఘాంతపోయాడు. ఎదట ఉన్న ఇంగ్లీషు



శత్రువులూ, తన చుట్టూ ఉన్న విద్రోహులూ కలిసి అతనికి ఉన్న మతి కూడా పోగొట్టారు. అతను కూడా పారిపోయాడు. ఆ రాత్రి అంతా ప్రయాణం చేసి, మర్నాడు ఉదయం 8 గంటలకు అతను ముర్షిదా బాద్‌లోని తన రాజభవనాన్ని చేరుకున్నాడు.

అపజయ వార్తతో ముర్షిదాబాదు అల్లకల్లోలమయింది. సిరాజుద్దౌలా తిరిగి తన బలాలను కూడగట్టుకోవాలని యత్నించాడు. తనకు అండగా నిలబడినవారికి అంతులేని డబ్బు ఇస్తానన్నాడు. కాని జనం అతన్ని చూస్తూనే చెల్లాచెదరుగా పారిపోయారు. ఇక గత్యంతరంలేక అతను తన భార్య





అయిన లుత్ఫున్నిసాను వెంటబెట్టుకుని, ఒక సమ్మినబంటుతో సహా నగరం విడిచి వెళ్ళిపోయాడు.

నవాబు వచ్చిన మర్నాడు—జూను 25 న–మీర్ జాఫర్ ముర్షిదాబాదు చేరాడు. మరికొన్ని రోజులకు క్లైవు కూడా అక్కడికి వచ్చాడు. మీర్ జాఫర్ బెంగాలుకు సుబేదారుగా ప్రకటన జరిగింది. మరికొన్ని రోజుల అనంతరం సిరాజుద్దౌలా పట్టుబడి, ముర్షిదాబాదుకు తీసుకురాబడ్డాడు. వెంటనే మీర్ జాఫర్ కొడుకు మీరన్ అనేవాడు సిరాజుద్దౌలాను హత్య చేయమని ఉత్తరు విచ్చాడు. ఈ విధంగా నవాబు పైన మీర్ జాఫర్ చేసిన కుట్ర సఫలమయింది. క్లైవుకూ, అతని అనుచరులకూ పుష్కలంగా బహుమానాలు ముట్టాయి. 24-పరగణాలు జమీందారీగా లభించింది. ఇంగ్లీషు కంపెనీకి బోలెడంత డబ్బు కూడా ఇవ్వబడింది.

ప్లాసీయుద్ధం నిజానికి పెద్ద యుద్ధమే కాదు. కాని ఎన్నో మహాయుద్ధాల కన్న దీని నుంచి హెచ్చు పరిణామాలు ఏర్పడ్డాయి. దీని మూలానే బ్రిటిషువారు ముందుగా బెంగాలునూ, దరిమిలా యావద్భారతాన్నీ తమ అధీనంలోకి తెచ్చుకోవటం జరిగింది. ఈ యుద్ధంలో క్లైవ్ గొప్పయుద్ధ నైపుణ్యం చూపాడన్నది పూర్తిగా కట్టుకథ. అదేవిధంగా, సిరాజుద్దౌలా దేశం కోసం పోట్లాడాడనేదీ, మీర్ జాఫర్ దేశద్రోహం చేశాడనేదీ నిజం కాదు. వాళ్ళు తమ తమ స్వార్థాలే చూసుకున్నారు.

ప్లాసీ యుద్ధం అనంతరం క్లైవు స్థితి డక్కనులో డూప్లే స్థితికన్న గొప్పది కూడా కాదు. ఈ యుద్ధం తరవాత బెంగాలులో కలిగిన పరిణామాలు మీర్ జాఫర్ వర్తనను బట్టీ, బెంగాలు రాజకీయ వ్యవస్థను బట్టీ ఏర్పడినవి.







# భారత చరిత్ర




యూరపులో ఏడేళ్ళ యుద్ధం ప్రారంభమైన కారణంగా మన దేశంలో ఇంగ్లీషు, ఫ్రెంచి వర్గాల మధ్య యుద్ధం సాగినట్టు మనం లోగడ తెలుసుకుని ఉన్నాం. కాని ఈ యుద్ధం కర్ణాటకంలో వెంటనే సాగలేదు. కారణ మేమంటే మద్రాసు ప్రాంతంలో ఉభయపక్షాల బలాలూ లేవు. బెంగాలులో యుద్ధం సాగించటానికి క్లైవ్, వాట్సన్‌లు ఇంగ్లీషు సైనిక, నౌకాబలాలను తరలించుకపోయారు. పుదుచ్చేరి నుంచి అక్కడి ఫ్రెంచి గవర్నరు ఫ్రెంచిబలాలను హైదరాబాదులో ఉన్న బుస్సీకి సహాయంగా పంపాడు.

1758 లో కర్ణాటక ప్రాంతంలో కూడా ఇంగ్లీషు ఫ్రెంచి పక్షాల మధ్య యుద్ధాలు సాగాయి. ఫ్రాన్సు నుంచి కొత్త బలాలు పంపబడ్డాయి. అయితే ఫ్రెంచి సైనిక, నౌకాశాఖల మధ్య సామరస్యం లేని కారణంగా ఫ్రెంచిపక్షం చాలా నష్టపోయింది. ఒక వంక ఫ్రెంచి సేనలు ఒక్కొక్క ఇంగ్లీషు స్థావరాన్నే జయించుకు వస్తూంటే, ఫ్రెంచి నౌకాబలం బ్రిటిషు నౌకాబలానికి ఓడిపోయింది (ఏప్రిల్ 28). నౌకాబలం యొక్క సహాయం లేకుండా ఫ్రెంచి సేనలు మద్రాసును జయించటం సాధ్యం కాలేదు. అయితే సంవత్సరాంతం లోపల ఫ్రెంచి సేనలు ఇంగ్లీషువారి స్థావరాలలో మద్రాసు, తిరుచిరాపల్లి, చెంగల్పట్టులు తప్ప మిగతా అన్ని ప్రదేశాలనూ జయించి, డిసెంబరు 14 న మద్రాసును ముట్టడించాయి. అయితే ఈ ముట్టడి నిరుపయోగమయింది.

ఆ తరవాత ఫ్రెంచివారి అపజయం పూర్తి కావటానికి ఒక సంవత్సరం మాత్రమే పట్టింది. ఫ్రెంచి సేనాపతి అయిన లాలీ అనేవాడు పెద్ద పొరపాటు చేశాడు—అతను హైదరాబాదు నుంచి బుస్సీని పిలిపించి,

## 73. ఫ్రెంచివారి ఓటమి





అక్కడి ఫ్రెంచి సేనను అసమర్థుల చేతిలో పెట్టాడు. ఆ అవకాశం గ్రహించి క్లైవు బెంగాలు నుంచి కర్నల్ ఫోర్డ్ అనేవాడి నాయకత్వం కింద సర్కార్లకు ఒక సేనను పంపాడు. ఈ ఇంగ్లీషుసేన ఫ్రెంచిసేనను జయించి, రాజమహేంద్రవరాన్నీ, మచిలీపట్టణాన్నీ ఆక్రమించుకుని, నిజాం సలాబత్ జంగ్‌తో ఇంగ్లీషు కంపెనీకి అనుకూలమైన సంధి చేసుకున్నది.

కర్ణాటక ప్రాంతంలో కూడా ఫ్రెంచివారికి అపజయమే సంప్రాప్తమయింది. ఆదిలో కంజీవరం వద్ద వాళ్ళు ఇంగ్లీషువారిని ఓడించగలిగారు గాని, అటుతరవాత ఫ్రెంచి సైనికుల అసంతృప్తివల్ల తిరుగుబాటు కూడా సంభవించింది.

చివరకు 1760 జనవరిలో వందవాసి వద్ద ఫ్రెంచి సైనిక బలాలు యుద్ధం సాగించి, ఇంగ్లీషుబలాల చేతిలో తిరుగులేని పరాజయం పొందాయి.

1761 జనవరి 16న పుదుచ్చేరి నగరం ఇంగ్లీషు సేనల వశమయింది. ఇంగ్లీషు వారు పుదుచ్చేరిలోని స్థావరాన్నే కాక, నగరాన్ని పూర్తిగా ధ్వంసం చేసి, "ఒక్క ఇంటిమీద కూడా కప్పులేకుండా" చేసేశారు. దాని తరవాత మరి రెండు ఫ్రెంచి స్థావ



రాలు—జింజీ, మలబారు తీరాన ఉన్న మాహే—ఇంగ్లీషువారి వశమయాయి. ఇక ఫ్రెంచివారికి ఇండియాలో స్థావరాలేమీ మిగలలేదు.

ఫ్రెంచివారి పరాజయానికి కారణాలు ఎన్ని ఉన్నప్పటికీ, బెంగాలు ఇంగ్లీషువారి అధీనం కావటమే వారి విజయాలకు మూల కారణం. బెంగాలు నుంచి మద్రాసుకు అంతులేని సేనలనూ, ధనాన్నీ ఇంగ్లీషువారు తరలించగలిగారు. ప్లాసీయుద్ధం యొక్క సద్యః ఫలితమే ఫ్రెంచివారి ఓటమి. "బెంగాలు ఇంగ్లీషువారి కింద ఉండగా పుదుచ్చేరి స్థావరంగా పెట్టుకుని నెపోలియ

నంతటి వాడైనా ఓడిపోక తప్పదు,'' అని ఒక చరిత్రకారు డన్నాడు.

సైనికంగా బెంగాలు ఇంగ్లీషువారి ఆధిపత్యం కిందికి వచ్చినప్పటికీ రాజకీయంగా పెద్ద మార్పులు కలిగిన లక్షణాలేవీ పైకి కనబడలేదు. నవాబు పదవికి సిరాజుద్దౌలా స్థానంలో మీర్ జాఫర్ వచ్చాడు. నవాబు దర్బారులో ఇంగ్లీషువారి రెసిడెంటు ఒకడు మాత్రం అదనంగా ఏర్పడ్డాడు. అయితే మీర్ జాఫర్ మనుగడ కేవలమూ క్లైవు చేతిలో ఉన్నది.

1758 జూనులో కలకత్తా కౌన్సిలువారు క్లైవును బెంగాలుకు గవర్నరుగా ఎన్నుకున్నారు. ఈ ఎన్నిక పైన ఇంగ్లీషు కంపెనీ సంవత్సరాంతంలో తన ఆమోద ముద్ర వేసింది. అయినప్పటికీ క్లైవు స్థానం సందిగ్ధంగానే ఉండిపోయింది. అవతల నవాబున్నాడు. అయితే ఆ నవాబు చర్యలను క్లైవు శాసిస్తూ వచ్చాడు. ఇది మీర్ జాఫర్‌కు ఏ మాత్రమూ నచ్చలేదు. అయితే బ్రిటిషువారి సైనికబలం తనకు అండగా లేకపోతే అతను అధికారంలో నిలవలేడు. ఈ మాట ప్రత్యక్షంగానే (1759లో) రుజువయింది.

అలీ గొహర్ (రెండవ షా ఆలం) అనే వాడు బెంగాలు, బిహారులను ఆక్రమించగోరి పట్నా నగరాన్ని ముట్టడించాడు. క్లైవ్ సహాయంతో మీర్ జాఫర్ ఆ ప్రమాదాన్ని నివారించుకోగలిగాడు.

ఈ విధంగా ఇంగ్లీషువారిపై ఆధారపడటం ఇష్టంలేక మీర్ జాఫర్ చిన్సురాలోని డచ్చివారితో రహస్యాలోచనలు సాగించాడు. ఇంగ్లీవారి స్థానాన్ని కాజెయ్యాలన్న తహతహతో డచ్చివారు జావా నుంచి తమ బలాలను పిలిపించ యత్నించారు. కాని ఈ యత్నాన్ని క్లైవు పడగొట్టి, 1759 నవంబరులో బేదారా వద్ద డచ్చివారిని ఓడించి, సంధికి ఒడబరిచాడు.





# భారత చరిత్ర



ఈ విధంగా క్లైవు తన స్వశక్తి సామర్థ్యాలతోనే మూడేళ్ళపాటు ఇంగ్లీషు ఆధిపత్యాన్ని బెంగాలులో కొనసాగింపజేసి, 1760 ఫిబ్రవరి 25న తన దేశానికి వెళ్లిపోయాడు. ఆ వెంటనే నవాబు కొడుకు మీరాన్ అనేవాడు మరణించటంతో, మీర్ జాఫర్ అనంతరం ఎవరు నవాబు అవుతారన్న ప్రశ్న ఏర్పడింది. మీర్ జాఫర్ అప్రయోజకుడూ, అయోగ్యుడూనూ. దానికి తోడు అతను ఇంగ్లీషు కంపెనీకి చెల్లించవలసిన డబ్బు సక్రమంగా చెల్లించలేదు. అందుచేత ఇంగ్లీషువారు నవాబు అల్లుడైన మీర్ కాసిమ్‌ను నవాబు చేయదలిచారు. మీర్ కాసిమ్ వారితో ఒక రహస్య ఒప్పందం చేసుకున్నాడు (1760 సెప్టెంబరు 27). కంపెనీకి ఇంకా రావలిసి ఉన్న మొత్తం చెల్లించటానికీ, బర్ద్వాన్, మిద్నపూర్, చిటగాంగు జిల్లాలు కంపెనీ పరం చెయ్యటానికీ మీర్ కాసిమ్ సమ్మతించాడు. ఇందుకు ప్రతిఫలంగా ఇంగ్లీషువారు అతన్ని డిప్టీ సుబేదారుగా నియమించటానికీ, కాలక్రమాన అతన్ని నవాబు చెయ్యటానికీ ఒప్పుకున్నారు. అయితే మీర్ కాసిమ్ డిప్టీ సుబేదారుగా ఉండటానికి మీర్ జాఫర్ సమ్మతించలేదు. రాజభవనాన్ని ఇంగ్లీషు సేనలు స్వాధీనం చేసుకునే పరిస్థితి ఏర్పడే సరికి మీర్ జాఫర్ పదవీత్యాగం చేశాడు. వెంటనే మీర్ కాసిమ్ నవాబుగా ప్రకటించబడ్డాడు.

బెంగాలులో ఒక సందిగ్ధ పరిస్థితి ఏర్పడింది. సర్వాధికారాలూ తనవే అయినట్టు నవాబు భావిస్తున్నాడు; అవి తమవే అయినట్టు ఇంగ్లీషువారు ప్రవర్తిస్తున్నారు. కాని ఎవరివన్న విషయం చాలాకాలం నిర్ధారణ కాలేదు. చివరకు ఈ విషయం నిష్కర్షగా తేల్చుకునేటందుకు సాహసించి, మీర్ కాసిమ్ తన పీకమీదికే తెచ్చుకున్నాడు.









ఇంగ్లీషు కంపెనీ ఎలాటి సుంకాలూ చెల్లించకుండా తమ సరకులను బెంగాలులో రవాణా చేసి, వర్తకం సాగించటానికి పాదుషా నుంచి అధికారం పొంది ఉన్నది. అయితే అదే అధికారాన్ని కంపెనీ ఉద్యోగులు తమ సొంత వ్యాపారాలలో కూడా అమలు చేయసాగారు. ఇందు విషయమై నవాబు ఎన్ని పర్యాయాలు తన ఆక్షేపణ తెలిపినా, కౌన్సిలు సభ్యులు స్వలాభాపేక్ష కారణంగా లక్ష్యపెట్టారు కారు.

చివరకు 1762 లో బెంగాలు శాశ్వత గవర్నరయిన వాన్సిటార్ట్, మీర్ కాసిమ్ తన రాజధానిగా కొత్తగా ఏర్పాటు చేసుకున్న మాంఘీరుకు వెళ్ళి ఒక విస్పష్టమైన ఒడంబడిక చేసుకున్నాడు. అయితే కలకత్తాలోని కౌన్సిలు సభ్యు లీ ఒడంబడికను నిరాకరించారు. అప్పుడు నవాబు సుంకాలను పూర్తిగా రద్దు చేసేస్తానన్నాడు. కాని ఇంగ్లీషువారు తమ మీద తప్ప మిగతా వర్తకు లందరి పైనా సుంకాలుండి తీరాలన్నారు. పట్నాలోని ఇంగ్లీషుఫాక్టరీ అధిపతి, ఎలిస్ అనేవాడు, ఇంగ్లీషువారి ప్రత్యేక సౌకర్యాలను గురించి తీవ్రవైఖరి అవలంబించటమేగాక, పట్నానగరాన్ని వశపరుచుకుందామని కూడా యత్నించాడు. ఈ యత్నం విఫలమై పట్నాలోని ఇంగ్లీషు సైనిక కూటం నాశనమయింది. ఈ సంఘటనల ఫలితంగానే 1763 లో మీర్ కాసిమ్‌కూ, ఇంగ్లీషువారికీ మధ్య యుద్ధం ప్రారంభమయింది.

జూను 10 న మేజర్ అడమ్స్ అనేవాడు 1100 మంది తెల్లసైనికులనూ, 4000 సిపాయిలనూ సమకూర్చుకుని యుద్ధరంగంలో మీర్ కాసిమ్‌ను ఎదిరించాడు. నవాబు సైన్యంలో 15000 మంది సైనికులున్నారు; అందరూ పాశ్చాత్య యుద్ధ రీతులలో శిక్షణ పొందినవారే. అయినా మీర్ కాసిమ్‌కు అపజయాల పరంపర తప్పలేదు.





అతను వరుసగా కౌత్వా, ముర్షిదాబాద్, గిరియా, సూతీ, ఉదయనలా, మాంఘీర్ యుద్ధరంగాలలో ఓడిపోయి పట్నాకు పారి పోయాడు. తరవాత అతను తనకు చిక్కిన ఇంగ్లీషు యుద్ధఖైదీలనూ, తన ఉద్యోగు లలో అనేకమంది ప్రముఖులనూ హత్య చేయించి, ఔధ్‌కు పారిపోయి, నవాబు షుజాఉద్దౌలాతోనూ, రెండవ షా ఆలమ్ చక్రవర్తితోనూ చేరి, బెంగాలును ఇంగ్లీషు వారి నుండి విముక్తం చెయ్యటాని కొక కూటం ఏర్పాటు చేశాడు.

ఈ సమిష్టి సేనలను 1764 అక్టోబరు 22న బక్సార్ వద్ద ఇంగ్లీషువారు ఓడిం చారు. వెంటనే షా ఆలమ్ ఇంగ్లీషువారి పక్షం వెళ్ళిపోయి, వారితో విడిగా సంధి చేసుకున్నాడు. మీర్ కాసిమ్ పరారి అయి పోయి, దేశసంచారం చేస్తూ, 1777 లో ఢిల్లీ సమీపంలో దిక్కుమాలిన చావు చచ్చాడు. సిరాజుద్దౌలా కుట్ర ఫలితంగా ఓడాడు, కాని మీర్ కాసిమ్ శక్తి చాలక ఓడాడు. ఈసారి ఇంగ్లీషువారు సాధించిన విజయం వాస్తవమైనది.

ఈ యుద్ధం అయిపోగానే ఇంగ్లీషువారు మీర్ జాఫర్‌ను నవాబుగా ప్రకటించి, అతని నుంచి అదనపు సౌకర్యాలు పొందారు. 1765 లో మీర్ జాఫర్ చనిపోగా, అతని కొడుకు నజ్మొద్దౌలా నవాబు అయాడు. అయితే అతను నామమాత్రపు నవాబు; అధికారమంతా ఇంగ్లీషువారిదే.

1765 మేలో క్లైవ్ రెండోసారి బెంగాలు గవర్నరయి, షా ఆలమ్ చక్రవర్తితో సంధి చేసుకున్నాడు. బెంగాలు, బిహార్, ఒరిస్సాల "దివానీ" ఇంగ్లీషుకంపెనీకి సంక్రమిం చింది (1765 ఆగస్టు 12). క్లైవు ఇంగ్లీషు కంపెనీలో పెచ్చు పెరిగిన అవినీతినీ, సైనికశాఖలోని దురలవాట్లనూ సరిచేశాడు. అతను 1767 ఫిబ్రవరీలో స్వదేశానికి వెళ్ళిపోయాడు.





# భారత చరిత్ర



పానిపట్టు యుద్ధంలో తిన్న దెబ్బ నుంచి మహారాష్ట్రులు 1770 నాటికి పూర్తిగా కోలుకున్నారు. ఢిల్లీ చక్రవర్తి అయిన రెండవ షా ఆలం వారికి అధీనుడయాడు. మహారాష్ట్రులను కొంత అదుపులో ఉంచడం కూడా ఒక ఆశయంగా పెట్టుకుని వారన్ హేస్టింగ్స్ 1773 లో వారాణసి సంధి చేసుకున్నాడు. అయితే ఈ లోపుగానే మహారాష్ట్రులకు తీరని నష్టం సంభవించింది— 1772 లో పేష్వా మాధవరావు చనిపోయాడు. మాధవరావు పినతండ్రి అయిన రఘునాథరావుకు అంతులేని అధికార వ్యామోహం పట్టుకున్నది; మాధవరావుకు తమ్ముడూ, వారసుడూ అయిన నారాయణరావు బొత్తిగా దుర్బలుడు. పేష్వా మాధవరావు తన పినతండ్రి రఘునాథరావు (రఘోబా)ను నిగ్రహించి ఉంచగలిగాడు. కాని యువకుడైన నారాయణరావు చిలిపితనం కొద్దీ రఘోబాతో వైరం పెట్టుకుని, అతన్ని నిర్బంధంలో ఉంచాడు. దీనితో రఘోబా రెచ్చిపోయి, అసంతృప్తులై ఉన్న కొందరు సైనికులతో కుట్ర చేశాడు. 1773 ఆగస్టు 30 న నారాయణరావు తన పినతండ్రి సమక్షంలోనే హత్య చేయబడ్డాడు.

తరవాత రఘోబా పేష్వా అయాడు. కాని త్వరలోనే అతనికి ప్రతిఘటన ఏర్పడింది. పూనాలోని ఒక బలమైన వర్గం, నానా ఫడ్నవిస్ అనే బ్రాహ్మణయువకుడి నాయకత్వం కింద రఘోబాను వ్యతిరేకించింది. చనిపోయిన నారాయణరావు భార్య గంగాబాయి 1774 లో ఒక మగ శిశువును ప్రసవించటం ప్రతిపక్షులకు బలాన్ని చేకూర్చింది. వారు ఆ పసికందును పేష్వాగా ప్రకటించారు.

రఘోబా ఆట కట్టయింది. అతన్ని దేశాంతరాలకు తరిమివేశారు. అతను

75. మహారాష్ట్రులూ - ఇంగ్లీషువాళ్ళూ

బొంబాయిలో ఉన్న ఇంగ్లీషు వారిని శరణు జొచ్చి, వారి సహాయం అర్థించాడు. ఇంకేం? భారతీయుల మధ్య అంత ర్వైరాలు ఇంగ్లీషు వారికి ఎప్పుడూ లాభి స్తూనే వచ్చాయి. ఈసారీ అంతే అయింది. నిజానికి, బొంబాయిలోని ఇంగ్లీషువారు పూనాలోని మహారాష్ట్ర ప్రభుత్వంతో సత్సం బంధాలు కలిగి ఉన్నారు; అయితే బొంబాయి పరిసరాలలో ఉన్న తీర ప్రాంతాలు తమ అధీనమైతే తమకు మరింత బలం చేకూరు తుందన్న ఆశతో వారు రఘోబా పక్షం అవలంబించారు. 1775 మార్చి 7 న రఘోబాకూ, ఇంగ్లీషు వారికీ సూరత్ ఒప్పందం జరిగింది. ఆ ఒప్పందం ప్రకారం ఇంగ్లీషువారు రఘోబాకు 2,500 మంది సైనికుల నివ్వటానికీ, వారి ఖర్చులు అతనే భరించటానికీ ఏర్పాటు జరిగింది. ఇందుకు ప్రతిఫలంగా రఘోబా సాల్సెట్, బస్సీన్‌లను ఇంగ్లీషువారి పరం చేశాడు; భరూచ్, సూరత్ జిల్లాలపై రాబడిలో కొంత వారి కివ్వడానికి అంగీకరించాడు; కంపెనీ విరోధులతో మైత్రి చేసుకోకుండా ఉండడానికీ, ఎవరితో మైత్రి చేసుకున్నా ఆ ఒడంబడికలో ఇంగ్లీషువారిని కూడా చేర్చటానికీ ఒప్పుకున్నాడు. 1775 ఫిబ్రవరి 27 నాటికి కర్నల్ కీటింగ్ అనే



వాడి నాయకత్వాన బ్రిటిషు సైన్యం కొంత సూరత్ చేరింది. మే 18 న అరాస్ మైదానం మీద, కీటింగ్, రఘోబాల సమిష్టి సేనలు పూనా ప్రభుత్వసేనలను తలపడి యుద్ధం చేసి ఓడించాయి.

అయితే బొంబాయి ప్రభుత్వం ఇలా రఘోబాతో ఒప్పదం చేసుకోవడానికీ, యుద్ధం చెయ్యడానికీ కలకత్తాలోని సుప్రీమ్ కౌన్సిలు అనుమతి లేదు. సూరత్ ఒప్పం దాన్ని ఆమోదించడానికి వారన్ హేస్టింగ్స్ సిద్ధంగానే ఉన్నప్పటికీ, సుప్రీమ్ కౌన్సిలు సభ్యులలో అధిక సంఖ్యాకులు ఒప్పం దానికి అభ్యంతరం చెప్పారు. బొంబాయి





కౌన్సిలు వారి చర్య "అవివేకమూ, అపాయకరమూ, అనధికారికమూ, అక్రమమూ" అయినదని కలకత్తా కౌన్సిలు తీర్మానించింది.

కొద్ది మాసాల అనంతరం, కలకత్తా నుంచి కర్నల్ అప్టన్ అనేవాడు పూనాకు వచ్చి అక్కడి ప్రభుత్వంతో సంధి సంప్రతింపులు జరిపాడు. 1776 మార్చి 1 న పురంధర్ ఒడంబడిక జరిగింది. దీనితో సూరత్ ఒప్పందం రద్దవుతుంది. కొత్త ఒప్పందం కింద సాల్సెట్, బస్సీనులు ఇంగ్లీషువారికే చెందుతాయి. ఇంగ్లీషువారి యుద్ధ ఖర్చుల కింద పూనా ప్రభుత్వం 12 లక్షల రూపాయ లిచ్చుకోవాలి; ఇంగ్లీషు వారు రఘోబా పొత్తు వదులుకోవాలి; అతను వెళ్ళిపోయి గుజరాతులోని కోపర్‌గాంవ్‌లో నివాసం ఏర్పరచుకోవాలి; అతనికి పూనా ప్రభుత్వం నెలకు 25,000 రూపాయలు భరణం ఇస్తుంది.

అయితే ఈ ఒప్పందం అమలు జరగలేదు. ఇందులోని నిబంధనలు బొంబాయి ప్రభుత్వానికి నచ్చలేదు. వారు ఈ ఒప్పందాన్ని ధిక్కరించి, అప్టన్ మాటలు పెడచెవిని బెట్టి, రఘోబాకు ఆశ్రయమిచ్చారు. పూనా ప్రభుత్వం కూడా ఒప్పందంలోని నిబంధనలను అమలు జరపలేదు. 1777 లో నానా ఫడ్నవిస్ ఒక ఫ్రెంచి వాణ్ణి చేరదీసి, ఫ్రెంచివారికి పశ్చిమ తీరంలో ఒక రేవు ఇస్తానని మాట ఇచ్చాడు. ఇందువల్ల బొంబాయి కౌన్సిలు వారికి ఫ్రెంచి వారి ఎత్తుగడలను గురించి సందేహాలు తల ఎత్తాయి. ఇంగ్లీషువారు తిరిగి యుద్ధం తలపెట్టి, 1778 నవంబరులో పూనా మీదికి 600 మంది తెల్ల సైనికులనూ, 3,300 మంది సిపాయీలనూ పంపారు. 1779 జనవరి 9 న పడమటి కనుమలలోని తాలేగాంవ్ వద్ద పెద్ద మరాఠీ సేన ఈ సేనను ప్రతిఘటించి, చిత్తుగా ఓడించింది.







# భారత చరిత్ర



వాడ్‌గాంవ్ వద్ద ఇంగ్లీషువారు తమకు అవమానకరమైన సంధి చేసుకున్నారు. ఈ సంధి ప్రకారం, బొంబాయి ప్రభుత్వం 1773 తరవాత ఆక్రమించుకున్న ప్రాంతాలన్నీ విడిచి పుచ్చాలి; బెంగాలు నుంచి వచ్చిన బలాలను ఉపసంహరించాలి, బ్రోచ్ నుంచి వచ్చే ఆదాయంలో సింధియాకు కొంత వాటా ఇవ్వాలి.

గవర్నరుజనరలైన వారన్ హేస్టింగ్స్ ఈ సంధిని పూర్తిగా నిరాకరించాడు. దీని వల్ల కలిగిన అపఖ్యాతిని ఎలా కడిగేసుకోవాలో అతనికి తెలియలేదు. ఈసారి మిగతా కౌన్సిలు సభ్యులు ఆయనతో ఏకీభవించారు. కర్నల్ గొడార్డ్ అనేవాడి నాయకత్వం కింద ఒక పెద్ద సేన బెంగాలు నుంచి బయలుదేరి, మధ్య ఇండియా మీదుగా వెళ్ళి, 1781 ఫిబ్రవరి 15 న అహమ్మదాబాదునూ, అంతకు ముందు డిసెంబరులో బస్సీన్‌నూ పట్టుకున్నవి. ఏప్రిల్ 1781 లో ఈ సేన పూనా మీదికి వెళ్ళి, అపజయం పొంది వెనక్కు తగ్గటం జరిగింది. వారన్ హేస్టింగ్స్ పంపిన ఇతర సేనలు ఆగస్టు 3 న గ్వాలియరును పట్టుకున్నాయి; ఫిబ్రవరి 16 న శివపురి (సిప్రి) వద్ద సింధియాను ఓడించాయి.

ఈ విజయాలతో ఇంగ్లీషువారి ప్రతిష్ఠ పెరిగింది. అంతదాకా మహారాష్ట్ర సమాఖ్యకు మహానాయకుడు కావటానికీ, ఉత్తరదేశంలో తన అధికారం చలాయించటానికీ ఆలోచనలు చేసిన మహాదాజీ సింధియా, ఇప్పుడు పథకం మార్చి, ఇంగ్లీషువారి సఖ్యం కొరకు అర్రులు చాచాడు. ఆయన ఇంగ్లీషువారితో మంతనాలు జరిపి, వారికీ, పూనా ప్రభుత్వానికీ మధ్య రాజీ కుదుర్చుతానని, 1781 అక్టోబరు 13న మాట ఇచ్చాడు. 1782 మే 17న సల్‌బై





సంధి జరిగింది. అయితే 1783 ఫిబ్రవరి 26 దాకా నానా ఫడ్నవిస్ దానిపై సంతకం చెయ్యలేదు. ఈ ఒప్పందం ద్వారా ఇంగ్లీషు వారికి సాల్సెట్ ఖాయ పరచబడింది; మాధవరావు నారాయణ్ పేష్వా పదవికి హక్కుదారుగా గుర్తించబడ్డాడు; రఘోబాకు పింఛను ఇవ్వబడింది; యమునకు పశ్చిమంగా ఉండే సింధియా రాజ్యభాగం సింధియాకు తిరిగి వచ్చింది; ఆర్కాటు నవాబు నుంచి హైదరాలీ గెలుచుకున్న ప్రాంతమంతా తిరిగి అప్పగించాలని ఈ ఒప్పందంలో ఉన్నది. అయితే హైదరాలీకి ఈ ఒప్పందంతో ప్రమేయం లేదు.

ఈ విధంగా ఈ ఒప్పందం యుద్ధ పూర్వ పరిస్థితిని తిరిగి ఏర్పాటు చేసింది. ఇంగ్లీషు వారు ఎంతో నష్టపోయి కూడా, ఈ సంధి ద్వారా ఏమంత లాభం గడించలేకపోయారు. ఆ కారణం చేతనే వారన్ హేస్టింగ్స్ అక్రమ ఆర్థిక చర్యలకు పాల్పడ్డాడు. అయినప్పటికీ మన దేశంలో ఇంగ్లీషువారి ఆధిపత్యం కొనసాగటంలో ఇదొక ప్రముఖ ఘట్టం అయింది. దీని మూలంగా వారికి మహారాష్ట్రులతో ఇరవై ఏళ్ళపాటు అశాంతి లేకుండా పోయింది. ఆ కాలంలో వారు ఫ్రెంచి వారితోనూ, టిప్పుసుల్తాను లాటి ఇతర విరోధులతోనూ



స్వేచ్ఛగా పోరాటాలు సాగించగలిగారు; నిజామునూ, ఔధ్ నవాబునూ లొంగ దీసుకోగలిగారు.

అంత మాత్రం చేత ఈ సల్‌బై సంధి ఇండియాలో బ్రిటిషు పరిపాలనకు పునాది అయిందని చెప్పటం అతిశయోక్తి అవుతుంది. ఒక విషమపరిస్థితి నుంచి బ్రిటిషు వారు బయటపడిన మాట నిజమేగాని, వారి కింకా మహారాష్ట్రులతోనూ, టిప్పుతోనూ వైరం ఉండనే ఉన్నది. పంజాబు, నేపాలు, బర్మాలలో వారిని ప్రతిఘటించే శక్తులు ఉద్భవిస్తూనే ఉన్నాయి.

హేస్టింగ్స్ వెళ్ళిపోయి, కార్న్‌వాలిస్ గవర్నరు జనరలుగా వచ్చే మధ్యకాలంలో ఆ పదవి నిర్వహించిన మక్‌ఫర్సన్ అసమర్థుడు. అదీగాక దేశ రాజకీయ వ్యవహారాలలో కంపెనీవారు జోక్యం కలిగించుకోరాదంటూ బ్రిటిషు పార్లమెంటు ఒక శాసనం చేసింది. ఈ కారణంచేత కార్న్‌వాలిస్ హయాములో కూడా కంపెనీకి రాజకీయ సంబంధమైన కార్యకలాపాలేవీ లేకపోయాయి.

ఈలోపల మహారాష్ట్ర సమాఖ్య పరిస్థితి ఎలా ఉన్నది? సంకోచాలతోనూ, కుట్రలతోనూ ఛిన్నాభిన్నమయి పోతున్న మహారాష్ట్ర సమాఖ్యకు రాణీ అహల్యాబాయీ, మహాదాజీ సింధియా, నానా ఫడ్నవిస్ లాటి మహామహులు జీవంపోశారు. అహల్యాబాయి తన రాజ్య నిర్వహణలో అత్యంత ఆదర్శప్రాయురా లనిపించుకున్నది. తన కాలపు రాజకీయాలలో ఆమె వహించిన పాత్ర అద్వితీయమైనది. అహల్యాబాయి 1795లో చనిపోగా, తుకోజీ హోల్కర్ ఇందోరు సింహాసనం ఎక్కాడు. ఇతను మంచి యోధుడేగాని, రాజకీయ ప్రావీణ్యం గలవాడు కాదు. 1797లో ఇతను మరణించినాక ఇందోరులో అరాజక పరిస్థితి ఏర్పడింది.





# భారత చరిత్ర



ఆ కాలంలో మహాదాజీ సింధియా అత్యుత్తమ మహారాష్ట్ర నాయకుడు. సల్‌బై సంధిలో బ్రిటిషువారు ఆయన స్వాతంత్ర్యాన్ని పూర్తిగా ఆమోదించారు. పూనా ప్రభుత్వంతో ఆయన నిర్దుష్టమైన పద్ధతిలో వ్యవహరించాడు.

సల్‌బై సంధి అనంతరం ఏర్పడిన పరిస్థితిని వినియోగించుకుని సింధియా, ఉత్తరభారతంలో తన బలాన్ని పెంపొందించుకుని, దృఢతరం చేసుకున్నాడు. మహారాష్ట్రులకు సంప్రదాయసిద్ధమైన యుద్ధవిధానాన్ని విడిచిపుచ్చి, ఆయన తన సేనలో రాజపుత్రులనూ, ముస్లిములనూ చేర్చుకుని, పాశ్చాత్య శాస్త్రీయపద్ధతులలో సేనను రూపొందించి, అందులో సైనికనిపుణుడుగా ఒక ఫ్రెంచివాణ్ణి, అనేక దేశాలకు చెందిన యూరోపియనులనూ ప్రవేశపెట్టాడు. ఆయన ఢిల్లీ వెళ్ళి, అక్కడ నామమాత్రపు చక్రవర్తిగా ఉన్న రెండవ షా ఆలంను తన కీలుబొమ్మను చేసుకుని తన పైవాడైన పేష్వాకు "వకీలిముత్‌లుక్" పదవి ఇప్పించి, తాను అతని సహాయకుడి (నాయిబ్) పదవి సంపాదించుకున్నాడు. ఆయన ఢిల్లీలోనే ఉండిపోయి, మొగలు సేనల పైన ఆధిపత్యం సంపాదించి, పైకి ఢిల్లీ సుల్తానుకు గులాముగా ఉంటూ, అతణ్ణి తన ఇష్టం వచ్చినట్టు ఆడించాడు.

1792 నాటికి మహాదాజీ ప్రభ ఉత్తర హిందూస్థానంలో పరమోచ్ఛదశను అందుకున్నది. రాజపుత్రులూ, జాట్‌లూ ఆయనకు లోబడ్డారు. ఇక ఆయన పూనా కోటలో పాగా వెయ్యవలసి ఉంది. కాని అక్కడ అధికారం నిర్వహించే నానాఫడ్నవిస్ ఉద్దండుడు. అందుచేత మహాదాజీ పేష్వాను సందర్శించే మిష మీద 1792లో దక్షిణయాత్ర చేశాడు. ఈ సమయంలో

## 77. మహాదాజీ సింధియా





మహాదాజీ పొరుగువాడైన తుకోజీహోల్కర్ ఆయనపై కత్తికట్టి, అజ్మీరు సమీపంలో లఖేరీ వద్ద యుద్ధం చేసి ఓడించబడ్డాడు. కాని మహాదాజీ ఆశయం పూర్తి కాలేదు. 1794 ఫిబ్రవరి 12 న ఆయన పూనాలో, తన 67 వ ఏట మరణించాడు.

మహాదాజీ సింధియాకు అతని దత్త పుత్రుడు దౌలత్‌రావు సింధియా వారసు డయాడు. అతని వయసు పదమూడేళ్ళు. సింధియా మరణం ఇంగ్లీషు వారికి మహోపకార మయిందని చెప్పవచ్చు. అతను ఎలాగైనా వారికి పక్కలో బల్లెమే.



ఇప్పుడు మహారాష్ట్ర వ్యవహారాలకు నానా ఫడ్నవిస్ నాయకు డయాడు. నర్మదకు దక్షిణంగా ఉండే ప్రాంతాలను మహారాష్ట్రులు కోల్పోయి ఉన్నారు. వాటిని తిరిగి సంపాదించు కోవాలంటే వారు మైసూరు టిప్పుసుల్తానుతో యుద్ధానికి దిగటం తప్పని సరి. ఇందుకు నాందిగా మహారాష్ట్రులు నిజాముతో స్నేహ ఒడంబడిక (జులై 1784) చేసుకుని, 1785 డిసెంబరు 1 న హరిపంత్ ఫడ్కే నాయకత్వాన పూనా నుంచి మహారాష్ట్ర సేనను పంపారు.

టిప్పు తన శత్రువును ఎదుర్కొనటానికి దుర్బలమైన యత్నాలు కొన్ని చేశాడు గాని, ఇంగ్లీషువారికీ, మహారాష్ట్రులకూ మధ్య సఖ్యం ఏర్పడుతుందని భయపడి, మహారాష్ట్రులతో రాజీపడి, 1787 ఏప్రిలులో సంధి ఒడంబడిక చేసుకున్నాడు. ఇందువల్ల టిప్పుసుల్తాను 45 లక్షల రూపాయలు ఇచ్చుకోవలసి వచ్చింది. అయితే ఈ సంధి ఎంతో కాలం దక్కలేదు. ఇంగ్లీషువారికీ, టిప్పుకూ మధ్య 1789 లో వైరం ఆరంభం కాగానే టిప్పుకు విరుద్ధంగా మహారాష్ట్రులూ, నిజామూ కూడా కార్న్‌వాలిస్‌తో సంధి ఒడంబడిక చేసుకున్నారు. కాని ఈ త్రిపక్ష సంధిలో సత్తా ఏమీ లేదు. టిప్పు తాకిడికి భయపడి సఖ్యత నెరపినప్పటికీ నిజాముకూ,





మహారాష్ట్రులకూ వైరం ఉండనే ఉన్నది. టిప్పూ భయం కాస్త తగ్గగానే మహారాష్ట్ర నాయకులైన పేష్వా, దౌలత్‌రావ్ సింధియా, తుకోజీహోల్కర్, బిరారురాజా ఏకమై నిజాము పైన కత్తికట్టారు.

ఉభయ పక్షాలకూ యుద్ధం జరిగింది. 1795 మార్చిలో నిజాము ఓడిపోయి సంధి చేసుకుని, అంతులేని ధనాన్నీ, రాజ్య ప్రాంతాలనూ కోల్పోయాడు. నిజాముకు బ్రిటిషువారు ఏమీ సహాయపడ లేదు.

ఇంగ్లీషు వారికీ మైసూరుకూ మధ్య యుద్ధాలకు కారణం, 18 వ శతాబ్ది ఉత్తరార్ధంలో హైదరూ, టిప్పూ ఇంగ్లీషువారి పురోగమనానికి రాహుకేతువుల లాగా తయారు కావటం.

హైదరు చదువుసంధ్యలు బొత్తిగా లేనివాడు, కాని అమితమైన ధైర్యసాహసాలు గలవాడు. అతను మైసూరు సేనలలో జీత భత్యాలు లేకుండా పనిచేస్తూ, యుద్ధాలలో తన పరాక్రమం ప్రకటించి పైకి వచ్చిన వాడు. కాలక్రమాన మైసూరు రాజ్యాధికారాలన్నీ అతని చేతిలోకే వచ్చాయి. అతని అభ్యుదయాన్ని మహారాష్ట్రులూ, నిజామూ, ఇంగ్లీషువారూ సహించలేక పోయారు.

1765 లో మహారాష్ట్రులు తన మీద ఎత్తి వస్తే, హైదరు వారితో సంధి చేసుకుని, పరిహారం కింద వారికి 32 లక్షల రూపాయలూ, గుత్తి, సావనూరు ప్రాంతాలూ ఇచ్చుకున్నాడు. 1766 నవంబరులో మద్రాసు (బ్రిటిషు) ప్రభుత్వం నిజాము నుంచి ఉత్తరసర్కారు జిల్లాలు తీసుకుని, హైదరు పైన నిజాము చేసే యుద్ధంలో సహాయపడటానికి అంగీకరించింది. మొత్తం మీద హైదరుకు విరుద్ధంగా మహారాష్ట్రులూ, నిజామూ, ఇంగ్లీషువాళ్ళూ త్రిపక్ష సంఘటనగా ఏర్పడ్డారు. అయితే తనపై మొదట దాడి చేసిన మహారాష్ట్రులను హైదరు డబ్బిచ్చి వదుల్చుకున్నాడు.





# భారత చరిత్ర



నిజాము తనను వదిలి ఇంగ్లీషువారితో చేరినా హైదరు యుద్ధం మానక, బొంబాయి సేనలను ఓడించి మంగళూరు తిరిగి స్వాధీనం చేసుకుని, 1769 మార్చిలో మద్రాసుకు అయిదు మైళ్ళ దూరంలోకి వచ్చి, ఇంగ్లీషువారిని సంధికి బలాత్కారంగా ఒడబరిచాడు (1769 ఏప్రిలు 4). ఈ సంధి ననుసరించి, హైదరాలీ పైన ఎవరైనా ఎత్తి వస్తే, తాము అతనికి సహాయపడతామని ఇంగ్లీషువారు మాట ఇచ్చారు.

అయితే ఈ ఒప్పందాన్ని మద్రాసు ప్రభుత్వం అమలు చెయ్యలేదు. 1771 లో మహారాష్ట్రులు హైదరుపై దాడి చేసినప్పుడు వారు అతనికి సహాయం వెళ్ళలేదు. అందుచేత హైదరు ఇంగ్లీషువారి పై తిరిగి దెబ్బ తీసే అవకాశం కోసం ఎదురు చూడసాగాడు. అతను 1779 లో ఇంగ్లీషువారికి వ్యతిరేకంగా ఏర్పడిన సంఘటనలో చేరాడు.

1780 జులైలో హైదరు 80 వేల సైనికులతోనూ, 100 ఫిరంగులతోనూ కర్ణాటక మైదానాల పై "ఉప్పెన లాగా" వచ్చి పడి, కల్నల్ బేలీ అనే వాడి నాయకత్వం కింద ఉండిన ఇంగ్లీషు దళాన్ని ఓడించి, అక్టోబరులో ఆర్కాటును పట్టుకున్నాడు. ఇంగ్లీషు కంపెనీ ఇరకున పడింది.

అయితే గవర్నరు జనరలైన వారన్ హేస్టింగ్స్, తమ సర్వసేనాని కింద కొంత సేనను హైదరు పైకి పంపటమే గాక, హైదరు నుంచి బీరారు రాజునూ, నిజామునూ, మహాదాజీ సింధియానూ చీల దీశాడు. అయినా ఇవేవీ లక్ష్యపెట్టక, హైదరు తన శక్తి కొద్దీ యుద్ధం సాగించి, 1781 లో పోర్టోనోవో వద్ద ఓడిపోయాడు.

ఇంగ్లీషువారితో అటో, ఇటో తేల్చుకోకుండానే హైదరు, 1782 డిసెంబరు 7 వ పుట్టవ్రణంతో చనిపోయాడు.

**78. మైసూరు యుద్ధాలు**







హైదరు అనంతరం అతని కొడుకు టిప్పు ఇంగ్లీషువారితో పోరాటం కొనసాగించాడు. బ్రిటిషువారి సర్వసేనాని అయిన బ్రిగేడియర్ మాథ్యూస్‌నూ, అతని అనుచరులనూ టిప్పు 1783 లో పట్టుకున్నాడు.

కొత్త ఇంగ్లీషు గవర్నరు మకార్ట్నీ టిప్పు వద్దకు సంధి రాయబారం పంపాడు. 1784 మార్చిలో మంగళూరు సంధి జరిగింది. ఈ సంధి గవర్నరుజనరలు వారన్‌హేస్టింగ్సుకు ఏ మాత్రమూ నచ్చలేదు.

ఇది వట్టి శుష్కసంధి అనీ, ఇంగ్లీషు వారితో తనకు యుద్ధం తప్పదనీ టిప్పుకు తెలుసును. అతను ఊహించినట్టే ఇంగ్లీషు వారికీ, మైసూరుకూ మూడోసారి యుద్ధం వచ్చింది. అందుకు కావలసిన పరిస్థితులను కొత్త గవర్నరుజనరలు కార్న్‌వాలిస్ (1786-1793) కల్పించాడు. ఆయన 1788 లో నిజాము నుంచి గుంటూరును స్వీకరించాడు; 1789 జులై 7 న నిజాముకు లేఖ రాస్తూ, టిప్పు పేరు ప్రస్తావించకుండా నిజాముతో "శాశ్వత సహకారం" ఏర్పాటు చేసుకునే సూచన చేస్తూ, దాన్నే ఒడంబడిక పత్రంగా పరిగణించమన్నాడు. ఈ విధంగా కార్న్‌వాలిస్ 1784 సంధిని నీరుగార్చేశాడు.

ఈ పరిస్థితిలో టిప్పు 1789 డిసెంబరు 29 న తిరువాన్కూరు పైన దాడి చేశాడు. మంగళూరు సంధి ప్రకారం ఇంగ్లీషువారి సహాయానికి అర్హత గల తిరువాన్కూరు రాజా మద్రాసు గవర్నరు (జాన్ హాలండ్)ను సహాయం అర్థించాడు. మద్రాసు గవర్నరు నుంచి సహాయం రాలేదు. కార్న్‌వాలిస్ మద్రాసు ప్రభుత్వ చర్యను నిరసించాడు. మరి కొద్ది మాసాలకు (1790 జూన్, జులై లలో) నిజామూ, మహారాష్ట్రులూ కూడా ఇంగ్లీషువారితో త్రిపక్ష ఒడంబడికలు చేసుకున్నారు. ఆటు తరవాత ఇంగ్లీషువారికీ, మైసూరుకూ మూడవ సంగ్రామం జరిగింది.









రెండు సంవత్సరాలుగా సాగిన ఈ సంగ్రామంలో మూడు యుద్ధాలు జరిగాయి. మొదటి యుద్ధంలో ఇంగ్లీషు సేనాని కన్న టిప్పు ఎక్కువ యుద్ధనైపుణ్యం చూపాడు. అందుచేత రెండవ యుద్ధానికి కార్న్‌వాలిస్ స్వయంగా సేనాపతిత్వం వహించి, తన సేనలను వెల్లూరు, అంబూరుల మీదుగా నడిపించుకుంటూ వచ్చి, 1791 మార్చి 21 న బెంగుళూరు పట్టుకున్నాడు. తరవాత అతను మే 13 న అరికెరా చేరాడు. టిప్పు రాజధాని అయిన శ్రీరంగపట్టణానికి ఇది 9 మైళ్ళ తూర్పుగా ఉన్నది. అయితే ఈ యుద్ధంలోనూ టిప్పు యుద్ధనైపుణ్యమే రాణించింది.

తిరిగి యుద్ధం సాగినప్పుడు టిప్పు కోయంబత్తూరును పట్టుకున్నాడు (నవంబరు 3). అయితే, అతను శ్రీరంగపట్టణానికి తిరిగి వచ్చే దారిలో గల కొండ దుర్గాలను కార్న్‌వాలిస్, బొంబాయి నుంచి సహాయం వచ్చిన దళాలతో ఆక్రమించి, 1792 ఫిబ్రవరి 5 న శ్రీరంగపట్టణం శివార్లను ముట్టడించాడు.

టిప్పు తన రాజకీయ విజ్ఞతను ఉపయోగించి సర్వనాశనం కాకుండా తప్పించుకున్నాడు. కాని ఇకమీదట ఘర్షణ వల్ల ఫలితం ఉండదని అతనికి తెలిసిపోయింది. సంప్రతింపుల అనంతరం, 1792 మార్చిలో శ్రీరంగపట్టణం ఒడంబడిక జరిగింది. టిప్పు తన రాజ్యంలో సగం వదులుకోవలసి వచ్చింది. కృష్ణాతీరం నుంచి, పెన్నారు నదిని దాటిన ప్రాంతాన్ని నిజాముకూ, మరి కొంత భాగాన్ని మహారాష్ట్రులకూ ఇవ్వవలసి వచ్చింది. దీని మూలంగా మహారాష్ట్రుల సరిహద్దు తుంగభద్ర దాకా విస్తరించింది. మలబారూ, కూర్గు రాజా పై పెత్తనమూ, దిండిగల్లూ, దాని పరిసరాలూ, 30 లక్షల సవర్నులకు పైబడిన పరిహారమూ ఇంగ్లీషు వారికి దక్కాయి.







# భారత చరిత్ర




ఇంగ్లీషువారికీ, మైసూరు సుల్తానుకూ మొదటిసారి యుద్ధం జరిగినప్పుడు నిజాము తాత్కాలికంగా బ్రిటిషువారిని విడిచిపెట్టినప్పటికీ, తిరిగి 1768 ఫిబ్రవరి 23న మచిలీపట్నం వద్ద ఇంగ్లీషు వారితో మరొక శాంతి ఒడంబడిక చేసుకున్నాడు. ఈ ఒడంబడిక ప్రకారం నిజాము ఉత్తర సర్కారు జిల్లాలను ఇంగ్లీషు వారికి ఇచ్చేటట్టూ, అందుకుగాను ఇంగ్లీషు కంపెనీ నిజాముకు ఏటా 9 లక్షల రూపాయలు చెల్లించేటట్టూ ఏర్పాటయింది. దరిమిలా ఇంగ్లీషువారు గుంటూరు రాజ్యాన్ని నిజాము తమ్ముడైన బసాలత్ జంగ్‌కు యావజ్జీవ భుక్తంగా ఇచ్చేసి, నిజాముకు చెల్లించే మొత్తాన్ని 7 లక్షలకు తగ్గించారు.

నిజాము తన సేనలోకి ఫ్రెంచి సిపాయీలను చేర్చుకుని 1768 ఒడంబడికను ఉల్లంఘించాడన్న నెపం మీద 1779లో మద్రాసు గవర్నరుగా ఉండిన రంబోల్డ్ అనే అవివేకి గుంటూరును బసాలత్ జంగ్ నుంచి పుచ్చుకుని, నిజాముకు డబ్బు చెల్లించటం మానేశాడు. అయితే ఈ చర్యను గవర్నరు జనరలైన వారన్ హేస్టింగ్స్ నిరసించాడు. అయినప్పటికీ నిజాము ఇంగ్లీషువారికి వ్యతిరేకిగా పరిణమించాడు. అందుకు బలమైన కారణం మరొకటి ఏమిటంటే, చాలా క్లిష్టమైన పరిస్థితిలో ఇంగ్లీషువారు రఘోబాతో సఖ్యం చేసి ఉండటం. ఈ కోపంతో, ఇంగ్లీషువారికి విరుద్ధంగా హైదరుతోనూ, మహారాష్ట్రులతోనూ సఖ్యం చేసుకున్న నిజామును హేస్టింగ్స్ చీల దీశాడు. అందుకై అతను గుంటూరును బసాలత్ జంగ్‌కు తిరిగి ఇచ్చేశాడు.

1782లో బసాలత్ జంగ్ చనిపోయాడు. గుంటూరు తమకు తిరిగి ఇచ్చెయ్యమని ఇంగ్లీషువారు నిజామును అడిగారు.

**79. ఇంగ్లీషుకంపెనీ అక్రమాలు**







గుంటూరు నిజాముకూ, ఇంగ్లీషువారికీ కూడా అవసరమే. గుంటూరు లేకపోతే నిజాముకు సముద్రతీరం అందుబాటులో ఉండదు. ఇంగ్లీషువారికి ఉత్తరానా, దక్షిణానా గల ప్రాంతాలను కలిపేది గుంటూరే. కొంత సంకోచించిన మీదట నిజాము గుంటూరును ఇంగ్లీషువారి కివ్వటానికి ఒప్పుకుని, టిప్పు తననుండి కాజేసిన కొన్ని మండలాలను తిరిగి రాబట్టుకోవటానికి ఇంగ్లీషువారి సహాయం కోరాడు.

ఇంగ్లీషు గవర్నరు జనరల్ (కార్న్‌వాలిస్) ఇరుకునపడ్డాడు. ఎందుకంటే ఆ మండలాల పైన మైసూరు వారికి గల అధికారాన్ని ఇంగ్లీషువారు అప్పటికే రెండు ఒడంబడికలలో ఆమోదించి ఉన్నారు. అయినప్పటికీ, మైసూరుతో మరొక యుద్ధం జరిగితే సహాయకులు అవసరమవుతారు గనక గవర్నరు జనరలు నిజాముకు సైనిక సహాయం చెయ్యటానికి సమ్మతించాడు. మూడవ మైసూరు యుద్ధంలో నిజాము బలాలు ఇంగ్లీషువారి పక్షాన పోరాడాయి.

* * *

రుహేల్‌ఖండ్ అనే సారవంతమైన ప్రాంతం ఔధ్‌కు వాయువ్యంగా హిమాలయాల వరకు విస్తరించి ఉండేది. జనాభా 60 లక్షలు. దానిని పాలించే రుహేలా నాయకుల సమాఖ్యకు అధిపతి హాఫిజ్ రహ్మత్‌ఖాన్. ఔధ్ నవాబుకు రుహేల్‌ఖండ్‌ను కాజెయ్యాలని ఉండేది. అయితే ఉభయులకూ మహారాష్ట్రుల భయం ఉండేది. అందుచేత రుహేలాలు ఔధ్‌నవాబైన షుజాఉద్దౌలాతో ఒక ఒప్పందం చేసుకున్నారు: మహారాష్ట్రులు రుహేల్‌ఖండ్ మీదికి దాడివస్తే ఔధ్‌నవాబు వారిని పారదోలాలి; అందు నిమిత్తం రుహేలాలు 40 లక్షల రూపాయలు ఇచ్చుకోవాలి.

ఈ ఒప్పందం జరిగిన మరుసటి ఏడే (1773)లో మహారాష్ట్రులు రుహేల్‌ఖండ్





పై దాడి చేశారు. బ్రిటిషు సైనికులూ, ఔధ్ సైనికులూ వారిని తరిమికొట్టారు. అయితే షుజాఉద్దౌలాకు రుహేలాలు 40 లక్షలు ఇవ్వలేదు. ఆ సాకుతో షుజా ఉద్దౌలా బ్రిటిషు బలాలను తన బలాలకు తోడుగా పెట్టుకుని రుహేల్‌ఖండ్ పై యుద్ధం చేసి 1774 ఏప్రిల్‌లో విజయం సాధించాడు.

ఈ విషయంలో గవర్నరు జనరల్ వారన్‌హేస్టింగ్స్ పాత్ర బ్రిటిషు పార్లమెంటులో గర్హించబడింది. వారాణసి రాజైన చైత్‌సింగ్ విషయంలో హేస్టింగ్స్ ప్రవర్తన ఇంకా నీచమైనది. చైత్‌సింగ్ 1775 జులై నెలలో ఇంగ్లీషు కంపెనీతో ఒక ఒప్పందం చేసుకుని, తాను కంపెనీ పెత్తనం కింద ఉండేటట్టూ, అందుకు గాను తాను కంపెనీకి ఏటా 22న్నర లక్షల రూపాయలు ఇచ్చేటట్టూ అంగీకరించాడు.

1778 లో ఇగ్లీషువారికీ, ఫ్రెంచివారికీ యుద్ధం సాగినప్పుడు హేస్టింగ్స్ చైత్‌సింగ్‌ను మరో 5 లక్షలు అదనంగా ఇవ్వమని అడిగాడు. చైత్‌సింగ్ ఇచ్చాడు. కాని వారన్‌హేస్టింగ్స్ మళ్ళీ మళ్ళీ అదనపు ధనం అడుగుతూ వచ్చాడు, చైత్‌సింగ్ ఇస్తూ వచ్చాడు. తరవాత హేస్టింగ్స్ కోరిన ప్రకారం చైత్‌సింగ్ అశ్వికదళాలను ఇవ్వలేకపోయాడు. అది సాకుగా పెట్టుకుని, హేస్టింగ్స్ స్వయంగా వారాణసి వెళ్ళి, చైత్‌సింగ్‌ను అరెస్టు చేశాడు.

ఇది చూసి చైత్‌సింగ్ సిపాయిలు ఆగ్రహావేశులై, అకస్మాత్తుగా తిరగబడి, అనేక మంది ఇంగ్లీషు సైనికులనూ, ముగ్గురు సైనికాధికారులనూ వధ చేశారు. ఇలా జరుగుతుందని చైత్‌సింగ్‌కు తెలియదు. నిర్దోషి అయినప్పటికీ చైత్‌సింగ్ పదవీభ్రష్టుడై, గ్వాలియర్‌లో తలదాచుకున్నాడు. ఏటా కంపెనీకి 40 లక్షలు కట్టే షరతు మీద, చైత్‌సింగ్ పదవిని అతని తమ్ముడి కొడుకిచ్చారు.





# భారత చరిత్ర



నానా ఫడ్నవిస్ హయాంలో మహారాష్ట్రుల ప్రతిష్ఠ ఉన్నతికి వచ్చింది. కాని అది దక్క లేదు. ఫడ్నవిస్ నియంతృత్వానికి తట్టుకో లేక పేష్వా మాధవరావు నారాయణ 1795 అక్టోబరు 25న ఆత్మహత్య చేసుకున్నాడు. అతని అనంతరం పేష్వా అయిన రెండవ బాజీరావు (రఘోబా కొడుకు) నానా ఫడ్నవిస్‌కు ప్రబల విరోధి. ఎన్నో కుట్రలూ, కుహకాలూ జరిగిన పిమ్మట 1796, డిసెంబరు 4న ఒక విధమైన రాజీ కుదిరింది; రెండవ బాజీరావు పేష్వాగానూ, నానా అతని ప్రధానిగాను నిర్ధారణ అయింది.

రెండవ బాజీరావుకు యుద్ధతంత్ర ప్రావీణ్యం ఏమీ లేకపోయినా, పిల్లి మీద ఎలుకనూ, ఎలుక మీద పిల్లినీ ఎక్కించే నేర్పు చాలా ఉన్నది.

1798 ఏప్రిలు 26న లార్డ్ వెలస్లీ గవర్నరు జనరల్‌గా వచ్చాడు. ఇతను ఆరితేరిన సామ్రాజ్యవాది. అతను బ్రిటిషు సామ్రాజ్య పరిరక్షణమే లక్ష్యంగా పెట్టుకుని తన విధానాలను రూపొందించాడు. అతను భారతదేశంలో గల అనేక రాజ్యాలకు సైనిక సహాయం ఆశ పెట్టి, కొన్ని కొన్ని ప్రాంతాలు కంపెనీ అధీనంలో ఉంచటానికీ, సైన్యపు ఖర్చులు వసూలు చెయ్యటానికీ ప్రయత్నించాడు. నిజాములాటి దుర్బలులు ఈ ఎరను తేలికగా మింగారు. మహారాష్ట్రులు మటుకు వెలస్లీకి జవాబు కూడా ఇవ్వలేదు.

కాని, 1800 మార్చి 13న నానా ఫడ్నవిస్ పూనాలో మరణించటంతో మహారాష్ట్ర వ్యవహారాలలో ఇంగ్లీషువారు చెయ్యి పెట్టే అవకాశం చిక్కింది. నానా ఫడ్నవిస్‌కు ఇంగ్లీషువారంటే ఎంత గౌరవం ఉన్నా, రాజకీయంగా వారిని విషం కింద జమ కట్టుతూ వచ్చాడు. కొండలాటి నానా పోగానే మహారాష్ట్ర నాయకుల మధ్య స్పర్ధలు

80. మహారాష్ట్రుల పతనం





మిన్నుముట్టాయి. పూనా గద్దె కోసం దౌలత్ రావు సింధియా (మహాదాజీ పెంపుడు కొడుకు), జస్వంతరావు హెూల్కరూ (తుకోజీ సొంత కొడుకు) ఒకరిపై ఒకరు కత్తులు కట్టారు. మాల్వా వద్ద సింధియా, హెూల్కరు సైన్యాలతో పోరుతూ ఉన్న సమయంలో, పేష్వా జస్వంతరావు సోదరుడైన విఠూజీని హత్య చేశాడు. ఆగ్రహావేశంలో జస్వంతరావు, సింధియా సేననూ, పేష్వా సేననూ కలిపి చిత్తుగా ఓడించి, పూనాను పట్టుకున్నాడు (అక్టోబరు 23). పేష్వా అక్కడికీ, ఇక్కడికీ పరుగులు తీసి, చిట్టచివరకు బసీన్‌లో తలదాచుకున్నాడు.



ఈ స్థితిలో రెండవ బాజీరావు ఇంగ్లీషు వారి సహాయం అర్థించాడు. మహారాష్ట్రుల వ్యవహారాలలో తలదూర్చే అవకాశం గవర్నరు జనరలు వెలస్లీకి ఈ విధంగా దొరికింది. 1802 డిసెంబరు 31న బసీన్ ఒడంబడిక పైన సంతకం చేసి రెండవ బాజీరావు ఇంగ్లీషువారి సహాయం పొందాడు. ఈ ఒడంబడిక ప్రకారం పేష్వా కింద ఉన్న భూభాగంలో 6000కు తక్కువగాని కాల్బలమూ, దానికి అనుగుణమైన ఫిరంగులూ, యూరోపియన్ ఫిరంగి దళంవాళ్ళూ శాశ్వతంగా ఉంచబడతారు; ఈ సేనల కయ్యే ఖర్చు కింద పేష్వా 26 లక్షల రాబడి గల ప్రాంతాలను ఇంగ్లీషువారికి సమర్పించాలి.

1803 మే 13న బ్రిటిషు సేనలు రెండవ బాజీరావును సింహాసనం మీద తిరిగి కూర్చోబెట్టాయి.

ఇంగ్లీషువారి దృష్టినుంచే చూసినా బస్సీన్ సంధి ఒడంబడికలో ఒక పెద్ద లోపం ఉన్నది—దానిపై సంతకం పెట్టిన వాడు పరమ అప్రయోజకుడైన రెండవ బాజీరావు. అతని సంతకానికి తోలీ విలువ లేదు. ఈ సంధి మహారాష్ట్ర నాయకు లందరికీ ఆగ్రహం తెప్పించింది. తమ జాతికే అవమానం జరిగినట్టు భావించి, పరస్పర





విద్వేషాలను పక్కకు నెట్టి, వారంతా ఏకమై, బ్రిటిషువారిని ప్రతిఘటించ యత్నించారు.

మొట్టమొదట దౌలత్‌రావు సింధియా, రెండవ రఘూజీ భోంస్లే (బిరారు) ఏకమయారు. వారు జస్వంతరావు హొల్కర్‌ను కూడా తమ పక్షం కమ్మని ఆహ్వానించారు. కాని అతను వారితో చేరక, వారి ఉద్యమం ఎలా పరిణమించేదీ చూసి ఒక నిర్ణయానికి రావాలనుకుని, తీరా తరుణం మించిపోయాక రంగంలోకి దిగాడు.

1803 ఆగస్టులో మహారాష్ట్రులకూ, ఇంగ్లీషువారికీ యుద్ధం ప్రారంభమయింది. మహారాష్ట్ర సేనలో 250,000 మంది సైనికులూ, ఫ్రెంచివారి చేత శిక్షణ పొందిన 40 వేల మంది సైనికులూ ఉన్నారు. అయితే ఇంగ్లీషువారు కూడా యుద్ధానికి తగిన విధంగానే ఆయత్తమయారు. అనేక రంగాలలో యుద్ధం సాగింది. ప్రధాన రంగాలు దక్కనులోనూ, హిందూస్థానంలోనూ ఉన్నాయి. గుజరాతూ, బుందేల్‌ఖండూ, ఒరిస్సాలలో చిన్న రంగా లున్నాయి. అన్ని రంగాలలోనూ ఇంగ్లీషువారే గెలిచారు. అయిదు మాసాలు గడిచేలోపుగా సింధియా, భోంస్లేలు అనేక అపజయాలు పొంది, చెరొక సంధీ చేసుకున్నారు. 1803 డిసెంబరు 17న జరిగిన దేవగాం సంధితో బిరారు పాలకుడైన భోంస్లే కటక్ మండలాన్నీ, బలాసోర్‌నూ, వర్ధానదికి పశ్చిమంగా ఉండే తన యావత్ రాజ్యాన్నీ కోల్పోయాడు.

డిసెంబరు 30న సింధియా ఇంగ్లీషువారితో సుర్జిఅర్జున్‌గాం వద్ద సంధి చేసుకుని, ఇంగ్లీషువారికి గంగా యమునల మధ్య తనకు గల రాజ్యమంతా సమర్పించి, జయపూర్, జోధ్‌పూర్, గోహద్‌లకు ఉత్తరంగా ఉన్న రాజ్యాన్నీ, పశ్చిమాన అహమ్మద్‌నగర్‌నూ, బ్రోచ్‌నీ, అజంతా కొండల దాకా ఉన్న తన రాజ్యాన్నీ, తనకు గల వివిధ హక్కులనూ కోల్పోయాడు.





# భారత చరిత్ర



రెండవ మహారాష్ట్ర యుద్ధం అయాక ఇంగ్లీషువారి బలం చాలా పెరిగింది. మొగలు పాదుషా వారి పరిరక్షణ కిందికి వచ్చాడు. జోధ్పూర్, జయపూర్, బూందీ, భరత్పూర్ వగైరా రాజ్యాలతో వారు సంధులు చేసుకున్నారు. నిజామూ, పేష్వా వారికి మరింత లోబడిపోయారు. అయితే ఈ శాంతి దక్కలేదు. అంతవరకూ తటస్థంగా ఉన్న హోల్కర్, 1804 ఏప్రిల్లో, ఇంగ్లీషువారితో యుద్ధానికి తలపడ్డాడు. అతను ఆరంభంలో విజయాలు సాధించటమే గాక, ఒక వారంరోజుల పాటు ఢిల్లీని ముట్టడించాడు కూడా. కాని అక్కడ అతనికి అపజయం ఎదురయింది. అతను 1806 జనవరి 7 న ఇంగ్లీషువారితో సంధి చేసుకున్నాడు.

19వ శతాబ్ది ఆరంభం నాటికి మహారాష్ట్ర సంస్థానాలన్నీ అస్తవ్యస్తంగా ఉన్నాయి. అది మహారాష్ట్రుల పతనదశ. జస్వంతరావు హోల్కరు తన సోదరుడైన కాశీరావునూ, అతని కొడుకైన ఖండేరావునూ హత్య చేయించి, ఉన్మాదానికి గురి అయి 1811 అక్టోబరు 20 న పోయాడు. అతని ఉంపుడుగత్తె అయిన తులసీబాయి, బలరామ్సేఠ్ అనే మంత్రినీ, అమీర్ఖాన్ అనే పఠాను నాయకుణ్ణీ అడ్డం పెట్టుకుని రాజ్యమేలింది. దౌలత్రావ్ సింధియా స్థితి ఎలా ఉన్నదంటే, అతను సైనికులకు జీతాలు కూడా ఇవ్వలేక, జనాన్ని దండుకోనిచ్చాడు. అతనికి సైన్యం మీద ఏమీ అధికారం లేకుండా పోయింది. రఘూజీ భోంస్లే రాజ్యం అరాజకంగా ఉన్నది; దాన్ని పిండారీలూ, పఠానులూ యథేచ్ఛగా కొల్లగొట్టుతున్నారు.

ఈ స్థితిలో కూడా మహారాష్ట్ర పాలకులు ఇంగ్లీషువారిని మరొకసారి ప్రతిఘటించ సంకల్పించారు. ఈ సంకల్పం బలంగా

## 81. మహారాష్ట్రుల పతనం



కలిగినది రెండవ బాజీరావుకు. అతనికి ప్రేరేపకుడు త్రింబక్‌జీ దాంగ్లియా అనే వాడు. గాయిక్‌వాడ్ తన మంత్రి అయిన గంగాధరశాస్త్రిని 1814 లో పేష్వా వద్దకు రాయబారం పంపాడు. గంగాధరశాస్త్రి ఇంగ్లీషు పక్షపాతి. త్రింబక్‌జీ ప్రేరణతో పేష్వా గంగాధరశాస్త్రిని హత్య చేయించాడు. ఇంగ్లీషు అధికారులు త్రింబక్‌జీని ఠాణాదుర్గంలో ఖైదుచేశారు.

1817 నాటికి పరిస్థితి బాగా విషమించింది. ఇంగ్లీషువారిని ప్రతిఘటించటానికి గాను ఇతర మహారాష్ట్ర నాయకులనూ, పఠాను నాయకుడైన అమీర్‌ఖాన్‌నూ, పిండారీలనూ కూడగట్టటానికి పేష్వా తీవ్రంగా యత్నాలు సాగించాడు.

ఇంగ్లీషువారు చూస్తూ ఊరుకోలేదు. వారు బలాత్కారంగా రెండవ బాజీరావు చేత పూనా ఒడంబడికపైన సంతకం చేయించారు. (1817 జూను 13). ఈ ఒడంబడికతో పేష్వాకు మహారాష్ట్ర సమాఖ్య నాయకత్వం ఊడింది; గాయిక్‌వాడ్ పై అతని కుండిన అధికారాలు సడలించబడ్డాయి; కొంకణం మొదలైన కొన్ని ముఖ్య ప్రాంతాలను ఇంగ్లీషువారికి సమర్పించవలసి వచ్చింది.



1817 నవంబరు 5 న దౌలత్‌రావు సింధియా చేత కూడా ఇంగ్లీషువారు గ్వాలియర్ సంధిపై సంతకం చేయించారు. ఈ సంధి వల్ల అనేక రాజపుత్ర సంస్థానాలు మహారాష్ట్రుల ఆధిపత్యం నుంచి విముక్తమయాయి.

ఇంగ్లీషు వారికి అచ్చివచ్చిన మూడవ సంధి నాగపూరు సంధి (1816 మే 27). రెండవ రఘూజీ భోంస్లే 1816 మార్చి 22 న పోయాడు. అతని కొడుకు పర్సోజీ వెర్రిబాగులవాడు. పర్సోజీ దాయాది అయిన అప్పాసాహెబ్ రాజప్రతినిధి అవుదామనే కాంక్షతో ఉండటం గుర్తించి, నాగపూరు







సంధి ద్వారా ఇంగ్లీషువారు అతని కోరిక తీర్చారు.

ఈ విధంగా ఇంగ్లీషువారి కబంధ హస్తంలో చిక్కటం మహారాష్ట్ర పాలకులకు ఇష్టంలేదు. వారికి పేష్వా ఆశయాల పట్ల సానుభూతి కూడా ఉన్నది. సింధియా ఇంగ్లీషువారి ఒడంబడిక పై సంతకం చేసిన రోజునే పేష్వా పూనాలోని బ్రిటిషు రెసిడెన్సీని నాశనం చేసి, తగలబెట్టి, 27 వేల సేనతో 2,800 మంది సైనికులు గల బ్రిటిషు సేనను ఖిడ్కీ వద్ద ప్రతిఘటించి పోరాడి, ఓడిపోయాడు. పేష్వాలాగే నాగపూరులోని అప్పాసాహెబ్, ఇంగ్లీషు వారితో పోరాడి, 1817 నవంబరు 27 న సితాబల్దీ వద్ద ఓడిపోయాడు. జస్వంతరావు కొడుకు రెండవ మలహర్‌రావు హోల్కర్ కూడా ఇంగ్లీషు వారితో యుద్ధం చేసి మరుసటి నెలలో మహిద్పూర్ వద్ద ఓడిపోయాడు. అప్పాసాహెబ్ పంజాబుకూ, అక్కడ నుంచి జోధ్పూర్‌కూ పారిపోయి, 1840 లో మరణించాడు. నర్మదకు ఉత్తరంగా ఉండే ప్రాంతమంతా ఇంగ్లీషువారి అధీనమయింది. 1818 జనవరి 6 న హోల్కర్ మందసోర్ వద్ద ఇంగ్లీషువారితో సంధి చేసుకున్నాడు.

మహారాష్ట్ర సంఘటనా చిహ్నమైన పేష్వా పదవి రద్దయింది. ఇది జరిగే లోపుగా రెండవ బాజీరావు ఇంగ్లీషు వారితో రెండు సార్లు యుద్ధం చేసి, రెండుసార్లూ ఓడిపోయాడు. చివరకు ఇంగ్లీషువారు అతనికి ఏటా 6 లక్షల భరణం ఏర్పాటు చేసి కాన్పూరు సమీపంలో ఉండే బిదుర్‌కు పంపేశారు. త్రింబక్‌జీ చునార్ దుర్గంలో యావజ్జీవ ఖైదుశిక్ష పొందాడు. సాతారా అనే చిన్న రాజ్యానికి శివాజీ వంశస్థుడైన ప్రతాపసింహు డనే వాణ్ణి రాజుగా ఏర్పాటు చేశారు.

భారతదేశంలో బ్రిటిషువారి అధికారం అపారంగా వృద్ధిచెందింది.





# భారత చరిత్ర



గడచిన యుద్ధాలలో పొందిన అపజయా లతో టిప్పుసుల్తాను చితికిపోయాడనీ, అతను ఇక తల ఎత్తలేడనీ ఇంగ్లీషువారు అను కున్నారు. అయితే ఇది భ్రమ అని త్వర లోనే రుజువయింది.

టిప్పు అపజయ పరాభవాన్ని దిగమింగి ఊరుకునే మనిషికాడు. దానికి తోడు అతనికి ఇంగ్లీషువారంటే తీవ్రమైన ద్వేషం కూడానూ. అతను చురుకుగా యుద్ధనష్టా లను చక్కబరచుకున్నాడు; తన కోటను మరింత బలిష్ఠం చేసుకున్నాడు; తన అశ్విక దళాలనూ, పదాతిసేననూ వృద్ధిపొందించు కున్నాడు; కూడిరాని సామంతులను శిక్షించాడు; దేశాన్ని యథా పూర్వస్థితికి తెచ్చాడు.

ఆ సమయంలో యూరపులో ఇంగ్లీషు వారికీ ఫ్రెంచివారికీ తీవ్రమైన యుద్ధం జరుగుతున్నది. రాజకీయజ్ఞుడైన టిప్పు, భారతదేశంలో ఇంగ్లీషువారికి ప్రతిగా ఫ్రెంచివారి సహకారం పొందటానికి కృషి చేశాడు; తాను ఫ్రెంచివారి జాకొబిన్ క్లబ్బులో సభ్యుడుగా చేరాడు; తన కింద కొలువున్న ఫ్రెంచివారి చేత ఫ్రెంచిరిపబ్లిక్ జెండా ఎగరవేయనిచ్చి, శ్రీరంగపట్టణంలో "స్వాతంత్ర్య వృక్షం" నాటింపజేశాడు. రాబోయే యుద్ధంలో తన పక్షాన ఉండమని అర్థిస్తూ టిప్పు, అరేబియాకూ, కాబూలుకూ, కాన్‌స్టాంటినోపులుకూ, ఇతర దేశాలకూ దూతలను పంపాడు; భారతదేశం నుంచి ఇంగ్లీషువారిని వెళ్ళగొట్టటానికిగాను వలం టీర్లు ముందుకు రావలసిందని ప్రకటన కూడా చేశాడు. ఈ ప్రకటన ఫలితంగా, 1798 ఏప్రిలులో కొందరు ఫ్రెంచివారు మంగళూరులో దిగారు.

ఆ నెలాఖరులోనే మద్రాసు వచ్చిన ఇంగ్లీషు గవర్నరుజనరలు వెలస్లీ, టిప్పు



విద్రోహం తలపెట్టినట్టు పసిగట్టి, తక్షణమే టిప్పుతో యుద్ధానికి తగిన సన్నాహాలు చేశాడు. ఆయన త్రిపక్ష ఒప్పందం కింద మళ్ళీ నిజామునూ, మహారాష్ట్రులనూ అహ్వానించాడు. నిజాము సెప్టెంబరు 1న ఇంగ్లీషువారితో ఒక ఉపసంధి చేసుకున్నాడు. మహారాష్ట్రులు మాత్రం వెలస్లీకి స్పష్టమైన సమాధానం చెప్పక, నీళ్ళు నమిలారు. యుద్ధంలో లభించే లాభంలో కొంత భాగం పేష్వాకు ఇస్తామని కూడా వెలస్లీ అన్నాడు.

టిప్పుకూ, ఇంగ్లీషువారికీ జరిగిన ఈ యుద్ధం చాలా క్లుప్తమైనది. 1799 మార్చి 5న, శ్రీరంగపట్టణానికి పడమరగా 45 మైళ్ళు దూరంలో ఒక యుద్ధమూ, మార్చి 27న శ్రీరంగపట్టణానికి తూర్పుగా 30 మైళ్ళ దూరంలో మరొక యుద్ధమూ జరిగాయి. టిప్పు రెండింటిలోనూ ఓడిపోయి శ్రీరంగపట్టణానికి తిరిగి వచ్చాడు. మేనెల 4న ఇంగ్లీషువారు శ్రీరంగపట్టణాన్ని పట్టుకున్నారు. తన రాజధానిని కాపాడుకునేటందుకు టిప్పు వీరోచితంగా పోరాడి, కోట ద్వారం వద్ద ప్రాణాలు వదిలాడు. అతను గుండు దెబ్బ తగిలి పడిపోయి ఉన్నసమయంలో ఒక ఇంగ్లీషు సైనికుడు టిప్పు



నడుముకు ఉండిన వజ్రాలు పొదిగిన బెల్టును కాజేయాలని యత్నించాడట. టిప్పు వాణ్ణి తన కత్తితో కొట్టాడు. అప్పుడా ఇంగ్లీషు సైనికుడు టిప్పు తలకు గురిపెట్టి తుపాకి పేల్చాడు. టిప్పు వెంటనే మరణించాడు. [టిప్పు మరణించిన కోటద్వారం బొమ్మలో చూడండి.]

టిప్పు మరణంతో ఒక గొప్ప రాజ్యం అంతరించింది; ఇంగ్లీషువారికి ప్రబల శత్రువొకడు పోయాడు. గెలిచిన ఇంగ్లీషువారు శ్రీరంగపట్టణాన్ని కొల్లగొట్టేశారు.

మైసూరు ఇంగ్లీషువారి వశమయింది. టిప్పు కుటుంబంవారిని వెల్లూరునగరంలో







నిర్బంధించారు. వెలస్లీ రాజకీయవిజ్ఞతగా భావించి మహారాష్ట్రులకు మైసూరు వాయువ్యదిశన ఉన్న రెండు మండలాలు ఇస్తానన్నాడు, కాని మహారాష్ట్రులు వాటిని నిరాకరించారు. కాని ఇంగ్లీషువారు నిజాముకు మైసూరు ఈశాన్య ప్రాంతం నుంచి గుత్తి, గుర్రంకొండ ప్రాంతాలను ఇస్తే నిజాము స్వీకరించాడు. మైసూరు పశ్చిమ ప్రాంతంలోని కెనరానూ, వైనాడూ, కోయంబత్తూరూ, ధారాపురమూ, శ్రీరంగపట్టణమూ మొదలైన వాటిని ఇంగ్లీషువారు సొంతం చేసుకున్నారు.

ఇలా పంపకం అయిపోగా మిగిలిన మైసూరు రాజ్యానికి ఒక బాలుణ్ణి రాజుగా ఏర్పాటు చేశారు. ఆ బాలుడు మైసూరును పాలించిన హిందూ రాజుల సంతతివాడు. అయితే అతను నామమాత్రపు రాజు. మైసూరు పై సర్వాధికారాలూ ఇంగ్లీషువారి చేతిలోనే వున్నాయి. మైసూరు రాజు వారికి కప్పం కట్టాలి, ఇంగ్లీషు సేనలను భరించాలి.

మైసూరును ఈ విధంగా విభజించటం వల్ల ఇంగ్లీషువారికి భూలాభమూ, ఆర్థిక లాభమూ, వాణిజ్యలాభమూ, సైనిక లాభమూ కూడా లభించాయి. అందుచేత వెలస్లీ చేసిన ఈ ఏర్పాటును ఇంగ్లండులో ఘనంగా మెచ్చుకుని, అతనికి మార్క్విస్ పదవి బహూకరించారు.

టిప్పు పతనంతో ఫ్రెంచివారికి ఈ దేశంలో మిత్రులెవరూ లేకుండాపోయారు. ఇంగ్లీషువారికి ఈ దేశం సంబంధించి సంతవరకు వారి బెడద తీరిపోయింది.

టిప్పు అసాధారణ వ్యక్తి. తన వర్గం వారిలో ఉండే అవినీతి అతనిలో లేదు. అతని రాజకీయ పరిజ్ఞానం సునిశితమైనది. తనకు నిజమైన శత్రువులు ఇంగ్లీషువారే గాని స్వదేశీయులు కారని అతను స్పష్టంగా గ్రహించాడు.





# భారత చరిత్ర



ఇంగ్లీషు కంపెనీతో లోగడ ఒప్పందాలు చేసుకున్న సంస్థానాలను క్రమంగా కంపెనీ పరిపాలన కిందికి తెచ్చినవాడు వెలస్లీ. ఇలా చెయ్యటంలో అతను చాలా అక్రమాలు చేశాడు. టిప్పుతో ఇంగ్లీషు వారు చేసిన యుద్ధంలో సహాయం చేసినందుకు నిజాము నవాబు కొన్ని ప్రాంతాలను సంపాదించుకున్నాడు. అయితే 1800 లో నిజాము రాజ్యంలో ఉంచిన ఇంగ్లీషుబలాల నిర్వహణకు గాను ఆ ప్రాంతాలను తిరిగి ఇంగ్లీషువారి కిచ్చి, రాజకీయాధికారా లన్నిటినీ వదులుకుని నామమాత్రపు రాజుగా మిగలటం జరిగింది. ఇందువల్ల పరిపాలన అస్తవ్యస్త మయింది.

కర్ణాటకంలో ఇద్దరు నవాబు లుండేవారు. ఈ ఇద్దరూ టిప్పుతో చేరి కుట్రచేశారని అబద్ధపు ఆరోపణలు చేసి, అక్కడి పరిపాలనను వెలస్లీ ఇంగ్లీషుకంపెనీ పరం చేశాడు. ఇదే విధంగా వెలస్లీ తంజావూరు, సూరత్ పాలకులకు బిరుదులు మాత్రం ఉండనిచ్చి, భరణాలు ఏర్పాటు చేసి, అక్కడి పరిపాలనను కంపెనీపరం చేశాడు. ఈ చర్యను, "ధూర్తమూ, అక్రమమూ," అని బివరిజ్ అనే ఆయన వ్యాఖ్యానించాడు.

నేపాలులోయను 1768 లో గూర్ఖాలు జయించారు. అంతకు పూర్వం ఆ లోయలను పాలించినవారి మధ్య సాగిన అంతః కలహాలు గూర్ఖాలకు లాభించాయి. క్రమంగా వారు అసాధారణమైన సైనికబలాన్ని పెంపొందించుకుని, తమ రాజ్యాన్ని విస్తరింపజేసుకునే మార్గాలు అన్వేషించసాగారు. ఉత్తర సరిహద్దున బలవత్తరమైన చీనా సామ్రాజ్యం ఉన్నది. అందుచేత గూర్ఖాలు దక్షిణంగా విస్తరించ దలిచారు.

19 వ శతాబ్దపు తొలిరోజులలో వారి రాజ్యం తూర్పున తిస్తానది దాకానూ,





పడమట సట్లెజ్‌నది దాకానూ విస్తరించింది; నేపాలుదేశం హిందూస్థానపు ఉత్తర సరిహద్దు వెంబడి ఒక బలమైన రాజ్యంగా వెలసింది.

1801 లో గోరఖ్‌పూరును కంపెనీ ఆక్రమించింది. బ్రిటిషురాజ్యం యొక్క ఉత్తర సరిహద్దు స్పష్టంగా నిర్దేశించి లేదు. గూర్ఖాలు బ్రిటిషు ప్రాంతంలోకి దాడులు చేస్తూండేవారు. 1814 మే నెలలో గూర్ఖాలు అకారణంగా బుత్వాల్ లోని మూడు పోలీసుస్టేషన్లపై దాడి చేశారు.

కొన్ని మాసాల అనంతరం, అక్టోబరులో గవర్నరుజనరలు వారన్‌హేస్టింగ్స్ గూర్ఖాలపై యుద్ధప్రకటన చేశాడు. యుద్ధతంత్రం కూడా ఆయనే నిర్ణయించాడు. సట్లెజ్, కోసీనదుల మధ్యగల సరిహద్దు మీద నాలుగు చోట్ల ఇంగ్లీషువారి సేనలు దాడి చేశాయి. కాని నేపాలీయులు మంచి యోధులు. వారిని జయించటం తేలిక కాదు. అదీగాక పర్వతమయమైన ఆ ప్రాంతంలో ఇంగ్లీషు బలాలకు కదలటం కష్టమయింది. అందుచేత 1814-1815లో బ్రిటిషువారు చేసిన యుద్ధచర్యలు కలిసి రాలేదు. పట్నా నుంచీ, గోరఖ్‌పూరు నుంచీ నేపాలు రాజధాని పైకి ఎత్తి వెళ్లిన రెండు



బ్రిటిషు సేనలు చివరకు తిరోగమించవలసి వచ్చింది. కలంగ అనే దుర్గాన్ని పట్టుకొనటానికి దుస్సాహసం ప్రదర్శించిన జనరల్ గిలెస్పీ అనేవాడు చనిపోయాడు.

అయితే 1815 ఏప్రిల్‌లో అల్మోరా, మే నెలలో మలాఓఁ దుర్గమూ ఇంగ్లీషు వారికి చిక్కాయి. అటు పైన ప్రతిఘటన నిష్ప్రయోజన మనుకుని గూర్ఖాలు సగౌలీ వద్ద సంధి చేసుకున్నారు (1815 నవంబరు 28). అయితే ఈ సంధిని నేపాలు ప్రభుత్వం ఆమోదించని కారణంగా తిరిగి యుద్ధం ప్రారంభమయింది. బ్రిటిషు సేనలు నేపాలు రాజధానికి 50 మైళ్ళ





దూరంలోకి వచ్చి, మక్వన్‌పుర్ వద్ద నేపాలీయులను ఓడించాయి (1816 ఫిబ్రవరి 28). తరవాత కొద్ది రోజులకు నేపాలు ప్రభుత్వం సంధి ఒడంబడికను ఆమోదించింది.

ఈ సంధి ఫలితంగా నేపాలీయులు తమ దక్షిణ సరిహద్దున ఉన్న పల్లపు ప్రాంతాలపై తమ హక్కులను విడిచి పుచ్చారు; గర్వాల్, కుమాఊఁ జిల్లాలను బ్రిటిషువారి పరం చేశారు; సికిమ్ నుంచి వైదొలగారు; కత్మండులో బ్రిటిషు రెసిడెంటును ఉంచుకోవటానికి ఒప్పుకున్నారు.

ఈ సంధి ఇంగ్లీషువారికి చాలా లాభించింది. ఇప్పుడు వారి వాయువ్య సరిహద్దు పర్వతాలను అంటింది. సిమ్లా, ముసూరి, అల్మోర, నైనిటాల్ లాటి పర్వతనగరాలు వారి అధీనమయాయి.

1817 ఫిబ్రవరి 10 న ఇంగ్లీషువారు సికిమ్‌రాజాతో ఒక ఒడంబడిక చేసుకుని, నేపాలు నుంచి పుచ్చుకున్న ఒక ప్రాంతాన్ని సికిమ్‌రాజాకు ఇచ్చారు. ఇలా చెయ్యటం చేత నేపాలుకూ, భూతానుకూ మధ్య ఎడం ఏర్పడింది.

ఈ విధంగా దేశంలోని సంస్థానాలు ఒకటొకటే బ్రిటిషువారికి లొంగి పోతూ ఉంటే, మధ్య దేశంలో పిండారీ, పఠాను దండులు విజృంభించి తీవ్రమైన సంక్షోభం కలిగించాయి. రాజపుత్రస్థానం అంతః కలహాలతో ఉడికిపోయింది.

పిండారీలు 1815-1816 లో నిజాము రాజ్యాన్ని ఉత్తర సర్కారు జిల్లాలనూ కొల్లగొట్టారు. వారన్ హేస్టింగ్స్ వీరి నిర్మూలనానికి సైనిక పథకం వేసి, 1818 జనవరి నాటికి పిండారీలను రూపు మాపాడు. పిండారీల లాగే పఠానులు కూడా బందిపోటు చేస్తూ వచ్చారు. అయితే వారిని అదుపులో పెట్టటానికి వారి నాయకుణ్ణి చీలదీసి, అతని కొక చిన్న రాజ్యం ఇచ్చారు.





# భారత చరిత్ర



1823 జనవరి 1 న లార్డ్ హేస్టింగ్స్ గవర్నరుజనరలు పని చాలించుకుని వెళ్ళి పోయేనాటికి, సట్లెజ్ నుంచి బ్రహ్మపుత్ర వరకూ, హిమాలయాల నుంచి కన్యా కుమారి వరకూ గల భారతదేశం నిర్వివాదంగా బ్రిటిషువారి అధీనమయింది. కాని ఈ సామ్రాజ్యంలో స్థిరపరిపాలన సాగాలంటే బ్రిటిషువారు తూర్పు, పడమర సరిహద్దులపై ఇతరులు కలిగించే అరాజక చర్యలను అణచటం తప్పనిసరి అయింది.

ఇంగ్లీషువారికి బర్మాతో 17 వ శతాబ్ది నుంచీ వర్తక సంబంధాలు ఉంటూ వచ్చాయి. అయితే, అస్పష్టంగా ఉన్న తూర్పు సరిహద్దు మీద బర్మావాళ్ళు చాలా అశాంతి రేకెత్తిస్తూ వచ్చారు. బర్మాతో వైరం తెచ్చుకోవటం ఇష్టంలేక బ్రిటిషు వాళ్ళు 1795 - 1811 మధ్యకాలంలో ఆరుసార్లు రాయబారాలు పంపారు.

1821 - 22 లో బర్మావారు అసామును జయించారు; 1823 సెప్టెంబరులో వారు, చిటగాంగు సమీపంలో షాపురీ అనే దీవిని పట్టుకుని, దాన్ని ఆక్రమించి ఉన్న బ్రిటిషు సైనికులను పారదోలారు. అటుతరవాత వారు బెంగాలులో కంపెనీ అధీనంలో ఉన్న ప్రాంతాలపై దాడిచెయ్యటానికి ప్రయత్నాలు సాగించారు.

అలాంటి స్థితిలో కొత్త గవర్నరుజనరలు 1824 ఫిబ్రవరి 24 న బర్మాపై యుద్ధం ప్రకటించాడు. బ్రిటిషు సైన్యాలు బర్మా వారిని అసాము నుంచి పారదోలగలిగాయి గాని, చిటగాంగు సరిహద్దు వద్ద, రాము అనే ప్రాంతంలో, బందులా అనే ప్రఖ్యాత బర్మా సేనా నాయకుడి బలాల చేత తిప్పి కొట్టబడ్డాయి.

అయితే ఈ లోపల బ్రిటిషువారు సముద్ర మార్గాన రంగూను పై దాడి తల

## 84. బర్మా యుద్ధాలు





పెట్టారు. ఇందుకుగాను 11,000 మంది సైనికులను సమీకరించారు; వారిలో హెచ్చుమంది మద్రాసురాష్ట్రంవారే. వారికి నాయకుడు జనరల్ కాంప్‌బెల్. బ్రిటిషు నౌకలకు అధిపతి కాప్టెన్ మర్యాట్ అనే ప్రసిద్ధ నవలాకారుడు.

1824 మే 11 న రంగూను బ్రిటిషు సేనలకు లొంగిపోయింది. బర్మావాళ్ళు బ్రిటిషు సేనలను ప్రతిఘటించక, తమ సర్వస్వాన్నీ తీసుకుని పెగూ అరణ్య ప్రాంతాలకు పారిపోయారు. బ్రిటిషు సైనికులకు తిండి కూడా లేదు; వానాకాలం కావటం చేత వాతావరణం చాలా అనారోగ్యకరంగా ఉన్నది. బ్రిటిషువాళ్ళు నానా అగచాట్లూ పడ్డారు.

డిసెంబరు 1 నాటికి బందులా, 60 వేలమంది సైనికులతో రంగూను సమీపానికి వచ్చి చేరాడు. అయితే ఆ నెల 15 న అతను బ్రిటిషువారి చేతిలో ఓడిపోయి, దోనాబ్యూ అనే ప్రదేశానికి తిరోగమించాడు. అక్కడే వుండి 1825 ఏప్రిలు ఆరంభం దాకా పోరాటం సాగిస్తూ, యాదృచ్ఛికంగా తగిలిన గుండుదెబ్బతో మరణించాడు. అతని మరణంతో బర్మాకు తీరని నష్టం కలిగింది.



బ్రిటిషు సేనాపతి అయిన కాంప్‌బెల్, ఏప్రిల్ 25 న, దిగువబర్మా రాజధాని అయిన ప్రోమ్‌నగరాన్ని ఆక్రమించి, వానాకాలం వెళ్ళిన దాకా అక్కడే ఉన్నాడు. 1826 ఫిబ్రవరి 24 న బర్మాకూ, బ్రిటిషు వారికీ సంధి కుదిరింది. బ్రిటిషువారికి యుద్ధనష్టం కింద బర్మావారు కోటిరూపాయలు ఇచ్చుకున్నారు; అసామ్, కాచార్, జయంతియా ప్రాంతాలపై జోక్యం కలిగించుకోమని మాట ఇచ్చారు; బర్మాలో బ్రిటిషురెసిడెంటును ఏర్పాటు చేశారు. ఈ యుద్ధం వల్ల బర్మా సముద్ర తీరంపై బ్రిటిషువారికి చాలా అధికారాలు వచ్చాయి.







మొదటి బర్మాయుద్ధంతో గాని, దాని అనంతరం జరిగిన సంధితో గాని బ్రిటిషు వారి చిక్కులు విడలేదు. 1837 మేలో పాత బర్మారాజును తొలగించి, అతని తమ్ముణ్ణి రాజుగా ప్రకటించారు. తన అన్న చేసుకున్న సంధి షరతులకు తాను బద్ధుణ్ణి కానని కొత్తరాజు తెలియజేశాడు. అతను బ్రిటిషు రెసిడెంట్లను అవమాన పరిచాడు. 1840 లో రెసిడెన్సీని మూయ వలసివచ్చింది. రంగూనులో ఉండే బర్మా రాజప్రతినిధి (గవర్నరు) బ్రిటిషు వర్తకులను చాలా తిప్పలు పెట్టాడు. వాళ్ళు కలకత్తా ప్రభుత్వంతో మొరబెట్టుకున్నారు.

గవర్నరుజనరలు డల్‌హౌసీ బర్మాకు ఒక యుద్ధనౌకను పంపి, బర్మారాజును నిర్బంధంలో ఉంచి, బ్రిటిషు వర్తకులకు నష్టపరిహారం ఇవ్వాలనీ, రంగూను గవర్నరును బదిలీ చెయ్యాలనీ అడిగాడు. బర్మా రాజు యుద్ధం కోరలేదు. అయితే బ్రిటిషు యుద్ధనౌకాధిపతి లాంబర్ట్ తొందరపాటువల్ల బర్మావారు ఆ యుద్ధనౌక పై కాల్పులు చేయటం జరిగింది. 1852 ఏప్రిలు 1 లోపుగా బర్మారాజు బ్రిటిషువారికి లక్ష సవర్లు పరిహారం ఇవ్వాలని బ్రిటిషువారు ఆదేశించారు. దీనికి బర్మావారు సమాధానం ఇవ్వలేదు.

తాము పెట్టిన గడువు అయిపోయిన నాడే బ్రిటిషు సైనిక, నావికాబలాలు రంగూను చేరాయి. త్వరలోనే మర్తబాన్ పతనమయింది. ఏప్రిలు 14 న బ్రిటిషు సైనికులు, జగత్ప్రసిద్ధమైన రంగూన్ పగోడాలోకి జొరపడ్డారు. మరొక మాసానికి బసీన్ ఆక్రమించబడింది. అక్టోబరు, నవంబరులలో ప్రోమ్‌నగరమూ, పెగూ ఓడిపోయాయి. పెగూ బ్రిటిషువశం కావటంతో బ్రిటిషు భారతసామ్రాజ్యపు తూర్పు సరిహద్దు బంగాళాఖాతపు తూర్పుతీరాన్ని ఆక్రమించేసింది.





# భారత చరిత్ర



ఒకప్పుడు మొగలుల చేత దెబ్బతిన్న సిక్కులు, మొగలుల బలం సడలే సమయానికి తిరిగి తమ శక్తులను కూడగట్టుకుని, 1773 నాటికి తమ రాజ్యాన్ని ప్రతిష్ఠించుకున్నారు. అది తూర్పున షాహ్‌రాన్‌పుర్ నుంచి పడమట అటోక్ దాకానూ, దక్షిణాన ముల్తాన్ నుంచి, ఉత్తరాన కంగ్రా, జమ్ముల దాకానూ విస్తరించి ఉండేది. అది పన్నెండు సంయుక్త రాజ్యాలుగా ఉండేది. అయితే సిక్కులకు శత్రుబాధ లేకుండా పోయేసరికి వారి మధ్య ఐకమత్యం సన్నగిల్లి, అంతః కలహాలు బయలుదేరాయి. ఒక వంక భారతదేశం బ్రిటిషువారి అధీనంలోకి వస్తూ ఉంటే సిక్కునాయకులు రాజస సంస్కృతిని అవలంబించి ఐకమత్యాన్ని కోల్పోసాగారు.

ఈ దశలో సిక్కుల రాజసాన్ని వదలగొట్టి, జాతీయ భావాలనూ, ఐక్యతనూ వారిలో పెంపొందించినవాడు రణ్జిత్‌సింగ్. ఇతను 1780 నవంబరు 2న జన్మించాడు. ఇతని తండ్రి మాహాసింగ్ సుకేర్‌చకియా రాష్ట్రానికి నాయకుడు. 1793లో కాబూలులోని జమాన్‌షా భారతదేశంపై దండయాత్రలు ప్రారంభించేనాటికి రణ్జిత్‌సింగ్ పదమూడేళ్ళ పసివాడు. 1798 దాకా సాగిన ఈ దాడులలో అతను జమాన్‌షాకు ఎంతగానో సహకరించాడు. అందుకు ప్రతిఫలంగా జమాన్‌షా రణ్జిత్‌సింగును, అతని 19వ ఏటనే లాహోరుకు గవర్నరుగా నియమించి, రాజా అనే బిరుదు ఇచ్చాడు.

అది మొదలు రణ్జిత్‌సింగ్ అప్రతిహతమైన రణకౌశలం ప్రదర్శిస్తూ, పంజాబులో అఫ్ఘనులకు తావు లేకుండా చేశాడు; బలమైన సిక్కు జాతీయరాజ్యం వ్యవస్థాపించాడు. అంతేగాక చెల్లాచెదురుగా వున్న సిక్కులను ఒకే రాజకీయవ్యవస్థ కిందికి







తీసుకురావటానికి అతను చాలా కృషి చేశాడు. ఇందుకొరకై సట్లెజ్, జమునల మధ్య ఉన్న సిక్కురాజ్యా లన్నిటినీ అతను తన అధీనంలోకి తెచ్చుకోవలసి ఉండెను. అవి మహారాష్ట్రుల రక్షణకిందా, దరిమిలా బ్రిటిషువారి రక్షణకిందా ఉంటూ వచ్చాయి. దీనికి తోడు సిక్కునాయకుల మధ్య తీరని అంతఃకలహాలుండేవి.

చివరకు ఇవే రణ్జిత్‌కు తోడ్పడ్డాయి. ఎందుకంటే అక్కడి సిక్కునాయకులలో కొందరు అతని సహాయం అర్థించారు. ఇది ఆసరాగా తీసుకుని అతను సట్లెజ్‌తీర రాజ్యాల మీదికి దాడులు చేసి, 1806, 1807 లలో లూధియానాను ఆక్రమించాడు. రణ్జిత్ విజృంభణ సహించలేని సిక్కునాయకులు 1808 మార్చిలో, ఢిల్లీలోని బ్రిటిషు రెసిడెంటుతో మొరపెట్టుకున్నారు.

రణ్జిత్ బలవంతుడు కావటం బ్రిటిషు వారికి ఇష్టంలేదు. కాని భారతదేశపు వాయువ్య సరిహద్దున ఉన్న బలవంతుడితో విరోధం తెచ్చుకోవటం వల్ల తమకు నష్టం కలుగుతుందనీ, తురుష్కులనూ, పర్షియనులనూ కలుపుకుని ఫ్రెంచివారు యుద్ధానికి వస్తారనీ భయపడి, బ్రిటిషువారు రణ్జిత్ సింగుతో ఒక సహకార సంధి ప్రతిపాదించారు. ఫ్రెంచివారికి విరుద్ధంగా రణ్జిత్ సహాయం పొందటమే గాక, అతను యుద్ధం ద్వారా పురోగమించకుండా ఈ సంధి ద్వారా నిలుపు చేయాలని బ్రిటిషువారి ఉద్దేశం.



బ్రిటిషువారికి తన సహాయం లేకుండా జరగదని రణ్జిత్ గ్రహించాడు. సిక్కు రాజ్యా లన్నిటికీ తానే అధిపతినని గుర్తించి నట్టయితే సంధికి ఒప్పుకుంటానని అతను బ్రిటిషురాయబారికి తెలిపాడు. కాని అంతలోనే, నెపోలియన్ భారతదేశంపై దండయాత్ర చేసే భయం తొలగిపోయింది.

ఇక బ్రిటిషువారికి రణ్జిత్ మైత్రితో అవసరం లేకపోయింది. అతని రాజ్యం





సట్లెజ్‌కి తూర్పుగా విస్తరించరాదని వారు తీర్మానించుకుని, ఒక బ్రిటిషుబలాన్ని పంపారు. రణజిత్ బ్రిటిషువారితో యుద్ధం చెయ్యదలచక, 1809 ఏప్రిలు 25 న అమృతసర్‌లో వారితో సంధి చేసుకున్నాడు. దాని ఫలితంగా అతను సట్లెజ్‌కి తూర్పుగా తాను గెలిచిన భూభాగ మంతా వదులుకో వలసి వచ్చింది. బ్రిటిషు సామ్రాజ్యం జమునాతీరం నుంచి, సట్లెజ్ ఎడమతీరం దాకా విస్తరించింది.

రణజిత్ తన రాజ్యాన్ని తూర్పుగా విస్తరించుకునే ప్రయత్నానికి స్వస్తి చెప్పి, ఉత్తర, పశ్చిమోత్తర, పశ్చిమదేశాల పైకి విజృంభించాడు. 1809-1811 మధ్య అతను గూర్ఖాలను జయించి, కంగ్రా జిల్లా వశపరుచుకున్నాడు; 1813 లో అఫ్ఘనులను ఘోరంగా ఓడించి, అటోకును వశపరుచుకుని, అఫ్ఘను రాజైన షా షుజా నుంచి జగత్ప్రసిద్ధమైన కోహినూర్ వజ్రాన్ని పుచ్చుకున్నాడు. ముల్తాన్ 1818 లోనూ, కాశ్మీరు 1819 లోనూ రణజిత్ వశమయాయి. 1823 లో పెషావరు అతని అధీనమయింది. 1824 నాటికి సింధు లోయలో చాలా భాగం రణజిత్ కిందికి వచ్చేసింది.

రష్యనులు దాడిచేస్తారని శంకించి, రణజిత్ రాజ్యాన్ని దాడికి అడ్డం పెట్టుకునే ఉద్దేశంతో బ్రిటిషువారు రణజిత్‌సింగుతో 1831 లో తిరిగి సంధి ఒప్పందం చేసుకున్నారు. అయితే ఇది రణజిత్‌కు ప్రతిబంధకమే అయింది. దీని మూలాన, రణజిత్ అఫ్ఘనులను జయించకుండానూ, సింధు దేశాన్ని తన రాజ్యంలో చేర్చుకోకుండానూ వారు అడ్డపడగలిగారు. అయినప్పటికీ రణజిత్ ఒక బలమైన రాజ్యాన్ని నిర్మించుకుని, దానికి ప్రతిష్ఠ సమకూర్చుకోగలిగాడు. అతను తన 59 వ ఏట, 1839 జూను 27 న మరణించాడు.





# భారత చరిత్ర




రణ్జిత్‌సింగ్ అనంతరం సిక్కు రాజ్యంలో అరాజకం ప్రబలి, సిక్కు సింహాసనం మీద ఎవరూ స్థిరంగా కూర్చోలేకపోయారు. చివరకు 1843 లో దలిప్‌సింగ్ అనే మైనరును గద్దె ఎక్కించి, రాజ్యాధికారాన్ని అతని తల్లి అయిన రాణీ ఝిందాన్ వశం చేశారు. అయితే నిజమైన అధికారం ఖాల్సా సేనల చేతిలో ఉంటూ వచ్చింది.

ఖాల్సా పొగరు అణచటం లాహోరు "దర్బారు"కు అత్యవసర మనిపించింది. ఇందుకు తగిన మార్గం కూడా దొరికింది. బ్రిటిషు వారు పెద్ద ఎత్తున సిక్కు రాజ్యాన్ని ఆక్రమించే యత్నాలు చేస్తున్నట్టు కనబడ్డారు. "దర్బారు" వారు సిక్కు సేనలను బ్రిటిషు ప్రాంతాల మీదికి ఉసి కొల్పారు. 1845 డిసెంబరు 11 న ఖాల్సా సేనలు సట్లెజ్ దాటాయి. వైస్రాయి హార్డింజ్ యుద్ధ ప్రకటన చేశాడు.

మొదటి యుద్ధం ముడ్కి వద్ద అతి భయంకరంగా జరిగింది. సిక్కులు చూపిన అద్భుత పరాక్రమం వారి సేనాపతి అయిన లాల్‌సింగ్ యొక్క అవివేకం మూలంగా అపజయానికే దారి తీసింది. ఆ యుద్ధంలో సిక్కులు తప్పక గెలవవలిసింది. డిసెంబరు 21 న ఫిరోజ్ షా అనే చోట జరిగిన యుద్ధంలో ఇంగ్లీషు సేన మరింత హీన స్థితిలో ఉండి కూడా, సిక్కు నాయకుడైన తేజసింగ్ అకస్మాత్తుగా యుద్ధరంగం నుంచి నిష్క్రమించటం వల్ల విజయం పొందగలిగింది.

1846 జనవరిలో సిక్కులు మరొకసారి సట్లెజ్ దాటి లూధియానా పై దాడిచేశారు. ఈ యుద్ధంలోనూ, దీని వెంబడి జరిగిన యుద్ధాలలోనూ సిక్కుసిపాయిలు ఎంత వీరోచితంగా పోరాడి కూడా, సేనానాయకుల అసమర్థత వల్ల ఓడిపోయారు. (సిక్కు సేనాపతులలో షామ్ సింగ్ అన్నవాడొక్కడే

## 86. సిక్కు రాజ్య పతనం



సమర్థుడు.) జనవరి 28 న ముగిసిన యుద్ధంలో విజయం పొందాక బ్రిటిషు సైనికులు అనేకమంది సిక్కులను కసికొద్దీ వధ చేశారు.

బ్రిటిషువారికి భారతదేశంలో సిక్కులు కలిగించినంత తీవ్ర ప్రతిఘటన మరెవరూ కలిగించి ఉండలేదు. ఫిబ్రవరి 20 న బ్రిటిషుసేనలు లాహోరు ప్రవేశించాయి. తరవాత జరిగిన సంధిలో సిక్కులు సట్లెజ్‌కి ఎడమపక్కన ఉన్న తమ ప్రాంతాన్ని ఇంగ్లీషువారి పరం చేశారు. కాశ్మీరూ, హజరా ఇంగ్లీషువారికి పోయాయి. సిక్కు సేనలు పరిమితం చేయబడ్డాయి. మైనరు మహారాజు రక్షణకుగాను కొంత బ్రిటిషు సేన ఉంచబడింది.

అటుతరవాత బ్రిటిషువారు ఒక నీచమైన పని చేశారు—లాహోరు దర్బారులో సర్దారుగా కొలువున్న గులాబ్‌సింగ్ అనే వాడికి కాశ్మీరును 10 లక్షల సవర్లకు అమ్మేటట్టు ఒక ఒప్పందం చేసుకున్నారు (16 మార్చిన, అమృతసర్‌లో). గులాబ్‌సింగ్ పైన ఒక పితూరీ లేచింది. దానికి కారకుడు లాల్‌సింగ్ అని బ్రిటిషువారు అతన్ని పదవి నుంచి తొలగించటమే గాక, పంజాబుపై తమ అధికారాలను మరింత బలపరచుకుంటూ



మరొక ఒడంబడికను లాహోరు ప్రభుత్వం మీద రుద్దారు.

సిక్కులు ఓడినా వారి పౌరుషమూ, స్వాతంత్ర్యేచ్ఛా చావలేదు. బ్రిటిషువారి ఆధిపత్యం వారికి దుస్సహమయింది. దీనికి తోడు, బ్రిటిషువారు రాణీ ఝిందాన్‌పై కుట్ర ఆరోపణ చేసి, ఆమెను లాహోరు నుంచి పంపి వెయ్యటంతో వారి ఆగ్రహం మరింత అయింది. యుద్ధానికి తత్తరపడే సిక్కులకు ఈ విధంగా అవకాశం చిక్కింది.

ముల్తాన్ పాలకుడైన దివాన్ ముల్రాజ్ శిస్తులు వసూలు చెయ్యలేక పోయాడు. లాహోరు ప్రభుత్వం అతనిపై చాలాపెద్ద





మొత్తం జరిమానా విధించింది. అతను ఆగ్రహించి, మార్చి 1848 లో తన పదవికి రాజీనామా ఇచ్చాడు. అతని పదవిని సర్దార్ ఖాన్‌సింగ్ అనేవాడి కిస్తూ, ఇద్దరు బ్రిటిషు సైనికాధికారులను లాహోరు ప్రభుత్వం ఫంపింది. ఈ ఇద్దరూ హత్య చేయబడ్డారు (ఏప్రిలు 20). ఈ పని ముల్రాజ్ చేయించినదే నన్నారు.

ఈ సాకు మీద బ్రిటిషువారు యుద్ధానికి రాక, ముల్రాజ్ సమస్యను లాహోరు ప్రభుత్వం ఎలా పరిష్కరిస్తుందో నని చూస్తూ ఊరుకున్నారు. అయితే ఒక చిన్న బ్రిటిషు ఉద్యోగి తొందరపాటు వల్ల పరిస్థితి విషమించింది. ముల్తానులో ముల్రాజ్ బలాలని ప్రతిఘటించమని, హజరా గవర్నరయిన ఛత్తర్‌సింగ్ తన కొడుకును సేనతో పంపితే, అతను (షేర్‌సింగ్) ముల్రాజ్ పక్షం కలిశాడు. ప్రముఖ సిక్కు నాయకులు షేర్‌సింగ్ పక్షమయారు. ఈ సారి సిక్కులు ఆఫ్ఘనులకు పెషావరు ఆశ చూపి, వారిని తమ పక్షం చేసుకున్నారు.

1848 అక్టోబరు 10 న బ్రిటిషువారు సిక్కులపై మరోసారి యుద్ధం ప్రకటించారు. నవంబరు 16 నా, 1849 జనవరి 13 నా ఉభయ పక్షాలకూ యుద్ధం జరిగింది. ఈ యుద్ధాలలో బ్రిటిషువారు ఓడక పోయినా తీవ్ర నష్టాలు పొందారు. జనవరి 22 న ముల్తానులో జరిగిన యుద్ధంలో వారు నెగ్గారు. ముల్రాజ్ దొరికిపోయి ద్వీపాంతరాలకు పంపబడ్డాడు.

అయితే, చీనాబ్ నదికి సమీపంలో గుజరాత్ అనే చోట ఇంగ్లీషువారు సిక్కులపై ఘనవిజయం సాధించగలిగారు. దానితో సిక్కుల ప్రతిభ అడుగంటింది. బ్రిటిషువారు పంజాబును తమ అధీనం చేసుకున్నారు. దలీప్‌సింగ్ ఇంగ్లాండుకు పంపివేయబడ్డాడు. ఏటా అతనికి 5 లక్షల రూపాయల భరణం ఏర్పాటయింది.









బ్రిటిషుప్రభుత్వం అనేకమంది భూస్వాములల ఆస్తులు కాజేసి, వారి పై ఆధారపడినవారికి భుక్తిలేకుండా చేసింది. రాజుల అధికారాలు చాలావరకు హరించింది. తీవ్రమయిన ఆర్థికసంక్షోభం దేశంలో అనేక ప్రాంతాల బయలుదేరింది.

పాశ్చాత్యనాగరికతా ప్రభావం దేశంలో విస్తరించటం సనాతనవాదులు సహించలేకపోయారు. సతీ, భ్రూణహత్యలూ నిషేధించబడటం వారిని చాలా బాధించింది. 1856లో స్త్రీ పునర్వివాహం చట్ట సమ్మతమయింది. క్రైస్తవ మిషనరీలు భారతీయులను తమ మతంలోకి చురుకుగా చేర్చుకోసాగారు.

ఇలాటి అంశాలను గురించి ప్రజలలో ఎంత ఆందోళన ఉన్నప్పటికీ, సిపాయిలలో అసంతృప్తి చెలరేగకపోతే 1857 సంక్షోభం జరిగేదికాదు. కాని సిపాయిలలో కూడా బ్రిటిషుఅధికారుల పట్ల అసంతృప్తి కలుగుతూ వచ్చింది. వాళ్ళను అధికారులు యుద్ధాలకు దూరప్రాంతాలకు తీసుకుపోయి, దీర్ఘకాలం పోరాడించేవారు. అందుకుగాను అదనపు భత్యాలివ్వమంటే ఇచ్చేవారుకారు. ఈ కారణంగా సైనికులు 1844-1857 మధ్య కాలంలో నాలుగు పితూరీలు జరిపారు.

ఈ స్థితిలో రైఫిల్ తూటాలు వచ్చి అగ్గికి ఆజ్యంపోశాయి. అప్పుడే ఎన్‌ఫీల్డ్ రైఫిల్ సైన్యంలో ప్రవేశపెట్టబడింది. దాని తూటాలకు జంతువుల కొవ్వు పూశారు. ఈ కొవ్వు గోవులకూ, పందులకూ చెందినదని సిపాయీలు పసికట్టారు. దాన్ని హిందువులూ, ముస్లిములూ సహించలేకపోయారు. నానా సాహెబ్, ఝాన్సీరాణి మొదలైనవారు, అసలే రెచ్చి ఉన్న సిపాయీలను మరింత రెచ్చగొట్టారు.

1857 తిరుగుబాటు తాలూకు తొలి చిహ్నాలు మొట్టమొదట బారాక్‌పూర్, బర్‌హాంపూర్ (బెంగాలు) లలో కనిపిం







చాయి. కాని ఈ ప్రాంతాలలో తిరుగుబాటు చేసిన వారిని శిక్షించి, ప్రభుత్వం తిరుగుబాటును అణచగలిగింది. అయితే 1857 మే 10 న మీరట్‌లో సిపాయిలు బహిరంగమైన తిరుగుబాటు చేశారు.

మీరట్‌లోని బ్రిటిషు ఉన్నత సైనికాధికారి అసమర్థుడు. తనకింద 2,200 మంది తెల్లసైనికులుండి కూడా, అతను తిరుగుబాటుదార్లను నిగ్రహించటానికి ఎలాటి యత్నమూ చెయ్యలేదు. తిరుగుబాటుదార్లు గుర్రాల మీద గాలప్ చేస్తూ మర్నాడు ఉదయానికల్లా ఢిల్లీ చేరి, దాన్ని స్వాధీన పరుచుకున్నారు. అక్కడ ఒక్క తెల్ల సైనికదళం కూడా లేదు. అక్కడ వారు అనేకమంది తెల్లవాళ్ళను వధచేసి, వారి ఇళ్ళను ధ్వంసం చేశారు.

ఢిల్లీనగరం వెలపల ఉన్న టెలిగ్రాఫ్ ఆఫీసులోని ఇద్దరు సిగ్నలర్లు పంజాబులోని అధికారులకు టెలిగ్రాఫ్ ద్వారా వార్త అందించారు. ఢిల్లీలోని ఆయుధాగారంలో లెఫ్టినెంట్ విల్లబీ, ఎనిమిదిమంది అనుచరులూ ఉన్నారు. వాళ్ళు కొద్ది రోజుల పాటు పోరాటం సాగించి, శక్తి చాలక, ఆయుధాగారాన్ని పేల్చేశారు. ఇందువల్ల తిరుగుబాటుదార్లకు నష్టం జరిగింది. అయినా వారు రాజభవనాన్ని తమ అధీనం చేసుకుని, రెండవ బహదుర్ షాను హిందూస్థానానికి చక్రవర్తిగా ప్రకటించారు. అప్పటికి బహదుర్ షా వయసుమళ్ళినవాడు, క్షీణించిన మొగలుసామ్రాజ్యానికి నామమాత్రపు రాజు.

బ్రిటిషువారు ఢిల్లీని స్వాధీన పరచుకోవటానికి ఎంతో యుద్ధం చెయ్యవలిసి వచ్చింది, ఎన్నో రాజకీయ తంత్రాలు పన్నవలిసి వచ్చింది. అలాటి పరిస్థితిలో ఢిల్లీ తిరుగుబాటుదార్ల అధీనం కావటం బ్రిటిషు సామ్రాజ్యానికి ఎంతో పెద్ద అఘాత అయింది.







# భారత చరిత్ర



ఢిల్లీ తిరుగుబాటుదార్ల అధీనం అయాక మూడు వారాలపాటు అలజడి లేదు. కాని బ్రిటిషువారు ఢిల్లీని తిరిగి స్వాధీనం చేసుకునే ప్రయత్నం ప్రారంభించేలోగా (1857 జూన్ మొదటి వారంలో) గంగ ఎగువనగల రాష్ట్రాలన్నిటా —రాజపుత్రస్థానంలోనూ, రోహిల్‌ఖండ్‌లోనూ, కాన్పూరులోనూ, లక్నోలోనూ, వారాణసిలోనూ, బిహారు కొన్ని ప్రాంతాలా—విప్లవజ్వాలలు లేచాయి. కుంవార్ సింగ్ నాయకత్వాన సాగిన బిహారు విప్లవాన్ని విలియమ్ టేలర్ (పట్నా డివిజను కమిషనరు) అణచాడు. వారాణసి విప్లవాన్ని అణచిన కర్నల్ నీల్ అనేవాడు, పట్టుబడిన విప్లవకారులందరినీ హత్య చేశాడు; తిరుగుబాటుదార్లనేగాక, అనుమానితులనూ, అల్లరి పిల్లకాయలనూ కూడా బ్రిటిషు అధికార్లు స్వయంగా ఉరితీశారు. అలహాబాదు దుర్గం జూను 11న విముక్తమయింది. విప్లవజ్వాలలు బాగా లేచినది కాన్పూరు, ఢిల్లీ, లక్నోలలో. పంజాబు పాలకులూ, ప్రత్యేకించి సిక్కునాయకులూ, కాశ్మీరు పాలకుడు గులాబ్‌సింగూ, అనేక మంది జమీందార్లూ, బ్రిటిషువారి కింద ఉద్యోగాలు చేస్తున్న భారతీయులూ కంపెనీ పట్ల విశ్వాసంగా ఉన్నారు. విప్లవాన్ని అదుపులో ఉంచటానికి తోడ్పడినవారు: సింధియా పాలకుడూ, అతని మంత్రి సర్ దిన్కర్‌రావూ, హైదరాబాదు మంత్రి సర్ సాలార్‌జంగ్, భోపాలు బేగమూ, నేపాలు మంత్రి సర్ జంగ్ బహాదుర్. బ్రిటిషు సామ్రాజ్యాన్ని కాపాడారన్న కీర్తి సింధియాకూ, సర్ సాలార్ జంగ్‌కూ దక్కింది.

కాన్పూరు విప్లవకారులకు నాయకుడు నానాసాహెబ్. వీరు బ్రిటిషువారు నిర్మించుకున్న రక్షణలను ముట్టడించారు. ఈ రక్షణలలో 400 మంది ఆయుధాలు పట్టగల

**88. భారతస్వాతంత్ర్య విప్లవసమరం**



వాళ్ళూ, అనేకమంది స్త్రీలూ, పిల్లలూ ఉండి, జూను 8 మొదలు 26 దాకా ఆత్మ రక్షణ చేసుకుంటూ నానా అగచాట్లూ పడ్డారు. తమను సురక్షితంగా అలహాబాదుకు వెళ్ళనిస్తామని తిరుగుబాటుదార్లు హామీ ఇచ్చిన మీదట వారు లొంగిపోయారు (జూను 27). కాని బ్రిటిషు సైనికులు కాన్పూరు నుండి పడవలలో అలహాబాదుకు బయలుదేరే తరుణంలో అతి తీవ్రమైన కాల్పులు వారిపై జరిగాయి. నలుగురు మాత్రమే ప్రాణాలతో తప్పించుకు పోయారు. రెండు వందల పదకొండు మంది స్త్రీలూ, పిల్లలూ "బీబీఘర్"లో నిర్బంధించబడ్డారు. వారి నందరినీ వధించవల సిందిగా నానా సాహెబూ, తాంతియా తోపీ ఉత్తరు విచ్చారు. అలహాబాదు, వారాణసీలలో బ్రిటిషువారి ప్రవర్తన కూడా ఇంచుమించు ఇలాగే ఉండింది. ఇది జరిగాక తెల్లవాళ్ళు మరింత అమానుషంగా ప్రవర్తించారు.

ఢిల్లీని తిరిగి స్వాధీన పరచుకునేటందుకు జూను 8న అంబాలా నుంచి బ్రిటిషు సైనికులు వచ్చారు. మీరట్ నుంచి మరి కొంత సేనా, పంజాబు నుంచి కొందరు సిక్కు సైనికులూ కూడా రావటం జరి



గింది. ఢిల్లీ విప్లవకారులతో ఘర్షణ ఆరంభమయింది. సెప్టెంబరు 14న ఢిల్లీలోని కాశ్మీరు గేటు ధ్వంసమయింది. మరి ఆరు రోజులపాటు తీవ్రమైన పోరాటం జరిగి, చివరకు నగరమూ, రాజభవనమూ బ్రిటిషు వారికి చిక్కాయి. బ్రిటిషు సైనికులు నగరాన్ని కొల్లగొట్టి, అనేక మంది అమాయకుల ప్రాణాలు తీశారు.

నామమాత్రపు పాదుషా అయిన రెండవ బహదుర్ షా, హుమాయూన్ సమాధి వద్ద పట్టుబడి, రంగూన్‌కు పంపబడి, అక్కడే 87వ ఏట మరణించాడు (1862). అతని కొడుకులూ, మనమలూ కాల్చి చంపబడ్డారు.





లక్నోలో తిరుగుబాటు మే 30న ప్రారంభమయింది. 1858 మార్చి 21 దాకా ఆ నగరం బ్రిటిషువారి అధీనంలోకి తిరిగి రాలేదు. బ్రిటిషువారు లక్నోను తిరిగి స్వాధీన పరచుకొనటానికి తోడ్పడిన వాడు నేపాలు మంత్రి జంగ్ బహదుర్.

మధ్య భారతంలో తిరుగుబాటుకు నాయకుడు తాంతియా తోపీ అనే మహారాష్ట్ర బ్రాహ్మణుడు. ఇతను 20,000 తిరుగుబాటు సైనికులతో సహా యమునా నది దాటి నానా సాహెబ్‌తో కలిశాడు. అయితే 1857 డిసెంబరు 6 న బ్రిటిషు వారి చేతిలో పరాజయం పొంది, తరిమి వేయబడి, ఝాన్సీరాణి అయిన లక్ష్మీబాయితో చేరి మధ్య భారతంలో తీవ్రమైన ప్రతిఘటన కొనసాగించాడు. బ్రిటిషు సేనలు 1858 ఏప్రిల్ 3న ఝాన్సీనిముట్టడించాయి.

ఏప్రిల్ 4 రాత్రి ఝాన్సీరాణి కొద్ది మంది అనుచరులతోసహా ఝాన్సీదుర్గాన్ని విడిచిపెట్టి కల్పి అనే చోటికి వెళ్ళింది. కల్పిని కూడా బ్రిటిషువారు మే 22 న పట్టుకున్నారు. ఝాన్సీరాణి నిరుత్సాహపడక, తాంతియా తోపీని వెంటబెట్టుకుని గ్వాలియర్ పైనపడి, సింధియాను ఆగ్రాకు తరిమేసింది. సింధియాను అతని సేనలు విడిచిపెట్టాయి. నానాసాహెబ్ పేష్వాగా ప్రకటన జరిగింది. ఝాన్సీరాణీ, తాంతియా తోపీల వైఖరికి భయపడి బ్రిటిషువారు వారిని నిగ్రహించే ప్రయత్నాలు సాగించారు. వారు గ్వాలియరును జయించారు. 1858 జూను 17 న యుద్ధంలో, పురుషవేషంలో ఉన్న ఝాన్సీరాణి చనిపోయింది. పరారీ అయిన తాంతియా తోపీ మానసింగ్ అనే వాడిద్వారా బ్రిటిషువారికి దొరికిపోయి, ఉరి తీయబడ్డాడు. నానాసాహెబ్ నేపాలు అరణ్యాలలోకి పారిపోయి అక్కడే చనిపోయాడు. 1857 భారత స్వాతంత్ర్య సమరం అలా ముగిసింది.



